శ్రీ అనుభవానందస్వామి

# సర్వసిద్ధాంత సౌరభము



7

★ వైష్ణవము ★

# సర్వ సిద్ధాంత సౌరభము

## విశిష్టాద్వైతము






"సాధన రహస్యా"ది బహు గ్రంథకర్తలు,

శ్రీరామకృష్ణాశ్రమములు (బాపట్ల & భీమునిపట్నము)

సంస్థాపకులు :

పరమహంస - పరివ్రాజకాచార్య

శ్రీ అనుభవానంద స్వాములవారు

పదునారవ కుసుమము

సర్వహక్కులు ప్రకాశకులవి

ద్వితీయ ముద్రణ : 1985

వెల : రు. 20-00

"This Book is Published with the financial assi
TIRUMALA TIRUPATHI DEVASTANA
Under their Scheme aid Publish religious b



ప్రతులకు :

శ్రీ అనుభవానంద గ్రంథమాల

బాపట్ల - 522 101 గుంటూరు (జిల్లా)

మరియు

పరమహంస కార్యాలయము

భీమునిపట్నము - 531 163 విశాఖ (జిల్లా)

ముద్రణ : మాతృశ్రీ ప్రింటర్స్. బాపట్ల

# ద్వితీయ ముద్రణము



అనుభవముతోకూడిన వచన రచనములు, సాధనా పటిమచే గలిగిన ఏకాగ్రతవలన సాధ్యము. ఆ ఏకాగ్రతచే జ్ఞానమును, 'ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞానం భవతి' ఆ జ్ఞానముచే సర్వ విజ్ఞానములు కలుగుచున్నవనిగదా శాస్త్రము! అదికూడ పూర్వజన్మసుకృత లభ్యమే!

శ్రీ అనుభవానంద స్వాములవారు, సకలసమన్వయావతార మగు శ్రీ రామకృష్ణ దేవుని సర్వాదర్శమూర్తిగా ఆరాధించిన మహనీయులగుటచేనేమో వారి వచన రచనములందు ఆ సమత్వము వ్యక్తమగుచుండును. ఆ సమత్వము వారి సకల గ్రంథములలో ప్రవహించుచుండును. అట్టి గ్రంథమే 'సర్వ సిద్ధాంత సౌరభము'. ఆ పేరులోనే ఆ సమరసత్వము వ్యక్తము.

'సర్వ వేదాంత సిద్ధాంత సార సంగ్రహము' ను శ్రీశంకరులును, 'సర్వ సిద్ధాంత లేశ సంగ్రహము' ను శ్రీ అప్పయ్య దీక్షితులును రచించినట్లుగా 'సర్వ సిద్ధాంత సౌరభము' ను శ్రీఅనుభవానంద స్వాములవారును రచించిరి. పుష్పముల సువాసన నాఘ్రాణించినవారు, ఆ కుసుమము ఎచ్చట నున్నదో అని అన్వేషించి, ఆ వృక్షమును కనుగొని సంతసించినట్లు సిద్ధాంతమను పుష్ప సౌరభమును గాంచినవారుకూడ గవేషణము సలిపి, ఆ సిద్ధాంత వృక్ష రాజమును కనుగొని ఆనందించవలయునని శ్రీ స్వాములవారి ఉద్దేశ్యము. ఏ పూవు విలువ, సుగంధములు దానివే! అట్లే ఏ

సిద్ధాంత విశిష్టత దానిదే। ఆ సమత్వ గ్రహణమునకే, ఆచరణము
నకే యీ 'సౌరభ' రచనము. ఆ సామరస్యముచే సంకుచితత్త్వము
బాసి, పరమత దూషణముల మాని, విశాలమును విశ్వతోముఖము
వగు ఆనందమును పొందనగును.

ఇదియే శ్రీరామకృష్ణ దేవుని ప్రత్యేక సాధనా విధానము
ఇదియే ప్రత్యక్ష అనుభవ స్థితి। సాధనలనేకములుగాని అనుభవము
ఒక్కటే। సిద్ధాంతములు బహుళములుగాని గమ్యమొక్కటే। సకలా
నుభవ స్వరూపుడైన శ్రీరామకృష్ణుని సమస్త సాధనా విధానము
లను, సర్వమత సామంజస్యమును, సకలానుభవ రహస్యములను
వ్యక్తము చేయుటకే యీ శ్రీ అనుభవానంద గ్రంథమాలను
శ్రీ అనుభవానంద స్వాములవారు సంస్థాపించిరి.

పాఠకులు దీనిని పఠించి, మన మహర్షుల భౌతికాభౌతిక
విజ్ఞాన సంపదకు వారసులై, మన ప్రాచీన భారతీయాధ్యాత్మిక
సంస్కృతీ ప్రవాహమున నీదులాడి, యథార్థ భారతీయులై
మనెదరుగాక।

[illegible]

# విషయసూచిక

---

శ్రీ శారదారామకృష్ణాభ్యాం నమః

# సర్వ సిద్ధాంత సౌరభము

## సప్తమ సంపుటము

## ముఖ ప్రబంధము

### మానవ హృదయము

అర్చత ప్రార్చత ప్రియ మేధాసో అర్చత ।
అర్చంతు పుత్రకా ఉత పురం న ధృష్ణ్వర్చత ॥
అవ స్వరాతి గర్గరో గోధా పరి సనిష్వణత్ ।
పింగా పరి చ నిష్కదద్ ఇంద్రాయ బహ్మోద్యతం ॥

ఋగ్వేద-8-69-8,9

పాడుడు! పాడుడు! మీ పాటలను పాడుడు! ఓ ప్రియ మేధసా పాడుము! బాలబాలికలుగూడ గానము చేయుడు! దుర్గము చందము రక్షణమగు నా భగవంతుని గీర్తింపుడు! గర్గరము ఉచ్చ స్వరమున బలుకుగాక! వీణారవములు ప్రతిధ్వనించుగాక! తీగెలు

తమ స్వరములు నెల్లెడల బ్రసరింపజేయుగాక! పరమేశ్
మన కీర్తనము ఎగయునుగాక! అని యూహకందనికా
అలౌకికానంద విభూషితులైన భారతఋషుల కంఠములు, ప
సమ్మోళన మాధుర్యమున, అభౌతిక సుఖస్వరూపుడైన ప
దివ్య చరణకమలసన్నిధి స్పృశింప, పై కెగసి యుండెను.
గ్రీసు దేశమున, నతి ప్రాచీన తత్త్వవేత్త యగు Ep
ఎపిక్టిటస్ హృదయవీణయు, Should there not be so
fill this place, and sing the hymn to God on beh
men? Were I a nightingale, I should do after the n
of nightingale. Were laswan, I should do aft
manner of a swan. But, since I am a responsible
I must sing to God, that is my work; I do it; no
desert this my post, as long as it is granted to
hold it; and upon you too I call to join in this self
hymn [1] ఈ స్థానమును బూరించి, సర్వమానవకోటి నిమి
భగవంతుని గీర్తించువారు లేరా? నే గోయిలనై యుం
గోయిలవలె జేసియుందును. నేనొక హంసనై యుం
హంసచందము బ్రవర్తించియుందును. కాని నేనొక బ
యుత వ్యక్తినౌట; నే భగవంతుని గీర్తింపవలయును.
విధి; నే నాచరింతును. దాని నిర్వహింప నాకవకాశము ప్రా
బడునంతదనుక దాని ద్యజింపను. ఈ గానములో మిమ
బాల్గొన నే నాహ్వానించుచున్నాను, అనియు మ్రోగియున్న

ఈ విధముగా ననాదికాలమునుండి, మానవుని హృ
గహ్వరమున నిగూఢమై యున్న అంతర్వాణి, ప్రపంచ నిజ

1. *Epictitus; Golden Sayings*

పరిశీలనము గావించి, 'అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః। నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యం మోక్షచింతనం॥' శరీరాదులనిత్యములు. ఇట శాశ్వతమెద్దియును లేదు. మృత్యువు చేరువనే నిత్యము నుండును. కాన మోక్షకాంక్షయే కర్తవ్యమనియు, Such a puzzling thing is indeed this world of ours! It is in fact so full of mystery and so full of pitfalls [2] మన ప్రపంచము ఎంత విభ్రమాత్మకము! అది సంపూర్ణముగ నిగూఢమును, ప్రమాద భరితముగను గ్రహించి, విమర్శించి, Man is of kin to the beasts by his body, and if he is not of kin to God by his spirit, he is a base and ignoble creature [3] శారీరకముగ మానవుడు పశుసన్నిహితుడు, తత్త్వతః అతడు భగవత్పరుడుకానిచో అతడు, హేయమును తుచ్ఛమునైన జీవి యగును అనియు దెలిసి, అట్లుండుట అసహజముగుటచే, Should rise to a higher stage, grow into completion [4] నింతకు మించు స్థానమును నందికొన బరిపూర్ణత్వమును బొందవలయునని సంకల్పించి, తత్సిద్ధికై, A friend behind the phenomena [5] ప్రకృతి వెనుకగల నా మిత్రుని, behind a smoke-screen of mortal thinking [6] మానవ చింతనమను

---

2. *Prof. M. Rangacharya: The Three Great Acharyas' p. 148*
3. *Prof. Francis Bacon: Science & The Moral Life: Max Otto. p. 81*
4. *Dr. S. Radhakrishnan: Convocation Address, Hansray Mahila Mandal Mahavidyalaya, 9-11-59*
5. *Edwyn Bevan: Science & The Moral Life, Max Otto. p. 135*
6. *G. De Kock: Read and Live, p. 49*

ధూమావనిక వెనుకనున్న యా సద్బాంధవునిచే నాకర్షింపఁ
'గావ ఇవ గ్రామం యుయుధిర్ ఇవాశ్వాన్, వాశ్రేవ వత
సుమనా దుహానా పతిరివ జాయాం అభినోన్యేత్, ధర్తా దివః సి
విశ్వవారః॥' (ఋ. వే. 10-149-4) గ్రామమును జేరు గోవులవ
అశ్వముల జేరు యోధులవలె, లేగల జేరు గోవులవలె, పతినిజే
పతివలె, ఆనందనాథుడును ద్యులోకాధినేతయునైన నా దేవదేవు
మమ్ము జూచుగాక అని ప్రార్థించును. 'అంకోలం నిజబీజసం
రయస్కాంతోపలం సూచికా, సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహ
సింధు సరిద్వల్లభం ప్రాప్నోతి' [7] యూడుగు విత్తనములు
మాను, సూది యయస్కాంతమును, సాధ్వి తన పతిని,
వృక్షమును, నది సాగరమును జేరువిధంబున, 'వృథైవ భవ
యాతా భూయసి జన్మసంతతిః॥ తస్యాదవ్యతనుం జన్మ సంచి
శరణం వ్రజ' అనేక జన్మముల వ్యర్థముగ గడిపితివి. వాని
నొక్క జన్మముననైన భగవంతుని శరణు బొందుమని, దేవ
మహర్షి శాండిల్యమహామునిని బోధించి యున్నటుల, ఆ భగవ
తుడే సర్వాధారమని ఆకర్షింపబడి శరణుజొచ్చును. తన బాహ
భ్యంతరముల గల పారమార్థిక తత్త్వమును అనుభవించుట
గదా మతమనబడును! [8] అట్టి బాహ్యాంతర తత్త్వమేగదా
పారమార్థిక సత్యము, భగవత్తత్త్వము! అట్టి నిర్విషయ నిరుపమ
మూర్తిని ధ్యానించుమాత్రమున 'యః స్మరేత్ పుండరీకాక్షం

7. Sri Jagadguru Sankaracharya of Kamakoti Peetham
13-2-5
8. Dr. S. C. Chattarjee: Prabuddha Bharata,
p 8, 1952

రాహ్యాభ్యంతర శ్శుచిః' అనురీతి సర్వపునీతుడు మానవుడగునుగదా! అట్టిచో మాతాపితల, దారాపుత్రుల, బంధుమిత్రుల, ధనధాన్యాదుల, గృహక్షేత్రాదుల 'సర్వధర్మాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్। లోకవిక్రాంతచరణౌ శరణం తే వ్రజన్ విభో॥' (శరణాగతి గద్య) సర్వ ధర్మముల, సర్వకామముల సంత్యజించి, నీ చరణకమలముల శరణుబొందుచున్నాడను అను రామానుజుని వాక్యము రీతి, బ్రపన్నుడగుచో జన్మ సార్థకత జెందును. 'త్రాతా నో బోధి వదృశాన ఆపిర్ అభిఖ్యాతా మర్డితా సోమ్యానాం। సఖా పితా పితృతమః పితౄణాం, కర్తేము లోకం ఉశతే వయోధాః॥' (ఋ. వే 4-17-17) మా రక్షకుడవు కమ్ము. భక్తుల నవలోకించి, అనుగ్రహించి, నీవు మావాడవు - కమ్ము. మిత్రా, పితా, పితలకు మించిన పితా! ప్రియభక్తునికి శక్తిసంపదల బ్రసాదింపుము అను వేదవాక్యము ననుసరించి, అతడు మన సర్వస్వముగూడ అగుచున్నాడు. సర్వమును అనుగ్రహించుచున్నాడు. అందుచే 'సులభం భగవన్నామ జిహ్వా చ వశవర్తినీ। తథాపి నరకం యాంతి ధిగ్ధిగస్తు నరాధమాః॥' (గరుడ పురాణము) భగన్నామము నుచ్చరించుట సులభము. అందులకు వలసిన జిహ్వాయు వాని స్వాధీనము. ఇట్లుండియు మనుష్యులు నరకమునకు బోవుచున్నారు. ఛీ ఛీ ఏమి పాడు మానవులు! అని చింతించి, మనము ఆ దేవాధిదేవుని, ఆనందధాముని గీర్తించుటయేగాక, మన ఆర్షవాణితో స్వరముల జోడించి, 'శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః' (ఋ. వే. 10-13-1) లోకములోని అమృత పుత్రులారా! వినుడు అని సర్వమానవకోటిని సంబోధించి, యీ అమృత మార్గమును జాటెదముగాక! అదియు సఫలత గాంచుగాక!

## నేటి మానవకోటి

కాని, నేటి ప్రపంచమున అత్యధిక విద్యాభివృద్ధియు, భౌతిక విజ్ఞానసంజనిత సుఖసంపన్నతయు ప్రవర్ధమానమై, మానవునికే ఆశ్చర్యకరమై యొప్పారియున్నను, మానవుడు తనకే తీవ్ర సమస్యయై వెలుగొందియున్నాడు. Max Otto మాక్సు ఓటో పలికినట్లు Fabulous knowledge, ranging from beyond the milkyway to sub-atomic electrons, touching every type of structure and process, has not provided us with an exalted concept of our world [9] నక్షత్రవీధినుండి పరమాణ్వంతర్గతమగు ఎలెక్ట్రానువరకు సకల పదార్థ నిర్మాణముల, విధానముల స్పృశించు అసాధారణ విజ్ఞానము, మన ప్రపంచము యొక్క యుత్కృష్ట భావనను మనకు గలుగజేయులేదు మరియు రాధాకృష్ణ పండితుడు వచించునట్లు Though the conditions of modren life have become different and are in some ways better, we cannot say that we are superior to our ancients in spiritual depth or moral strength to grapple with difficulties [10] ఆధునిక జీవన విధానములు విభిన్నములై, కొన్నింటిలో మత్తమములై యున్నను, మన పూర్వులకంటె మనము పారమార్థిక సంపన్నతయందుగాని, నైతికబలమునగాని క్లిష్టత్వముల నివారించుకొనుటయందు అధికులము కాదు. కావున, ప్రస్తుత ప్రపంచ వాతావరణము, లౌకికవిషయ సంపూర్ణమై, Intoxicated by material prowess and hypnotised by technoligical

---

9. *Prof. Max Otto : Science & The Moral Life, p 112*

10. *Dr. S. Radhakrishnan : The Brahma Sutras, p 12*

fever [11] భౌతిక శక్తి సంపదచే మత్తుగలిగి, భౌతిక విజ్ఞానవ్యాధిచే నిమంత్రణమై, వ్యాధిగ్రస్తమై వెలసిల్లినది. తత్ఫలితముగ, a vacume so far as the inward mind is concerned [12] బుద్ధిగుహయందు ఒక శూన్యత్వమేర్పడినది. M. Arthur kline ఎం. ఆర్థర్ క్లైన్ వచనరీతి repression of the 'spiritual' the real pathology of our age [13] పారమార్థిక తత్త్వనిరోధమే మన కాలముయొక్క యథార్థ వ్యాధియై యున్నది. కావున, Spiritual vacuity has become almost a badge of intellectual superiority [14] పారమార్థిక భావ శూన్యత్వము ధిషణాధిక్యతకు చిహ్నముగా నేర్పడినది. ఈ విషయ క్లిష్టత్వమును, ప్రమాద మునుగూర్చి జవహరిలాల్ నెహ్రూ పండితుడు హెచ్చరించుచు, We have neither the old nor the new (faith) and we drift not knowing whither we are going [15] మనకు పురాతన విశ్వాసముగాని, అధునాతన విశ్వాసముగాని లేదు. ఎచటికి మనము జారుచున్నది తెలియకయే నడచుచున్నాము. The younger generation has no standard left, nothing to direct their thinking or control their actions. This is a dangerous situation [16] యువజనులకు ఏ ప్రమాణముగూడ, వారి భావనా

---

*11. Prof. Jean Rostand : Indian Express, 29-5-1960*
*12. Dr. S. Radhakrishnan : Address, The Mar Basil High School, Indian Express, 13-4-61*
*13. M. Arthur Kline : Vedanta Kesari, p 143, 1954*
*14. Dr. Sampurnanand: Bhavan's Journal, p 28, 6-11-55*
*15. Pandit Jawaharlal Nehru: Bhavan's Journal, p 27, 3-6-56*
*16. Sri Jagadguru Sankaracharya of Kamakoti Peetham, Bhavan's Journal, p 19, 3-6-56*

విధానమును నడుపుటకుగాని, వారి ప్రవర్తనను నియమించుటకు గాని అభావమైనది. ఇది చాల ప్రమాదకర పరిస్థితి. అట్టులైన ప్రాచీన సంప్రదాయముల ద్రుంచి, యువకుల నిరాధారులుగజేసి, వారికాధారముల గల్పింపగలమా? యని కంచీపుర కామకోటీ పీఠికాధ్యక్షులగు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీ మహాస్వామివారి ప్రశ్న. ఉన్నవాని నిర్మూలించుట అతి సులభమే యగునుగాని, నూత్నముల నిర్మించుట బహు కష్టసాధ్యముగదా! మానవుడు దేవుడగుటకు కార్యరంగమున నేర్పడియున్న యీ ప్రపంచమును, as soundless, scentless, colourless, merely the hurrying of material, endlessly, meaninglessly [17] శబ్ద, గంధ వర్ణ రహితమునై, అనంతముగ అర్థరహితముగ పర్వెత్తుచుండు పదార్థ మని, A. N. Whitehead ఎ. ఎన్. వైట్‌హెడ్ అను తాత్త్విక గణిత శాస్త్రవేత్తయు, appalling meaninglessness [17] ఘోర మైన అర్థశూన్యత యని Julion Huxley జూలియన్ హక్స్లే అను జీవశాస్త్రజ్ఞుడును, నిర్విరామముగ వయనించు అగ్నిగోళములలో the appearance of man is an unfortunate accident [17] మానవ నిర్మాణము దురదృష్టకర సంఘటనమనియు, అర్థరహిత ప్రవచనముల గావించు భౌతిక శాస్త్రజ్ఞుల దృష్టికి, సృష్టి, అర్థరహితమై తోచుచున్నది. కాని Without the knowledge of the spirit all material knowledge is only adding fuel to the fire [18] తత్త్వజ్ఞానరహితమైన భౌతికజ్ఞానము, అగ్నిలో నింధనముల జేర్చుటవంటిదని వివేకానందుని హెచ్చరిక. 'ఉద్యంతు

17. *Prof. Max Otto : Science & The Moral Life. p 83*
18. *Swami Vivekananda : Jnana Yoga*

శతమాదిత్యాః, ఉద్యంతు శతమిందవః। న వినా విదుషాం వాక్యై ర్నశ్యత్యాభ్యంతరం తమః॥' (సభారంజకశతకం) శతభాస్కరు లుదయించుగాక! శతచంద్రులుదయించుగాక! జ్ఞానుల వాక్యము లచేగాక అంతస్థమగు అంధకారము అంతరింపదు. అట్లంధకారము నశింపని యీ ప్రపంచమున, నేడు జ్ఞానము నశించిపోయినది. దీనికి గారణము నన్వేషించిన మనోశాస్త్రవేత్త యగు C. G. Jung సి. జి. జంగ్ ఆచార్యుడు, Modern Man in Search of a Soal 'ఆత్మాన్వేషణ పరుడైన ఆధునిక మానవుడు' అను గ్రంధమున, నిట్లు వచించి యున్నాడు. తన దగ్గరకు మనోవ్యాధి నివారణము నకై యరుదెంచువారందరును, నేటివరకు అనుచరులకు సర్వ కాలములు, మతములు ప్రసాదించు అమూల్య వస్తువును గోల్పోయిన వారనియు, none of them has been really healed who didnot regain his religious outlook [19] తన పారమార్థిక దృక్పథమును పునరుద్ధరణము గావించుకొనినివారు, పూర్తిగ రోగ విదూరులు కాలేదనియు వక్కాణించి యున్నాడు. అనగా పారమార్థి కత లోపించుటచే మానసిక దుర్బలత్వములు ఏర్పడి, చిత్తచాంచల్య ములుగూడ నేటి ప్రపంచమున సంభవించు ప్రమాద పరిస్థితి జనించినదని గ్రాహ్యము.

---

19. *Dr. S. Radhakrishnan : The Brahma Sutras, p 9*

కావున మానవునిలో నుండవలసిన మానవత్వము నశించి, మానవుడు పశుత్వమున బడిపోవుట నేటి దుర్భర పరిస్థితి. Enlightenment (Jnana) is not an intellectual state, but a state of spiritual awakening which comes through moral rebuilding [20] జ్ఞానము, ధీకుశలతకాక పారమార్థిక స్థితియొక్క జాగరణము. అది నైతిక పునర్నిర్మాణమున జనించును. An educated person being,———, one who thinks more than is necessary for survival [21] కేవలము జీవించుట కవసరములు మాత్రముగాక, అధికతరముగ యోచించువాడే విద్యావంతుడు అని విజ్ఞుల వచనము. విజ్ఞానమనగ విద్యాధిక్యతమాత్రముగాక వివేకము నాబడునవియు, అది నైతికమనియు, John Dewey జాన్ డ్యూయీ నిర్వచించెను. [22] అనగా Man was more than his present and his past disclosed. In some sense he was what he was still to be [23] మానవుడు, తన వర్తమాన భూతకాలముల కధికుడు అనగ అతని భవిష్యత్తుకూడ నితడై యుండును. మాక్సు ఓటో వాక్యముల గమనించి, సంపూర్ణ

---

20. *Sri C Rajagopalachari : Bhavan's Journal, p 73, 9—8—59*
21. *Mildred McAfee : Science & The Moral Life of Max Otto, p 13*
22. *John Dewey : Seience & the Moral Life of Max Otto. p 19*
23. *Prof. Max Otto : Science & The Moral Life, p 33*

మానవత్వ వికాసమునకై మార్గాన్వేషణము గావించుటయే ప్రస్తుత కర్తవ్యము.

అదెట్లు? అను ప్రశ్నముదయింపక మానదు. It seems to me, that side by side with the decline of religious life, the neuroses grow noticiably more frequent [24] పారమార్థిక జీవన క్షీణతతోడ, మానసిక చాంచల్యము తరచుగ అధికమగుచున్నదని జంగ్ మొదలగు విజ్ఞుల హెచ్చరికకదా! భౌతికవిజ్ఞానము ఎంత అభివృద్ధి గాంచినను, the intuitions of value, tha significance of love, the irresistable attraction of beauty etc., [25] ఆంతరంగిక ప్రవృత్తులు, ప్రేమతత్త్వ తాత్పర్యము, అజేయ, సౌందర్య ఆకర్షణముల ఆంతర్యముల గ్రహించి తెలుపగలదా? 'పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యా మృతం దివి' (ఋ. ౧౦-౯౦-౩) ఈ విశ్వ భూతాదికమా భగవంతుని కొక పాదమగుచుండ ద్యులోకాదులు పాదత్రయమగును. అనగా నీ స్థూల ప్రపంచము, సృష్టితో ఒకి సంకుచితమై యొప్పారుచుండ, దీని కాధారభూతమగు సచ్చిదానందలక్షణముల, బాహ్యజగత్పరిశీలనలో మగ్నమై యున్న నీ భౌతిక జ్ఞానము గ్రహింపగలదా?

అందుచేత, సృష్టిని సంపూర్ణముగ దరచి చూచి, నిజతత్త్వ మారసి, సత్యమును బోధించు మహాపురుషులే మనకు శరణ్యము. అట్టి సత్పురుషుల పెన్నిధి భారతభూమి. Karl Jaspars కార్ల్ జస్పర్స్ వచించురీతి, Philosophy is a task which man will

---

24. *Prof. C. G. Jung : Modern Man in Scarch of a Soul, Vedanta Kesari, p 38, 1953*

25. *Betrand Russell : The Essence of Religion*

face in one form or another as long as he remains man[26] మానవుడు, మానవుడుగా నెంతకాలముండునో అంతవరకు తత్త్వవిచారణ మేదోవిధముగ నతని నెదుర్కొనుచుండును. అతడు యీ సృష్టి రహస్యమును, విచారింపక దప్పదు. ఈ విషయమును గ్రహించిననాని, అతనికి ప్రాపంచిక జీవితము సునిశ్చితముకాదు. కాన, ప్రథమతః యీ తత్త్వ విచారణము మానవ జీవితమున నత్యంతావసరమని స్పష్టమగుచున్నది. Philosophy has for its function the ordering of life and the guidance of action[27] ఆ తత్త్వ విచారణము జీవనవిధానము క్రమపరచి, కర్మనిరతిని నియమించుటచే, నది కేవలము మానసికమైనది కాదు. దాని ననుష్ఠానమునందుంచుటయే పారమార్థిక జీవనము నాబరగి, అది makes man moral and just, and directs him to discharge his social obligations to his fellow men[28] మానవుని నైతిక నిరతుని, న్యాయప్రవర్తకుని గావించును. తోటి మానవులతో గల బాధ్యతలను నిర్వర్తింపజేయును. తత్త్వజ్ఞాన, పారమార్థిక జీవిత ములకుగల యట్టి సన్నిహిత సంబంధమే, మానవ నిత్యజీవిత విధానమున, మతజీవనము సజీవమై, సత్యమై రాణించును.[29] అది సత్ఫలములను క్షీరముల ప్రసాదించు గోవుగ వివేకానందుని నిర్వచనము[30] అనగా Religion always places the human

26. *Prof. Karl Jaspers : Way to Wisdom p 14*
27. *Dr. S. Radhakrishnan : Indian Philosopey, Vol. 2. p. 770*
28. *The Editor : Prabuddha Bharata. p 165, 1960*
29. *Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. I, p 26*
30. *Swami Vivekananda : Complete Works, Vol. 7, p 42*

soul in the presence of God—[31] పారమార్థికము జీవుని సర్వదా భగవతుని సన్నిధి నుంచును. అందుచే నది places the human soul in the presence of its highest ideal, it lifts it above the level of ordinary goodness, and produces atleast a yearning after a higher and better life-a life in the light of God [31] జీవుని ఉత్కృష్టాదర్శమును ముందుంచుచు, సాధారణ ఉత్తమత్వమునకు పైకి గొంపోయి, భగవత్తేజోమయ జీవితము నాచరగు సర్వోత్తమ, సర్వోన్నత, జీవితాదర్శ తృష్ణనుద్భవింపజేయునని మాక్సు ముల్లరు మహాశయుడు వాకొనెను.

మరియు, ఈ విశాల విశ్వమున, ఈ దుర్జ్ఞేయ సృష్టి మధ్యమున, అనంతములై, అగాధములై, అద్భుతములై యొప్పారు యీ భూతకోటినడుమనున్న మానవుడు, తన అల్పత్వ, అణుత్వముల, నవగాహనము గావించి, he thinks himself lowlier than a blade of grass [32] తాను గడ్డిపరక కంటె నీచముగ దెలిసికొని, realises that the universe is permeated with the Divine [33] సకల విశ్వము పరమాత్మచే వ్యాప్తము అని గ్రహించును. ఇదియే ఆధ్యాత్మిక జీవనమునకు నాంది.

---

31. *Prof. F. Max Muller : Introduction to Science of Religion, p 192*

32. *Swami Ramakrishnanda: The Life of Ramanuja, p 9*

## భారతీయ విధానము

ప్రపంచ వ్యామోహ అవనిక వెనుక మానవునందు యున్న తత్త్వచింతనము, పారమార్థిక జీవనము నాటకు తృష్ణా ద్వయము, అనాదికాలమునుండి భారతదేశమున బెంపొ చున్నది. అది, ప్రపంచ విజ్ఞానమునకొక అమూల్య ప్రసాద ఆచార్య నాగరాజారావు ఉద్ఘాటించి యున్నాడు.[33] అతి ప్రా మయినంతమాత్రమున నది నిరుపయోగమని భావింపరా అనాదికాలసిద్ధమైన సూర్య, చంద్ర, అగ్ని, వాయు, జల శక్తులు అప్రధానములు కానటుల, సర్వప్రాణికోటికి యంతర్గత యున్న ప్రేమరాగములు అనాదికాలసిద్ధములైనను అప్రధానమ కానట్లు, మానవునిలోగల అవ్యక్త భగవదాకాంక్షయు, తత్పద్ధ నెల్లకాలముల నిత్యశోభాయుతమై, ఉపయుక్తములై, గొందుచుండును. వానికి వయోవృద్ధత్వములు, ప్రాచీన అర నత్వములభావములు. నిత్యయౌవనములే, నిత్యతేజో విభా ములే. కావున, అతి ప్రాచీనకాలగత పరంపరా ప్రవాహ అరుదెంచు Indian thought is a chapter of the history of human mind, full of vital meaning for us[34] భారతీ భావధార, మానవ మనో చారిత్రమున మనకు, ప్రముఖ అర్థయు మైన ఒక ప్రకరణము. ఎందుచేతన, the facts of min

---

*33. Prof. P. Nagaraja Rao: The schools of philosop*
*p.*

*34. Dr. S. Radhakrishnan: Indian philosophy,*
*Vol. 1, p. 7.*

consciousness were studied by the Indian thinkers with as much care and attention as the facts of the outer world are studied by our modern scientists [35] బాహ్య ప్రపంచమును, మన ప్రస్తుతకాల భౌతిక విజ్ఞానవేత్తలు పరిశీలించి గ్రహించుచున్నట్టుల, భారతీయ శేముషీధురంధరులు బుద్ధివిషయముల నంత శ్రద్ధాయుక్తులతో గ్రహించియున్నారు. అందుచే వారు ఆధ్యాత్మిక రహస్యముల సమగ్రముగ గ్రహించుటచే, సర్ ఫ్రాన్సిస్ యంగ్ హస్బెండు వచించునట్లు, India, for thousands of years, has been a fountainhead of spiritually [36] భారతావని, సహస్రాధిక సంవత్సరములుగ, పారమార్థిక విషయ స్రవంతిగ రాజిల్లుచున్నది అట్టి నిగూఢ విషయ నైపుణ్యము నార్జించి, ప్రపంచమునకు ఆదర్శమై, శరణ్యమై ప్రకాశించుటచే, భారతీయ తత్త్వవిచారణమున నగ్రగామియైన వేదాంతమును గూర్చి మాక్సుముల్లరు పండితుడు, If philosophy or religion is meant to be a preparation for the after life, a happy wife, a happydeath, I know of no better preparation for it than the Vedanta [37] మరణానంతరజీవితమునకు, ప్రస్తుత సుఖజీవితమునకు, శాంతియుత మరణమునకు తత్త్వవిచారణము, పారమార్థిక జీవనము సంసిద్ధపరచునను యన్వయమైనచో, వేదాంతము కంటె నుత్తమతరము నా కగోచరము అనిను

---

35. *Dr. S. Radhakrishnan: Indian philosophy, Vol. 1, p 32*

36. *Sir Francis Younghusband: New York Times Magagine, 26-9-37*

37. *prof. F. Max Muller: Complete Works of Swami Rama Tirtha, Vol. 7. p 114*

విస్పష్టముగ వాకొనెను. జీవేశ్వర సంబంధ సమన్వయము, యీ విధానమున పరిస్ఫుటమైనట్లు అన్యమున కానుపింపవదు. అందుచే నీ భారతీయ విధానము నిత్యనూతనమై, శక్తివంతమై, సర్వతోముఖమై, సర్వమానవోపయుక్తమై, శోభాయమానముగ నాటినుండి నేటివరకు విరాజిల్లుచున్నది.

## సర్వతోముఖత్వము

మానవోపయుక్తముగ, ప్రపంచమున ననేక వస్తుచయము గలదు. ఇసుమంత సూక్ష్మదృష్టి బరిశీలించి చూచుచో, సృష్టిలోగల సర్వ పదార్థములు, ఏదియో ఒకవిధముగ మానవున కుపయోగించుచునే యున్నవి. అనగా నీ సృష్టియంతయు, మానవున కుపయోగకరముగ నున్నది కావున, కపిల మహర్షియు నీ ప్రకృతినిగూర్చి వివరించుచు, నది పురుషునికి అనగా జీవునికి 'భోగాపవర్గార్థం' అనియు, 'పురుషస్య దర్శనార్థం కైవల్యార్థం' అనియు వచించుట మనము చూచియున్నాము. 'భోగ' పదమునకు, 'దర్శన' పదమునకు తాత్పర్యము అనుభవమని వ్యక్తము. అతని అనుభూతి కొరకే, యీ సృష్టి నిర్మాణమున కంతరార్థమని కపిలాచార్యుని ఉపదేశము. అయినను సర్వమానవులకు, సర్వ సృష్టి పదార్థములు, సర్వ, కాలముల, సర్వ విధానముల నుపయుక్తములు కానేరవు. వ్యక్తి, వస్తువు, కాలము, విధానముల ననుసరించి యుపయోగము మారుచుండును. వస్తువులలో నెట్టి పదార్థ విభేదములుండునో, మానవులొక్కటిగ గోచరించుచున్నను, తత్త్వము ననుసరించి అట్లు వ్యక్తి విభిన్నత్వములు భాసించును. ఈ విషయమును వివరిం

చుచు, సత్త్వరజస్తమోగుణములు విశదీకరింపబడి యున్నవి. శారీరకముగ, వాత పిత్త శ్లేష్మముల సమ్మేళనా విభేదముచే, మానవులలో ఆహార వ్యవహారముల దారతమ్యమేర్పడుచున్నరీతి, నీ త్రిగుణ సంకలన విధానము ననుసరించి, వ్యక్తి వ్యత్యాసములు మానవకోటిలో నేర్పడి, ప్రవృత్తి భేదములు జనించుచున్నవి. ఆ ప్రవృత్తి తారతమ్యములకనుగుణముగురీతి బోధనా విధానము, ఉద్యోగ వ్యవహారములు, లోకమున జరుగుచున్నవి.

అటువలెనే, యీ పారమార్థిక జీవన విధానమునగూడ మానవులలో వ్యక్తిననుసరించి, అతని ప్రవృత్తికనుగుణముగ బోధన, సాధన, ఆచరణముల నుపదేశించినచో, నవి అతని కుపయుక్తములగునుగాని, లేకున్న అవి అతనికి నిరుపయుక్తములగుటయేగాక, నొక్కొకవేళ దురుపయోగమునకును వినియోగించును. అంతియగాక కొన్ని సమయముల నవి అతనికి ప్రమాద హేతువులుగగూడ బరిణమించును. ఈ విషయముల గాఢ గవేషణము గావించిన ఆర్ష తత్త్వవేత్తల, సాధకుల అధికారి నిర్ణయము గావించి, తద్వ్యతిరిక్తముగ నుపదేశికుడు వ్యవహరింపరాదనియు శాసించియున్నారు. అదియు నవసరమే. అజ్ఞానిచేత నాయుధము, బాలకుని కరమున నగ్ని, మూఢుచెంత నధికారములపకార హేతువులగుట లోకమున గాంచుచున్నాముగదా!

కావున పారమార్థిక విషయ ఉపదేశము, సర్వ సామాన్యముగ నుండక, ప్రత్యేక ప్రత్యేకముగ నుండవలెను. బోధకుడు

అధికారి నిర్ణయము గావించునట్లు, సాధకుడుగూడ తన కనుగుణ విషయముల గ్రహింప నుద్యుక్తుడుగ గావలయును. Not only must you have the spiritual ideas, but they must come to you according to your method [38] నీకు పారమార్థిక భావము లవసరములేగాని, అవి నీ విధానమున కనుగుణముగ నుండవలెనని, వివేకానందుని హెచ్చరిక. అట్లు కానిచో, విషమత్వ మేర్పడును. నీ స్థితికి అవి స్వల్పములైనచో నిరుపయుక్తములు. కాక అవి అధికములైనచో, నిరుపయుక్తములేకాక ప్రమాద భరితములు. కాన, సాధకుడు చాల జాగృతి వహించి, పారమార్థిక విషయ గ్రహణము గావించు చుండవలయును.

దీనియందెక్కువ కృషి గావించిన ఋషివరేణ్యులు భారతీయ సంస్కృతిని సర్వతో ముఖమొనరించుటలో పై విషయముల, నిపుణతతో విచారించి నిర్ణయించిరి. సర్వ మానవులకు, అఖిల సాధకులకు, ఒకే విధానము నుపదేశించి, అనుష్ఠానము లందింపక, వ్యక్తి ననుసరించి బోధయు, తదనుగుణ సాధనయు బోధించిరి. కాన నీ భారతీయ విధానము సంకుచితముగాక, అతి విశాలమై, సర్వవిధమై, సర్వవ్యాప్తమై, నానావిధ సాధకులకుప యుక్తముగనుండుట దీని విశేషము. మోనియర్ విలియమ్స్ అను ఆంగ్లదేశ సంస్కృతాచార్యుడు, Hinduism has something to offer which is suited to all minds. Its very strength lies in its infinite adaptablity to the infinite diversity of human character and human tendencies [39] అఖిల

---

38. *Swami Vivekananda : Jnana Yoga*

39. *Sir Monier Williams · Vedanta Kesari, p 11 .1926*

తత్త్వములకు అనుగుణమగు విశేషము హిందూమతమున గలదు. అనంత మానవ సంస్కారములకు, అనంత విభిన్న తత్త్వములకు, సర్వసమన్వయమునందే, దాని శక్తియంతయు గలదని రచించెను. పాల్ దేవసేనుడుగూడ శ్రీశంకరాద్వైత విచారము చేయుచు, నిర్గుణ, సగుణ, బ్రహ్మముల సూచించి, He constructs out of the materials of the Upanishads two systems: one esoteric, philosophical (called by him Nirguna Vidya, sometimes paramarthika avastha) containing the metaphysical truth for the few ones, rare in all times and countries, who are able to undrstand it; and another exoteric, Theological (Saguna Vidya, Vyavaharika avastha) for the general public, who want images, not abstract truth, worship, not meditation [40] శంకరులు ఉపనిషద్విషయములనుండి ద్వివిధ విధానముల నిర్మించెను. సర్వ కాలముల, సర్వ దేశముల, నపూర్వముగనుండు అర్థ జ్ఞాన నిపుణులైన అల్పసంఖ్యాకులకొరకు పారమార్థిక అవస్థ నాబడు నిర్గుణవిద్యను; ధ్యానముకాక, సుసూక్ష్మతత్త్వ విచారణముకాక, విగ్రహారాధనము గోరు సర్వ సామాన్యులకొరకై వ్యావహారిక అవస్థ యనబరగు సగుణవిద్యను బోధించెను. మొదటిది అంతరము, రెండవది బాహ్యము. ఇది కేవలము శంకరవిధానముగాక, ప్రాచీన మహర్షి సంప్రదాయమై యున్నదని గ్రాహ్యము. అందు స్థూల రూపమైన సగుణ విద్యయు, బహుముఖములై, నానావిధములై, సర్వవిధ ప్రవృత్తులకు అనుగుణముగ నేర్పడియున్నది. ఇదియే భారతీయ ప్రాచీన పారమార్థిక సంస్కృతివిశిష్టత! ఇదియే సర్వ మానవ కోటి మానవోద్ధరణమునకుత్కృష్ట ఉపాయాంతరము.

40. *Dr. Paul Deussen : The Philosophy of Vedanta. p.*

ఈ వివిధ ప్రవృత్తుల సమన్వయము గావించుకొని, జీర్ణింప జేసికొని, సర్వము తానెయై సాధించి, అనుభవించిన వరమాదర్శ మూర్తియునగు మారుతి మనకు లభ్యమగుట మన అదృష్టము. ప్రసంగవశమున తన గురువు, దైవము అయిన శ్రీరామచంద్రుని ప్రశ్నమునకుత్తరముగ 'దేహబుద్ధ్యాస్మి దాసోహం జీవబుద్ధ్యా త్వదంశకః। ఆత్మబుద్ధ్యా త్వమేవాహం ఇతిమే నిశ్చితామతిః॥' నేను దేహస్మృతి నున్నప్పుడు, నీకు దాసుడనను భావమున నుందును, జీవుడను అను తలపుతో నున్న వేళల, నీ యంశ మునుగా నిశ్చయమున నుందును. అటులే, నేను ఆత్మనను భావము తోచుకాలముల, నేను నీవే యని నిశ్చయమున నుందు నని వచించెను ఇందు ద్వైత, విశిష్టాద్వైత, అద్వైత సిద్ధాంత ములు మూడును ప్రస్ఫుటముగా, నఖిల భారతీయ పారమార్థిక సిద్ధాంత, సాధన, సిద్ధి విషయములు వక్కాణింపబడియున్నవి. స్థూలబుద్ధులై, దేహాది విషయముల దాటని వారికి, భక్తిరూప దాస్యభావము ముఖ్యమై, ఆ పరబ్రహ్మముగూడ స్థూలముగ భగవంతుడై యొప్పారి, తదనుగుణ అనుభవ సంచయమును బ్రసాదించును. అట్లుగాక దేహచింతనమును మించి, తదాధారమగు జీవభావము గలిగి, సాధకుని చిత్తము సూక్ష్మతరముకాగ, విశిష్టా ద్వైతము శరణ్యమై, అంశాంశిభావమున భక్తుడు భగవంతుని భాగమై, శరీరమునగల అవయవాది వివిధ భాగములకు ప్రత్యేక వ్యక్తిత్వము లేక దేహమును నియమించి, మనసునకు లోబడి నడుచుకొనురీతి, భక్తునకు ప్రత్యేకతలేక, విష్ణువునకు భాగముగాన అతని కధీనుడై, సంపూర్ణ శరణాగతి గావించి, పూర్ణప్రపన్ను డగును. అతనికి దదనుగుణ అనుభూతి వొదమును అంత, నేను

ఆత్మనను భావము సూక్ష్మాతిసూక్ష్మముగ బుద్ధి పరిణమించి గలుగగా, జీవ బ్రహ్మ వ్యత్యాసము అదృశ్యమై, 'సోహం' జ్ఞానమున, బూర్వము సాధకుడనబడువాడు బ్రహ్మైక్యమున నుండును. ప్రపంచ మున నే మతమును జూచినగాని, ఏ సిద్ధాంతమును బరిశీలించిన గాని, అఖిలము యీ మూడు విధానములలో నంతర్గతములై యొప్పారవలయును. వీని కన్యమైన సిద్ధాంతము అభావము, అభూతము, అసంగతము.

కావున India's greatest treasure is her ancient spiritual wisdom. The time has come when the treasure should be fully discovered and offered, not only to the people of India, but also to those of other countries so that a foundation may be laid upon which to build the peace, the unity, and the concord to which all nations aspire [41] హిందూదేశమునకు, ప్రాచీన, పారమార్థిక విజ్ఞానమే సర్వోన్నతనిధి. ఒక భారత ప్రజానీకమునకేగాక, సర్వేతరదేశము లకుగూడ, అఖిల జాతులు కాంక్షించు సమన్వయత్వము, ఏకత్వము, శాంతుల నిర్మించు పునాదుల నిర్మాణమునకై, దాని గవేషణ మొనరించి, అర్పింపవలసిన అవసరకాలమేతెంచినది. కాన, మనము కార్యాచరణమునకు గడంగెదముగాక!

---

41. *The Editor : Cultural Heritage of India, Vol 3.*

## దర్శన - అద్వైత ఖండములు

అందుకొరకు, 1938 వ సంవత్సరమున గ్రంథరూపమున నావిర్భవించి, 1954 వ సంవత్సరమున, ఆధునిక యుగ పరమావ తారవరిష్ఠుడైన భగవాన్ శ్రీరామకృష్ణ దేవుని ముఖ్య శిష్యురాలును, సహధర్మచారిణియునైన శ్రీ శారదామణీదేవి శతవార్షిక జయంత్యు త్సవ సందర్భమున, పరమేశ్వరుని అనుగ్రహవిశేషమున, ముద్రణ యంత్రమున నెక్కి, ప్రకటిత శోభాయమానరూపము దాల్చి యుండిన మన 'సర్వసిద్ధాంత సౌరభము' ఆ దేవదేవుని పరిపూర్ణ కృపావీక్షణ మహాత్మ్యమున, నింతవరకు దర్శన, అద్వైత ఖండ ముల ప్రదర్శించి, లోకమున ప్రస్తుతి గాంచియుండుట సర్వవిది తమే. దర్శనాచార్యుల సర్వతోముఖ ప్రతిభావిభూతుల వివరించి, అందలి ప్రాచీనాధునిక భావముల గ్రోడీకరించి సమన్వయించి, వర్తమాన భావజాలములు భూతకాలభావ జన్యములుమాత్రమే యనియు నిరూపించి, భారతీయ ప్రాచీన విజ్ఞానసంపద నిసు మంతగ దృష్టికి గోచరింపజేసి, మన 'సౌరభ' గ్రంథము, అమహర్షి కోటి ఋణవిమోచనము నొందినది. సూక్ష్మబుద్ధి బరిశీలించినచో, భగవదవతారమైన శ్రీకపిలాది వ్యాసపర్యంతముగల ఆ దర్శన కర్తలు, వ్యక్తము గావింపని విజ్ఞానము ప్రపంచమున గలదా యని ఆశ్చర్యము గలుగును. అంతియుగాక, నా మహర్షిచంద్రుల యమానుషశక్తి సర్వము, మానవ అజ్ఞాన విమోచన మార్గాన్వేషణ మునకే వినియోగింపబడి, దుర్జ్ఞేయ విషయముల సాధించి, సుబోధకము గావించి, సర్వమానవోద్ధరణకార్యమునకై ప్రసాదింప బడినవి. అందుచే నెల్లమానవులు వారికి ఋణపడియున్నారు. ఆ

ఋణవిముక్తికై వారి మార్గముల ననుసరించి, అనుభవించి ఆనందించుటయే మార్గము. అందులకెల్లరు సంసిద్ధులగుదురుగాక !

ద్వితీయమైన అద్వైత ఖండము, దర్శన ఖండమువలె సంపుటీత్రయముగలిగి అలరారినది. కాలమెరుగని కాలమునుండి పరంపరాగతమై, కృపామాతయై, అజ్ఞ మానవోద్ధరణ కార్యదీక్షా దక్షయై, అరుదెంచుచున్న వేదమున నంతర్గతమై, ఉపనిషత్తుల విశదీకృతమై, సూత్రముల సకల సంశయ విచ్ఛేదకమై, స్మృతుల శాసనముగనై, పురాణేతిహాసాదులయందు ప్రదర్శితమై, నిదర్శనమై, శ్రీశంకరుని జేరి విజృంభించి, అనుచరుల హస్తముల విశ్వవిశాలత్వము నొందిన అద్వైత సిద్ధాంత విశేషముల జూచియున్నాము. బాల్యమున సన్న్యసించి, అమానుష విద్యాశక్తి నాస్వాదించి, సరస్వతీ మూర్తియై, దేశముల బర్యటించి, పరమహంస పరివ్రాజకాచార్యుడై, యతిసార్వభౌముడై, సన్న్యాస చక్రవర్తియై ప్రకాశించిన శ్రీ శంకరభగవత్పాదాచార్యుని మహిమా విషయముల జవి జూచినారము. ఉత్తమాధికారియై, సర్వ సల్లక్షణ సంశోభితుడైన ముముక్షువునకు దివ్యతమాదర్శమునందు గాంచియున్నాము. అటుల శ్రీ శంకరానంతరాద్వైతమగు ఆరవ సంపుటముతో అద్వైత ఖండము, సమాప్తి నొందియున్నది.

## వైష్ణవ ఖండము

నిర్గుణ, నిర్వికార, నిరాకార, నిర్విశేష, పరబ్రహ్మమునందే లక్ష్యము నుంచి, అన్యమును విస్మరించి, సుసూక్ష్మ కుశాగ్రబుద్ధి గ్రహించి, సాధించి, అందే లయించి, అభేదత్వము నొంది,

బ్రహ్మైక్యమున నేకాకృతినుండుట నందరికి సాధ్యమా? నిరాకా
మున సాకారము, నిర్గుణమునందు సగుణములిమిడియుండు పరమ
రహస్యముల శోధించి, సాధించి, అనుభవించి, బోధించు
అత్యంతావసరమైనది. లోకమున, మానవునిలో వ్యక్తమగుచున్న
సర్వ ప్రవృత్తుల నిరోధించి, సమయింపజేసి శాంతిని సాధించు
కంటె నా ప్రవృత్తుల సజీవముగ నుంచి, సర్వ కేంద్రము న
పరమ లక్ష్యమునైన ఆ పరమాత్మునికే వాని నర్పించి, పునీతవ
గావించి, తన్మూలముగ శాంతిని సాధించు ఉపాయాంతరము
సామాన్య ప్రజానీకమునకై ప్రసరింపజేయుట విజ్ఞుల కర్తవ్యమ
కాదా? అనుభవసంపన్నులు తమ సిద్ధత్వమున స్థితులై యున్న చ
నిక సామాన్య సాధకలోకముయొక్క గతి ఏమి? సృష్టికి పూర్వమ
అగ్రమున, అవాఙ్మానస గోచరమై, అనిర్వాచ్యమై యొ
యుండెనని భావింపబడు పరబ్రహ్మముతో బాటు, సృష్ట్యాదిన స
రూపముదాల్చి, సృష్టిని సంకల్పించి, తపము గావించి, బహు
రూపము నొంది, సర్వ చరాచరభూతకోటియై, అంతటను ప్రవేశిం
అంతర్యామియై నియమించి పాలించి తరింపచేసె
ఆ పరమాత్మను గ్రహింపవలయునుగదా! సచ్చిదానంద సల్ల
లక్షితుడై, సృష్టి స్థితి లయ కర్తయై, సర్వుడై యుం
సీ పరమేశ్వరుడుగూడ పరబ్రహ్మము నాబడునుగదా! వ్యత్యాస
నిర్వ్యాపారము సవ్యాపారములుమాత్రమే యగును
పరమాత్మ బరబ్రహ్మముకంటె జీవునికి సన్నిహితుడు, అప్ర
వాని బొందగోరి, సాధించుటయే అద్వైతేతరసిద్ధాంతమ
పరమావధి.

ఈ సాకారమగు పరమాత్మ, ఆ యా సిద్ధాంతముల ననుస రించి, ముఖ్యముగ శివ, విష్ణు, శక్త్యాది రూపముల రూపొంది, భారతీయ, పారమార్థిక విజ్ఞానమును అనంతముగ గావించి యున్నది. ఆ పరమేశ్వరునియందు సర్వవ్యాపకత్వ సర్వాంత ర్యామిత్వములనే జూచి, వానికే ప్రాధాన్యమిచ్చినచో నది వైష్ణవ సిద్ధాంతము నాబడును. ఆ సగుణ సాకారదైవమునకు, అందు గోచరించు కొన్ని లక్షణములకే ప్రాముఖ్యత నొసంగి, తదనుగుణ నామకరణము గావించినచో నా దైవమున నా నామమును, ఆ సిద్ధాంతమునకుగూడ ఆ నామమే అన్వయింప బడుచుండును. ప్రస్తుతమున ఆ పరమాత్ముని విష్ణువుగ జూచి, ఆతని సన్నిధి నార్జించి, ఆనందించు విధానముల బోధించు వైష్ణవ సిద్ధాంతము యీ ఖండమున సమీక్షింపబడును.

## విశిష్టాద్వైతము

కాని యీ వైష్ణవము వేదమూలమై, సర్వోపనిషత్తుల నందంతర్గతమై, పురాణేతిహాసముల వ్యాప్తమై, సువిశాలమై, బరమాత్మనుండి తులసీదళమువరకుగల వివిధ రూపముల దొంగి చూచుచు, తన అనంతత్వమును నిరూపించియున్నది. సర్వమానవ హృదయముల జొచ్చి, అందలి మనోప్రవృత్తుల నాకర్షించి, తన భక్తుల గావించి, సర్వతోముఖమై విరాజిల్లినది. అట్టి అనంత వైశాల్యముగల యీ సిద్ధాంతమును ఒకచో జేర్చి ఒక రూపము నొసంగి, సాధకకోటికి సులభ గ్రాహ్యముగను,

ఆచరణ యోగ్యముగను ఒనరించు మహావకాశము శ్రీరామానుజా చార్యులకు సంప్రాప్తించెను. మున్ను భాగవత, సాత్వత, ఏకాంతిక, పాంచరాత్ర, వైఖానసములు నావివిధ రూపముల అవిస్పష్టముగ ఆర్ష గ్రంథముల వ్యాప్తమైయున్న సిద్ధాంత భాగముల గ్రోడీకరించుట ముఖ్యావసరమయ్యెను. అయ్యావసరమును గుర్తించి, మహదవకాశమును గ్రహించి, అద్వితీయ కార్యదక్షతతో నిర్వహించి సాధించిన, ఆ యతిరాజులకు ధన్యవాదములు. ఆ యతికులశేఖరుడు గావించిన యీ సిద్ధాంత భాగమునకు, విశిష్టాద్వైతమని పేరు ప్రఖ్యాతమైనది. కాన, వైష్ణవముయొక్క పుట్టుపూర్వోత్తరములు ప్రథమతః యీ సప్తమ సంపుటమున 'సౌరభము' సమీక్షించి, పిమ్మట శ్రీమద్రామానుజులు నిర్మించిన విశిష్టాద్వైత సిద్ధాంతమును విశదీకరింప యత్నించును.

అంత నెనిమిదవ సంపుటమున సౌరభము, శ్రీ రామానుజానంతర వైష్ణవమును, ద్వైతమత సంస్థాపకాచార్యులైన శ్రీమధ్వాచార్యునితో బ్రారంభించి, వైష్ణవమున గాలాంతరమున నేర్పడి, ప్రసరించిన వివిధవైష్ణవ సిద్ధాంతముల దత్కర్తల సూక్ష్మముగ సమీక్షింప యత్నించును.

ఇట్లు, మానవ అజ్ఞాన నివారణసిద్ధికై బహువిధ కృషి గావించుచున్న సర్వ సిద్ధాంత సౌరభముయొక్క సంకల్పము ఈడేరి, సార్థక్యము కలుగుగాక! ఈ సత్సంకల్పసిద్ధికై సచ్చిదానంద స్వరూపుడు, అనంతకల్యాణగుణగణ విశిష్టుడును, జనన పోషణ సంహారకారణుడును, పరమాత్మయునైన, శ్రీమహావిష్ణువు అనుగ్రహించునుగాక!

మఙ్గళమ్ మహత్

# శ్రీ వైష్ణవ సిద్ధాంతము

## ఉపోద్ఘాతము

### సాకార - నిరాకారములు

O Lord, Thou hast form, and Thou art also formless. Thou walkest befor us, O Lord, in the shape of a man; again, Thou hast been described in the Vedas as beyond words and thought [42] ఓ ప్రభూ నీకు రూపము గలదు. మరియు నీవు నిరాకారుడవు. మానవాకృతి దాల్చి, ఓ దేవా, నీవు మా ముందు నడచుచున్నావు. మరియు, వేదముల నీవు అవాఙ్మన సగోచరుడవుగ వర్ణింపబడియున్నావు అని ఆధునికయుగ పరమావతారుడైన శ్రీరామకృష్ణదేవుని సంస్తుతి. తనచుట్టు భక్తి శ్రద్ధల నాశీనులైన భక్తకోటిని సంబోధించి, పరబ్రహ్మముయొక్క సాకార నిరాకార తత్త్వముల వివరించుచు, నా మహాత్ముడు క్రింది విధముగ బోధించియున్నాడు. Satchidananda is like an infinite ocean. Intense cold freezes the water into Ice, which floats on the ocean in blocks of various forms. Likewise, through the cooling influence of bhakti, one sees forms of God in the ocean of the Absolute [42]

---

*42. Sri Ramakrishna : The Gospel of Sri Ramakrishna, p 115*

సచ్చిదానందము ఒక మహాసాగరము వంటిది. అధిక శీతలత్వము నీటిని మంచుగడ్డగ ఘనీభవింపచేయు, నా హిమఖండములు వివిధాకృతుల సాగరముపై దేలుచుండును. అవ్విధమున, భక్తి యను శీతలత్వ ప్రభావమున బరబ్రహ్మమహోదధిలో భగవంతుని రూపములు గోచరించును. ఈ పరమార్థమును జీవగోస్వామియు బ్రస్తావించి, The Sakara form of God is as real as the Nirakara form. The Saguna is as much true as the Nirguna[43] సాకారదైవము, నిరాకారదైవములీల సత్యము. నిర్గుణ మెంత యథార్థమో సగుణముగూడ నంత సత్యమే యగును అని వక్కాణించెను. మరియు గాంధీ మహాత్ముడును To me God is Truth and Love; God is ethics and morality; ......... Yet He is above and beyond all these,...... He transends speech and reason. He is a personal God to those who need His personal presence[44] నా దృష్టికి భగవంతుడు సత్య ప్రేమములు, భగవంతుడు నీతి శీలములు. అయినను అతడు వీని కన్నింటికతీతుడు. అతడు వాగ్యుక్తుల నధిగమించును. అతని స్వరూప సాన్నిధ్యము గోరువారలకు సాకారదైవమగుచున్నాడు అని పలికియున్నాడు.

పై వాక్యముల బరిశీలించినచో, నా భగవత్తత్త్వము నిరామయ, నిర్వికార, నిరాకారములనుండి మానవునిపై గ

---

*43. Swami Jagadiswarananda : Prahuddha Bharata. p 149, 194*

*44. Mahatma Gandhi : My God, Bhavan's Journal, p 48. 98, 195*

అపార ప్రేమవాత్సల్యములచే బద్ధుడై, కాన బంధువై, ఆప్తుడై, మానవుని ప్రాపంచిక జీవిత విషమ పరిస్థితులలో శరణ్యమై యొప్పారుచున్నట్లు దోచును. Karl Jaspurs కార్ల్ జాస్పర్సు అను జర్మనుదేశ తత్వవిదుడు వచించునట్లు, The precariousness of all worldly existence is a warning to us, it forbids us to content ourselves with the world, it points to somthing else[45] ప్రాపంచిక జీవన విషమత్వములు మనకు హెచ్చరికయై, ఈ ప్రపంచముతో తృప్తిగాంచ నిషేధించుచు, అన్యతరమునకు సూచించుచున్నది. ఈ విషయలంపటముల నవలోకనము గావించిన, ఇందెంత తృప్తి మానవుడు గాంచగలుగుచున్నాడు? వీనికన్నింటికాధారభూతమై, అతీతమై యొప్పు నా పరమాత్మ సందర్శన మహాభాగ్యము ముందు యీ విషయ సుఖములెంతమాత్రము! ఈ ప్రపంచ జీవితమున, మానవుడు సంక్లిష్ట పరిస్థితులబడి, మ్రగ్గి, దారి దెలియకున్న వేళల, He feels he must lean on some firm support, one which is itself not in need of further or other support[46] కేవలము ఆ యనంతమూర్తియే, అట్టి నిత్య విశ్వసనీయ మార్గదర్శకుడును, ఆధారమును కాగలడు. భగవంతునకు మానవునకు సన్నిహిత సంబంధముండుటచే, The Divine Being comes down to the plane of the devotee to take him by the hand[47] నా దివ్యమూర్తి భక్తునికి జేదోడగుటకు గ్రిందికిదిగి

45. *Prof. Karl Jaspurs: Way to Wisdom, p. 22*

46. *Dr. R. Nagaraja Sarma: Reign of Realism, p. 10*

47. *Swami Yatiswarananda: Vedanta Kesari. p 189, 1957*

రాగలడు. ఆ భగవంతుడు కేవలము అచింత్య తత్త్వము మాత్రముగాక, but is pefect love which expends itself others [48] ఇతరులకొరకు వినియోగపడు పవిత్రమయుడు నై యున్నాడు ఆ భగవానునికి జ్ఞాన బలవీర్యములతోసహా, కరుణయు ముఖ్యలక్షణముగ రామానుజుని వాదము. సర్వ సృష్టియు ప్రస్తుత దృష్టికి, విద్యుదయస్కాంతాది వివిధ ప్రకృతి శక్తులనుండి సంజనితమనియు, కాని పరిశీలనాదృష్టి నవలోకించుచో నీ ప్రకృతి శక్తులన్నియు నొకేశక్తినుండి యావిర్భావమనియు, Unified Field Theory ఏకశక్తి ప్రతిపాదిత సిద్ధాంతము ననుసరించి ఐన్‌స్టిన్ మొదలగు ప్రఖ్యాత విజ్ఞానవేత్తలు తెలుపుచున్నారు. ఆ సర్వవ్యాపకశక్తి, కేవలము ప్రాకృతికమును నిర్జీవమునుగాక, అందు ప్రేమయును, శక్తియునంతర్గతమనియు, నా ప్రేమ శక్తిచేతమాత్రమే అది సృష్టి స్థితి లయముల నిర్వహించుననియు, శ్రీరామానుజాచార్యుని తాత్పర్యముగ దోచును. సర్వేతర శక్తులు యంత్రములకు లొంగినవిగాని యీ ప్రేమశక్తి యింతవరకు నే యంత్ర పరిశోధనములకు నధీనము కాకుండెను గదా! ఆ ప్రేమశక్తి స్వరూపమే భగవంతుడని స్పష్టము. ఆ కరుణతత్త్వముచేతనే ఆతడు సృష్టిని కల్పించి, నియమించి, సాధకుల ముక్తుల గావించుచున్నాడనియు నా ఆచార్యుని గాఢ విశ్వాసము. [49] అతడు మానవుని నిత్యజీవన పద్ధతులలో బాల్గొని,

---

48. *Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol. 2, p 660*

49. *Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol. 2, p 683*

యీ సృష్టి కార్యమును నిర్వర్తించుచున్నాడు.[50] అతడు విశ్వమునకు హితుడు, సహాయకుడు, తండ్రి, కర్త, మరియు పాలకుడు.

ఇట్లు వితర్కించి చూచినచో, If a system of thought cannot justify fundamental human instincts and interpret the deeper spirit of religion, it cannot meet with general acceptance[51] మానవుని ముఖ్య ప్రవృత్తుల సమర్థింపజాలక, పారమార్థిక జీవన అగాధ తత్త్వమును వివరింపజాలని సిద్ధాంతమెట్లు సామాన్యాదరణము నొందును. సామాన్య మానవునకు భగవంతుడు సత్యమై, నిత్యమై, అతీతమై యుండియు, అనంత ప్రేమయు, శక్తియు గలిగినవాడై, అతనికి అత్యవసర సమయముల చెంతనుండి తోడ్పడువాడునై యుండవలెను. అతనికి, Something to grasp and to worship as a Supreme Power and Personality.......to whom he might with complete confidence surrender himself in all conditions of trial and sorrow and suffering[52] గ్రహించుకొనుటకు, పరమ శక్తి స్వరూపుని అర్చించుకొనుటకు, కష్టనిష్ఠురములు దుఃఖమునైన సర్వ పరిస్థితులలో సంపూర్ణ విశ్వాసమున శరణుపొంద వీలగు

50. *Dr. S. Radhkiishnan: Indian Philosophy, Vol. 2, p 689*

51 *Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol 2, p 659*

52. *Prof. M. Rangacharya : The Three Great Acharyas, p 148*

పరమాత్మ యవసరమని తోచును. 'స నః పితా జనితా స ఉ
బంధుః' (అథర్వ. 2-1-3) అతడు మన తండ్రి, తల్లి, మిత్రుం
అగియు, దగ్గర జేరుటకు అనువుగ భగవంతుడుండవలెను.

అట్టి, సాధక భగవత్సంబంధము, నిరాకార, నిర్వికార బ్రహ
ముతో సంప్రాప్తింపనేరము. అది సాకార దైవముతోడనే సాధ్యము
భక్తికి, అర్చనకు, సాకార, సగుణ దైవము లక్ష్యముగా గలదు
అతడు సంపూర్ణ 'సత్యం శివం సుందరం' అనురీతి సత్యత్వము
సుఖత్వము, సౌందర్యముల కాకరమైయుండును. సాకార, సగు
దైవమునకుమాత్రమే భక్తునితో సాంగత్యము సంభవము, జీవుడ
దైవముతో ననేక బాంధవ్యముల గల్పించుకొని, శాంత, దాస్య
సఖ్య, వాత్సల్య, మధుర, శిశుభావముల, నొక్కమాటలో, ప్రపంచ
మున నెట్టి వివిధ సంబంధములు పరస్పరము గలవో నన్నింటిని
ఆ దేవాధిదేవునిపై బ్రసరింపజేసి, అనుభవించి, ఆనందకందలిత
హృదయుడై ప్రకాశించును.

మరియు, సాకారదైవము ప్రేమ వాత్సల్య కృపాస్వరూపుడు
గాన, నిత్య సంసార సమస్యలబడి, చిత్తచాంచల్యమున నశక్తుడై,
మానవుడు తరచు గావించు పొరపాటుల చూచి, కనికరించి క్షమింప
శక్తుడు. క్షమయే అతని స్వరూపము. అందుచే, Erring man lifts
his hands to Him in ecstatic prayer and submission and
implores His pardon and forgiveness [53] ప్రతి మానవు
డును ఆవేదనాభరిత నమ్రతతో, ప్రార్థనములతో, ఆ దేవునికై

53. *Dr. R. Nagaraja Sarma : Regin of Realism. p 7*

కరముల జోడించును. అనగా నట్టి అనంత కల్యాణగుణగణ పరిపూర్ణుడైన భగవంతుడు, పుణ్యాత్ములకేగాక పాపముల జేసి పశ్చాత్తప్త హృదయులై, క్షమాభిక్షకై ప్రార్థించు పాపాత్ములకుగూడ గల్పవృక్షమై చెలరారును. పుణ్యాత్ములకుగాని, పాపాత్ములకుగాని, Psychologically speaking, prayer is instinctive in its origin [54] తత్త్వతః వచించినచో, ప్రార్థనము మానవునిలో సహజముగ నున్నది అను మహమ్మదు ఈక్బాల్ వాక్యములెంతైన యథార్థములు. మానవ ప్రవృత్తులలో నిదియు ముఖ్యమైనదే. భగవత్ప్రార్థనముగూర్చి ప్రసంగించుచు గాంధీమహాత్ముడు, ఇట్లు వచించెను. I believe that prayer is the very soul and essence of religion, and, therefore, prayer must be the very core of the life of man, for no man can live with out religion ....... Without prayer there is no inward peace... The man of prayer will be at peace with himself and with the whole word [55] పారమార్థికమునకు ప్రార్థనము సారము అని నేను నమ్ముచున్నాను. పారమార్థిక జీవితము లేక మానవుడు మనజాలడు కాన, మానవుని జీవితమున ప్రార్థనము చాల ముఖ్యము. ప్రార్థనమువినా అంతరంగిక శాంతి గలుగనేరదు. ప్రార్థనాయుత చిత్తుడు తా శాంతుడై, లోకముతో శాంతిసంబంధమున నుండును. అందుచే దేవ, మానవ సంబంధమునకు ముఖ్యముగ, నీ హృదయగత ప్రార్థనా విధానము అత్యవసరమని గ్రహింపబడుచున్నది. ఈ విధానము, This idea of devotion and worship to some higher being who can reflect back

54. *Sir Mahamad Iqubal : 10-1-1929*
55. *Mahatma Gandhi : A Talk in Gujarat, 1930*

the love to man, is universal [56] మానవునకు ప్రేమమును ప్రతిబింబింపజేయుగల ఒక అమానుష వ్యక్తికై భక్తిశ్రద్ధలు విశ్వవ్యాపకముగనున్న మానవ హృదయాకాంక్షయే. మానవ హృదయమెంత భగవంతునికై యారాటపడుచున్నదో అటులనే పరమాత్మయుగూడ భక్తునికై తాపత్రయమొందును. As in human love, both God and the devotee are eager to rush into each other's arms. God's love for man and man's love for God. The first is divine grace and the second bhakti [57] మానవ ప్రేమలోవలె భక్త పరమాత్మలు, పరస్పరాలింగనమునకై పర్విడుదురు. మానవునిపై భగవంతుని ప్రేమ, భగవంతునికై మానవప్రేమ. మొదటిది దైవానుగ్రహము. రెండవది భక్తి యని నామకరణము. కాన మానవునందుద్భవించి, భూతాంతరాళముజొచ్చి, పరమాత్ము గబళించి, లోంచి, అనుగ్రహ రూప ప్రసాదము నాస్వాదించి, మానవునికి పరమశాంతి నొసంగు యీ భక్తినిగూర్చి, యిసుమంత విచారించెదముగాక!

## భక్తి మహాత్మ్యము

'కిం జన్మనా సకలవర్ణ జనోత్తమేన? కిం విద్యయా సకల శాస్త్రవిచారవత్యా:। యస్యాస్తి చేతసి సదా పరమేశ భక్తి:, కోన్యాన్ తతస్త్రిభువనే పురుషోస్తి ధన్య:॥' (బ్రహ్మసంహిత) అగ్ర వర్ణమున జనించినంతమాత్రమున ప్రాముఖ్యమేమి? సకలశాస్త్ర

56. *Swami Vivekananda : Complete Works Vol 2, p 38*
57. *Swami Tyagisananda : Cultural Heritage of India. Vol 3, p 290*

విచారణరూప విద్య నార్జించిన నేమి ప్రయోజనము? సదా పరమేశ్వర భక్తి తన్మయత్వమున నున్నవానికంటె నీ త్రిభువనములలో ధన్యులెవరు! అని బ్రహ్మసంహిత ప్రశ్నించుచున్నది. 'అలం కలౌ వ్రతైః తీర్థైః యోగైః శాస్త్రైః అలం మఖైః। అలం జ్ఞానకథాలాపైః భక్తిరేకైవ ముక్తిదా॥' ఈ కలిలో వ్రతములు, తీర్థములు, యోగములు, శాస్త్రములు, యజ్ఞములు, జ్ఞాన విచారణములకంటె భక్తియే ముక్తి దాయకము అని భాగవత మాహాత్మ్యము బోధించుచున్నది, అంతియగాక, 'తపః పూర్వం కృతయుగే, త్రేతాయాం యజ్ఞమేవచ। ద్వాపరే దానమితి ఆహుః కలౌ భక్తిర్ గరీయసీ॥' (6-2-17) కృతయుగమున తపము, త్రేతాయుగమున యజ్ఞము, ద్వాపరమున దానమని యందురు. ఈ కలిలో భక్తి ఉత్కృష్టమైనది అని విష్ణుపురాణము హెచ్చరించుచున్నది. మరియు 'చతుర్ముఖాదీనాం సర్వేషామపి వినా విష్ణుభక్త్యా కల్ప కోటిభిర్మోక్షో న విద్యతే' (మ. నా. 8) కోటి కల్పములు యత్నించినను బ్రహ్మాదులకుగూడ విష్ణుభక్తి లేకున్నచో మోక్షము సిద్ధింపదని మహానారాయణము ఘంటాపథముగా వక్కాణించుచున్నది. జన్మాంతర సహస్రములు తపోజ్ఞాన సమాధుల ననుభవించి క్షీణకర్ములైన వారికే, యీ హరిభక్తి కలుగుననియు భాగవతము పలుకుచున్నది. దీనినను సరించి చూచుచో, నీభక్తి సాధనము ఎంత అసాధారణమో, ఎంత కష్టసాధ్యమో బోధపడుచున్నది.

అందుచేతనే, విష్ణ్వంశమున జనించి, వేదాదుల విభజించి, మహాపురాణముల రచియించి, మహాశాస్త్రముల మీమాంసించి, తపోధనుడై, నాటి ఋషిపుంగవులకే శిరోభూషణమూర్తియైన

వ్యాసభగవానుడు కాలాంతరమున ఖిన్నుఁడై, చిత్తశాంతి గానక, నేకాంతమున చింతించుచుండెను. దీని గమనించి పరమర్షి వరేణ్యుడును, త్రికాల వేదియు, త్రిభువన పర్యటనశీలుడును, బ్రహ్మ మానసపుత్రుడును అయిన నారదమహర్షి, వ్యాసు జెంతజేరి విచారకారణమును బ్రశ్నించెను. అందులకు, సకల శాస్త్రసారములు, వేదవేదాంగాది శ్రుతులసారము గ్రహించి వ్రాసినను, తనకు జిత్తశాంతి గలుగమికి గారణము ఏమని ఆతడు దేవర్షి చంద్రుని అడిగెను సుసూక్ష్మగ్రాహియైన నారదుడు వ్యాస తాత్పర్య నిర్ణయము గావించి, 'అంచితమైన ధర్మచయమంతయు జెప్పితీవందులోన నిం, చించుక గాని విష్ణుకథలేర్పడ జెప్పవు ధర్మముల్ ప్రపం, చించిన మెచ్చునే గుణవిశేషములెన్నిన గాక నీకు నీ, కొంచెము వచ్చుటెల్ల హరిగోరి నుతింపమి నార్యపూజితా॥' (భాగవత 1-95) అని గట్టిగ బోధించి, కేవలము మానసముపై నాధారపడు శాస్త్రచయంబులు శాంతి నొసంగనేరవనియు, హృదయకవాటముల దీసి, భగవంతున దర్పించి, కీర్తించుటే ముఖ్యమనియు నొక్కి వక్కాణించెను. అందుకై భాగవత కథా వర్ణనమునకు బ్రోత్సాహమొసంగి నారదుండడిగిన, వ్యాసభగవానుడును, భక్తియుక్తమైన చిత్తముతో, పరిపూర్ణుడైన ఈశ్వరునిగూర్చి చింతించి, ఏకాగ్రచిత్తమున, 'అవనీచక్రములోన నే పురుషుడే యామ్నాయమున్ విన్న మా, ధవుపై లోక శరణ్యుపై భవములం దప్పింపగా జాలు భ, క్తివిశేషంబు జనించు పట్టి భువన క్షేమంకరంబైన భా, గవతామ్నాయము బాదరాయణుడు దా గల్పించె నేర్పొప్పగ॥' (1-156). ఆ భాగవత మహా గ్రంథము సంపూర్ణమై, 'నిగమములు వేయి జదివిన, సుగ

మంబులు గావు ముక్తి సుభగత్వంబుల్। సుగమంబు భాగవత మను, నిగమంబు బఠింప ముక్తినివసనము బుధా॥' (1-40) అను రీతి సర్వ శాస్త్రసారంబై, సకల శాస్త్రాతీతంబై, ముక్తిదంబై విరాజిల్లుచున్నది. అందుచే నెంత విద్యావంతుడై, తపోరతుడై, యోగియై యున్నను, మానవుడు హరిభక్తి రహితుడైనచో నెట్టి శాంతియులేక, చింతా సముద్రమున మునిగి తేలుచునే యుండునని యీ ప్రాచీన కథా తాత్పర్యము.

ఇటులే, దేవర్షినాథుడైన నారదుడుగూడ, పూర్వము శోకసంలగ్న మానసుడౌట, బ్రహ్మమానసపుత్రుడై, నిత్యజ్ఞానియై యొప్పు సనత్కుమారుని జేరి, ఖేద నిర్మూలనము గావించుకొనిన గాథయు శాస్త్రముల బ్రశస్తము. సనత్కుమారుని ప్రశ్నమునకు, దానఖిల శాస్త్రముల నధ్యయనము గావించితి నని వచించుచు, 'ఋగ్వేదం భగవోధ్యేమి యజుర్వేదం సామవేదమాథర్వణం చతుర్థం, ఇతిహాస పురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యం రాశిం దైవం నిధిం వాకోవాక్యమేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం క్షత్రవిద్యాం నక్షత్రవిద్యాం సర్వదేవ జనవిద్యామేత దృగవోఽధ్యేమి॥' (ఛాం 7-1- ) అను విధమున, తన సర్వ విద్యా పాండిత్యమును వివరించెను. కాని, తన విద్యావిధానమును వివరించుచు, 'సోఽహం భగవో మంత్రవిదేవాస్మి నాత్మవిద్' నేను, మంత్రముల విద్వాంసుడను గాని ఆత్మ విదుడగాను అనియు జెప్పి, అందుచె ఖేదము గలుగుచు శాంతిలేదనియు, నందుచె శోకనివారణము గావింపుమనియు ప్రార్థించెను అంత సనత్కుమారుడు సర్వశ్రేష్ఠముగ, సర్వసారమై, సర్వాంతరమైన,

జ్ఞానము ప్రధానమని బోధింప, నారదుడును గ్రహించి, దుఃఖ నివారణము నొంది, వెతలేయుండేనని గాథాపద్ధతి. ఇందును గూడ కేవలము విద్యాగ్రహణము ప్రధానముగాక, అంతట నావరించి, అంతర్యామియై, సర్వమును నియమించు తత్త్వమును గ్రహించుట ముఖ్యమనియు సువిదితము.

అందుచే intellectual understanding alone cannot satisfy the heart. We cannot live by intcellect alone. The heart, the seat of our feelings and emotions, is closer to us than our intellect. When the heart is not satisfied man is unhappy. And the intellect cannot bring peace to the haart [58] బుద్ధి గ్రహణముమాత్రము హృదయమును దృప్తిపరుపనేరదు. భావోద్వేగములకు పాదవమైన హృదయము, బుద్ధికంటె మనకు సన్నిహితము. హృదయము సంతృప్తి నొందనిచో మానవుడు సుఖదూరుడగును. బుద్ధి కౌశల్యము హృదయమునకు శాంతి నొసంగజాలదు అని అతులానందుని సముచిత వచనము. అట్లు, భగవంతుని మనసాగాక, హృదయతః వీక్షించి గ్రహించుట భక్తి నాబరగును. అదియే పారమార్థిక జీవన విధానమున సదా పరమశాంతిదము. ఇది సర్వమానవకోటి యనుభవము. సదా సర్వవికార భూయిష్టమైన యీ సృష్టిలో, నా పరమాత్మునితో సఖ్యము కుదిరినచో నది మహాభాగ్యము. అట్టి భాగ్యోదయకాలమున, నెల్లెడల నా పరమాత్మయే వేయి విధముల గోచరించుచు, Whither shall I go from Thy

58. *Swami Atulananda: Vedanta Kesari, p 12, 1927*

Spirit, or whither shall I flee from Thy Presence? If I ascend in to Heaven, Thou art there, and if I make my bed in Hell, behold Thou art there. If I take the wings of the morning and dwell in the uttermost parts of the sea, even there shall Thy Hand lead me and Thy right hand shall hold me [59] నీ నుండి నే నెటకేగగలను? నీ సన్నిధి నుండి ఎటకు బారిపోవుదును? నేను స్వర్గమున కెక్కినచో, నీ వచట గలవు. నేను నరకమున బవ్వళించినచో నాహా అచటగూడ నీవు గలవు. సూర్యోదయపక్షముల ధరించి నే జలనిధి యవ్వల కేగినచో, అటగూడ నీ హస్తము నన్ను నడుపును. నీ దక్షిణ కరము నన్ను ఉద్ధరించును, అను పాశ్చాత్య భక్తుని కీర్తన ననుసరించి, ఎల్ల చోట్ల ఆ భగవానుని అమృత హస్తము భక్తునికి అందదండయై వెలుగొందును. ఈ భక్తి విశేషము గిబ్బర్టు ముర్రె వచించినట్లు, విచిత్రమై యుక్తికందని నిత్య తుష్టియై, సహజమై యుండి, the groping of a lonely-souled gregarious animal to find its herd or its herd leader in the great spaces between the starts [60] నక్షత్రాంతరాళమునగల అనంత ప్రదేశమున తన సమూహమును, లేక తన సంఘనాయకుని గనుకొనుటకై దేవులాడుచు, ఒంటరితనముగల సాంఘిక మృగమువలె మానవుడు వెతుకుచునే యుండును. ఆ వెతకులాడుటయే, ఆ నిత్యాన్వేషణయే భక్తి నాబరగి, ఆ భక్తి పరిభావమున మానవుడు, రాధాకృష్ణ మహా

59. *G. De Kock: Read and Live, p 69*
60. *Prof. Gilbert Murray : Science & The Moral Life, of Max Otto, p 136*

శయుడు వచించినరీతి, becomes through bhakti more and more vividly conscious of its relation to God, until at last it surrenders itself to God who is the soul of its soul [61] అత్యధికతర స్పష్టముగ తన భగవత్సంబంధమును గ్రహించి, చివరకు తనకాత్మభూతుడైన నా పరమాత్మకు ప్రపన్నుడగును. అట్లు, మానవుని యంతరమున సాధకస్థితినుండి ముక్తస్థితివరకు నుండి, అతనిని నియమించి, తరింపజేసిన యీ భక్తిని, శాస్త్రములెట్లు నిర్వచించినవో కొంత యోచించెదముగాక !

## భక్తి నిర్వచనము

'భక్తిరీశ్వర విషయైవానురక్తిరితి యుజ్యతే' (1-6) భగవద్విషయపరమైన అనురక్తియే భక్తి యని శాండిల్య భక్తిసూత్ర వ్యాఖ్యాత యయిన, స్వప్నేశ్వరుని నిర్వచనము. ఆ యనురక్తి ఆర్ద్రీభూతమైన హృదయమందు ప్రతిబింబితమై, చలింపకుండునట్టి భగవదాకారపరముగ, ప్రవాహముగనున్న భావవిశేషమే భక్తి యని మధుసూదన సరస్వతి వచించుచు, 'ధారావాహికతాం గతా' అని అవిచ్ఛిన్న భక్తిభావమునకు ప్రాధాన్యమొసంగియున్నాడు. ఇదియే పరాభక్తియు నాబడు నని దేవీభాగవత వాక్యము. సమస్త వస్తువులకంటె అధికుడై, అనంతానవద్య కల్యాణగుణగణ స్వరూపుడైన భగవంతునిపై, 'నిరంతర ప్రేమప్రవాహః' అనియు, శ్రీమద్రామానుజుడు శ్రీభాష్యమున వచించియున్నాడు.

---

61. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p.705

నిరంతరత్వముతోసహా అతి గాఢముగకూడ నుండవలయు నని హెచ్చరించుచు, 'యా ప్రీతి అవివేకానాం విషయేష్వన పాయినీ। త్వామనుస్మరతః సా మే హృదయాన్మాపసర్పతు॥' (వి.పు. 1-20-17) అవివేకులకు విషయ సుఖములందెట్టి గాఢతర ప్రేమ యుండునో, ఆ ప్రీతిని ఈశ్వరపరమొనరించుట భక్తి యని విష్ణుపురాణము నిర్వచించెను. 'యా ప్రీతిరస్తి విషయేష్వవివేక భాజాం। సైవాచ్యుతే భవతి భక్తిపదాభిధేయా।' అనియు ద్రవిడో పనిషత్సారసంగ్రహ వాక్యము. ఇది విష్ణుపురాణవాక్యానుగుణమే. ప్రథమమున నిచ్ఛ, దాన ఆనందము, అంత రాగము అభివృద్ధి గాంచి, అది భక్తిగ రూపొందుచున్నది. అది 'పరమేశ్వర విషయ కాంతఃకరణవృత్తివిశేష ఏవ భక్తిః' (1-2) అనియు, స్వప్నేశ్వ రుడు తన భాష్యమున స్పష్టపరచెను. ఈ సంసార నాశహేతువైన భక్తి, జీవనోపాధి పరిహారమున బరమాత్మ గోచరమైన రాగ మనియు, నతని వివరణము (1-6). ఆ భగవంతుని, యింద్రియా ర్థములు లేని నిర్మల చిత్తముతో సేవించుట యనియు నిర్వచ నము. అనగా నిహలోక సుఖాదుల నపేక్షింపక, భగవంతునియందు మనస్సు లీనము సేయుటయే యనియు సుబోధకము. 'జ్ఞానా న్మాలిన్యనివృత్తిస్తతః పరా భక్తిరితి' (1-16) జ్ఞానముచే సర్వ మాలిన్య నివృత్తిగలిగిన భక్తియనియు స్వప్నేశ్వరుని వివరణము. 'నారద పాంచరాత్రము' భక్తి వివరణము గావించుచు, 'అనన్య మమతా విష్ణౌ మమతా ప్రేమసంగతాః। భక్తిరిత్యుచ్యతే....॥' భగవంతునియందు, గాఢతమ మమకారము గలిగియుండుటయే భక్తి యనియు బోధించినది. 'సా పరానురక్తిరీశ్వరే' (1-2) అనియు శాండిల్యుడు సూచించెను ఈ భక్తి 'ఆత్మరత్యవిరోధేనేతి'

(1-1-218) అవిరోధముచే ఆత్మరతియై యుండుననియు శాండిల్య మహర్షి బోధింప, 'శాంతిరూపాత్ పరమానందరూపాచ్చ' (4-60) నది శాంతిరూపమై, పరమానందమే యని నారదమహర్షియు అనుకరించెను. అందుచే భక్తికి ఆత్మరతి ప్రధానమని, స్వప్నేశ్వరుడు అన్వయించెను (1-10). భక్తిమార్గమున నగ్రగణ్యుడైన యామునాచార్యుడు యీ భక్తిని యింకను మీమాంసించి, 'దర్శనం పరభక్తిస్స్యాత్ పరజ్ఞానం తు సంగమః। పునర్విశ్లేష భీరుత్వం పరమా భక్తిరుచ్యతే।' భగవత్సాక్షాత్కారము పరాభక్తి యనియు, భగవదైక్యము పర జ్ఞానమనియు, భగవద్వియోగ భయము పరమభక్తి యనియు వివరించి, విరహవేదనయే ముఖ్యముగ భక్తి యగుచున్నదని వర్ణించెను. 'మాహాత్మ్యజ్ఞాన పూర్వస్తు సుదృఢ సర్వతోఽధికః స్నేహో భక్తిరితి ప్రోక్తః తయా ముక్తిర్న చాన్యథా; జ్ఞానపూర్వః పరస్నేహో నిత్యో భక్తిరితీర్యతే' భగవంతుని మాహాత్మ్యజ్ఞానముచే సుదృఢమైన, సర్వాధికమైన, స్నేహబుద్ధియే భక్తి యనియు, దానివలనమాత్రమే ముక్తి యనియు, ననగా, జ్ఞానపూర్వకమైన నిత్యమైన పరస్నేహమే భక్తి యనియు, బూర్ణప్రజ్ఞుడైన మధ్వాచార్యుని వివరణము. మరియు, జ్ఞాన, కర్మములను దాటి, అనగా విచారణ, కర్మముల వర్జించి, అనన్యకాంక్షానిరతి భగవంతుని అనుభవించుట భక్తి యని రూపగోస్వామియు నిర్వచించును, మరియు నాభక్తి, 'స్వస్వరూపానుసంధాన' మని, శ్రీ శంకరుడును నిర్వచించును. అది 'అనిర్వచనీయం ప్రేమస్వరూపం' (4-1) అని నారదుడు, తన భక్తి సూత్రముల సూచించియున్నట్లు పరమస్వరూపమై,

ఆ తన్మయత్వమున నుండిపోవుటయే భక్తియుననిగూడ స్వాప్నేశ్వరుడు వాకొనును (1-4).

అందుచేత శంకరుడును తన, 'శివానందలహరి'లో భక్తిని నిర్వచించుచు, సూదుగ విత్తనము తన మార్గమును జేరునట్లు మొదలగు అనేక యుపమానములు జెప్పి, 'తథా పశుపతేః పాదార విందద్వయం చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే' (61) అట్లు మహాదేవుని చరణారవిందములనంటి, సదా అన్నిట నిలచి యుండుటయే భక్తి యనబడును అనియు నిర్వచించెను. ఆ దేవదేవుని గుణవర్ణనము నవలోకించుమాత్రమున, గంగా జలము సాగరు జేర బారునట్లు, భేదరహితముగా భక్తుడు భగవంతుని కై, దన మనమును బ్రసరింపజేయుట భక్తి యగుననియు వర్ణితము. ఆ భగవదనుసంధానరసాస్వాదన భాగ్యమున ఆనందానుభూతియేగదా సత్ఫలము!

అంతియగాక, 'పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః' (1-16) ఆ భగవంతుని పూజా, కైంకర్యాదుల గావించుటయు భక్తియని పారశర్యుని తాత్పర్యముగ నారదుని భావము. అది కాయిక భక్తి నాబడును. 'కథాదిష్వితి గర్గః' (1-17) భగవల్లీలా కథన విధానము గూడ భక్తి యని గర్గమహర్షి అభిప్రాయమనియు నా దేవర్షి తలంపు. 'నారదస్తు తదర్పితా ఖిలాచరతా తద్విస్మరణే పరమ వ్యాకులతేతి' (1-19) సమస్తాచార వ్యవహారములను భగవదర్పితము గావించి, దైవ విస్మృతులు గలిగినతోడ మిగుల వ్యాకులము గలుగుటయు భక్తి నాబడునని తన యభిప్రాయముగా నా బ్రహ్మ మానస సుతుని కథనము.

అట్టి సమయములు, 'అన్యాభిలాషితా శూన్యం జ్ఞానకర్మా ద్యనావృతం। అనుకూల్యేన కృష్ణానుశీలనా భక్తిరుత్తమా' (భక్తి రసామృత సింధువు) ప్రతిఫలాసక్తి లేక, జ్ఞాన కర్మముల నవలం బింపక, నిరంతరాయముగ నా భగవంతుని అనుకూల మార్గముల ద్రొక్కి, ధ్యానించుటయే భక్తి యని చెప్పినది.

పై విషయముల జూచినచో, 'తదేవ కర్మ జ్ఞాని యోగిభ్య ఆధిక్య శబ్దాత్' (1-22) ఆ భక్తి, కర్మ జ్ఞాన యోగములకంటె నధికమను శాండిల్యుని వాక్యములు సముచితములు. ఈ భావమునే నారదమహర్షియు, 'సా తు కర్మజ్ఞానయోగేభ్యోఽప్యధికతరా' (2-1) అనియు వాకొనియున్నాడు. మున్ముందటికి, భక్తికిమించినదన్య మొండు లేదని నారదుడు 'త్రిసత్యస్య భక్తిరేవ గరీయసీ' (5-14) యని తన, గ్రంథాంతమున నొక్కి వక్కాణించెను. ఈ భక్తికి సాధ్యముకానిది ఏదియును గానము అని అధ్యాత్మరామాయణ (1-6-36), భాగవతాది భక్తి గ్రంథములు వేనోళ్ళ చాటుచున్నవి. కావ 'వాసుదేవ కథాప్రశ్నః పురుషాం స్త్రీన్ పునాతి హి। వక్తారం ప్రచ్ఛకం శ్రోతౄం స్తత్పాదసలిలం యథా॥' వాసుదేవుని పాద తీర్థమువలె, వాని కథావిషయముల బ్రశ్నించువారి, వచించువారి, వినువారగు స్త్రీలను పురుషులను పవిత్రపరచునని శుకబ్రహ్మ మువకు వాగ్దానము జేయును. ఇక 'నారాయణపరాః సర్వే న కుత శ్చన బిభ్యతి' (భాగవత. 6-17-28) నారాయణపరులు అందరును కొంచెమైన భయము నొందవలసిన అవసరము గానము.

ఈ భక్తి విధానమును ఆధునిక పండితవర్గముకూడ వివ రించియున్నది. హృషీకేశమునగల శివానంద సరస్వతి తన 'నారద

భక్తిసూత్ర' గ్రంథమున భక్తిని నిర్వచించుచు, Bhakti Yoga is the one yoga which directly appeals to the feelings of man [62] మానవచిత్త ప్రవృత్తులకు ప్రత్యక్ష సంబంధముగలది భక్తి యోగమని తెలిపెను అటులే వివేకానందుడును, Bhakti Yoga is a real, genuine search after the Lord, a search beginning, continuing and ending in love [63] ప్రేమతో ప్రారంభించి, ప్రేమతో నభివృద్ధిగాంచి, ప్రేమతో సమాప్తినొందు పరమేశ్వరాన్వేషణమే భక్తి యోగముగ నిర్వచించెను. Bhakti is an emotionally predominated - enlightened spiritual activity [64] ఆ భక్తి అనగా జ్ఞానయుక్తమైన ఆచరణము గలిగి యుండుట యని యొక నిర్వచనము. భగవంతునిపై భక్తి గలిగి, మూఢత్వములు లేకుండుట భక్తిసారమని రాధాకృష్ణ పండితుని వాక్యము. [65] When service of the Lord, and submission or surrender to Him is born out of selfless and transcendent love, it is bhakti [66] నిస్స్వార్థత్వముతో భగవదధీనుడై, భగవత్సేవను నిర్విషయ ప్రేమమున గావించుట భక్తి యని చంద్రశేఖర అయ్యరు వచించెను. అద్భుత ఆధ్యాత్మికానుభవ వృక్షబీజము

---

62. *Swami Sivananda Saraswati : Narada Bhakti Sutras, p 5*

63. *Swami Vivekananda : Complete works, Vol. 3. p 31*

64. *Sri Braj Bihari Nigam : Prabuddha Bharata. p 429, 1960*

65. *Dr. S. Radhakrishnan: Indian philosophy, Vol. 2, p 664*

66. *Sri N. Chandrasekhara Aiyar : Prabuddha Bharata, p 500, 1955*

భక్తి యనుటయు నుచితమని అతని భావము. ఈ భక్తి అజేయమై, అద్భుత శక్తివంతమై, can move mountains; nothing is impossible for it [67] పర్వతముల గదలించును, దానికి అసాధ్యమెద్దియును లేదని రాధాకృష్ణ ఆచార్యుని విశ్వాసము. ఈశ్వరారాధనము అను యర్థముగల 'భజ్' అను ధాతువునుండి భక్తిపదముత్పన్నము. శరణాగతి యన్నను, ప్రపత్తి యన్నను నిదియే.

### శరణాగతి

'ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే' (శ్వేతాశ్వతర) మోక్ష కాంక్షగల. నేను శరణు జొచ్చుచున్నాను అని యుపనిషత్తుల నీశరణాగతి దర్శితము. భరతాచార్యుడు ప్రపత్తిని నిర్వచన చేయుచు 'అనన్య సాధ్యే స్వాభీష్టే మహావిశ్వాసపూర్వకం। తదేకోపాయతా యాచ్ఞా ప్రపత్తిశ్శరణాగతిః॥' ఇతర విధముల సాధింప సాధ్యపడని తన కోరికలను, 'దేవా నీవే యుపాయమై నెరవేర్పు' మని ప్రార్థించుటయే ప్రపత్తి యని తెలిపియున్నాడు Complete surrender of everything held near and dear with all its defects and imperfections, perfections and excellances... . Such a surrender constitutes the purest act of sacrifice [68] తన ప్రేమపాత్రముల నన్నింటిని సర్వార్పణము గావించుట, దాని మంచిచెడ్డలతోసహ నర్పించుట—అట్టి సర్వార్పణము అతిపవిత్రమై,

---

67. *Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p 665*

68. *Dr. R. Nagaraja Sarma : Reign of Realism. p 9*

త్యాగమే యగునని ఆర్. యస్ శర్మ సంస్తుతి. భక్తియోగము తత్త్వవిచారణముద్వారా నగుచుండ, ప్రపత్తి is the approach to God through faith and selfless love, accompained by an attitude of self-surrender and risiganation 69 ఆత్మార్పణ బుద్ధి, త్యాగములతోకూడిన నిస్వార్థ ప్రేమలతో పరమాత్ము బొందజూచుటయే ప్రపత్తి యని డాక్టర్ అణిమాసేన్ గుప్త స్పష్టము నేసియున్నాడు. ప్రపత్తితో భక్తి సమాప్తి నొందు ననియు శ్రీరామానుజుని నమ్మకము (గీతా. భా. 1866.)

ఈ ప్రపత్తి విధానమే, తైత్తిరీయారణ్యకమున న్యాస విద్యగా వివరింపబడినది. అట పుత్రుడగు ఆరుణికి ప్రజాపతి బోధించుచు, నాత్మకళ్యాణార్థము సర్వశ్రేష్ఠమగు నుపాయము నకై ప్రశ్నింపబడి, సత్య, తప, దమ, శమ, దాన, ధర్మ, ప్రజోత్పత్తి, అగ్నిపూజ, అగ్నిహోత్ర, యజ్ఞ, మానసోపాసన, న్యాసముల, గ్రమముగ బోధించి, అందు సర్వోత్తమము న్యాస విధానమని యుపదేశించెను. ఈ న్యాసము నాత్మసమర్పణముగా వేదముల బ్రతిపాదింప బడియున్నది. 'వయం ధాతే త్వే ఇద్ విందర విప్రా అపి ష్మసి' (ఋ. వే. 8-66-13) దేవా! మేము మీవారము. మేము నీపై నాధారపడియున్నాము. 'త్వం అస్మాకం తవ స్మసి' (ఋ. వే 8-92-32) నీవు మావాడవు, మేము

69. *Dr. Anima Sen Gupta : Prabuddha Bharata, p 506, 1959*

నీవారము అను వేదమంత్రములీ భావమును వ్యక్తపరుపగలవు. నరజన్మమున ముక్తి కలుగునని జన్మాంతము ప్రపన్నుడై మెలగుట తృప్త ప్రపత్తి యగుచుండ, అంతవరకు నోర్వలేని అర్తుడు ఆర్త ప్రపత్తి గలవాడని విజ్ఞులనుడి.

ఈ ప్రపత్తిరహస్యము నెరింగి, ఆర్తులై, పరమాత్మకు బ్రపన్నులై, పూర్వము ఎందరు అద్భుత ఫలితముల నార్జించి శాంతి నొందలేదు! యోధాన యోధుడయ్యును, నాటికాలమున నెదురు లేని శూరుడై యుండియు, ఆతని శక్తి కంతటికి మూలకారణము శ్రీకృష్ణపరమాత్మయే యని గ్రహించి, విశ్వసించి, 'శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నం' అని పాండవ మధ్యముండైన అర్జునుడు సంపూర్ణ ప్రపత్తి జేసి, శస్త్రాస్త్రముల బోనాడి, నమ్రుడై, శరణాగతుడై, ఘోరయుద్ధమున జయశ్రీ నొందుటయే గాక, భీష్మ యుధిష్ఠిరాదులకగూడ నలభ్యమైన ఆత్మబోధను భగవద్గీతారూపమున దాబొంది, తా తరించుటయేగాక నాటినుండి నేటివరకు ఎందరు సాధకులకు జ్ఞానోపదేశకారణమై యతరారి యుండెను!

అబలయై, స్త్రీయై, ఎదుటనున్న భర్తృపంచకము నిర్వీర్యులై యుండ, భీష్మ ద్రోణాది పెద్దలు వాగ్బంధనమున మౌనము ధరింప, మహాసభమధ్యమున నొక్కరేని 'నా' యను వారులేని దిక్కుమాలినదై, అనేక విధముల బరుష వచనములకెరయై, కురుసంఘమునుండి బాధనొంది, కడపటికి వస్త్రాపహారరూప అవమానము పైబడనుండ, నింక వేరుగతి గాంచనిదై, మానవ

శక్తుల యశక్తతను గుర్తించినదై, కరద్వయమును జోడించి, ద్వారకావాసుడైన శ్రీకృష్ణభగవానుని బ్రార్థింప, నంతలో నామె అపాయమదృశ్యమై, విరోధులు పరాజితులై, నాడు ద్రౌపది రక్షింపబడుటయేగాక, తత్ఫలితముగా కౌరవవంశ నాశనముగూడ నేర్పడియున్నదిగదా!

మరియు, మకరి నోటబడి, తప్పించుకొన దీర్ఘ రణమొన రించి తావుల్దప్పి, శ్రమించి స్వశక్తి నిరుపయోగకరంబని గుర్తెరిగిన నా గజేంద్రుడు, బాధానివారణమొంది, సురక్షణము నొందెను గదా! అది కేవలము మృగముగదా!

అంతియగాక, విరోధి సోదరుడై యుండియు, జ్యేష్ఠుని మార్గము అన్యాయము, అమానుషము అని గ్రహించి, శ్రీరామ చంద్రపాదపద్మ శరణాగతిగాక నన్యమార్గము అభావమని ఎరింగి, ప్రణమిల్లి, సోదరు అన్యాయమును విభీషణుడు జయించి, రాజ్యాభిషిక్తుడై ఆనందమొందెనుగదా!

అటులే, కాకాసురుని విషయము సర్వవిదితము. సీతామహా దేవికపకారము గావించి, శ్రీరామచంద్రు కోపాగ్ని బారిబడియు, ప్రపత్తి ప్రభావమున వైకుంఠునిజేరలేదా? కాన నీ శరణాగతి సర్వశక్తిమంతము, అజేయము, అద్భుతము. విరోధులనే రక్షించెనే!

'తం పత్నీభిః అనుగచ్ఛేమ దేవాః పుత్రైర్భ్రాతృ ఋతవా హిరణ్యైః నాకం గృహ్ణానాః సుకృతస్య లోకే తృతీయే పృష్ఠే అధిరోచనే దివః' (యజు. వే. 15-50) ఓ పురుషోత్తమా! సుకృత జనులకే ప్రవేశార్హతగల స్వర్గాదిలోకములపై విరాజిల్లు త్రిపాద్వి భూతి బొందుటకై, స్త్రీ, పుత్ర, సోదర, ధన, జనసహితముగా పూజ్యుడవును, అగ్రగతి ప్రదాతవునగు నిన్నే మేము శరణు బొందుచున్నాము.

---

# వైష్ణవ సిద్ధాంత చారిత్రము

## వైదికము

వేదే రామాయణే చైవ పురాణే భారతే తథా। ఆదావంతే
చ మధ్యే చ హరిస్సర్వత్ర గీయతే॥' వేదములందు, రామాయణ
పురాణములందు, భారతాది శాస్త్రములందు ఆదిమధ్యాంతముల
హరి కీర్తింపబడుచున్నాడు 'సాక్షాత్పరంపరాభ్యాం వేదా
మాధవం। సర్వే వేదాంతాః కిల సాక్షాదపరే తేభ్యః
యతా॥' ప్రత్యక్షముగనో, పరంపరగనో వేదములు మాధవునే
ందుచున్నవి. ఉపనిషద్భాగములు సాక్షాత్తు ఆతనినే
ముగ స్తుతించుచున్నవి. వేదములందు ఇతర భాగములు
ము పరంపరగ నుతించుచున్నవి, అని హరివంశము,
సిద్ధాంత సర్వవ్యాపకత్వమును దెల్పుచు, నెట్లు సర్వ
ము శాస్త్రముల నది కీర్తింపబడుచున్నదో పై శ్లోకముల
ంయున్నది. మరియు నీ వైష్ణవ ధర్మము, బలదేవ ఉపా
ని వచనములలో a universal religion whose portals
en to all and from entering which not a single
t seeker after Truth is ever debarred [70] నీ విశ్వ
ధర్మము, సత్యాన్వేషణమునకు గడంగు వాడొక్కడైన

---

rof. *Baladeva Upadhyaya: Prabuddha Bharata, p 294, 1952*

సిందు ప్రవేశించి నిరాకరింపబడక, ద్వారముల నెల్లరకు తెరచియే యుంచును అని, దీని విశ్వతోముఖత్వమునుగూడ వివరించెను. అట్లు సర్వప్రాధాన్యము నార్జించి, సర్వాశ్రముల జొచ్చి, సర్వముముక్షువుల నాకర్షించి ప్రకాశించు యీ వైష్ణవధర్మ చారిత్రముయొక్క అనగా పుట్టుపూర్వోత్తరముల నించుక గ్రహించెదముగాక!

'ప్రతే యక్షి ప్రత ఇయర్మి మన్మ, భువో యథా వంద్యో నో హవేషు ధన్వన్నివ ప్రపా అసి త్వమగ్న, ఇయక్షవే పూరవే ప్రత్న రాజన్' (ఋ వే. 10-4- ) నీకే నేను నా నివేదనమును దెచ్చితిని. నీకే నా ప్రార్థనముల నర్పించెదను. మా విజ్ఞాపనములలో నీవేగదా సంస్తుతిపాత్రుడవు ఓ ప్రభూ! భక్తునికి నీవు ఎడారిలోని నిత్య స్రవంతివిగదా! అని వైదిక ఋషీశ్వరుల ప్రార్థనము. ఈవిధముగా, నా వైదిక ఋషిలోకము అనేక విధముల నా పరమాత్మపై బుద్ధినుంచి, ప్రాపంచికముల నసంతృప్తిచెంది, దీని గేవలమూసర క్షేత్రముగ విశ్వసించి, యిందు దృప్తినొసంగు తత్త్వము భగవంతుడుగాక అన్యమును గానమను నిశ్చయమునకేతెంచి, ఎల్లెత్తి ప్రార్థించి యున్నారు. మరియు The Vedic worshipper has called his God 'the song lover and wished to encompass Him by his songs (ఋ. వే. 1-10-12) [71] గిర్వాణుడు అనగా గానప్రియుడని భగవంతుని సంబోధించి, వైదిక భక్తుడు ఆ పరమాత్మ దన గీతములచే ప్రావృతుజేయగోరెడువాడు. కొన్ని

71. *Prof. A. C. Bose, Prabhuddha Bharata,*
*p. 375, 1956*

వైదిక మంత్రములు బృందగానములవలె నుండును. కొన్ని వైదిక మంత్రములు, సాక్షాత్తు భక్తిగీతములబోలి, భక్తి మతములగల వివిధ ప్రవృత్తుల సూచించుచు, భక్తి విధానమును వ్యక్తపరచుచున్నవి అని ఎ. సి బోసు ఆచార్యుని కథనము. ఆ గానమునకు అనుగుణమైన జంత్రాది యుపకరణములును, వేదముల గోచరము. అటులే బృందగాన సమయముల నీ జంత్రీనాదములతో సహ, తాళ విశేషములతో, మృదంగాది వాద్యములుగూడ నున్నట్లు బోసు మహాశయుని గవేషణా విశేషము.

మరియు వేదముల భక్తులు, ఆ పరమేశ్వరునితో, గాలాంతరమున భక్తిసిద్ధాంతముల నభివృద్ధిగాంచియున్న వివిధ భావముల వ్యక్తపరచి, ఆతనితో మాతా పిత మిత్ర సోదరాది పరస్పర మానవ సంబంధ బాంధవ్యముల నా దేవాదిదేవునితో బెంపొందించుకొని, భక్తి తన్మయత్వమున గానము చేసినట్లును విదితము. అట్టి సంబంధముల దెల్పు మంత్రముల గొన్నింటిని దిలకించెదముగాక:

'అగ్నిం మన్యే పితరం అగ్నిం అపిం, అగ్నిం భ్రాతరం సదమిత్ సఖాయం' (ఋ. వే. 10-7-3) అగ్నిదేవుని తండ్రిగను, బంధువుగను, సోదరుగను, పరిగణించెదను. అతని నా నిత్య మిత్రునిగ నెంచుకొందును అని యీ మంత్రము కొన్ని బాంధవ్యముల సూచించినది. భగవద్గీతలో 'పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయాః' పుత్రునికి దండ్రివలె, మిత్రునికి స్నేహితుని చందము, ప్రియురాలికి భర్తవలెననువిధాన ప్రపంచమున ప్రధాన సంబంధముల వేదము భక్త భగవానుల సంబంధములో స్పష్టపరచియున్నది. వేదముల నా భగవంతుని నే లింగ ప్రధానముగ

గాంచక, నొక్కచో దండ్రిగను, మరొకచో దల్లిగను వ్యవహరించి యుండిరి. అందుచే దండ్రిభావమున దల్లి భావముగూడ నంతర్గతమనియే విదితము. 'త్వం పితాసి నః' (ఋ. వే 1-31-10) నీవు తండ్రివి. 'త్వమేవ మాతా చ పితా త్వమేవ' అను వాక్యముగూడ 'త్వం హి నః పితా వసో త్వం మాతా' (ఋ. వే. 8-98-11) అను వైదిక మంత్రజన్యముగనే తోచును. 'పితేవ హూయసే' (ఋ. వే. 8-21-14) 'పుత్రా సో న పితరం' (ఋ. వే. 1-130- ) 'పితేవ న శృణు హి హూయమానః' (ఋ. వే. 1-104-9) తండ్రివలె మా మాటల వినుము, మొదలగు అసంఖ్యాక మంత్రములలో, భక్తుడు తన ఇష్ట దైవమును దండ్రిగా భావించి, ప్రార్థించి యున్నాడు. ఆ మంత్రములలో పితాసుతుల సంబంధమున నెన్నివిధములైన బాంధవ్యములుండునో యన్నియు నందు వ్యక్తీకరింపబడి, సంబంధింపబడియున్నవి. అటులే మాతృభావము. లింగభేదము పాటింపబడకున్నను, కొన్ని మంత్రములు మాతృభావమును స్పష్టపరచుచు 'యస్తే స్తనః శశయో యోమయోభూర్, యేన విశ్వా పుష్యసి వార్యాణి। యో రత్నధా వసువిద్ యః సుదత్రః సరస్వతి తం ఇహ ధాతవే కః' (ఋ వే. 1-164-49, అ. వే 7-10-1) సరస్వతీ! నిరంతరమగు నీ స్తనయుగ్మము విశ్వ శ్రేయోదాయకముగ నున్నది. వానిచే నెల్ల ఆర్యుల బోషించుచున్నావు రత్నములగలిగి, సంపదల బొంది, వరముల నొసంగుచున్నావు. మా పోషణముకొరకై వాని మా కందుంచుచున్నావు అనియు, 'తస్యాస్తే రత్నభాజ ఈమహే వయం, స్యామ మాతుర్ న సూనవః' (ఋ వే 7-81-14) రత్నభాజః మేము నీవారము

కాగోరుచున్నాము. తల్లీ, మేము నీకు బిడ్డలమువలె నగుదుము గాక! అనియు మాతృదృష్టి వేదముల స్పష్టము.

వైష్ణవ సిద్ధాంతమున ప్రఖ్యాతమైన పంచవిధ భావములు, వేదములగూడ గోచరము. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావములలో, నా దేవుని ప్రభువుగ సంబోధించు మంత్రములు విరివిగా గాన్పించును. 'హిరణ్యగర్భః సమవర్తతాగ్రే, భూతస్య జాతః పతిరేక ఆసీత్। సదాధార పృథివీం ద్యాం ఉతేమాం, కస్మై దేవాయు హవిషా విధేమ॥' (ఋ. వే. 10-121-1) ఏ దేవుని మనము ప్రార్థింతము? సృష్ట్యాదినగల దేవదేవుని, సృష్టికి నేకైక ప్రభువును, ద్యులోకాదుల నిలిపియుంచువాని బ్రార్థింతము. 'త్రాతారం ఇంద్రం' 'అవితారం ఇంద్రం' (ఋ. వే. 6-47-11) రక్షకుడైన యింద్రుని, పాలకుడైన యింద్రుని యను మొదలగు మంత్రముల, నా దేవుని మహాప్రభువుగా జిత్రించి, అతని ఆశ్రయించి, నుతించి, ప్రార్థించి అనుగ్రహమును బొందు యత్నించు విధానము, బహుధా వేదముల గోచరము. ఇది భక్తి భావములలో శాంతభావము నాబడును. ఆ ప్రభువునకు అవసరమైన సేవల జేయసంసిద్ధుడై, సేవ్యసేవకభావ సంబంధమున నున్న మంత్రములు, దాస్యభావమును సూచించుచున్నవి. 'సఖా' (ఋ. వే. 4-17-17) 'మాకిర్ న ఏనా సఖ్యా వి యౌషన్.... అస్మే తే సంతు సఖ్యా శివాని' (ఋ. వే. 10-2?-7) మన మిత్రిత్వము ఎప్పటికి చెడకుండునుగాక!....మాతో నీ మంగళకరమైన స్నేహితము వెలయునుగాక అనియు, 'భవా నః

సుమ్నే అంతమః సఖా వృధే' (ఋ. వే. 8-13-3) మా యానం దముకొరకు మాకు సహాయముకొరకు మాదగ్గర నుండుము, మొదలుగాగల మంత్రములు, పరమాత్మునితో భక్తుని సఖ్య భావమును సూచించుచున్నవి. అటులనే వాత్సల్యభావముగూడ వ్యక్తము. 'తం మాతా రేళిహ స ఉ రే విహ మాతరం' (ఋ. వే. 10-114-4) అతని తల్లి, ఆ దేవుని ముద్దాడును. అతడు తన తల్లిని ముద్దులాడును; 'శిశుం న విప్రా మతి భే రిహంతి' (ఋ. వే. 10-123-1) ఆ భగవాను ఋషీశ్వరులు, తమ కీర్తనము లచే శిశువును లాలించినట్లు లాలించుచున్నారు; 'శిశుం రిహంతిః మతయః' (ఋ. వే. 9-85-11) స్తోత్రములు శిశువును ముద్దాడు చున్నవి అను స్థానముల, నా పరమేశు శిశువునుగనే భావించినట్లు వ్యక్తము. కడపటిది యగు మధుర భావమును స్పష్టపరచు మంత్రములుగూడ వేదముల ననేకములు గోచరము. 'జారః కనీన ఇవ చక్షదానః' (ఋ. వే 1-117-18) పడతియొక్క ప్రియునివలె వరములొంపగుము, 'జారః కనీనాం పతిర్జనీనాం' (ఋ. వే. 1-66-4) యువతుల ప్రియునిచందము సతుల పతివలెననియు, 'కళ్యాణీభిర్ యువతిభిర్' (ఋ. వే. 10-30-5) సుందరులైన యువతుల మధ్యగల యువకునివలె, 'పరిష్వజంతే జనయో యథా పతిం' (ఋ. వే. 10-43-1) భార్య, భర్తను కౌగిలించుకొను చందము, అను మంత్రముల నా భగవన్మూర్తిని వల్లభుగ భావించి, సంబోధించినట్లును విదితము.

మరియు నా భగవంతుని, బ్రపంచములో మానవునికిగల అనేక విధములగు యితర సంబంధములతోగూడ, వైదిక ఋషులు

జూచియుండిరి. 'విచక్రమే పృథివీం ఏష ఏతాం, క్షేత్రాయ విష్ణుర్ మనుషేదశస్యన్। ధృవాసో అస్య కీరయో జనాస, ఉరుక్షితం సుజనిమా చకార॥' (ఋ వే. 7-100-4) పృథ్విని మానవవాసమునకై సంసిద్ధము చేయ, దాని బరమాత్మ ఆవరించెను. అతనిలో దీనజనులు తమ ఆశ్రయమును గాంచుదురు. ఆ విశాల హృదయుడు మానవులకై, యీ పృథివిని విశాలముగ జేసెను అను మొదలగు వాక్యములు అతని దీనజనబాంధవునిగా జిత్రించి యున్నవి. 'క్రతూయంతి క్రతవో హృత్సు ధీతయో, వేనంతి వేనాః పతయంత్యా దిశః। న మండితా విద్యతే అన్య ఏభ్యో, దేవేషు మే అధికామా అయంసత।' (ఋ. వే. 10-64-2) నా హృదయమున భావోద్వేగములు కలవరపరచుచున్నవి. ప్రేమ కాంక్షలు ప్రసరింపుచున్నవి. అవి ఎల్ల దిక్కులకు పర్వెత్తుచున్నవి. వీనికంటె ఉపశాంతి కారణములు అన్యములు అభావము. నా ఉత్కృష్ట ఆకాంక్షలు భగవంతునిపై గలవు, అను చోట, నా పరమేశ్వరుడే మానవుని ప్రేమపాత్రుడుగా స్పష్టపరచుచున్నవి. ఆ మానవునికేగాక సర్వ జీవకోటికి, నాతడే పరమ ప్రేమగమ్యముగ 'త్వాం ఉశిజః ప్రథమా అగృభ్ణద। త్వభ్యేమా విశ్వాభువనాని యేమిరే' (ఋ. వే. 9-86-30) ప్రథమ, ప్రియులు నిన్ను గాఢముగ హత్తుకొని యున్నారు. కాన సర్వజీవులును నీ దిక్కునకే దిరిగియున్నవి; అను మంత్రము తెలుపుచున్నది, ఆ దేవుని అతిథిగ వీక్షించుటయు గలదు. 'ప్రేష్ఠం వో అతిథిం స్తుషే, మిత్రం ఇవ ప్రియం' (ఋ. వే. 8-84-1) పరమప్రేమపాత్రుడైన మిత్రునిచందము, మీ అతిథియైన భగవంతుని స్తుతించుచున్నాము అను మంత్రమున, నతడు అతిథిగ నయ్యెను. అటులే 'విశో విశో వో అతిథిం' (ఋ. వే. 8-74-1)

సకల గృహముల నతడు అతిథి యనియు, 'విశ్వేషాం అతిథిర్ మానుషాణాం' (ఋ. వే. 4-1-20) మానవులందరికిగూడ నతిథి యనియు బరిగణింపబడుట గాంచగలము. పర్యవసానముగ నా భగవంతుడు, సర్వవిధముల మానవుని రక్షణము అను సత్యమును బోధించుచు, 'శర్మ వర్మ మాతరం' (సా. వే. 18-72) ఆ పరమే శ్వరు కృపయే నా యంతరమునగల కవచము అను గాఢవిశ్వాస మును వేదమంత్రములు సూచించియున్నవి.

ఈ పైన వివరించిన విధమున, వేదముల భక్తిసిద్ధాంత ములు, కాలాంతరాభివృద్ధిగాంచి, సువిశాలమై, సకలవిధ మానవ ప్రవృత్తుల నా పరమాత్మదిశకు మరలించి, పవిత్రము గావించి, తజ్జనిత తన్మయత్వమున మైమరచి, ఆ పరమేశ్వరునందే ఆనంద మున నుండునట్టి మహదవకాశమును, సర్వతోముఖత్వమును, వేదముల సువ్యక్తమై, స్పష్టమై, గోచరించుచుండుట మనము గాంచియున్నాము. వేదముల నీ భక్తి చిహ్నములు ఇంకెన్ని విధముల గోచరమో ఇంకను చూచెదముగాక!

## నామములు - విష్ణువు

Vaishnavism, as the name implies, means the particular theistic religion of which Vishnu is the object of worship and devotion as the Supreme God. The germs of Vishnu's later greatness and of sectarian Vaishnavism is traceable even in the Rig - Veda [72]

---

72. *Prof. D. C. Sarcar : History and Culture of The Indian People, p 481*

నామము సూచించువిధముగ వైష్ణవము, విష్ణువును పరదైవముగ భావించి, పూజించి, భక్తిలోనుండు ప్రత్యేక సగుణ దైవారాధన మతమై యున్నది. విష్ణువుయొక్క కాలాంతర ప్రాముఖ్యము, వైష్ణవశాఖయొక్క బీజములు, ఋగ్వేదమునగూడ గానగలము అని సర్కారు పండితుడు వచించురీతి, నీ వైష్ణవ బీజములు వేదము ననే గోచరము. ముఖ్యముగ, వైష్ణవమునకాధారమగు విష్ణుదేవుడు, అతని నామము, ప్రతిభ అనేకరీతుల వేదముల గోచరము.

'ఋతస్య గర్భం' (1-156-3) ఋతముయొక్క గర్భము గను, ఋగ్వేదమున 69 వ సూక్తమున విష్ణువు, ఇంద్రునితో సహ గొప్ప యోధుడుగను జిత్రింపబడినది (ఋ. వే 6-69-1). అతని యౌన్నత్యమచింత్యమై, 'శిపివిష్ట' యను తేజోవంతుడని ప్రత్యేక బిరుదముగూడ నతనికి నీయబడినది (ఋ. వే. 7-100-5,6). 'త్రీణి పాదా వి చక్రమే విష్ణుర్గోపా అదాభ్యః' (ఋ వే. 1-23-18) మూడు అడుగులలో నతడు ఆకసమును లంఘించుటవలన ప్రశస్తి గలిగెను. మరియు 'ప్ర విష్ణవే శూషమేతు మన్మ గిరిక్షిత ఉరుగాయాయ వృష్ణే....' (ఋ. వే. 1-154-3) విశాలమును, స్థిరంబును అయిన యీ మూడు లోకముల నొక్కడే, మూడు, సోపానముల నిర్మించిన యీ విష్ణువునకు అనుకూలశక్తి గలుగునుగాక, మొదలగు మంత్రముల విష్ణువు ప్రస్తుతి జేయబడెను. అతడు నివాసముండు స్థానము 'విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః' (ఋ. వే. 1-154-5) పరమమై, సౌకర్యవంతమైనదని వివరింప బడినది. అటుల 'విష్ణోర్ను కం వీర్యాణి ప్ర వోచం యః పార్థివాని విమమే రజాంసి। (ఋ వే. 1-154-1) యీ భువనత్రయమును

గల్పించిన విష్ణుకార్యముల, మనసా నుతించెదరని ఋషిసత్త్వము
యీ సూక్తముల నభివర్ణించెను. ఈవిధముగ నొక్క ఋగ్వేద
మనేగాక జతుర్వేదములగూడ, వివిధరీతుల విష్ణువు కీర్తింప
యుండెను.

ఆకసమున సంచరించు విష్ణువునుగూర్చిన మంత్రము
నాతడు సూర్యదృష్టిలో జూడబడినట్లు విదితము. In the Rigvec Vishnu is a solar deity, regarded as the pervader, havi his place in the Supreme heaven [73] ఋగ్వేదమున వ్యా
కత్వముగలిగి, పరమపదమున నివాసము గల ఆదిత్యునిగ బరి
ణింపబడెనని రాధాకృష్ణ మహాశయుని అభిప్రాయము.
ప్రకాశముచే భూమ్యాకాశముల, మనోలోకముల నావరించిన ప్రతి
వంతుడని ఆచార్య రంగాచార్యుల అభిప్రాయము. [74] ఇతడ
ద్వాదశాదిత్యులలో నొక్కడుగ వ్యవహరింపబడెను. From th beginning Vishnu was marked out for a great destiny In the Vedas he is the God of three strides. He dwell inscrutable in the bright realm of light where can the birds dare not fly [75] (ఋ. వే. 1-155-5) ప్రథమమునుండి
విష్ణువు ఉత్కృష్ట భవిష్యత్తు గలిగియున్నాడు. ప్రతిపాదములు
అవానివలె వేదముల నతడు వర్ణితము. విహంగములుగూడ నెగుర

par
of v Dr. S. Radhakrishnan : Indian
gerr Philosophy, Vol. 2, p. 667
Vaish Prof. M. Rangacharaya : The Three Great
Acharyas, p 141
72. Dr. S. Radhakrishnan: Indian philosophy,
Vol. 1, p 492

భీతిజెందు తేజోమయాకాశమున నతని నివాసము అని పండిత రాధాకృష్ణుని అభిప్రాయము. ఆ విష్ణుపదమును చూచుట మానవుని ఉన్నతాదర్శమనియు, కఠాది యుపనిషత్తులనుండి (1-3-9), యజుర్వేదమున, విష్ణువునకధికతర ప్రాధాన్యము గలిగినట్లు రాధాకృష్ణ ఆచార్యుని తలంపు.[76] శతపథ బ్రాహ్మణములో, విష్ణువు యజ్ఞస్వరూపముగ నభివర్ణితము (5-2-3-6; 5-4-5-1; 12-4-1-4; 14-1-1-6-15). The fortunes of Vishnu among the gods of India, have been the most varied. In the earliest Vedic age, he was the highest, being placed in the sky and the last, in the series of Gods to whom a portion of the sacrificial food was to be offered - -[77] హిందూ దేవతలలో విష్ణువుయొక్క అవకాశములు వివిధములు. ప్రథమతః నతడు సర్వోత్తముడై, ద్యులోకమున నుంచబడెను. తర్వాత యజ్ఞముల హవిర్భాగమునొంద నితర దేవతలతో నొకడుగ నుండెను, అనియు శ్రీనివాస అయ్యంగారు తెలిపియున్నాడు.

ఈ విషయమును దరచి చూచిన హేమచంద్రాచార్యుడు వ్రాయుచు, వైదిక కాలముల విష్ణువునకు ఎక్కువ ప్రాధాన్యము లేక, సర్వాధికుడుగ బరిగణింపబడలేదనియు, అతనికంటె నింద్రుడే అధికుడుగ ఋగ్వేదమున (1-177-) మొదలగు సూక్తముల గోచరమనియు, నతడు 'ఇంద్రస్య యుజ్యః సఖా' (ఋ. వే. 1-22-19)

---

76. *Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 1, p 124*

77. *Sri V. T. Srinivasa Iyangar : Ounlines of Hindu Philosophy, p 190*

ఇంద్రుని ముఖ్య స్నేహితుడుగ దెలువబడి యున్నాడనియు, అంతియగాక వృత్రాసుర సంహార కార్యమున, ఇంద్రునిచే నాజ్ఞాపింపబడినట్లును వ్యక్తముగ నతని వచనము. తైత్తిరీయ బ్రాహ్మణమున, విష్ణువు అధికతర ప్రాధాన్యమును గలిగి, పృథ్వీ అంతరాళ ఆకాశములకధినాథుడని వివరింపబడినది. శతపథ బ్రాహ్మణమున, నతడు యజ్ఞస్వరూపుడై యొప్పెను. ఐతరేయ బ్రాహ్మణములో నతడు దీక్షాపాలుడై యజ్ఞరక్షకుడయ్యెను. ఈ విధముగా విష్ణు నామము వేదముల నుపయుక్తమై, వివిధరూప పరిణామమును బొంది, కాలాంతరమున వైష్ణవ సిద్ధాంతమునకు అధిదేవతయై చెల్వొందినట్లు, ఆచార్య హేమచంద్ర రాయ్ ఛౌధురుని అభిప్రాయము.[78] ప్రస్తుత వైష్ణవ సిద్ధాంత బీజములు, వేదముల గానరావని అతని తాత్పర్యము.

## నారాయణ

వైష్ణవమున 'విష్ణు' పదము తర్వాత 'నారాయణ' పదము చాల ప్రముఖము. ఈ నారాయణ పదమునన్వయించి ఋగ్వేదము పురుషసూక్తము (10-1-26) వల్లీ, అందు నారాయణుడు 'సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్।' అనుచు ప్రారంభించి, 'పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి' అనియు, అతనినుండి సృష్టియంతయు నుద్భవించినట్లు వివరించి,

78. Prof. Hemachandra Roy Chaudhuri : Materials for the Study of the Early History of the Vaishnava Sect., p 7

'బ్రాహ్మణోఽస్య ముఖమాసీద్బాహూ రాజన్యః కృతః। ఊరు తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత॥' అని చతుర్విధ మానవ సృష్టినిగూడ సూచించి, 'చంద్రమా మనసో జాతశ్చక్షోః సూర్యో అజాయత' అని సూర్యచంద్రాదిక నిర్మాణమును దెలిపి, నారాయణసర్వశక్తిత్వ, సర్వజ్ఞత్వ, సర్వత్వముల వివరించి, స్తుతించి యున్నది. ఈ పురుషసూక్త మంత్రములు, నారాయణుడను మహర్షిచే నిర్మితమనియు తెలియుచున్నది. నారాయణ నామక ఉపనిషత్తుగూడ, నారాయణుడు సృష్టిని సంకల్పించి, ప్రాణ, మన, సర్వేంద్రియములను, ఖం వాయు జ్యోతిరాపః పృథివీ మహా భూతములను సృజించినట్లు, ప్రస్ఫుటముగ వాకొను చున్నది. నారాయణునుండి బ్రహ్మరుద్రేంద్రాదులు, ప్రజాపతి, వసవాదిత్యులు సర్వము జనించినట్లు, అందే ప్రవర్తించి, అంతమున ప్రలీయములగుచున్నవని విదితము చేయుచున్నది. 'అథ నిత్యో నారాయణః। బ్రహ్మా నారాయణః। శివశ్చ నారాయణః। శక్రశ్చ నారాయణః। కాలశ్చ నారాయణః। దిశశ్చ నారాయణః।' అని సర్వమును నారాయణుడే అని తెలిపి, 'నారాయణ ఏవేదం సర్వం యత్ భూతం యచ్చ భవ్యం।' త్రికాలములును నాతడే అని కీర్తించి, 'నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతః శుద్ధో దేవ ఏకో నారాయణో న ద్వితీయోఽస్తి కశ్చిత్।' అనియు నారాయణ అద్వితీయ తత్త్వమును స్పష్టపరచి, దీని గ్రహించిన వాడు 'విష్ణురేవ భవతి స విష్ణురేవ భవతి' అని ప్రథమతః స్తుతించి, అభివర్ణించినది. ఇచ్చట నారాయణ, విష్ణు శబ్దముల నన్వయించుచు,

నారాయణు గ్రహించినవాడు విష్ణువగును అని సూచించినది. అంత నంతమున, 'ఓం నమో నారాయణాయేతి' అను అష్టాక్షరీ మంత్రో పదేశమును ఆ ఉపనిషద్రాజము బోధించినది.

అంతియగాక, వివిధ గాయత్రీ మంత్రములతోబాటు 'నారాయణాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి। తన్నో విష్ణుః ప్రచోదయాత్॥' (తై. ఆ. 10-) అను మంత్రరాజముగూడ ఏర్పడి, అనేక భక్తకోటికి తారణోపాయమై, యలరారినది. ఈ మంత్రమున నారాయణ శబ్దమునకు విష్ణు పదమేగాక వాసుదేవ పదముగూడ నన్వయింపబడి, వాని ఏకత్వ ప్రతిపాదనము గావింపబడి యున్నది.

నారాయణ పద వ్యుత్పత్తి 'నారాః అయనం యస్య సః' నరులకు ఆశ్రయస్థానమనియు, 'నారాణాం అయనం' అనియు వచింపబడెను. మనుస్మృతి, మహాభారతములు 'ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః। తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః॥' (1-10) జలము నారము అనబడును. ఆ యాపములు నరసూనువులు. అట్టి నారములు పరమాత్మకు మునికిపట్టులగుటచేత, నతడు నారాయణుడనబడెను అనియు, 'ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః। అయనం మమ తత్పూర్వమతో నారాయణో హ్యహం॥' (శాంతి. 341-40) ఆపములు నారములనబడును. ఆ యాపములు నరసూనువులు. అవి నాకు ఆధారములగుటచే నేను నారాయణుడను అనుచు, నారాయణ శబ్దార్థమును వివరించినవి.

మరియు నీ నారాయణ శబ్దము, శతపథ బ్రాహ్మణమునను, తైత్తిరీయారణ్యకమునను బ్రస్తావింపబడినది. ప్రజాపతి వనుపున నారాయణుడను వ్యక్తి, మూడు పర్యాయములు యజ్ఞముల గావించెనని శతపథము వ్రాసినది. అచ్చటి నారాయణుడు విష్ణువుతోగాని, ఆదిత్యునితోగాని, అన్వయింపబడలేదు. ఆ నారాయణుడు పంచరాత్ర త్రిసత్రము నాబడు యజ్ఞము పంచ రాత్రముల నిర్వహించినట్లును, తత్ఫలితమున సర్వజీవులకంటె నాధిక్యతను బొందినట్లును గోచరము. ఈ పంచరాత్రసత్ర గాథయే క్రమముగ, పాంచరాత్ర సిద్ధాంతమునకు ఆధారముగ నై యున్నది. బోధాయన ధర్మసూత్రముల, నారాయణ విష్ణువులకైక్యము గోచరమని ఆచార్య సర్కార్ పండితుని తలంపు. [79]

మహాభారత శాంతి పర్వమున, నారాయణ శబ్దము ద్వివిధ ముగ గోచరము. అందు, మోక్షధర్మ భాగములోని నారాయణీయ శాఖలో, బ్రథమతః దేవర్షియగు నారదుడు శ్వేతద్వీపమునకరిగి, అచటనున్న నారాయణు దర్శించినట్లును, పిమ్మట తదంశ సంభూతుడైన నర, నారాయణుల దర్శింప బదరికాశ్రమమును జేరి, పాంచరాత్రమును గ్రహించినట్లును వ్యక్తము. ద్వితీయ నారాయణుడు, అతి ప్రాచీన మహర్షి సత్తముడై, ధర్ముడనువాని పుత్రుడై నరునితో బదరికాశ్రమమున దపము గావించినట్లు విదితము. అతడు హిమాలయముల దీవ్ర తపంబాచరింప బ్రహ్మానుసంధానము నొందెననియు, నిదియు శ్రీసాంబశివుని కృపావిశేషమున ననియు

79. *Prof. D. C. Sarcar : History and Culture of the Indian People. p 435*

వాకొనబడి, అతని తపఃఫలితముగ నరుడుద్భవించినట్లును, అతడు సర్వవిధముల నారాయణమహర్షితో సమానుడైనట్లును చెప్పబడు చున్నది. వారిరువురే కృష్ణార్జునులై, అనగా నారాయణుడు కృష్ణపరమాత్మగను, నరుడు పార్థుడుగ నుద్భవించినట్లు మహాభారత కథనము.

కాని, నారాయణుడు చారిత్రాత్మక వ్యక్తి కాడనియు, నరుల ఆశ్రయ స్థానమునకు నారాయణము నాబడినదని భండార్కరు వాదించినను, నారాయణుడు ప్రాచీన మహర్షి అనియు, జ్ఞాని యనియు, నరుడను మహర్షికుటుంబమున జనించి యుండు ననియు, నీ యిరువురును సూర్యోపాసనాశీలురై యుండిరనియు, కాలక్రమమున నీ విధానము, ద్వాదశాదిత్యులలో నొక్కడైన విష్ణువునకు అనుసంధింపబడి యుండుననియు సర్కారు పండితుని భావము [80] మరియు, It seems that the worshippers of the deified sage Narayana were originally known as Pancharatras, who were later mixed up with Bhagavatas, worshipping Vasudeva according to the Vidhi of the Satvata people, and that the Narayan cult originated in some parts of the Himalayan region or its neighbourhood[80] పూజ్య నారాయణ మహర్షి నుపాసించువారు, ప్రథమతః పాంచ రాత్రికులనబరిగి, సాత్వత ప్రజల విధానము ననుసరించు వాసుదేవా రాధకులగు భాగవతులతో గలిసియుందురనియు, నీ నారాయణ శాఖ హిమవత్ప్రాంతముల బుట్టించి యుండుననియు, నీతని అభి

80. *Prof. D. C. Sarcar : History and Culture of the Indian People, p 437*

ప్రాయము. ఇదే అభిప్రాయమును మున్షీ మహాశయుడుగూడ వచించెను. Narayana an ancient sage, who 'became all beings' had come to be worshipped as God Himself. Slowly as the Vedic God Vishnu, attracted to himself the characteristics of the other gods; the new conception of Avatara identified Vishnu with the sage Narayana, Similarly Vasudeva who was till them just a hero, was accepted as God descended on earth Avatara. Later Narayana, Vasudeva and Vishnu, all three became Hari the Deity Eternal and Supreme Lord, the Supreme Spirit [81] పురాతన మహర్షి యగు నారాయణుడు సర్వాత్మకుడై, పరమాత్మగా బూజింపబడెను. క్రమముగ వైదిక దైవమైన విష్ణువు, ఇతర దేవతల లక్షణముల దనలో నాకర్షించి, వినూత్నమైన అవతారవాదము విష్ణువును నారాయణునితో నైక్యమొందించెను. అటులే, అంతవరకు యోధుడుగనున్న వాసుదేవుడుగూడ, భగవదవతారముగ స్వీకరింపబడెను. అంతట, నారాయణ, వాసుదేవ విష్ణువులు పరమాత్మ యగు హరితో నొక్కటియైరని అతని వాదము.

కాని పూర్వమున వచింపబడినరీతి నారాయణ నామము, మహాభారతమున ద్వివిధ సంబంధమున వాడబడియున్నది. అందు నరనారాయణ పూర్వకము ఒకటి. ద్వితీయమున నారాయణుడు విష్ణువైయె, అసురులనుండి అమృతభాండమును గ్రహించి, గరుడుని వాహనముగను, చిహ్నముగను గైకొనినట్లుగలదు. శ్వేత ద్వీపవాసుల అధినేత యగు నారాయణుడు, నరనారాయణులతో

81. *Sri K. M. Munshi : History and Culture of the Indian People, p xi*

నేతత్వము నొందనివాడని స్పష్టము. అతడు కేవలము పరమాత్మ గనే వర్ణింపబడి యున్నాడు (శాంతి. 336-27-55). అందుచేత నీ పదము ప్రథమతః పరమాత్మకే నామమై యొప్పి, క్రమమున మహర్షి కి అన్వయించి, ప్రశస్తిగాంచి యున్నదనిన పముచితము. అచట 'నారాయణో హరిః' (337-31) అని మహాభారతము, ఆ శ్వేతద్వీపాధిపతిని హరి శబ్దముతో నేకముచేసి యుచ్చరించినదిః కాన నారాయణ పదము పరమాత్మకే మొదట వాచకమైయుండ, తర్వాత మహర్షులు దాని స్వీకరించి, తమ నామముగ వాడియుండి రనుటయే సమంజసము.

## భగ

అటులే 'భగ' నామము. ఇది వివిధరీతుల వేదముల నువ యుక్తమై, 'భగవాన్' 'భాగవత' ములుగ గాలాంతరమున రూపొంది, వైష్ణవమతమున ముఖ్యస్థానము నలంకరించి యున్నది. ఇది వేదముల, బహుళముగ గాననగును. మిత్ర, అర్యమ, వరుణ, సవితా, విష్ణు, ఇంద్ర పదములతో సమానస్థాయిమండి, సమాన ప్రతిపత్తిని బొందియున్నది. అందుచేత నీ 'భగ' ఆ వేదముల నొక దేవునికే వాచకముగ నొప్పారియున్నది. 'శృణోతు మిత్రో అర్యమా-భగో' (ఋ. వే. 2-27-1) 'తత్ సు నః సవితా భగో వరుణో మిత్రో అర్యమా, ఇంద్రో నో రాధసా గమత్' (ఋ. వే. 4-55-10) సవితా, భగ, వరుణ, మిత్ర, అర్యమ, ఇంద్రాది దేవతలు, ధనాదులతో మీదగ్గరకరుదెంచెదరుగాక, మొదలగు ననంఖ్యాక మంత్రములు గాననగును. మరియు నా మంత్రముల 'త్వం భగోనృపతే రత్నధా' (ఋ వే. 2-1-7) అధిక సంపన్నుడవగు భగుడవు

అనియు, 'వామం వామం త ఆదురే దేవో దదా త్వర్యమా
ఽం పూషా వామం భగో' (ఋ. వే. 4-30-24) అర్యమదేవుడు
అమూల్య సంపదను మాకొసగుగాక! అటులే భగుడు మాకిడును
! 'తత్ సు నః సవితా భగో ఇంద్రో నో రాధసా గమత్'
ు. వే. 4-55-10) సావిత్రి, భగ, ఇంద్రాది దేవతలు తమ
పదలతో వచ్చెదరుగాక! అటులే ఋగ్వేదమున (5-16 2;5-49
;5-51-11; 5-82-1; 5-82-3;) మొదలుగాగల మంత్రములు
ని, ధనవంతుడై భక్తులకు దాని ప్రసాదించు దైవమునువలె
ంచియున్నవి. అందుచే నాతడు 'భగ త్రాతః' (ఋ.వే.
6-6) 'త్రాతు ర్త్రవి భగస్య' (ఋ.వే. 4-55-5) రక్షకుడనియు
డ గొనియాడబడియున్నాడు. మరియు నతడు, 'పూషా భగః
భమే విశ్వభోజా' (ఋ. వే. 5-41-4) 'పూషా భగః సరస్వతీ
షంత' (ఋ.వే. 5-46-2) 'పూషో భగో' (5-49-3) అను
ంత్రముల, సర్వజ్ఞుడనియు నిర్వచింపబడెను. అందుచే నతడును;
వో భగః' (ఋ. వే. 5-42-5) అని అనబడి, యుద్ధములలో
ండ సహాయము జేయువాడనియు సూచింపబడి (ఋ. వే.
33-5), 'భగో న కారే హవ్యో మతీనాం' (ఋ. వే. 3-49-3)
యజ్ఞముల హవిర్భాగమును యితర దేవతలతో సమానముగ
ంద అధికారము నార్జించినట్లు విదితము. కాని విష్ణువుతో నితని
క్కడను ఏకత్వము గోచరింపకుండుట యటులుండ (ఋ. వే.
46-3), విష్ణు, భగ, నామములు అన్యదేవతా పరముగ నుపయో
ంపబడియుండ, వేదముల వీరిరువురు అన్యులని సుబోధము.

పూర్వోక్తమురీతి సర్వసంపన్నుడైన భగుడు, నా వైదిక దేవుడు షడైశ్వర్యములు గలవాడుగ రూపొందె, 'ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః। జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరితా॥' (విష్ణు పు. 56-72) సంపూర్ణముగ ఐశ్వర్య వీర్య యశ శ్రీ జ్ఞాన వైరాగ్యములనెడు ఆరు ఐశ్వర్యములు గలవాడని ప్రఖ్యాతి నొందెను. 'మాహాత్మ్యస్య సమగ్రస్య ధైర్యస్య యశసః శ్రియః। జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతి స్మృతః॥' (1-13) అను గురు బాల ప్రబోధికా గ్రంథము ఐశ్వర్యమునకు మాహాత్మ్యమును జొప్పించినది 'జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్యతేజాంస్యశేషతః। భగవచ్ఛబ్ద వాచ్యాని వినా హేయగుణాదిభిః॥' (పరాశర) హేయ గుణములేక, జ్ఞానశక్తి బలయైశ్వర్య వీర్య తేజములు అశేషముగ నుండ భగవంతుడగును అనియు, 'శుద్ధే మహావిభూత్యాఖ్యే పరబ్రహ్మణి వర్తతే। మైత్రేయ భగవచ్ఛబ్దస్సర్వకారణకారణే' (56-72) హేయగుణవిహీనుడై, మహావిభూతి యను ప్రతిష్ఠగలవాడు, సమస్త కారణములకు గారణమైనవాడును, అగు పరబ్రహ్మము భగవచ్ఛబ్దమునకన్వయము. మరియు 'సంభర్తా చ తథా భర్తా, భకారార్థో ద్వయాత్మకః। నేతా గమయితా స్రష్టా, గకారార్థస్తథాయినే॥' (5-6-7ఎ) 'భ'కారమునకు సంభర్తయనియు, భర్త యనియు రెండర్థములు గోచరము. సృష్టి కార్యమునకు ప్రకృతివలన సాధనముగలవాడు సంభర్త, సృజించినదానిని బోషించువాడు అనగా భరించువాడు భర్త. అటుల 'గ' కారమునకు సర్వాధారుడనియు, సర్వ లయ కర్త యనియు, సర్వ కర్త యనియు నర్థము. అందుచే భగవానుడన సృష్టి స్థితి లయ కారణుడు అని అన్వయముగ విష్ణుపురాణ వాక్యములు. అంత 'సర్వ

హేయప్రత్యనీక కల్యాణగుణవత్తయా। పూజ్యాత్పూజ్యతమే యోఽసౌ భగవాన్ ఇతి శబ్ద్యతే॥' హేయగుణరహితమై, సమ కల్యాణగుణాకరమై, పూజ్యులకంటె బూజ్యతగలవాడు భగవానుడని రామానుజుడు విష్ణుసహస్ర నామ భాష్యమున తెలిపియున్నాడు.

పై విషయముల ననుసరించి చూచినచో, నీ భగ శబ్దము కాలక్రమమున సామాన్య వైదిక దేవతలనుండి పరమాత్మతో నేకత్వమువరకు బరిణమించినట్లు స్పష్టము. వేదముల నీ భగ నామక దైవము, మిత్రునికంటె ప్రాచీనుడై యుండెనని రంగాచార్యుని అభిమతము.[82] అతడు యీ విషయ వివరణము గావించుచు, భగ శబ్దము సంస్కృత వాఙ్మయములో అనేక అర్థముల బొంది, సూర్యాది దేవతలకుగూడ నన్వయింపబడుచుండెననియు వచించెను. Very frequently means good blessings and auspicious qualities and great powers... It must be in consequence of an identification of the God himself with the power of goodness that he possessed, that the word 'Bhaga' ceased to be the name of the God and came to denote chiefly his power of goodness and grace. After this took place, we observe a change in the structure of the name of the God: that name is no longer Bhaga but Bhagavat[82] ఈ భగ శబ్దము తరచుగ సదాశీర్వచనములకు, శుభదాయక శక్తులకు అర్థమగుచుండెను.

---

*82. Prof. M. Rangacharya : The Three Great Acharyas, p 143*

ఆ కారణమున నీ శక్తులతో, భగవంతు డేకీభూతము నొందుటచే భగ శబ్దము పరమాత్మునకన్వయింపక, అతని అనుగ్రహాది శక్తుల కర్థమయ్యెను. దానికనుగుణమై, దేవుని నామమున మార్పు ఏర్పడి, 'భగ' నామముగాక, 'భగవత్' నామము కలిగెను. ఆ విధముగ భగవంతుడు ప్రధానుడైన ఒక మతముగ రూపొంది, అందు భగవంతుడు పరమాత్మయై, భాగవతమతమై, మహాభారత మున ప్రత్యేకముగ వివరింపబడినదని అతని భావము.

## వాసుదేవ, కృష్ణ

అటులే వాసుదేవ, కృష్ణ పదములు. వాని వివరముల సౌరభము ఎనిమిదవ భాగమున బహుళముగ జూచెదముగాన, నిట అతి సూక్ష్మముగమాత్రము సూచించెదము.

'కృష్ణ' శబ్దము నలుపును సూచించునదై యున్నను, నిఘంటుకారులు ప్రత్యేక వ్యుత్పత్తుల దానికి గల్పించి, వివరించిరి. "సర్వం కరోతీతి కృష్ణః" సర్వమును జేయువాడు, 'కర్షతి చిత్తమితి' చిత్తము నాకర్షించువాడు అనియు, నమరకోశము తెల్పు చున్నది. దీనికి గారణము కృష్ణచరితములు అతని సర్వ శక్తిత్వ మును, సర్వాకర్షణీయత్వమును, అకుంఠితలీల వివరించి స్తుతించి యుండుటచేనై యుండనోపును. వివేకానందుని వాక్యములలో He is worshipped in various forms, the favourite ideal of men as well as of wemen, the ideal of children as well as of grown up men [83] నతడు వివిధముగ నారాధింప

83. *Swami Vivekananda : Complate Works, Vol. 3, p 256*

బడుచు బురుషులకేగాక స్త్రీలకును, పిన్నలకేగాక పెద్దలకును ఆరాధ్యుడై వెలిగెను. అందుచే నతడు అవతారములలో గణింపబడక, పరిపూర్ణావతారముగ గీర్తింపబడెను. మరియు నా యతివరేణ్యుని వాక్యములలో గృష్ణుడు, the first teacher in tbe history of the the world to discover and proclaim the grand truth of love for love's sake and duty for duty's sake [84] ప్రేమ ప్రేమకొరకును, విధి కర్తవ్య నిర్వహణమునకునను పరమ సత్యమును, ప్రపంచ చరిత్రమున బ్రథమతః గ్రహించి, ప్రకటించిన, ప్రథమాచార్యుడుగూడనై యున్నాడు. అంతియుగాక In him we find the ideal houshoulder, and the ideal sannyas in the Hero of thousand battles, who knew no defeat; in the terror of despots. sychophants hypocrates, sophists and pretenders, the master statesman, the uncrowned monorch, the king - maker, who had no ambition for himself [84] ఆదర్శ గార్హస్థ్యము, ఆదర్శ సన్న్యాసము అతనిలో గాంచగలము. అపజయమెరుగని బహుళ రణరంగ శూరుడు, నిరంకుశులకు, బరాన్నభుక్కులకు, వంచకులకు, కుతార్కికులకు, నటకులకు, నాతడు అత్యంత భయంకరుడు, అతికుశల రాజకీయవేత్త, కిరీటములేని చక్రవర్తి, రాజనిర్మాత, స్వార్థరహితుడౌ కృష్ణుడు అని త్యాగీశానందస్వామి సూక్ష్మముగ నొక్కచో, చక్కగ నా భగవానుని అభివర్ణించెను. అతడు, భక్తి జ్ఞాన కర్మయోగముల విచిత్ర సమన్వయ రూపమునై, పారమార్థిక సాధకులకు పరమాదర్శప్రాయుడై ప్రకాశించెను.

---

*84. Swami Tyagisananda : The Cultural Heritage of India, Vol. p 3, 299*

శ్రీకృష్ణుడు 'తద్ధైతద్ఘోర ఆంగిరసః కృష్ణాయ దేవకీపుత్రా యోక్త్వోవాచ' (3-17-6) ఆంగిరసుని పుత్రుడైన ఘోరమహర్షి, దేవకీ పుత్రుడైన కృష్ణునికొరకు దీనిని వివరించెను, అను మంత్ర ప్రకారము మహర్షుల శిష్యుడై, సూర్యోపాసనా విధానము నుప దేశము నొందినట్లు విదితము. అనగా నీ కృష్ణుడు ఉపనిషత్ జ్ఞాన సంపన్నుడని వ్యక్తము. ఈ విషయములనే, తర్వాత తన గీతా శాస్త్రమున గొన్ని మార్పులతో, తన ముఖ్య శిష్యుడైన అర్జునునకు బోతడుపదేశించినట్లును సుబోధకము. అట్లు శ్రీకృష్ణుడు, తన సిద్ధాంత విషయముల ఘోర మునీంద్రుని సన్నిధిని గ్రహించి నట్లు, పై ఛాందోగ్య మంత్రపాఠ తాత్పర్యము.

మరియు హరివంశ, భాగవత గ్రంథముల జిత్రింపబడిన శ్రీకృష్ణ లీలా విషయములు, may have partly developed out of Vedic legends about Vishnu, called Gopa (protector of cows) in the Rig-Veda [85] ఋగ్ వేదమున గోప (గోరక్షకుడు) అనబడు విష్ణువునుగూర్చిన వైదిక గాథలనుండి రూపొంది యుండునని, డి. సి. సర్కారు ఆచార్యుని అభిప్రాయము. శ్రీకృష్ణునిగూర్చి ఋగ్వేదమున, మరియొక అపూర్వ కథనముగూడ కలదు. 'అవదద్స్న అంశుమతీమతిష్ఠ దియానః కృష్ణో దశభిః సహస్రైః। అవత్ తమింద్రః శచ్యా ధమంత మప స్నేహితీ ర్నృమణా అధత్త' (8-96-13) శీఘ్రగమనముగల కృష్ణుడు, దశసహస్ర దస్యులతో అంశుమతిదగ్గర గలడు. బుసగొట్టుచున్న

85. *Prof. D. C. Sarcar : History and Culture of the Indian People, p 434*

అతని, శక్తిమంతుడగు యింద్రుడు పట్టుకొనెను. మానవ శ్రేయ మును గోరు యింద్రుడు, అతని క్రూర సైనిక దళముల హత మార్చెను అను మంత్రములలోను, 'ప్ర మందినే పితుమదర్చితా వచో యః కృష్ణగర్భా నిరహన్నృజశ్వనా। అవస్య వో వృషణం వజ్రదక్షిణం మరుత్వంతం సఖ్యాయ హవామహే' (1-101-1) రిజశ్వంతునితో మనకు హితము గావింపనెంచి, మనకు మిత్రుడగు నకై కృష్ణుని భార్యాగర్భముల విచ్ఛిన్నము గావించిన వజ్రా యుధధరుడు, వరప్రదాత, మరుద్గణసేవ్యుడైన ఇంద్రునికి, మన హవిస్సుల నొసంగెదముగాక అను మొదలుగా గల మంత్రము లలో, కృష్ణుడు ఇంద్రునకు ప్రత్యర్థి యనియు, వీరిరువురికి తరచు యుద్ధములు సాగి, ఇంద్రుడు జయశ్రీని గాంచి, తన యనుచరుల మెప్పు బొందెననియు స్పష్టము. ఈ కృష్ణ శబ్దమునకు గౌణముగ గాక, శక్తివృత్తి ననుసరించి 'నల్లని' వాడని అన్వయించిన, దేవకీ నందనుడైన కృష్ణుడు, యిచ్చట వర్ణింపబడిన కంటకుడైన అసురుడు గాకుండును. అచట నతడు, నల్లనివారి నాయకుడుగ కొన్ని మంత్రముల గోచరము. అందుచే నీ యన్వయము సమం జనమేమో! ఇంద్ర, కృష్ణ, విభేదములు పురాణములగూడ వర్ణితము. కాని పౌరాణిక కృష్ణుడు జయించెను, వైదిక కృష్ణుడు అట ఓడెను. ఆచార్య రాధాకృష్ణుని అభిప్రాయమున గృష్ణుడు, అనార్యజాతి నాయకుడై యుండి, వైదిక కాలముల నింద్రునికి ప్రత్యర్థియై, తర్వాత బురాణముల ననుచరుల నధికము గావించుకొని, at the time of the Bhagavat Gita he recovered much lost ground and got reinforced by becoming identified with the Vasudeva of the Bhagavats, and Vishnu of the

Vaishnavas [86] భగవద్గీతా కాలమునకు, దన స్థానమును దిరిగి సాధించి, భాగవతుల వాసుదేవునితోడను, వైష్ణవుల విష్ణువుతోడను, ఏకత్వము నొందెనని తెలియుచున్నది. ఎట్లనను రాధాకృష్ణ పండితుని దృష్టికి, It is clear that from the time of the Vedic hymns down to the Upanishad period there was a tradition about Krishna as a Vedic thinker [87] వేద మంత్ర ముల కాలమునుండి ఉపనిషత్తుల కాలమువరకు, కృష్ణుడు వైదిక జ్ఞానసత్తముడను సంప్రదాయము గలదు అని స్పష్టమగును. మరియు నా పండితుని తాత్పర్యమున, మహాభారత గ్రంథమున, శ్రీకృష్ణపరిణామ చారిత్రమున కృష్ణుడు, అనార్య నాయకుడుగను, పారమార్థిక జ్ఞాన ఉపదేశకుడనియు, అనార్యజాతికధిదేవుడనియు గోచరమని విదితము. కాలాంతరమున నతడు శ్రీమహావిష్ణువు యొక్క పరిపూర్ణావతారమను స్థితియు నందుగోచరము.

అటులే మహాభారత, నారాయణీయ శాఖలోని వాసు దేవుడు, శ్రీకృష్ణునితో అన్వయించి, వాసుదేవ-కృష్ణ సమన్వయము జరిగి, భాగవత సిద్ధాంతమునకు బట్టుగొమ్మగ రూపొందెను. వాసుదేవ పదము కృష్ణునకు నామమనియు, గృష్ణశబ్దము గోత్ర నామమనియు భాండార్కర్ వాదము. [88] అటులగాక యాదవ

---

*86. Dr. S. Radhakrishnan : Indian philosophy, Vol. I, p 87*

*87. Dr. S, Radhakrishnan : Indian philosophy. Vol. I., p 493*

*88. Prof. Hemachandra Roy Chaudhuri : Materials for the study of tee eariy History of the Vaishnava. Sect. p 22*

కుల దేవతయు, మహాభారతమున వర్ణింపబడిన వాసుదేవ కృష్ణుడను యోధుడు, was identified with the earlier Vasudeva [89] యితః పూర్వుడైన వాసుదేవునితో నేకముగ జేయఁబడియుండునని, మున్షీ మహాశయుని అభిప్రాయము. భారత, భాగవత, హరివంశముల కృష్ణుడు, దేవకీ పుత్రుడును, వసుదేవుని సుతుడునై యున్నాడు. వసుదేవ పుత్రుడగుటచే వాసుదేవుడైనట్లు స్పష్టము. కాని, యీ పురాణములకు బూర్వ గ్రంథముల, వాసుదేవ పదమునకు కృష్ణ శబ్దమునకు సంబంధము గానము. ఆ పదము ప్రత్యేకముగ గోచరించును. అందుచే నా వాసుదేవుడు, కృష్ణవాసుదేవునకు అన్యుడై యుండనోపు. కాలక్రమమున, వీరికిరువురకును నభిన్నత్వమేర్పడి, యొకరుగనే భావింపబడి యుండునని దోచును. ఈ విధమున శ్రీకృష్ణ నామముగూడ కాలాంతర పరిణామము నొంది, వివిధ స్రవంతుల గలిపికొని మహానదులేర్పడు చందము, అనేక వ్యక్తుల చరిత్రముల స్వీకరించి, ఒక మహా శబ్దమై, వైష్ణవ మతమున ముఖ్యస్థానము నొందినట్లు వ్యక్తము. ఈ విషయమును సౌరభ అష్టమ సంపుటమున వివరముగ గాంచెదముఁగాక!

ఈ విధముఁగ, వైష్ణవ గ్రంథముల బహుళముగ గోచరించు, విష్ణు, నారాయణ, భగవాన్, కృష్ణ, హరి మొదలగు నామములు, వేదములనుండి యుత్పన్నములై, ఉపనిషత్తుల గొంత పారమార్థికతను గడించి, పురాణేతిహాసముల ప్రశస్తములై, బహుముఖ

89. *Sri K. M. Munshi : History and Culture of the Indian People, p xi*

ప్రఖ్యాతి గాంచి, సమగ్ర వైష్ణవసిద్ధాంత రూప పరిణామమున మూలకారణములై విరాజిల్లి యుండినట్లు, పూర్వ విషయము ననుసరించి గ్రాహ్యము. ఇక నీ వైష్ణవమునకు మూలాధారములైన కొన్ని ముఖ్య గ్రంథముల, సమీక్షించి చూచెదముగాక!

## నారద భక్తి సూత్రము

'ప్రహ్లాద నారద పరాశర పుండరీక, వ్యాసాంబరీష శౌనక భీష్మదార్భ్యాన్। రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాదీన్, పుణ్యా నిమాన్ పరమభాగవతాన్ స్మరామి॥' అని పరమ భాగవత సంస్మరణము, ఇందు నారదుడు ద్వితీయ స్థానము నలంకరించినట్లు గోచరించినను, యీ శ్లోకరచయిత, కాలము ననుసరించిగాని, ప్రాధాన్యత ననుసరించిగాని దీని రచించినట్లు లేదు. అంతియుగాక నారదుడు యిందు వచింపబడిన భాగవతుల యందరితో సన్నిహిత సంబంధముగలిగి, చాలవరకు ఉపదేష్టయునై చెల్వొంది యుండుటచే, నీ శ్లోక మునకు నారదుడే ముఖ్యమని తోచును. యథార్థముగూడ నంతియేగదా! నారదుడు, వేదముల నగోచరమై యున్న పురాణాది గ్రంథముల నతి ప్రాధాన్యమును బొంది, సర్వాంతర్యామియై సర్వవ్యాపియై, సకల కథావస్తువుల, ఘట్టముల ప్రత్యక్షమై, ఆనందమూర్తియై, ప్రదాతయునై రాజిల్లును. అతని సంచారములు, కార్యములు, సంబంధములు, కేవలము పారమార్థిక శ్రేయః కారణములై యొప్పారుట, నతని Narada the Missionary ప్రబోధకుడైన నారదుడని, శ్రీదానందస్వామి వచించుట ఎంతయు

90. *Swami Sridananda : Vedanta Kesari, p 42Y, 1*

సముచితము. నారద శబ్ద వ్యుత్పత్తిని గాంచినను 'నరస్య ధర్మో నారం, తద్దదాతీతి నారదః' ధర్మ ప్రచారము చేయువాడుగాన నారదుడయ్యెను. మానవులకు సత్యమును బోధించి, పరిపూర్ణత్వ మును బొందు విధానముల బోధించువాడు నారదు డని యర్థము. నర, నారద, నారాయణ శబ్దముల మూడింటి జూచినచో, నరులకు నారాయణు జూపించువాడు నారదుడై, సర్వమానవోపదేశికుడని స్పష్టమగును. మరియు, The word Narada is interpreted as something specially attaching Nara (Man). One view is that it means ignorance and that the Narada means one who kills ignorance. Another view is that it means knowledge ie., the knowledge par excellance, the knowledgeof what is eternal [91] 'నారద' పదము, ప్రత్యేక ముగ నరులకు సంబంధించినదిగ అన్వయించబడుచున్నది. ఒక అర్థమున దానికర్థము అజ్ఞానమని స్వీకరింపబడి, నారదుడన అజ్ఞాననాశకుడని తెలుపబడినది. రెండవ అర్థము ప్రకారము అది పరమ జ్ఞానమనియు, శాశ్వత జ్ఞానమనియు, దాని నొసంగు వాడు నారదుడనియు నన్వయము.

పదాన్వయమెట్లున్నను పురాణయుగమున, నారదస్థానము అతిప్రధానము, అద్భుతము, అసమానముగూడనై యున్నది. అతని అద్భుత కార్యనిర్వహణము ననుసరించి, హరియొక్క 21 అవతారములైన (1) కౌమారుడు (2) యజ్ఞేశుడు(3) నారదుడు

91. *Sri K. S. Ramaswami Sastri : A Seminar of Saints, p 17*

(4) నరనారాయణులు (5) కపిలుడు (6) కుమారుడు (7) యజ్ఞుడు (8) ఋషభుడు (9) పృథుచక్రవర్తి (10) మీనావతారము (11) కూర్మము (12) ధన్వంతరి (13) మోహిని (14) నరసింహుడు (15) వామనుడు (16) భార్గవుడు (17) వ్యాసుడు (18) రాముడు (19) రామకృష్ణులు (20) బుద్ధుడు (21) కల్కి, నాబడు ఏక వింశతి అవతారములలో స్థానమును సంపాదించి, 'తృతీయమృషిసర్గం వై దేవర్షిత్వముపేత్య సః। తంత్రం సాత్వతమాచష్ట నైష్కర్మ్యం కర్మణాం యతః॥' (1-3-8) మూడవ సర్గమున, నారదుడను దేవర్షియై, కర్మనిర్మోచకమైన సాత్వతము నాబడు వైష్ణవ తంత్రమును వెలువరించె నను భాగవత ప్రమాణము ననుసరించి, కీర్తి నార్జించి, వైష్ణవ సిద్ధాంత సంస్థాపకాచార్యస్థానము నలంకరించినట్లు ద్యోతకము. 'మరీచి మత్ర్యంగిరసౌ పులస్త్యం పులహం క్రతుం। ప్రచేతసం వసిష్ఠం చ భృగుం నారదమేవ చ॥' (1-35) అను మనుధర్మ శాస్త్రప్రకారము నారదుడు, పదుగురు ప్రజాపతులలోగూడ నుండ నధికారము సంపాదించి, విరాట్టునుండి తత్త్వశాస్త్రమును గ్రహించెను. అతని అసాధారణ ప్రజ్ఞావిశేషముచే దేవ దానవ మానవులలో నొక్కడైన విరోధిలేక, He is a true messenger of the spirit, and his message is one of love and peace. His purpose is to quicken the process of evolution in right direction [92] అతడొక ఆధ్యాత్మికవిద్యా సందేశహరుడు. అతని సందేశము ప్రేమశాంతులు. సక్రమవిధాన పరిణామ పద్ధతిని త్వరితము సేయుటయే అతని సంకల్పము అని శ్రీదానందస్వామియొక్క చక్కని నిర్వచనము. The end and finale of every mission of his consists in

the promotion of good and maintenance of peace [92] సత్యాభివృద్ధియు శాంతి పోషణముతే అతని సర్వకార్యములలో ప్రముఖము, పర్యవసానముగ నుండును. అతనికి సంఘమున నెట్టి భేదములు గానుపింపవు. పిన్న పెద్దల, ధనిక దరిద్రుల, దేవ దానవుల, ప్రజల చక్రవర్తుల నేకదృష్టి గాంచి, వారి పారమార్థిక పరిణామమును రూపొందించునట్టి, ప్రజ్ఞాశాలి నారదమహర్షి. అతని అసంఖ్యాక కార్యములు పురాణముల పరివ్యాప్తము. అందు గొన్నింటిమాత్రము గాంచెదముగాక!

నారదుడు పూర్వజన్మవృత్తాంతమును, స్వముఖతః వ్యాసునికి జెప్పుట భాగవతమున (1-6-1) వివరముగ గాంచనగును. అటుపిమ్మట జన్మమున బ్రహ్మమానస పుత్రుడై, ప్రజాపతి దశకములో నొకడుగ, నారదుడు జన్మించెను. అజేయమైన జ్ఞాన శక్తి సంపన్నుడై యతడు, సామాన్య ప్రజానీకమును భక్తి మార్గమునకు ద్రిప్పుచు, దేశముల దిరుగుచునుండెను. అట్లు గ్రుమ్మరుచు, దక్షప్రజాపతియొక్క పుత్రులైన పదివేలమంది హర్యశ్వులనువారల, భక్తిమార్గమునకు ద్రిప్పి, దక్షుని సంకల్పమగు ప్రజాభివృద్ధి నరికట్టెను. మరల దక్షుని వేయిమంది సుతులు, సబలాశ్వులు అనువారలగూడ మతాంతరుల గావించెను. అంత దక్షుడు కుపితుడై, 'స్థిరముగానక త్రిలోకముల నెల్ల కాలముల దిరుగుచుండువుగాక' అని నారదుని శపించెను. అది నైజమున వరప్రదానముగనే నారదునకు పరిణమించెను. యథేచ్ఛ సర్వత్ర, సర్వకాలముల పర్యటించు శక్తిసామర్థ్యములు దీన నేర్పడి, అధిక సంఖ్యాకులకు అతడుపయుక్తుడై వెలుగొందగలిగెను.

---

92. *Swami Sridananda: Vedanta Kesari, p. 423, 1957.*

పూర్వము వచింపబడినరీతి, సర్వశాస్త్ర పారంగతుడై, పురాణముల రచించుటయేగాక, వేదములగూడ విభజించి, ప్రఖ్యాతుడైన వ్యాసభగవానుని వ్యాకుల చిత్తమును జూచి, విస్మయము నొంది, కారణము నారసి, భాగవత మహాగ్రంథ రచనమునకు అతని నారదుడు ప్రోత్సహించెను. అటులే, వల్మీకమున దపంబొనరించుచున్న వాల్మీకి మహర్షికి తారకమంత్రోపదేశము గావించి, శ్రీరామాయణ కథా కథనమునకు గారణముగ గూడ నయ్యెను. మరియు లీలావతి గర్భస్థుడైన ప్రహ్లాదునకు అష్టాక్షరీ మహామంత్రోపదేశము గావించి, అతని మహాభక్త శిఖామణిగ రూపొందించి, హిరణ్యకశిపును నశింపజేయుటయేకాక భక్తి శక్తిని జాటెను. మరియు వ్యాససుతుడైన శుకునకు, విరక్తి మార్గోపదేశము గావించి, తీవ్రతపంబునకు బురిగొల్పి, లింగభేదాతీతునిగ గావించి, కృతకృత్యునిగ నిర్మించిన ఘనతయు నారదునికే గలిగెను (శాంతి పర్వము. 329—). ధ్రువుని చింతను గ్రహించి, ధర్మోపదేశంబు గావించి, అచంచల తపస్సంపన్నుని నొనరించి, అతని ధ్రువతారగ రూపొందించు అవకాశముగూడ నారదునికి కలిగెను (భాగవత - 4-8-42). ఈ విధముగ, బురాణేతిహాస గ్రంథముల, నారదుని ఆచార్యత్వములసంఖ్యాకములై, యొప్పారి, ఆ మహర్షిచంద్రుని అద్వితీయ జ్ఞానశక్తికై ఆశ్చర్యము పుట్టొందును.

పై విధముగ నుపదేష్ట యగుటయేగాక, అవసర సమయముల నారదమహర్షి శిష్యత్వమునుగూడ వహించి, విద్య నార్జించెను. సర్వవిద్యాపారంగతుడై, దేవర్షి సత్తముడై యున్నను

ఆత్మశాంతి గానక, నందులకు హేతువు నర్థించి, బ్రహ్మమానసపుత్రు డైన సనత్కుమారులవలన ప్రాణవిద్యను గ్రహించి, శాంతి బొంది నట్లు ఛాందోగ్యను తెల్పుచున్నది (1-2). అదేవిధముగ నతడు శ్వేత ద్వీపమునకరిగి, శ్రీమన్నారాయణ దర్శన మహాభాగ్యము బొంది, శ్రీమన్నారాయణ ముఖసంజనిత అమృతమగు పాంచ రాత్రమును స్వీకరించి ధన్యుడయ్యెను అటులే బదరికాశ్రమ వాసు లైన శ్రీనారాయణాంశ సంభూతులైన, నర నారాయణ దివ్యర్షుల జేరి, ఆశ్రయించి, పాంచరాత్ర వివరముల గ్రహించెను.

ఈవిధముగ దేవర్షిచంద్రుడైన నారదుడు, అద్భుతలీల విద్య నార్జించి, తపంబొనరించి, అనుభవము సాధించి, అనేకులకుపదే శించి, చరితార్థుల గావించి, సహస్రాధికుల జ్ఞానమార్గ గాములనుగ గావించి, అట్లు స్వాధీనము గానివారి నెట్టులైన సాధించి, వారి యజ్ఞానమును బాపి, సత్ప్రవర్తనుల గావించుట, గ్రంథముల విశే షముగ గాననగును. అతడొక జ్ఞానశక్తి స్వరూపము, అజ్ఞానాంధ కార విచ్ఛేదక మహాజ్యోతి, అద్భుతవ్యక్తి, మహాశక్తి. ఆ మహర్షి చంద్రునకు సర్వముముక్షుకోటియు, బహుధా ఋణపడియున్నారు. అతనికి సహస్రాధిక నమోవాకములు.

కేవలము, జ్ఞానప్రబోధ వాగ్రూపమున గావించి, తృప్తి నొందుటయుమాత్రముగాక, ఆ మహర్షి రచించినట్లు కొన్ని గ్రంథరాజములు గలవు. నారద భక్తి సూత్రములు, నారద పాంచరాత్రము, నారద పరివ్రాజకోపనిషత్తు, నారద స్మృతులు అను నాలుగు అతని కర్తృత్వముగ బ్రఖ్యాతము. అందు భక్తి సూత్రములు, పాంచరాత్రము, భక్తి వైష్ణవములు బోధింప, పరి

వ్రాజకోపనిషత్తు సన్న్యాస విధానముల, వివరముల నియమిం చును. స్మృతి యొక ధర్మశాస్త్రము. తన గానముచేతను, కీర్తన ములచేతను, ప్రబోధచేతను, రచనలచేతను, నాటి సంఘమును సురూపితలూగించిన మహావ్యక్తి మహర్షి నారదుడని విదితము. అట్లులని అతడు, భక్తి సిద్ధాంతమున, ప్రథమాచార్యుడుగాడని విదితము. కాని అతడు ఒక అపూర్వ మహాచార్యుడు. భక్తిమార్గము, వేదములంతటి అతి ప్రాచీనము. దాన వ్యక్తమైయున్న భక్తి విశేషముల నీ మహర్షి సత్త్వములు, పౌరాణిక పద్ధతి రూపొందించి, ప్రజాబాహుళ్యమునకు నుపయుక్తమగురీతి ప్రబోధించిరి. అందు నారదమహర్షి ప్రఖ్యాతుడు.

నారదుని గ్రంథముల నన్నింటి నిచట సమీక్షించుట సౌరభ సంకల్పము కాదు. అట్లు గావించుట, ఒక మహాగ్రంథ రచనమే. కాన ముఖ్యముగ, భక్తిసూత్రముల నిసుమింత సింహావలోకనము గావించెదముగాక!

నారదభక్తిసూత్ర కాలమునుగూర్చియు, కర్తృత్వమును గూర్చియు, ననేక భేదాభిప్రాయములు గలవు. నారదుడో, నారదునివంటివాడో రచించి యుండుననని, త్యాగీశానందస్వామి అభిప్రాయము. [93] రచయితయొక్క జీవితానుభవముల ప్రద ర్శనమే, యీ సూత్ర గ్రంథమనియు నాతని భావము. క్రీ. వె. 12వ శతాబ్దమున నెవరో రచించి, ప్రఖ్యాతుడైన నారదునికంటగట్టి రనియు గొందరందురు. [93] ఈ అభిప్రాయమునే పండిత రాధా

---

3. *Swami Tyagisananda: Vedanta Kesari,* *p. 113, 1937*

కృష్ణుడు, The Narada Sutras and the Sandilya Sutras are latter than the Mahabharata and the Bhagavata since the the former mentions Suka and Vyasa (N. S. 83) and the latter quotes freely from the Bhagavatgita [94] నారద, శాండిల్య సూత్రములు, మహాభారత, భాగవతములకు దర్వాత గ్రంథములు. అందు నారదసూత్రములు శుక వ్యాసుల ప్రస్తావింప, శాండిల్య సూత్రములు భగవద్గీతనుండి విరివిగా ప్రమాణముల గైకొనును అని స్పష్టపరచెను. అట్లుగాక, భాగవత రచనమునకు నిది, పూర్వగ్రంథముగ గొందరి అభిప్రాయము. [95]

## భక్తి సూత్రములు

ఈ గ్రంథము 84 సూత్రముల గలిగియున్నది. మొదటి 24 సూత్రములు భక్తిని వివరించును; ఆట 9 అనగా 25-33 వరకు కర్మ జ్ఞానయోగములకంటె నెట్లు భక్తిమార్గముత్తమమో తెలుపును. పిమ్మట 17 సూత్రములు, 34-50 వరకు భక్తిసాధన విధానముల బోధించును. అంత 51-66 అనగా 16 సూత్రములు, భక్తుని ప్రత్యక్ష భక్తిలక్షణముల జూపించును. కడపటి 18 సూత్రములు మహాభక్తుల స్తుతించును. మరల నీ గ్రంథము పంచాధ్యాయములుగ విభజింపబడి, మొదటి 24 సూత్రములు ప్రథమాధ్యాయముగను, 33 వ సూత్రమువరకు ద్వితీయాధ్యాయముగను,

---

94. *Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol. p 490*

95. *Sri N. Chandrasekhara Aiyer: Prabuddha Bharata, p. 499, 1955*

దర్వాత 50 వ సూత్రమువరకు ద్రుతీయముగను, అట 66 వ సూత్రమువరకు జతుర్థముగను, నంత 84 వరకు పంచమాధ్యాయముగ వెలుగొందును.

నారదదేవర్షి, యీ గ్రంథమును భక్తి ప్రచారార్థము నిర్మించి యుండుటచే, నిందు భక్తి విషయముల సమగ్రముగ వివరించినట్లు సువిదితము. 'అథాతో భక్తిం వ్యాఖ్యాస్యామః' (1) భగవద్భక్తి సాధించుటకై తగు అధికారము సంపాదించిన పిమ్మట, సర్వేతర మార్గములకంటె భక్తి విధానము ఉత్కృష్టము కావున, దీని వివరించెదముగాక అని, భక్తివివరణమును ప్రారంభించెను. దాని స్వరూప నిర్వచనమును రెండవ సూత్రమున 'సా త్వస్మిన్ పరమప్రేమరూపా' (2) ఆ భక్తి భగవంతునియందు, ఉత్తమమైన ప్రేమరూపముగా నుండును. మరియు నా భక్తి 'అమృతస్వరూపా చ' (3) అమృత రూపముగగూడనై యున్నది. దాని మూలమున వికారరహితమైన పరమానందము, ముక్తియు సాధ్యముగాన, నది అమృత స్వరూపమని వివరణము ఆ భక్తిని బొందగా 'యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవతి, అమృతో భవతి, తృప్తో భవతి' (4) పురుషుడు సిద్ధుడును, అమృతుడును, తృప్తుడును అగును అని నాలుగవ సూత్రము, భక్తి ఫలితమునుగూడ సూచించి, వాగ్దానమొసగుచున్నది. అటులే, భక్తి ఫలితముల 5, 6 సూత్రములగూడ సూచించి, అట్టి తృప్తుడైన భక్తుడు దేనిని గోరడనియు, దుఃఖింపడనియు, రాగద్వేషముల బొందడనియు, అట్టివాడు మత్తుడై, స్తబ్ధుడై, ఆత్మారాముడు నగును. అనగ బ్రపంచ వ్యవహారముల జిత్తమును బోనీయక, ఆత్మరతియందే మత్తుడై

యుండునని తాత్పర్యము. 'సా న కామాయమానా, నిరోధ రూపత్వాత్' (7) ఈ భక్తి లౌకిక ప్రేమమైన కామము కాదు అనియు, దద్వ్యతిరేకమనియు నీ సూత్రము హెచ్చరిక జేసినది. ఈ విషయము 14 వ సూత్రమువరకు వివరింపబడినది. నిరోధ పదమును వ్యాఖ్యానించుచు 8 వ సూత్రము, లౌకిక వైదిక వ్యాపారముల భగవంతునికర్పించుట యగునుగాని, వానితో నిరోధరూప సంతత వ్యతిరేకత గాదనియు బోధించును. నిరోధమనగా భగవంతునియందు అనన్య భక్తియు, వ్యతిరిక్త భావముల నుదాసీన భావనయుననియు (9), ననన్యత యన, భగవంతుడుగాక నన్యాశ్రయముల ద్యజించుట యగుననియు (10), నుదాసీనత యన భగవత్ప్రీతి కాకరములైన లౌకిక, వైదిక, కార్యాచరణత్వమనియు (11), దార్ఢ్యస్థితి భక్తునికి లభించినను, శాస్త్రోపదేశముల బాటింపవలయుననియు (12), అట్లు కాకున్నచో బతనమునకవకాశమున్నదనియు (13) హెచ్చరిక జేసినది. సాంఘిక నియమముల, శాస్త్ర వ్యవహారములవలె సాగించుచు, భోజనాది వ్యాపారముల శరీరమున్నంతవరకు బాటింపవలయునని (14) తెలిపినది. అంత 15-24 సూత్రమువరకు, వివిధ భక్తి నిర్వచనములు సూచింపబడెను. అందు పారశర్య, గర్గ, శాండిల్య, నారదాది మహర్షుల నిర్వచనా విధానములు చెప్పబడెను. అట్టి భక్తిసాధనకు ఆదర్శముగ గోపికలు చూపింపబడిరి (21). వారి భక్తి జ్ఞానపూర్వకమే యగును అని ప్రథమాధ్యాయము భక్తి నిర్వచన, ప్రయోజన, నిదర్శనములతో బూర్తిగాంచును.

రెండవ అధ్యాయము, పరాభక్తి ప్రాశస్త్యమును గూర్చిన వివరణముతో బ్రారంభము. 'సా తు కర్మజ్ఞాన యోగేభ్యోఽ వ్యధికతరా' (25) అది కర్మ, జ్ఞాన, యోగమార్గములకంటెగూడ నధికతరమని తాత్పర్యము. పరాభక్తి ఫలరూపమేయై యుండ, నితర యోగములు సాధనములుమాత్రము కాన, భక్తి శ్రేష్ఠమగు చున్నది (26). ఈ మార్గమునగల దైన్యభావమును పరమేశ్వరుడు మెచ్చునుగాని, ఇతర మార్గములగల యహంభావము నతడు ద్వేషించునుగదా (27)! కొందరు జ్ఞానము ముక్తి హేతువని యందురు (28). సర్వమార్గములు పరస్పరాపేక్షికములని కొందరి మతము (29). కాని భక్తి, స్వయంఫలరూప (30) మని నారదు వచనము. అందులకై నారదుడు మూడు దృష్టాంతములగూడ నొసంగెను (31). రాజపుత్రుడు అటవికుల మధ్య పెరిగి, తన స్థితి మరచునంతమాత్రమున నతడు రాజవంశజుడు కాడా? తన స్థితిని గ్రహించుకొనిన పిమ్మట, క్రొత్తగ రాజపుత్రత్వము అతనికి గలుగుటయు లేదు. అటులే సాధకుడు, అతని పారమార్థిక స్థితి నెరుంగకున్నను, అతని స్థితిలో నెట్టి వ్యత్యాసము గలుగదు, గ్రహించి ఆనందించును. యాత్రకు వెడలియున్న మనుజునకు స్వగృహము స్వగృహముగనే యుండును. తిరిగి అతడు అరుదెంచిన, నతనికది యథాపూర్వకముగనే యుండును. అటులే మానవుడు భగవంతునికి దాత్కాలికముగ దూరుడైనను, తిరిగి చేరుటతోడ యథాపూర్వ సుఖముల బొందును. మరియు క్షుధార్తుడు, భుజించి ఆనందము నొందుటగాక ఆ యానంద విరోధియైన ఆకలిబాధను నిర్మూలించుకొనును. ఈ మూడు ఉపమానముల నారదుడు సూచించి, భక్తివలన గలుగు ఆనందము

క మైనదేగాని, నూతనముగాద నిష్పష్టపరచెను.
న 'సైవగ్రాహ్యా ముముక్షుభిః' (33) వరా
ు స్వీకరింపవలయునని నారదుని యుద్బోధ.
యము, భక్తి సాధనముల బోధించినది.
గాత్యాగాత్ చ' (35) విషయముల ద్యజిం
మకార త్యాగముచేతను భక్తి సాధ్యపడును.
అనగా ఆరాధనాదికముచేగూడ నిది సాధ్యము
్రవణ, కీర్తనాదులచేగూడ సాధ్యము (37).
టకు మహాత్ముల కృపగాని, లేశమాత్రమైన
ాని అత్యవసరము (38). కాని అట్టి మహా
దుర్లభము (39). అయినను ఈశ్వర కృప
ంచును (40). అందుచే భగవంతునిపై ప్రేమ
ాధనముల గావింపవలెను (42). దానికై
్యజ్యము (43). అది కామ క్రోధ మోహ
ంశకారణము (44). కామాదులు ప్రథమతః
యు, కాలక్రమమున సముద్రములై దుర్ల
ఈ మాయ నధిగమింప సంగత్యాగము,
ము, నిర్మమములవసరములు (46). అట్టి
ు కావలయును. ఏకాంతవాసము, అహవర
త్రిగుణాతీతత్వము, లేనిదానికై యారా
రక్షణాకాంక్షలు లేకుండుటయు, పరవైరా
). కర్మఫలత్యాగము, స్వార్థకర్మత్యాగములు
ుల నతిక్రమించును. వైదిక కర్ములగూడ
ో వాడు, ఈశ్వరానుగ్రహమునకు పాత్రుడు.

అట్టివాడు 'స తరతి స తరతి, లోకాం స్తారయతి' (౫౦) తా దరించి, లోకమునుగూడ దరింపజేయును.

చతుర్థాధ్యాయము, భక్తి లక్షణములతో బ్రారంభము. 'అనిర్వచనీయ ప్రేమస్వరూపం' (౫౧) ప్రేమ యన అనిర్వచనీయము. మూగవాడనుభవించి జెప్పజాలని విధము ఇది. అనిర్వాచ్యము (౫౨). అధికారియందే యిది ప్రకాశించును (౫౩). ఈ పరమ ప్రేమ గుణరహితము, కామరహితము, ప్రవర్ధమానము, అవిచ్ఛిన్నము, అతిసూక్ష్మము, అనుభవరూపముగ నుండును (౫౪). దానిని బొంది, సర్వత్ర నా భగవంతునే గాంచును, అతనిగూర్చియే వినును, అతనిగూర్చియే ప్రసంగించును, అతనిగూర్చియే భావించుచుండును (౫౫). గుణవిభేదముచే నీ గౌణభక్తి త్రివిధము (౫౬). పరంపరరూప మున నివి ఉత్తమోత్తమములు (౫౭). ఈ గౌణభక్తి, పరాభక్తికంటే సులభతరము. భక్తి అన్యమార్గముల కంటె సులభము. దానికి అన్యప్రమాణములనావశ్యకము. అది స్వయంప్రమాణ రూపము (౫౯). మరియు నది శాంతిరూపము, పరమానంద రూపము (౬౦). లౌకిక, వైదిక వ్యవహారముల భగవంతునికిభక్తుడు సమర్పించియుండుటచే, నతనికి ఏ చింతయు నభావము (౬౧). అందుచే నతడు, లౌకిక వ్యవహారములకు విముఖుడు గావలసిన అగత్యముగూడ లేదు. వాని ఫలముల నీశ్వరునికి సమర్పించునుగదా! (౬౨). 'స్త్రీ ధన నాస్తిక చరిత్రం న శ్రవణీయం' (౬౩) స్త్రీ ధన నాస్తిక విషయముల వినరాదు. సర్వవ్యవహారముల భగవంతునికర్పించి, కామక్రోధాది ప్రవృత్తుల గూడ నాతనియందే చూపవలయును (౬౫) ఆ ప్రేమ నిర్వ్యాజ

ముగా నుండవలెను (66). ఈ విధముగా జతుర్థాధ్యాయము ముగియును.

ఇక బంచమాధ్యాయము, 'భక్తా ఏకాంతినో ముఖ్యాః' (67) ప్రేమకొరకు భగవంతుని ఎవరు ప్రేమించెదరో, వారు ఏకాంత భక్తులను సూత్రముతో భక్తిమహిమను జాటుచున్నది. ఏకాగ్రబుద్ధి భగవంతుని బ్రేమించువారు ముఖ్యులు (67). గద్గదకంఠులై, పుల కాంకిత శరీరులై అశ్రుధారలతో వారు, తమ కులమును, ప్రపంచ మునుగూడ, పవిత్రమొనరించెదరు (68). వారు ఈశ్వరతన్మయత్వ మున నుందురు (69). అట్టి ముఖ్యభక్తులు తీర్థములకు తీర్థత్వము, కర్మములకు సుకర్మత్వము, శాస్త్రములకు శ్రేష్ఠత్వము గలిగించెదరు (70). వారిని జూచి పితరులు అనందించెదరు. దేవతలు మోదమును గాంచెదరు, భూమియు రక్షకుని గాంచును (71). అతనికి జాతి, వర్ణాదిక విభేదము శూన్యము (72). అందరును సమానులే (73). ఇక వాదోపవాదములకవసరముగూడ గానము (74). కాని పరమాత్మ యొక్కటియై యున్నను, వివిధముగ దాని గాంచుట సాధారణము (75). అందుచేత 'భక్తి శాస్త్రాణి మన నీయాని తదుద్బోధక కర్మాణి కరణీయాని' (76) భగవంతుని గూర్చి భక్తిశాస్త్రముల దెలుపు శాస్త్రముల విమర్శించి మననము జేయుచుండవలెను. అట్టి భక్తి ప్రబోధక కర్మలగూడ నాచరింప వలెను. క్షణకాలముగూడ వ్యర్థము గావింపక, భక్తి సాధింప వలయును (77). అందులకు 'అహింసా సత్య శౌచదయాస్తిక్యాది చారిత్ర్యాణి పరిపాలనీయాణి' (78) అహింసాదులు సాధనములు. 'సర్వదా సర్వభావేన నిశ్చింతైః భగవానేవ భజనీయః' (79)

నిశ్చింతతో సర్వదా, సర్వథా, భగవానుని భజింపవలయును. అట్లు కీర్తింపగా, భగవంతుడు భక్తుల గృపజేయును (80). ముమ్మాటికిని 'భక్తిరేవ గరీయసీ, భక్తిరేవ గరీయసీ' (81) భక్తియే ఉత్తమము, భక్తియే ఉత్కృష్టము. ఈ భక్తి పూర్వోక్తరీతి ఏకరూపమై యున్నను, (1) భగవత్కళ్యాణ గుణాభివర్ణనము, (2) భగవద్దివ్యమంగళ విగ్రహానురాగము, (3) భగవత్పూజ, (4) సంస్మరణము (5) సేవ (6) సఖ్యము (7) వాత్సల్యము (8) మధురము (9) ప్రపత్తి (10) తన్మయత్వము (11) విరహము నా విధముగ ఏకాదశ విధానములై యొప్పారినవి. ఈ భక్తిశాస్త్ర ప్రచారమున కుమార, వ్యాస, శుక, శాండిల్య, గర్గ, విష్ణు, కౌండిన్య, శేష, ఉద్ధవ, ఆరుణి, బలి, హనుమంత, విభీషణాది మహాత్ములు ప్రఖ్యాతులు.

ఈ విధముగ, నారద ప్రోక్త భక్తిసూత్రములు భక్తిని వివరించి, ప్రచారము గావించియున్నవి. ఇటులే, నారద పాంచ రాత్రముగూడ నతి ప్రముఖమై, వైష్ణవమును బోధించుచు, వైష్ణవ నియమావళి మొదలైన, ఆచరణ విధానమును బోధించును. దానిగూడ గాంచెదముగాక!

## పాంచరాత్రము

Pancharatra is one of the most interesting and living theisms in the world and in a pregnant sense the most complete and satisfying theism [96] ప్రపంచములో, పాంచ

---

6. *Dr, K, C, Varadachari : Aradhana, p 42, 1955*

రాత్రము సజీవమై, మనోహరమైన ఆస్తిక మతములలో నొక్కటిగ నున్నది. విశేషార్థదృష్టి గాంచినచో నది పరిపూర్ణమై, సంతృప్తికర మైన మతము. దాని ప్రస్తావన మహాభారత శాంతిపర్వమున జేయ బడి, సాత్వత, పాంచరాత్రముగ వివరింపబడినది. The system appears to be thoroughly Vedic in origin and in thought [97] అది జనన, విషయముల సంపూర్ణముగ వైదికము. ఆచార్య బలదేవ ఉపాధ్యాయుని భావమున, The Pancharatra school of Vishnavism has, for many long centuries exerted a tramendous influence upon the religious, social, and cultural life of India. In fact, its influence has been so pervading and enduring that there hardly exists an aspect of Indian life which doesnot present an indisputable illustration of its impact upon its development [98] భారతీయ మత, సాంఘిక, సాంస్కృతిక జీవితముపై, వైష్ణవ పాంచరాత్ర సిద్ధాంతము, అద్భుత ప్రభావమును జూపినది. యథార్థమున, దాని ప్రభావము సోకి, అభివృద్ధి గాంచని నిరాక్షేప మైన ఉదాహరణము హిందూ జీవనమున లేదు. కాని దాని ప్రభా వము సర్వవ్యాప్తము, సుస్థిరము, అనియు ఆచార్య బలదేవుని వాదము. మరియు నీ పాంచరాత్ర ప్రశస్తిని, మహాభారతము ఉగ్గడించుచు, 'సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా।జ్ఞానాన్యేతాని రాజర్షే విద్ధి నానామతాని వై ః' (శాంతి. 349.64) అను వివిధ మతములు గలవనియు, అవి కపిల, హిరణ్యగర్భ,

97. *Prof. Baladeva Upadhyaya : Prabuddha Bharata: p 291, 195Y*

98. *Prof. Baladeva Upadhyaya: Prabuddha Bharata, p 289, 1952*

అపాంతరతమ, ఉమాపతులచే నిర్మితములనియు వచించి, 'పాంచ రాత్రస్య కృత్స్నస్య వేత్తాతు భగవాన్ స్వయం' (శాంతి. 349.68) పాంచరాత్రమునకు నిర్మాత స్వయముగా భగవానుడే యౌట, దీని ప్రాశస్త్యమని నుతించినది. అంతియగాక, 'ఏవమేకం సాంఖ్య యోగం వేదారణ్యకమేవ చ। పరస్పరాంగాన్యేతాని పాంచరాత్రం తు కథ్యతే॥' (శాంతి 349.82) సాంఖ్యము, యోగము, వేదము, వేదాంతము అను నాలుగు, ఒకే తత్త్వమును ప్రతిపాదించు సందర్భమున, పరస్పర సహాయమును గోరుచున్నవి. కాని ఈ శాస్త్రములు అన్నియు, పరస్పరాంగములుగా జేరిన ఏకైక శాస్త్రమునకే, పాంచరాత్రము అని పేరు. ఈ పాంచరాత్రము శైవ, యోగ, సాంఖ్య, బౌద్ధ, అర్హతాది పంచవిధ మతముల రూపు నడంచినదగుటచే, నిది పాంచరాత్రము నాబడినట్లు పద్మసంహిత నిర్వచనము. అనగా నీ పంచ మతముల రాత్రి, చీకటివలె తేజో రహితముగ నొనర్చినది అని తాత్పర్యము. కాని యీ వ్యుత్పత్తి fanciful అని శ్రీనివాస అయ్యంగారు కొట్టివేసెను.[99] మహాభారతము దీనినింకను గొనియాడుచు, 'ఇదం మహోపనిషదం చతుర్వేదసమన్వితం' (111) 'నారాయణ ముఖోద్గీతం నారదోఽ శ్రావయత్పునః' (శాంతి. 339.112) అది చతుర్వేద సంయుక్తమైన మహోపనిషత్తు అనియు, నది శ్రీమన్నారాయణ ముఖ జనితమై, మరల నారదునుండి బహిర్గతమనియు వచించెను. 'ఇదం శతసహస్రాద్ధి భారతాఖ్యాతవిస్తరాత్। ఆవిధ్యమతిమంథానం

99. *Sri V. T. Srinivasa Iyangar : Outlines of Hindu Philosophy, p 176.*

దధ్నోఘృతమివోద్ధృతః॥' పెరుగును కవ్వముతో జిలికి, దాని నుండి ఘృతమును దీయునట్లు, నీ పాంచరాత్ర తంత్రము, నూరువేల శ్లోకములచేగూడిన మహాభారతమునుండి, బుద్ధి యను కవ్వముతో దీయబడిన సారము. 'నవనీతం యథా దధ్నో ద్విపదాం బ్రాహ్మణో యథా। ఆరణ్యకం చ వేదేభ్యః ఓషధిభ్యో యథాఽమృతం॥' పెరుగునుండి వెన్న సారమైన చందము, మనుష్య జాతికి బ్రాహ్మణుడు సారభూతుడైనట్లు, ఆరణ్యకములు వేదమునకు సారమైనరీతి, సర్వౌషధముల నమృతము సారమగుచందము, పాంచరాత్రము మహాభారతమునుండి తీయబడిన సారము అనియు బాంచరాత్రము స్తుతింపబడినది (శ్రీ. భా. 2.2.42) మరియు 'పాంచరాత్రవిదో యే తు యథా క్రమవరా నృప। ఏకాంతభావోపగతాస్తే హరిం ప్రవిశంతి వై॥' (శాంతి. 349-72) యథాక్రమపరులై, పాంచరాత్ర విదులైనవారు, ఏకాంత భావమును బొందగా, హరిని ప్రవేశించెదరు అని పాంచరాత్ర మతావలంబన ప్రయోజనమునుగూడ, మహాభారతము ప్రకటించినది. ఈ విధముగ నీ పాంచరాత్ర విధానము అతి ప్రముఖమై, ప్రాచీన కాలము నుండి ప్రఖ్యాతి నార్జించి, సర్వోపయుక్తముగ బ్రకాశించియున్నదని విదితము.

పాంచరాత్ర శబ్ద వ్యుత్పత్తి వివిధమై, సందేహాస్పదమై యున్నది. 'పాంచరాత్రం నామ, పంచరాత్రియంతే యస్మిన్ శాస్త్రే తత్ పాంచరాత్రం' ఏ శాస్త్రముచేత నైదు అదృశ్యము లగునో, అది పాంచరాత్రము. లేక 'యస్య దేహినః మహాభూత

గుణాః శబ్ద స్పర్శ రూప రస గంధాత్మికాః పంచ సంఖ్యానాః రాత్రి యంతే ఇతి వా పాంచరాత్రిం' దేనిచేత, దేహమునగల మహా భూత సంబంధములైన జ్ఞానేంద్రియ ప్రవృత్తులు అయిదును అణగిపోవునో, అది పాంచరాత్రము. అనగా, పాంచభౌతిక వికార జన్యములగు శబ్దాది గంధపర్యంత విషయ సుఖభోగములనుండి మానవుని విముఖుని జేసి, భగవత్సేవలో నిమగ్నుని గావించు శాస్త్రమే పాంచరాత్రశాస్త్రమని గ్రాహ్యము. చతుర్ముఖునకు సృష్టి ప్రబంధరచనా కౌశలము లభించుటకు, వేదార్థమును సరహస్యముగ పంచరాత్రులు శ్రీమన్నారాయణుడుపదేశించుటచే, దీని పాంచరాత్ర మందురు అనియు అన్వయము. కాక, పూర్వము తెలిపియున్నట్లు, శైవాది జైనపర్యంత పంచ మతములు, గళాహీనమొనర్చ యుండుటచే పాంచరాత్రము అగును. మరియు 'రాత్రి శబ్దస్య జ్ఞానమర్థః రాత్రం చ జ్ఞానవచనం జ్ఞానం పంచ విధం స్మృతం పరమతత్త్వం ముక్తిః భుక్తిః యోగః విషయశ్చేతి పంచానాం నిరూపణేనాస్య తంత్రస్య పాంచరాత్రేతా ప్రసిద్ధా' రాత్రమనగా జ్ఞానము. జ్ఞానము పంచ విధముగ నున్నది. పరతత్త్వము ముక్తి భుక్తి యోగము విషయములనునవి జ్ఞానములు. ఈ పంచ జ్ఞానములనిరూపించు తంత్రము పాంచరాత్రముగ ప్రసిద్ధము అని పలు విధములుగ వ్యుత్పత్తులు గోచరము, a system connected with five nights [100] అయిదు రాత్రములతో సంబంధము గలదిగాన పాంచరాత్రము అనుట స్పష్టార్థము. పంచ రాత్రముల నారాయ

---

100. *Prof. Baladeva Upadhyaya: Prabhudha Bharata, p. 250, 1952*

శాండిల్య, ఔపగాయన, మౌంజాయన, కౌశిక, భారద్వాజ
పంచ మహర్షులకుపదేశించి యుండుటచే పాంచరాత్రమని
రసంహితా పాఠము. నారద పాంచరాత్ర గ్రంథము,
ర్బుధ్న్య సంహితయు, రాత్రి శబ్దమునకు జ్ఞానమను
యము నొనంగి యున్నవి. ఈ వివిధ రూపములైన అర్థ
ు, అన్వయార్థములై and proves that it originated in an
of hoary antiquity whose traditons have become lost
he later generations [100] పాంచరాత్రమతి ప్రాచీనకాల
కమై, దాని సంప్రదాయము తర్వాత ప్రజానీకమునకు అదృ
ము అని బలదేవ పండితుని తీర్మానము. శతపథ బ్రాహ్మణమున
ంపబడిన పంచరాత్ర సత్రియాగము, యీ సిద్ధాంతమునకు
రమై, నామకరణమై యుండునని వ్యక్తము. అదియే, యథా
ై యుండునని దోచెడిని.

దీనికి తంత్రము, అగమము, ఏకాయనము, ప్రకృతి,
ము, మూలవేదము, సాత్త్వవిధి, భాగవతశాస్త్రము, మహోపని
స్త్ర, ఏకాయన శ్రుతి మొదలుగాగల నామాంతరములసంఖ్యా
ులు.

ఈ పాంచరాత్రాగమ జననము, ఋగ్వేదీయ పురుష
ూక్తము (10-90) నకు జేరి, శతపథ బ్రాహ్మణమున (13-6-1),
హస్రశీర్షం దేవం విశ్వాక్షం.... విశ్వాత్మానం పరాయణం'
ుదలగు మంత్రములతోనున్న నారాయణ సూక్తమునకు సూచిం

---

00. Prof. Baladeva Upadhayaya: Prabhudha Bharata. p 250, 1952

చును. నారాయణుడు సృష్ట్యాదిన, వైదికమైన పాంచరాత్ర సత్రయాగము నాచరించెను. సర్వేతర దేవతలకంటె తన యాధిక్యతను సంస్థాపించుకొనుటకే, అతని సంకల్పము. ఆ యాగ నిర్వహణ వివరములు (12-2-4) సూక్తమున, ఆ బ్రాహ్మణము వివరించినది. అంత పురుషసూక్తమున వివరింపబడిన విధమున నారాయణుడు, సర్వమునకాధారమై, సృష్టి స్థితి లయకారణమై, సర్వాధిక్యతను ప్రకటించుకొనెను. ఆ సూక్త రచయితగూడ నారాయణుడను మహర్షి యగుట గమనార్హము. అందుచేత, నీ పాంచరాత్రము అచటనుండి ప్రారంభమై యుండునోపును. ఆ విధానమును శ్రీమన్నారాయణుడు, శాండిల్యాది పంచ మహా ఋషీశ్వరులకు బోధింప, వారు దీని విరివిగ ప్రచారమొనరించి ఆచార్యులును గూడనైరి.

ఇంతకు పూర్వము సృష్ట్యాదిన శ్రీమన్నారాయణుడు, చతుర్ముఖునకు వేదము నుపదేశించుటయేగాక, ఆ వేదార్థమును 108 సంహితలరూపముగ బోధించెను. అదియే పాంచరాత్రాగమము నాబడినది. ఈ యుపదేశము శ్రీమన్నారాయణుడు, పంచరాత్రముల గావించి యుండెను. అందుచేతగూడ పాంచరాత్రము నాబడియున్నది. మరియు శ్రీమన్నారాయణుడు దీని పంచరాత్రముల, తన ఐదుగురు శిష్యులకు అనగా అనంత, (ఆదిశేష) గరుడ, విష్వక్సేన, రుద్ర, బ్రహ్మలకు, సృష్ట్యాదిన బోధించియుండుటచే దీనికానామము కలిగినదనియు వాకొనబడినది [101].

---

101. Dr. K. C. Varadachari: Aradhana, p 37, 1955

అంత మరల నీ పాంచరాత్రము, మహాభారత ప్రమాణము ననుసరించి, 'క్షీరోదధిరుత్తరతః శ్వేతదీప' మునకధినాథుడైన, పురుషోత్తముడైన నారాయణ మహాప్రభు సన్నిధానమున (శాంతి. 336-27), దేవర్షి నారదమునీంద్రుడు శ్రవణము గావించి, ప్రపంచ శ్రేయోకాంక్షచే మరల నారదునిచే, నర నారాయణ మహర్షియుగ్మ చరణసన్నిధి, బదరికాశ్రమమున తెలియబడి లోకమునకందీయ బడినది. ఇదియే సాత్త్వత (శాంతి. 348-24-84) నామమునగూడ వ్యవహారము. ఈ సాత్త్వతము, 'సాత్త్వతం విధిమాఖ్యాయ, ప్రాక్ సూర్యముఖ నిఃసృతం' (శాంతి. 335-19) పూర్వము సూర్యునిచే నుపదేశింప బడినట్లును వ్యక్తము. ఇది, మహాభారత మున శాంతిపర్వాంతర్గత మోక్షధర్మమున బహుళముగ వివ రింపబడి, కీర్తింపబడి, నారాయణీయమనియు బోధింపబడినది. ముముక్షులగు సాత్త్వికులకుపాదేయమగుటచే నిది సాత్త్వతమన బడెనని వచనము (శాంతి. 343-43).

ఈ శాస్త్రము 108 సంహితలతో గూడియున్నది. ఇవియు ద్వివిధములుగ, సాక్షాన్నారాయణ ముఖోద్గతములనియు, గాలాంతర ఋషి ప్రోక్తములనియు జెప్పనోపును. ఇవి విధి ప్రయోగరూపములుగ చెల్వొందును. పద్మతంత్రము మొదలైనవి మంత్రసిద్ధాంతముల నిరూపించును. 108 సంహితలలో బంచరత్న గౌరవము నార్జించినవి, (1) పద్మసంహిత (2) సనత్కుమార సంహిత (3) పరమసంహిత (4) పద్మోద్భవసంహిత (5) మహేంద్ర సంహితలుగ ప్రశస్తము. నవ రత్నములుగ మరియొక గణన పద్ధతియు గలదు. అందు (1) పౌష్కర సంహిత (2) వరాహ

సంహిత (3) బ్రహ్మసంహిత (4) సాత్త్వత సంహిత (5) అహిర్బుధ్న్యసంహిత (6) పరమేశ్వరసంహిత (7) పద్మసంహిత (8) ఈశ్వరసంహిత (9) జయాఖ్యసంహితలు పేర్కొనబడినవి. ఇందును, జయాఖ్యము అతి ప్రధానమని విజ్ఞుల అభిప్రాయము.

వీనియందు నానావిధ విషయములు, సందర్భానుసారముగ వివరింపబడియున్నవి. ఇందు వేదాంత, యోగ, పాక, శిల్ప, జ్యోతిషములు, మొదలైనవిగూడస్థానము నార్జించినవి. అయినను యిందు విష్ణ్వారాధనా విధానములు, ఆలయ, మంటప నిర్మాణములు, ఉత్సవ విశేషములు, విగ్రహమూర్తి, ప్రతిష్ఠావిధులు, యంత్రోద్ధరణము, మంత్రపురశ్చరణము, ప్రాయశ్చిత్తములు, శాంతి పౌష్టికకర్మలు, కామకర్మ సాధనములు మొదలైన అసంఖ్యాక ముఖ్య విషయములు విశదీకరింపబడియున్నవి. వీనికంగములుగ భూగోళ విజ్ఞానములు, రత్నపరీక్ష. శిలాపరీక్ష, భూపరీక్షలుగూడ చిత్రింపబడినవి.

అందుచే నీ పాంచరాత్రము వైష్ణవులకతిప్రధానమై, వారి జీవితముల సదా శాసించుచుండును. వైష్ణవమత దీక్షా స్వీకారము అనగా పంచ సంస్కారములు, ఆరాధనము, మంత్రానుష్ఠానము, పాంచరాత్రమునుండియే గ్రాహ్యము. అందుచే నిది ఆచార, అనుష్ఠాన, ఆరాధనముల బోధించు కల్పతరువై వెలుగొందును, వైష్ణవులకీ పాంచరాత్ర మహాశాస్త్రము. 'సృష్టిశ్చ ప్రళయశ్చైవ దేవతానాం తథార్చనం। సాధనం చైవ సర్వేషాం పురశ్చరణమేవ చ॥ షట్కర్మసాధనం చైవః ధ్యానయోగః చతుర్విధః। సప్తభిర్లక్షణైర్యుక్తం ఆగమం తద్విదుర్బుధా॥' (1) సృష్టి

క్రమము (2) ప్రళయ వర్ణనము (3) దేవతార్చనా విధానము (4) సర్వకామ్య సాధనా విధానములు (5) పురశ్చరణములు (6) వశ్యాకర్ష విద్వేష మారణ మోహన ఉచ్చాటనలను షట్కర్మ సాధనములు (7) చతుర్విధ ధ్యానయోగములు, అను సప్త లక్షణములు గల శాస్త్రముగాన దీని ఆగమము అని యందురు. ఈ యాగమములు 108, భాగవత, పాంచరాత్ర, సాత్త్వత విధులనుండి రూపొంది యుండునని శ్రీనివాస అయ్యంగారు తలంచును.[102] పండిత వరదాచారి వాక్యములలో నీ శాస్త్రము ప్రథమమున Jnana, yoga, kriya (construction of temples and images) and carya (doing religious and spiritual activities in connection with the service of God)[103] దేవాలయ విగ్రహ నిర్మాణ విధానములు అను జ్ఞాన యోగ క్రియా విషయములను, భగవత్సేవార్థమై తదనుగుణ కార్యములు నాబడు 'చర్య'యు గలిగి యుండెను. కాని ఒకటిన్నరకోటి శ్లోకములతోగూడిన యీ మహత్ శాస్త్రము, క్లుప్తపరచి సంహితములుగ విభజింపబడెను. ఆ సంహితలు సుమారు 210 గలవు. అందును, ప్రామాణికములు నారదీయ, మహా సనత్కుమార, జయాఖ్య, పరాశర, పద్మ, విష్ణుతిలక, భారద్వాజ, శ్రీ, ప్రశ్న, సాత్త్వత, బృహద్బ్రహ్మ, అహిర్బుధ్న్యలుగ అతని అభిప్రాయము. మరియు బ్రహ్మసంహితననుసరించి, పాంచరాత్ర విధి మంత్రసిద్ధాంత, ఆగమసిద్ధాంత, తంత్రసిద్ధాంత, తంత్రాంతర సిద్ధాంతములని చతుర్విధము.

---

102. *Sri V. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy, p. iv*

103. *Dr. K. C. Varadachari: Aradhana, p. 37, 1955*

అందు ప్రథమమున భగవంతు డేకమూర్తిగను, ద్వితీయ
నాలుగు రూపములగను, తృతీయమున దొమ్మిది రూపముల
చతుర్థమున నాలుగు, మూడు రూపములగను యుండును
సంహిత. 1-1-80-83). ఈ విధముగ నీ సంహితాశాస్త్రము
సమగ్రమై, పారమార్థిక విషయముల అసమమై యుండ
Today---the actual opinions and religious practice
the Hindus are taken entirely from the Agamas
బ్రస్తుతము, హిందువుల మతానుష్ఠానములు, అభిప్రాయమ
సంపూర్తిగ నాగమములనుండియే గ్రహింపబడియున్నవి.
సిద్ధాంతమున, నా పరమాత్మకు సృష్టి స్థితి లయాదిక శ
మాత్రమేగాక, నిగ్రహానుగ్రహములుగూడ గలిగి, 'పరిత్రాణ
సాధూనాం వినాశాయ చ దుష్కృతాం' అనుచందము రక్షణ
శక్తులుగూడ నున్నట్లు నమ్మకము.

మరియు నీ పాంచరాత్రము, చతుర్వ్యూహ సిద్ధాంతమ
విశ్వసించును. దీనిప్రకారము, పరమాత్మ యగు వాసుదే
నుండి, సంకర్షణరూప జీవోత్పత్తి జరిగెను. అంత నతనిను
ప్రద్యుమ్నరూప మనస్సు, అహంకారమనెడు అనిరుద్ధ
రుద్ధుడు జనితము. మహాభారతముగూడ 'యో వాసుదేవో భగవ
క్షేత్రజ్ఞో నిర్గుణాత్మకః జ్ఞేయః। స ఏవ రాజేంద్ర జీవః సంకర్ష
ప్రభుః॥ (40) సంకర్షణాచ్చ ప్రద్యుమ్నోఽనిరుద్ధస్తు సోఽహ
కారః స ఈశ్వరః॥' (శాంతి. 339-41) అని వచించినది. శ్రీమన
రాయణుడు పరమాత్మయై యుండ, అతని అద్భుతశక్తియై

104. *Sri V. T. Srinivasa Iyanger: Outlines of Hindu Philosophy, p.*

సహాయమున సర్వము నిర్వర్తించును. పై
వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ చతు
విభవ అంతర్యామి అర్చావతారములని పరిశుద్ధ
ముకృష్ణాది అవతారములు విభవములనబడును.
త పరమేశ్వర రూపము అంతర్యామి యన
ంచరాత్రానుగుణముగ నిర్మాణమై, ప్రతిష్ఠిత
అర్చామూర్తులనబడును. ఇవి అన్నియు
యములే యగును పరమాణువుడై యున్న
శక్తిచే బరమాత్మను బొందజాలడు. పరమాత్మ,
ద్దాని సంకల్పించి, పరిపూర్ణానుగ్రహవిశేషమున
ముపాశములనుండి ఉద్ధరించి, తన సన్నిధాన
దింపగా, జీవుడు ముక్తుడై, ఆనందము నను
పరమేశ్వరానుగ్రహమునే శక్తిపాతమని, యీ
ంగ వాకొనును. అందుచే జీవుడు ఆ పరమాత్మకు,
శరణాగతి బొందవలయును. దీనినే 'న్యాస'
ఈ విధముగ బాంచరాత్రము సర్వతోముఖమై,
కు గామధేనువై, వెలుగొందుచున్నది. దీని
ముందు గ్రంథమున జూచెదముగాక! 'ఇదం
ఇదం హితమనుత్తమం। ఋగ్యజుస్సామభి
సైస్తథా। భవిష్యతి ప్రమాణం వా ఏతదేవాను
- 2-2-42) ఈ పాంచరాత్ర తంత్రమే, సాంసా
ంచును. పరమ పావిత్ర్యమైన పరబ్రహ్మమును

బోధించునదియు నిదియే. ఇదియే మోక్షసాధనము. ఇది ఋగ్యజు స్సామాధర్వణ చతుర్వేదముల ననుసరించియున్నది. కాన నిదియే ప్రమాణము, అనుశాసనముగూడనగుగాక!

## మహాభారతము

మహాభారత గ్రంథము మొత్తమునకెట్లున్నను, శాంతి పర్వమునగల నారాయణీయ శాఖయు, భీష్మ పర్వమునగల భగవద్గీతా శాస్త్రమును, యీ పాంచరాత్రమునే బోధించునని వైష్ణవ సిద్ధాంతము. బదరికాశ్రమమున, నర నారాయణుల నారదుడు సందర్శించి, ఆట వారు గావించుచున్న తప యజ్ఞాది కార్యముల గాంచి, శ్రీమన్నారాయణాంశుడైన నారాయణమహర్షి అజ్ఞానివలె నట్లాచరించుటకచ్చెరువంది, నారదుడు ప్రశ్నింప, నా నారాయణ మహర్షినుండి, సర్వాధికమైన శ్రీమన్నారాయణుడు శ్వేతద్వీపమున గలడను వృత్తాంతము నెరింగి, ఆటకేగి, వాసుదేవ సిద్ధాంతముల నారదుడు గ్రహించెను. అందు, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అని రుద్ధరూప చతుర్వ్యూహముల గ్రహించెను. అట ఏకాంతికులు శ్వేత ద్వీపవాసులనియు, వారు చంద్రవర్చస్సు గలవారనియు, వాసుదేవ భక్తిపరులకే శ్రీమన్నారాయణ దర్శనభాగ్యము లభించు ననియుకూడ గ్రహించెను. ఆ యుపదేశ సందర్భమున నారాయణీయ, సాత్త్వత, ఏకాంతిక, భాగవత, పాంచరాత్రిక పదములు, ఒకే యర్థ పర్యాయ నామములవలె నుపయోగింపబడినవి. మహాభారత కాలమునకు వీనికేకత్వ ప్రతిపాదనమేర్పడియుండునుగాని, యింతః పూర్వము పరస్పరాన్యత్వములు గలవేమో అని తోచును. మరియు నిది, ఆర్య సంప్రదాయము కాదనియు, ననార్యమనియు గొందరి

వాదము.[105] దాని యర్చనా విధానమవైదికమనియు, చతుర్వ్యూహ సిద్ధాంతము, వేదముల నభావమనియు వాదించెదరు. కాని యామునాచార్యులు వీనినన్నింటి ఖండించి, పాంచరాత్రిక వైదికత్వమును స్థిరపరచెను. దీని ననుష్ఠించు సాత్త్వతులు అనార్యులని మనుస్మృతి వచనము (10-23). స్వాత్త్వత వంశమునకు జెందిన వాసుదేవకృష్ణు ఆర్యత్వము, మహాభారత భాగవతము లందనేక పర్యాయములు శంకింపబడుట విస్పష్టము. నారదుని శ్వేతద్వీప యాత్రయు, నందుగల చంద్రవర్చస్యులగు ప్రజానీకము యొక్క యునికియు గమనించి, కొందరు ఏకాయనవిధి క్రైస్తవ జన్యముగ భావించెదరు. అచ్చటి జనులు, ఏకేశ్వరోపాసకులగుట గమనార్హమని వారి తలంపు. కాని ఏకేశ్వరోపాసనము వేదములందుండుటయేగాక, ఛాందోగ్యమున, నారదుడు సనత్కుమారునకుదా గ్రహించిన విద్యలలో 'వాకో వాక్యమేకాయనం' (7-1-4) అనియు దెలిపియున్నాడు. అందుచే, నీ పాంచరాత్ర భక్తి విధానమునకు, క్రైస్తవమునకెట్టి సంబంధమును గానమని రాధాకృష్ణాది పండితబృందముయొక్కదృఢ భావము.[105] క్రైస్తవమునకు అనేక శతాబ్దములకు బూర్వమే, వాసుదేవ మతములు దేశమున గల్గుటకు పాణినీయ సూత్ర (4-3-98) ములే ప్రమాణమనియు, వీరి వాదము మరియు నీ భక్తి సిద్ధాంతము, క్రైస్తవమునకతి ప్రాచీనమనుటకు, అనేక ప్రమాణములును గలవు.

ఈ నారాయణీయమునగల పాంచరాత్రముగూడ, పరిత్యమము గాదనియు, నందు వైదిక భావములు గొన్ని చొప్పింప

105. *Dr. S, Radhakrishnan : Indian philosophy. Vol. I., p 498*

బడినవనియు, గొందరి అభిప్రాయము శతపథ బ్రాహ్మణమున గల వివరణము, పరిశుద్ధముగ వారి వాదము. ఎట్లైనను మహాభారతమున నది జొచ్చి, 'అష్టాదశపురాణానాం శ్రవణాత్ యత్ ఫలం భవేత్। తత్ ఫలం సమవాప్నోతి వైష్ణవో నాత్ర సంశయః॥' (18-6-97) అష్టాదశపురాణ శ్రవణముచే గలుగు ఏ ఫలము గలదో అది, వైష్ణవునకుగూడ సంప్రాప్తము అని మహాభారత గ్రంథ అంత్య శ్లోక తాత్పర్యమున, వైష్ణవముతోగూడ నేకమై, ప్రఖ్యాతమై, వెలుగొందుట గాంచనగును. నారాయణ, విష్ణు, వాసుదేవ పదములు మహాభారతమున, నొక యర్థమున బ్రయోగింపబడుటయు గాననగును ఈ విధముగ మహాభారతము, నారాయణీయ శాఖద్వారా పాంచరాత్ర సిద్ధాంతోత్పత్తి ప్రచారాభివృద్ధుల వివరించి, వైష్ణవమత గ్రంథమను నిర్ధారణము గావించుకొనినది. చివరి శ్లోకమున ఈ భావమును స్థిరపరచియున్నది.

## భగవద్గీత

వైష్ణవ సిద్ధాంతమునకు, భగవద్గీతగూడ అతిప్రధాన గ్రంథముగ బరిగణింపబడును. అంతియగాక, 'యతీనాం చాపి యో ధర్మః స తే పూర్వం నృపోత్తమ। కథితో హరిగీతాసు సమాస విధికల్పితః॥' (శాంతి. 348-53) యతులకుకూడ నేది ధర్మమో అది పూర్వము, హరిగీతలో సమాసవిధులతో బోధింపబడినది అనియు, 'ఏవమేష మహాధర్మః సతే పూర్వం నృపోత్తమ। కథితో హరిగీతాసు సమాసవిధికల్పితః॥' (శాంతి. 346-11) ఈ విధముగ నీ మహాధర్మము, పూర్వము హరిగీతలో సమాసవిధులతో ఉపదేశింపబడి

నది యనియు, మహా భారతమున వచింపబడినది. ఈ భావమును నిస్సంశయములీల స్పష్టపరచుచు, 'సముపోఢేష్వనీకేషు కురుపాండవయోర్మృధే। అర్జునే విమనస్కే చ గీతా భగవతాస్వయం॥' (శాంతి 348-8) కురుపాండవ యుద్ధకాలమున విమనస్కుడైన అర్జునునకు, భగవంతునిచే స్వయముగా నిది బోధింపబడినది అని తెలుపబడినది. దీనికి బూర్వ శ్లోకముల 'ఏకాంతినాం చ కా చర్యా' (7) 'గతి మేకాంతినాం' (6) ఏకాంతులయొక్క ఆచరణము, గతులు, భగవద్గీతా గ్రంథము బోధించినట్లు గాంచనగును. ఇట భగవద్గీత, హరిగీత నాబడియెను. ఈ విధముగ శాంతిపర్వము, రెండు సందర్భముల, గీతాశాస్త్ర తాత్పర్యము ఏకాంతికమగు భాగవత ధర్మమని రూఢిపరచినది. అందుచేతనే, of all the philosophical tracts in the Mahabharata the Bhagavat Gita is undoubtedly of the highest merit. It contains the earliest exposition of the philosophy of the Bhagavata cult, which later developed in to Vaishnavism [106]. మహా భారతములోని, తాత్త్విక విచారణా గ్రంథములన్నింటిలో, భగవద్గీత నిస్సందేహముగ సర్వోత్తమ ప్రాధాన్యముగలది. అది, తర్వాత వైష్ణవముగ బరిణమించిన, నతి ప్రాచీన భాగవత సిద్ధాంత వివరణముల గలిగియున్నది అని, ఆచార్య రాధాకుముద ముఖర్జీ, తన అభిప్రాయముగ దెలిపియున్నాడు.

అందుచే, మహాభారత నారాయణీయము, భాగవత పురాణములతో సహా యీ గీతాశాస్త్రము, భాగవత సిద్ధాంత ప్రతిపాదన

---

106. Dr. Radhakumud Mukharjee : History and Culture of the Iudian People, p 249

మున నతి ప్రాధాన్యము నొందియున్నది. సర్కారు పండితుని అభిప్రాయమునగూడ, The earliest and the best exposition of the doctrine of the Bhagavata sect founded by Vasudeva-Krishna is to be found in the Bhagavat Gita, which has been incorporated in the Mahabharata [107] వాసుదేవ కృష్ణునిచే నెలకొల్పబడిన, మహాభారతమున చేర్పబడిన, భాగవత సిద్ధాంతముయొక్క ప్రాచీనత్వమును, ఉత్తమమును అయిన వివరణము భగవద్గీతాశాస్త్రమున గలదని వాకొనబడెను. గీతాశాస్త్రము భక్తి సిద్ధాంతముల నుపదేశించుచు, కర్మ జ్ఞానయోగ ముల నప్రధానముగ బోధించుచున్నదని, యామునాచార్యుని వచనము. ఎట్లైనను అది అద్భుత శాస్త్రమై, భగవదనుభూతికి భక్తియే ముఖ్య విధానముగ బోధించును. వేదోక్త భాగవతమత పునః ప్రతిష్ఠకై శ్రీకృష్ణ భగవానుడు, అర్జునునకు గీతాద్వారమున బోధించెననియు స్పష్టము. అనగా వేదగత భాగవత సిద్ధాంత మును మహాజ్ఞానియైన నారదుడు, బ్రహ్మమానసపుత్రుడైన సనత్కుమారునుండి గ్రహించి, మరల శ్వేతద్వీపమున శ్రీమన్నా రాయణుని, బదరికాశ్రమమున నరనారాయణుల చెంతగూడ గ్రహింప, పారాశరుడు మహాభారత, విష్ణుపురాణరూపమున దాని నుద్ధరించెను. అంత, దాని శ్రీకృష్ణుడు, గీతారూపమున పునః ప్రతిష్ఠ గావించెను. అట వ్యాసుడు, భాగవతశాస్త్ర రూపమున దాని నుద్ధరించినట్లు సూక్ష్మముగ, భాగవతసిద్ధాంత ప్రచార కథ సూచించును. ఇందు, కాలక్రమముస్థిరపరచుట కష్టసాధ్యము. కాన,

107. *Prof. D. C. Sarcar : History and Culture of the Indian Peodle, p 440*

భగవద్గీతా శాస్త్రము, వైష్ణవ గ్రంథముల అతి ప్రముఖ స్థానము నలంకరించి, పూజింపబడుచుండుటయందెట్టి అతిశయోక్తియు గానము. అది, యుపనిషత్తుల సారమును అందరికందుబాటు గావించి, అనుష్ఠాన యోగ్యముగ జేసి, సులభతరముగ నొనర్చెను. ఇందు ఉపనిషత్తుల ఉపాసనా విధానము, భాగవతుల భక్తి విశేషములు సమన్వితములై, ఏకస్వనమొందెను. అందుచే నిది మిగుల గౌరవము నార్జించి, సర్వ ముముక్షు హృదయముల నాకర్షించి, శాసించు నధికారియై, వ్యాప్తమై ప్రకాశించినది. కాని, నారాయణీయములో బ్రస్తావింపబడిన వ్యూహమును యిందు గానము.

ఈ గీతా ప్రబోధకుడైన శ్రీకృష్ణపరమాత్మయు సాత్త్వతు డనబడి (శాంతి. 339. 104), వైష్ణవాచార్యులలో నొకడుగ మాత్రమేగాక, భాగవతమత సంస్థాపకుడనియు బ్రతీతి గలదు. ఈ విధముగ మహాభారతము నారాయణీయము, గీతాశాస్త్రము లతోడనే గాక, నింకను అసంఖ్యాక విధానముల భక్తి శాస్త్రముగను, అందును భాగవత మత సిద్ధాంత ప్రచారక మహాగ్రంథముగ నున్నటుల సుబోధకము.

## భాగవతము

'సర్వవేదాంతసారం యచ్ఛ్రీభాగవతముచ్యతే। తద్ర సామృతతృప్తస్య నాన్యత్ర స్యాద్రతిః క్వచిత్॥" (భాగ. 12-13. 15) సర్వ వేదాంత సారమైనది శ్రీభాగవతము నా బరగును. ఆ రసామృతపాన తృప్తుడు, యితరములు గొంచెమేని సుఖము

గాననేరదు అని, శ్రీమద్భాగవత గ్రంథము కీర్తింపబడినది అందుచేతనే భక్తి కవి కులాలంకారుడైన పోతనామాత్యుడును, 'పలికిన భవహరమగునట' అని ఫలితమును బ్రస్తావించి, 'భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు, శూలికైన దమ్మిచూలికైన' (1-19) అనియు స్తుతించెను. మరియు పోతనామాత్యుడు, 'లలితస్కంధము గృష్ణమూలము శుకాలాపాభిరామంబు మంజులతా శోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరోజ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై, వెలయున్ భాగవతాఖ్యకల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై' (1-22) అనియు, నీ భాగవతమును గీర్తించెను. అంతియగాక, 'శ్రీమంతమై మునిశ్రేష్ఠకృతంబైన భాగవతంబు సద్భక్తితోడ, విన గోరువారల విమలచిత్తంబుల జెచ్చెర నీశుండు సిక్కుగాక, యితర శాస్త్రంబుల నీశుండు సిక్కునే' (1-36) అని ఘంటాపథముగ, భాగవత ప్రాశస్త్యంబును, అన్యశాస్త్ర నిష్ఫలత్వంబును జాటి, 'వేదకల్పవృక్ష విగలితమై శుకముఖాసుధాద్రవమున మొనసి యున్న, భాగవత పురాణ ఫలరసాస్వాదన, పదవి గనుడు రసిక భావ విధులు' (1-37) అనియు, రసికుల నాహ్వానించియున్నాడా కవికుల సార్వభౌముడు. అట్టి శ్రీ మద్భాగవత మహాగ్రంథము, వైష్ణవ సిద్ధాంత చారిత్రమున ముఖ్య స్థానము నలంకరించి, అసంఖ్యాక వ్యాఖ్యానముల నొంది, భాగవతమత శిరోభూషణమై యొప్పారినది. దీని దరచి, భక్తిసుధాస్రావమును గ్రోలుట బహుకష్టసాధ్యమని, మున్నె పోతనామాత్యుడు ఎల్గెత్తి చాటెను. కాన దీని అతిక్లుప్తముగ, ముఖ్యమును అవసరమును అయిన విషయముల సమీక్షించెదముగాక!

'నిమ్నగానాం యథా గంగా దేవానామచ్యుతో యథా। వైష్ణవానాం యథా శంభుః పురాణానామిదం తథా॥' (16) శ్రీమద్భాగవతం పురాణమమలం యద్వైష్ణవానాం ప్రియం॥' (12-13-17) అని కీర్తింపబడిన భాగవతము, A repository of the accounts of the ancient mystics of India [108] భారతీయ, ప్రాచీన, జ్ఞానఘనుల విశేషముల అగారమే భాగవతమని, ప్రఖ్యాత రచయిత రాండే అభిప్రాయము. చంద్రశేఖర అయ్యరు మహాశయుడు Bhagavata is the efforescence of bhakti; it is its finest flower [109] భాగవతము భక్తియొక్క ప్రకాశము. అది భక్తి యొక్క సుందర పుష్పము, అని వచించి, భక్తిగ్రంథములనేకములు గలవు గాని, యందు భాగవతము, a magnificient epitome of the philosophy of devotion [109] భక్తి సిద్ధాంతమున మహాద్భుతసారమనియు, అది భారతావని సర్వత్ర భక్తి ప్రచారము త్వరితగతినగుటకు ముఖ్య ఉపకరణమనియు, వచించి యున్నాడు. సర్వేతర భక్తి ప్రచారక శాస్త్రములలో, భాగవత గ్రంథము అత్యున్నతస్థానము నలంకరించియున్నదనియు, ఇది అద్వితీయమై, భక్తులను పులకాంకితులను తన్మయుల జేయుననుటయు సత్యము. అవును, 'తన్మనస్కాః తదాలాపాః తద్విచేష్టాః తదాత్మికాః। తద్గుణానేవ గాయంత్యో నాత్మాగారాణి సస్మరుః॥'

---

*108. Sri R. D. Rande: Indian Mysticism, p 8*

*109. Sri N. Chandrasekhara AiYer :*

*Prabuddha Bharata, p 500, 501, 1955*

(భాగవత) అందే మనస్సునుంచి, దానినే ప్రసంగించుచు, ఆ కార్య ములనే గావించుచు, అందే లయించి, తద్గుణాభివర్ణనమునే గానము జేయుచు, దమ గృహములఁగూడ మరపింపజేయు అనుపమ గోపికా భక్తి పారవశ్యమును అభివర్ణించి, కీర్తించు నీ భాగవతము, అద్భుత శక్తివంతము గాకుండునా!

ఈ యుద్గ్రంథము, శ్రీకృష్ణ పరమాత్ముని చరితామృత మథనమును ప్రత్యేకముగ నుంచి, అట్టి అద్భుత భక్తిసంస్థితుల గ్రహణమునకు పాఠకుల చిత్తముల సంసిద్ధమొనర్చి, తొమ్మిది స్కంధముల, అసంఖ్యాక భక్త శిఖామణుల కథాకథనము గావిం చెను. ఇందు 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అనబడి, 'భగవానో సాత్త్వతాం పతిః' (భాగవత. 7-10-52, 1-1-12) సాత్త్వతవంశజు లకు అధినాయకుడైన, శ్రీకృష్ణ పరమాత్మయే యిందు మూల పురుషుడు. ఆ భగవానుని వివరముల, తర్వాత గ్రంథమున గాంచె దముగాక! 'హంసః కూర్మశ్చ మత్స్యశ్చ ప్రాదుర్భావాద్ద్విజోత్తమ॥ వరాహో నరసింహశ్చ వామనో రామ ఏవచ। రామో దాశరథిశ్చైవ సాత్త్వతః కల్కిరేవ చ॥' (శాంతి. 339-103, 104) అను, మహా భారత వాక్యమున, దశావతారములలో సాత్త్వత నామమున జేర్పబడి, పూర్వోక్తచందము కేవలము అవతారముగగాక, సంపూ ర్ణావతారమై వెలుగొందిన శ్రీకృష్ణ భగవానుని, సర్వాకర్షణీయ గుణగణవైభవముల నెవరు కొనియాడ గల్గుదురు! కాని పై వాక్య ముల గృష్ణునకు, భాగవత సిద్ధాంత పర్యాయనామమైన సాత్త్వత శబ్దము, అన్వయింపబడియుండుట గమనార్హము. మహాభారత మున 'సర్వసాత్త్వతముఖ్యానాం ద్వారకాయాశ్చ' (శాంతి.

110.) అనుచోటగూడ, ద్వారకా ప్రజలు సాత్త్వత వంశజులు, వారికధినాథుడు శ్రీకృష్ణుడనియు గ్రాహ్యము. అందుచే గ్రంథరాజము, 'సాత్త్వత విధి' నాబడిన పాంచరాత్రమును ప్రదర్శించు గ్రంథముగ, స్పష్టము గావింపబడినది.

ఇందు, శ్రీకృష్ణ శబ్దమునకు వాసుదేవ నామముగూడ తరచు అనుసంధింపబడుచుండును. పూర్వము తెలుపబడినచందము వాసుదేవ నామము, 'సర్వభూతాధివాసశ్చ వాసుదేవస్తతో ఓహం' (శాంతి. 341-41) సర్వభూతాధివాసుడనైన వాసుదేవుడను నేను అను అన్వయార్థమునగాక, 'నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి, తన్నో విష్ణుః ప్రచోదయాత్' అను నారాయణ గాయత్రిలోని వాసుదేవ పదార్థమునగాక, వసుదేవుని పుత్రుడుగాన వాసుదేవ నామమున కృష్ణుడు పిలువబడియుండును. వాసుదేవ నామము, 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అను ద్వాదశాక్షరీ మంత్రాధిష్ఠాన దైవముగ గ్రహింపబడెను. అతనికి వేదముల గల 'భగ' దైవముతో నేకత్వము గల్పింపబడి, భగవంతుడై, కాలక్రమమున, విష్ణు నారాయణులతో నన్వయింపబడి,'స ఏష శాశ్వతో దేవః సర్వగుహ్యమయః శివః। వాసుదేవ ఇతి జ్ఞేయో యన్మాం పృచ్ఛసి భారత॥' (భీష్మ. 66-38) నిత్య దైవమును, గోప్యమును, మంగళకరమును అగువాడే వాసుదేవుడని గ్రాహ్యము అనురీతి, సర్వోత్తమ దైవమై విరాజిల్లి యుండెను. ఈ విధముగనే అతని విష్ణుపురాణముగూడ వివరించియున్నది (1-2-10). దానికనుగుణముగ 'వసనాత్ సర్వభూతానాం వసుత్వాత్ దేవయోనితః। వాసుదేవ స్తతో వేద్యో బృహత్త్వాత్ విష్ణురుచ్యతే॥'

(ఉద్యోగ. 70-3) మాయావనికిచే సర్వ భూములను అతని మహత్వముచే నావరించుటచేతను, దేవతలకు ఆధారమై విష్ణు స్థానమై యుండుటచేత వాసుదేవుడనబడెనని, వివిధరూప వ్యుత్పత్త్యర్థములు వాసుదేవ పదమునకు, మహాభారతాది గ్రంథములచే గల్పింపబడెను పండిత భండార్కర్ అభిప్రాయమున, వాసుదేవ కృష్ణులు అన్య వ్యక్తులు. వాసుదేవుడు యాదవ, వృష్ణి, సాత్వతము నాబడు క్షత్రియ వంశమునకు జెందినవాడు. అతడు 'సాత్వత విధి' యను మతమును స్థాపించెను. అంత గాలక్రమమున, అతడు ఋషి యను ప్రఖ్యాతి నొందియుండిన కృష్ణునిలో నైక్యము నొందెనని తెలియుచున్నది'. [110] పండిత హేమచంద్రుడు Nobody will deny the existence of several 'holy seers' bearing the name of Krishna, who were quite distinct from Vasudeva of the Vrishni race. Such were the Krishna, the father of Viswakaya (Rig. 1. 116. 33: 1. 117. 7) Krishna Angirasa (Kaushitaki Brahmana. 30. 9) Krishna Harita (Aitereya Brahmana. 3. 2. 6) [110] వృష్ణికుల వాసుదేవునికి, అన్యులైన కృష్ణనామక జ్ఞానులు గలుగుట ఎవ్వరును కాదనజాలరు. అందు కొందరు, విశ్వకాయునితండ్రి కృష్ణుడు, ఆంగీరస కృష్ణుడు, కృష్ణహారీతులు అని వాదించును. అందుచేత భాగవత ప్రధానమైన కృష్ణ వాసుదేవులు కాలాంతర సమన్వయము లని యితని అభిప్రాయము. ఈ విషయము ముందు భాగమున వివరముగ గాంచెదముగాక! ఎటులైనను the Lord of the

---

110. *Prof. Hemachandra Roy Chaudhuri : Materials for the Study of the Early History of the Vaishnava Sect, p 53*

Autumn Moons శరచ్చంద్ర ప్రభువైన శ్రీకృష్ణుడు సర్వశక్తి సంపన్నుడై, సర్వదేవతల దనతో లయమొనరించి, సర్వము తానయై, నాడేకాక నేటికిని, సర్వ ముముక్షువులకేగాక, సర్వ కళో పాసకులకాదర్శమూర్తియై, విరాజిల్లుట సువిదితము. అట్టిది ఆ మహామూర్తి తత్త్వము.

భాగవత గ్రంథమునగల విష్ణువునకును. వేదములగల విష్ణువునకును బ్రిబల వ్యత్యాసము గలదు. వేదముల విష్ణువు ఇంద్రునకు సఖుడై స్వాధీనుడు. భాగవత విష్ణువు పరమాత్మయే యగును.

భాగవత మతము ప్రారంభమున, గేవలము సూర్యోపాసనా విధానమని పండిత హేమచంద్రుని తాత్పర్యము. అది సాత్త్వతము, వృష్ణి నాబరగు మధురప్రాంత యాదవ క్షత్రియులలో విజృంభించినది. దీనికి ఉదాహరణముగ, దేవకీనందనుడైన శ్రీ కృష్ణుడు, సూర్యోపాసకుడైన ఘోర అంగీరసునివద్ద యీ విద్య నభ్యసించుట చూచియుంటిమి. అంతియగాక దీని బలపరచుచు శాంతిపర్వము, 'సాత్త్వతం విధిమాస్థాయ ప్రాక్ సూర్యముఖ నిఃసృతం' (335.19) సాత్త్వతము పూర్వము సూర్యముఖతః వచింప బడినదని తెలుపును. అటులే గీతాప్రమాణముగూడ, నీ భావమును నొక్కి చెప్పుచున్నది. శ్రీకృష్ణుడు దా జెప్పుచున్న విద్యను గురుపరంపరను నుగ్గడించుచు, 'ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయం। వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్॥' (4.1) ఈ అవ్యయమైన యోగమును, నేను సూర్యునికి జెప్పితిని. అతడు దానిని మనువునకును, మనువిక్ష్వాకునకును బోధించెను అని దెలు

పుచు సూర్యుని సూచించుటచే, నది సూర్యోపాసన యనియే నిర్ధారణమగుచున్నది. [111]

భాగవత ధర్మమును గ్లుప్తముగ వచించుచు, భాగవతము ప్రహ్లాదునిచేత 'శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం। అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం॥ ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవలక్షణా। క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీతం ఉత్తమం॥' (7-5-23-24) 'తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా, ర్చనముల్ సేవయు నాత్మలో నెరుకయున్ సంకీర్తనల్ చింతనం, బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స, జ్జనులై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా' (7-167) అని పలికించినది. ఇందు భగవత్కళ్యాణగుణాభివర్ణనమున నారద వ్యాసులు, దివ్య మంగళవిగ్రహానురాగమున గోపికలు, పూజయందు అంబరీషుడు, స్మరణమున ప్రహ్లాదుడు, సేవకు ఆంజనేయుడు, సఖ్యమున ఉద్ధవార్జునులు, వాత్సల్యమున దేవకీ కౌసల్యలు, మధురమున రాధా రుక్మిణీ సత్యలు, సర్వార్పణమున బలి విభీషణాదులు తార్కాణములు. తన్మయత్వమున సనత్కుమారాదులను, విరహమున గోపికలగూడ జేర్పనగును.

భాగవతమతమున వాసుదేవుడు, పరమాత్మగా బరిగణింపబడుట యటుండ, అతని సోదరుడైన సంకర్షణుడు అనగా

111. *Prof. Hemachandra Roy Chaudhuri: Materials for the Study of the Early History of the Vaishnava Sect. p. 53*

బలరాముడు జీవుడనబడి, అతనినుండి ప్రద్యుమ్న నామక మన ముత్పత్తి యైనట్లును, దానినుండి అనిరుద్ధుడను అహంకారము జనించినట్లు తెలుపబడినది. ఈ విధానము భాగవత శాస్త్రమున గానరాదు. అది కాలాంతర పరిణామమై యుండనోపును. పాంచ రాత్రవిధిలో నది బహుళముగ వివరింపబడియున్నది. అయినను భాగవతవిధి పాంచరాత్రముగను, సాత్త్వతముగను, బేర్వడసి యున్నది. తర్వాతి వైష్ణవ సిద్ధాంతమునకు యీ భాగవత మతము నాంది యగును. అతి ప్రాచీనమైన ఏకాయనముగూడ నిందు లయించినది. శాంతి పర్వముననే ఏకాంతిక, సాత్త్వత ములు ఏకమై, పాంచరాత్రముతో అభిన్నత్వము నొందియుండుట గాంచియుంటిమి.

ఈ భాగవత మతము, నాలుగు సోపానముల పరిణ మించి యుండునని ఆచార్య గార్బే భావించెను [112] వైదికమైన బ్రాహ్మణ సిద్ధాంతమునకు, స్వతంత్రముగ నిది పుట్టిండుట ప్రథమ దశ కృష్ణ వాసుదేవునిచే నిది సంస్థాపితమై, భక్తి ప్రధాన సాధన ముగ నుండెను. కృష్ణుని విష్ణువుతో నైక్యమొందించుట ద్వితీయ ఘట్టము. అప్పుడు యిది వైష్ణవమనియు నాబడినది. దీని ననుస రించువాడు వైష్ణవుడు అనియు ననబడెను. 'తత్ఫలం సమవా ప్నోతి వైష్ణవో నాత్ర సంశయః' (18-6-9.) అని, మహాభారతము వైష్ణవుని సూచించెను. మూడవదశలో భాగవతవిధి వైష్ణవ సిద్ధాం తముతో నేకమై, వేదాంత సాంఖ్య యోగ విషయములగూడ

---

*112. Dr. S. Radhakrishnan : Indian philosophy, Vol. I, p 489*

నిందు జేర్చుకొనినది. అంత దురీయమున, రామానుజుని హస్త స్పర్శముచే విశిష్టాద్వైత సిద్ధాంతమై యొప్పారినది అని, అతని సిద్ధాంతము. ఇది తద్విదులచే గవేషణార్హము. ఎటులైనను ఈ భాగవతవిధి శ్రీకృష్ణునిచే స్థాపితమని కొందరి గాఢ విశ్వాసము.

## శాండిల్య భక్తిమీమాంస

Sandilya was, probably one of the first among those who systematised the doctrines of the Vasudevakas. If we regard him as identical with Udara Sandilya of the Vedic texts, he is tenth in the apostolic succession from Indrota, the priest of Janamejaya, the great grandson of Krishna's sister Subhadra [113]
వసుదేవతల సిద్ధాంత నియామకులలో శాండిల్యుడు, బహుశః ప్రథమాచార్యులలో నొక్కడుగ నుండును. వైదిక గ్రంథములగల, ఉదార శాండిల్యుడే యితడని మనము భావించుచో, శ్రీకృష్ణుని సోదరి సుభద్రకు పౌత్రుడైన జనమేజయుని పౌరోహితుడు ఇంద్రోతుని పిమ్మట, పదియవవాడై యుండును అని పండిత హేమచంద్రుని భావము. కాని శాండిల్యుడు పూర్వగ్రంథమున గాంచినరీతి, శతపథ బ్రాహ్మణమున వాకొనబడినట్లు, ప్రథమతః శ్రీమన్నారాయణునినుండి పాంచరాత్రాగమమును గ్రహించిన శాండిల్య, ఔపగాయన, మౌంజాయన, కౌశిక, భారద్వాజులనెడి పంచ ఋషీశ్వరులలో నొకడుగ పఠింపబడియున్నాడు భరత

113. *Prof. Hemachandra Roy Chaudhuri : Materials for the Study of the Early History of the Vaishnava Sect, p 108.*

ముని పుత్రులలో నొక శాండిల్యుడు గలడు. బృహదారణ్యకోపనిషత్తు పరిసమాప్తమున (అ. 6-5-2) శాండిలీపుత్రుడొకడు గురువంశమున సూచింపబడెను.

మరియు ఛాందోగ్యోపనిషత్తున, (3-14-1) శాండిల్యునిపేర శాండిల్యవిద్య యను నొక ప్రత్యేక విద్యయు నుపదేశింపబడి యున్నది. అటులే, నా మహర్షిచంద్రునికన్వయించుచు, శాండిల్య భక్తి మీమాంస నాబడు భక్తిసూత్రములుకూడా బ్రఖ్యాతములు. ఇది నారద భక్తిసూత్రములతోసహ భక్తిగ్రంథముల బ్రశస్తి గలిగియున్నది. అందుచే వీని నిసుమంత మీమాంసించి చూచెదముగాక!

ఛాందోగ్యమున, 'సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత' (3-14-1) సర్వము బ్రహ్మస్వరూపమెయై యున్నది. అటనుండి యిది జనించి, అందే లయించి, దానిచేతనే పోషింపబడుచున్నది. శాంతమైన చిత్తముతో దాని నుపాసింపవలెను, అను మంత్రరాజములతో నీ శాండిల్యవిద్య ప్రారంభింపబడుచున్నది. ఈ మంత్రము వైష్ణవ సిద్ధాంతమున అతిప్రధానమై, శ్రీ మహావిష్ణువునుండి సృష్టితంత్ర విధానము బోధించుచున్నట్లు వివరింపబడుచున్నది. మరల 'క్రతుమయః పురుషో యథా క్రతురస్మింల్లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి స క్రతుం కుర్వీత' (3-14-1) మానవుడు ధ్యానపరుడు. ఈ జీవితమున నతడెద్దాని ధ్యానించునో, అది తా తర్వాత నగును, అందుచే

బ్రహ్మమును ధ్యానింపవలెను అని యిచ్చటి ప్రబోధము. ద్వితీయ మంత్రమునుండి చతుర్థము వరకు మూడు మంత్రములు ఆత్మస్వరూపమును వర్ణించి, అదియే బ్రహ్మముగ దీర్మానించినవి. ఈ మంత్రముగూడ వైష్ణవమున బ్రధానము. అందు 'మనోమయః ప్రాణశరీరో భారూపః సత్యసంకల్ప ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామః సర్వగంధః సర్వరసః సర్వమిదమభ్యాత్తోఽవాక్యనాదరః' (3-14-2) ఏది మనోమయమో, దేని శరీరము ప్రాణమో, ఎవరిది భారూపమో, ఎవరిది సత్యసంకల్పమో, ఎవరి ఆత్మ ఆకాశతుల్యమో, ఎవరు సర్వకర్మముల సర్వకామముల గావించునో, ఎవరికి సర్వ గంధములు, సర్వరసములు జెందునో, ఎవరు సర్వ విశ్వమును వ్యాపించెనో, ఏది పలుకదో, ఎవరినిగూడ నేది అనాదరింపదో, 'ఏతమ ఆత్మాంతర్హృదయేఽణీయాన్ వ్రీహేర్వా యవాద్వా సర్ష పాద్వా శ్యామాకాద్వా శ్యామాకతండులాద్వా ఏష మ ఆత్మాంతర్ హృదయే జ్యాయాన్ పృథివ్యా జ్యాయానంతరిక్షౌ జ్యాయాన్దివో జ్యాయానేభ్యో లోకేభ్యః' (3-14-3) అది నా యంతరమున గల ఆత్మ. అది వడ్లగింజకంటెను, యవ, ఆవ, శ్యామక బీజములకంటె దేలికయైనది. ఆ యంతరాత్మ పృథ్వి కంటె, అంతరిక్షముకంటె, ద్యులోకముకంటె సకల లోకముల కంటెగూడ బెద్దది. 'సర్వకర్మా సర్వకామః సర్వగంధః సర్వరసః సర్వమిదమభ్యాత్తోఽవాక్యనాదర ఏష మ ఆత్మాంతర్ హృదయ ఏతద్బ్రహ్మైతమితః ప్రేత్యాభిసంభవితాస్మీతి యస్య స్యాదద్ధా న విచికిత్సాస్తీతి హ స్మాహ శాండిల్యః' (3-14-4) సర్వకర్మముల సర్వకామముల సర్వగంధ సర్వసముల బొంది, సర్వము నావరించి, ఏమియు వచింపక, నెవరిని అనాదరింపక నుండునదియే నా

అంతరాత్మ. అదియే బ్రహ్మము. దాని నే నీప్రపంచమును వదలి పొందెదను. దీనిని విశ్వసించినవారు, ఏతత్ ధ్యానఫలిత మును బొందుదురు అని, శాండిల్యుడు వచించెను అని, ఛాందోగ్య పాఠము. ఇదియే ప్రాణవిద్య అనియు, శాండిల్యవిద్య యనియు శాస్త్రముల ప్రఖ్యాతము. నారదుడు సనత్కుమారుదగ్గర గ్రహించిన ప్రాణవిద్యకు యిది, వ్యాఖ్యానరూపమైనట్లు విదితము. ఇందుగల మంత్రరాజములు, తర్వాత వైష్ణవ గ్రంథముల సవ్యాఖ్యానముగ వ్యాప్తమై యుండుట గాంచనగును. అందుచే నీ ఛాందోగ్య, శాండిల్యవిద్యావిషయ ప్రాధాన్యమెంతయో గ్రాహ్యము. ఈ శాండిల్య విద్యాప్రస్తావనము, వేదాంత సూత్రములగూడ గాన నగును (3-3,19,20,50,58). అచట సర్వోపనిషత్తులలో సూచింప బడిన ప్రాణవిద్య ఒకటియే యని నిర్ధారింపబడినది. ఇక శాండిల్య భక్తి సూత్రముల గొంత చూచెదముగాక!

శాండిల్య భక్తి సూత్రములు, ఇతర భక్తిప్రస్థాన గ్రంథము లలో నొక ప్రముఖ స్థానము నలంకరించియున్నవి. నారద సూత్రములు భక్తిని వివరింప, శాండిల్యుడు తత్త్వార్థ విషయముల గైకొని విశదీకరించెను. దీనికి స్వప్నేశ్వరునిచే చిన్న భాష్యము గోచరము. ఇది చాల క్లుప్తముగ నున్నది.

## శాండిల్య భక్తి సూత్రములు

శాండిల్య సూత్రములు మొత్తమున శతముగనుండి, మూడు అధ్యాయములుగ విభజింపబడి యున్నవి. మరల నొక్కొక్క అధ్యాయము, రెండు అహ్నికములుగ జేయుబడి

యున్నది. విద్యార్థులు సులభముగ నీ భక్తిశాస్త్రమును, ఆరు దినముల నధ్యయనము గావించుకొనుటకు యిట్లు విభజింపబడినట్లు ద్యోతకము. ప్రథమాధ్యాయము, ప్రథమాహ్నికమున 9 సూత్రములు గలవు. అందు ద్వితీయాహ్నికము 17 సూత్రముల గలిగి యున్నది. ద్వితీయాధ్యాయమున మొదటి అహ్నికమున 29 సూత్రములు గలవు. రెండవ ఆహ్నికమున 56-84 వరకు 29 సూత్రములు గలవు. అంత, ద్వితీయాధ్యాయము ప్రథమాహ్నికము 8 సూత్రములను, ద్వితీయము 8 సూత్రములను గలిగి శోభిల్లుచున్నది. మరియు ప్రథమాధ్యాయము, భక్తి నిర్వచనముతో మొదటి ఆహ్నికము ప్రారంభించి, భక్తి ప్రాధాన్యమును రెండవది వచించును. ద్వితీయాధ్యాయము ప్రథమాహ్నికమున భక్తిసాధనముల గోడీకరించి, భక్తిలక్షణముల బ్రవిస్తాంచి, ద్వితీయాహ్నికమున భక్తిప్రయోజనముల వాకొనుచు అధికారిని గూడ వచించియున్నది. తృతీయాధ్యాయము ఈశ్వరునిగూర్చి ప్రథమమున వివరించి, ద్వితీయమున ముక్తివిషయముల విశదీకరించినది. ఇక గొంత వివరముల జూచెదముగాక !

## సూత్ర సమీక్ష

'అథాతో ధర్మ జిజ్ఞాసా' అని మీమాంసా సూత్రములును, 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' అని వేదాంత సూత్రములు ప్రారంభింపబడియున్నచందము, శాండిల్యకృత భక్తిసూత్ర గ్రంథము 'అథాతో భక్తి జిజ్ఞాసా' (1) అని ప్రారంభింపబడియున్నది. నారద సూత్రములుకూడ నిట్టులేగదా! ఈశ్వర సాక్షాత్కార సాధనములగు జ్ఞానకర్మములు పరీక్షింపబడి, అవి నిష్ఫలమగుటచే

భక్తి మీమాంస చేయబడుచున్నది. ఆ భక్తి 'సా పరానురక్తిః ఈశ్వరే' (2) ఈశ్వరునియందు సంపూర్ణ అనురాగరూపమే యగును. ఆ భక్తియందు సంస్థితుడైనవాడు అమృతత్త్వము బొందునని మూడవ సూత్రము వాగ్దానమొనర్చుచున్నది. ఈ భక్తి ఈశ్వర విషయక జ్ఞానము కానేరదు. జ్ఞానమున్నను భక్తిశ్రద్ధ లుండవుగదా (4). అంతియగాక భక్తి సంపూర్ణముగా నావిర్భవించుచో జ్ఞానము క్షీణించునుకాన జ్ఞానము భక్తి యనుట తగదు. అందుచే 'ద్వేషప్రతిపక్షభావాద్రసశబ్దాచ్చ రాగః' (6) ద్వేషమునకు వ్యతిరేకమును, రస శబ్ద వాచ్యమును భక్తి కావుటచే నిది అనురాగమనియు వాచ్యము. జ్ఞానము మానవ వ్యాపారాధీనమై యుండ, యోగము క్రియాఫలితమై యుండ, భక్తిమాత్రము పురుష కర్తృత్వముపై నాధారపడక, నాతని పూర్వజన్మ సుకృత ఫలముపై నాధారపడియుండును. కృపాసముద్రుడైన ఈశ్వరునకు శరణాగతుడై భక్తిని బొందును (7). 'అత ఏవ ఫలానంత్యం' (8) కాన భక్తియొక్క ఫలముగూడ అనంతము. మరియు పరమేశ్వరానుభూతికి గారణముగ వచింపబడు జ్ఞానమునకు నీ భక్తియే ముఖ్య కారణము (9).

కనుక నీ భక్తి పరమముఖ్యమై, జ్ఞానాది యోగములుగూడ దీని సహాయము నపేక్షించును (10) భక్తియే పరమ శ్రేష్ఠము (11). జ్ఞానముచే భగవద్దర్శనలాభము పొసగినను, దాని అనుభవమునకు భక్తి యవసరము (12). భక్తి హృదయము నాశ్రయించి యుండునుగదా! అందులకు దృష్టాంతముగా 'అత ఏవ తదభావాద్వల్లవీనాం' (14) అను సూత్రము, గోపికాకాంతల

జూపించుచున్నది. వారు బ్రహ్మజ్ఞానము లేశమాత్రముగ సంపాదింపకున్నను, సర్వపాపముల బాసి, ముక్తిని గాంచియుండుట సువిదితము. కావున జ్ఞానము భక్తికి ఫలరూపముగాక, భక్తికి సహకారి యగును (15). ప్రపంచమున పితృభక్తి, మాతృభక్తి, మొదలుగాగల భక్తులెన్నియో గలవుగాని, యన్నింటను నీ పరాభక్తి ఉత్తమము (1ు). యోగము భక్తి జ్ఞానములకంగప్రాయము (19). యోగశాస్త్రముల వచింపబడిన సమాధి గౌణ భక్తివలన నంప్రాప్తము. దానిచే బరభక్తి లభ్యము (20). ప్రాపంచిక ముగ ననురాగము దుఃఖకారణమై యున్నను, భగవదనురాగము ఆనందదాయకము (21) కావున నెట్లు యోచించినను 'తదేవ కర్మి జ్ఞాని యోగిభ్య ఆధిక్య శబ్దాత్' (22) భక్తియే, కర్మ జ్ఞాన యోగములకంటె అధికమని నిశ్చయము. ఇది ప్రశ్నోత్తరముల గీతాశాస్త్రమున (12-1-7) నిరూపితమై యున్నది. ఈ భక్తి శ్రద్ధారూపముగూడ కాదు. శ్రద్ధ సామాన్య కర్మల నాశ్రయించి యుండును. శ్రద్ధా భక్తులని లోకవ్యవహారమున్నను, రెండును అన్యములే యగుచున్నవి. ఈ భక్తి అభివృద్ధినొందుటకే వేదముల బ్రహ్మజిజ్ఞాస ఉపనిషద్రూపమున వచింపబడియున్నది (26).

ద్వితీయాధ్యాయము భక్తి అభివృద్ధికి అనుగుణసాధనముల ప్రస్తావించును. 'బుద్ధిహేతుప్రవృత్తిరావిశుద్ధేరవఘాతవత్' (27) చిత్తశుద్ధి గలుగునంతవరకు నవసరములగు కర్మలు ఆచరణీయములు. అటులే గురుశుశ్రూష, శ్రవణ మననాదులును అవసరములని, 'తదంగానాం చ' (28) అని ఆదేశంపబడినది. అందు వివిధాచార్యుల అభిప్రాయములు తెలుపబడినవి. జీవుడీశ్వరునకు బరుడు

కాన, బుద్ధిని పరమేశ్వరపరమొనర్పవలెనని కాశ్యపమహర్షి వచించెను (29). బుద్ధి శుద్ధాత్మపరమైనచో ముక్తి యని బాదరాయణుని వచనము. ఆత్మ బ్రహ్మమునందు నేకమగునంతదనుక, ఉపాసన అవసరమని పై రెండు భావముల సమన్వయించి, శాండిల్యుడు వాకొనెను. భాగత్యాగలక్షణము ననుసరించి జీవేశ్వరులకు, అభిన్నత్వము అని 32వ సూత్రము స్పష్టపరచెను. అభిన్నమైన జీవునకు గల దుఃఖాదులు ఈశ్వరునకు గల్గుగదా అనినచో, అట్లు గలుగదు అని సమాధానము (33). ఈశ్వరునికిగల ఐశ్వర్యాదికముగూడ నతనికి క్లేశహేతువు గానేరదు (34). ఐశ్వర్యాదులు ఈశ్వరునకు స్వాభావికము. అందుచే దుఃఖహేతువులుగావు (36). జగత్సృష్టి యంతయు నతని ఐశ్వర్యమున నున్నను, అది ప్రకృతితో సంబంధించియుండుటచే నీశ్వరుడు అవికారియే (37). సృష్టి ప్రకృతిసంబంధముగనున్నను, అది ఈశ్వరునియందే యుండును. పరత్వమునకవకాశమభావముగా! (38). మరియు, ఈశ్వర ప్రకృతులు పరస్పరాపేక్ష గలిగి, సృష్టి తంత్రమును సాగించుచున్నారు. 'చేత్యాచితోర్న తృతీయం' (40) ఈ చిన్మయమైన బ్రహ్మము, జడరూపమైన ప్రకృతిగాక మూడవది ఏదియును లేదు. ఈ ద్వయమైనను 'యుక్తౌ చ సమ్పరాయాత్' (41) సృష్టికి బూర్వమేకముగనుండి, సృష్టికాలమున రెండుగ మారుచున్నది. అందుచే ప్రకృతి 'శక్తిత్వాన్నానృతం వేద్యం' (42) శక్తిస్వరూపమగుటచే, మిథ్యావస్తువు కాదు, అని యీ సూత్రముల శాండిల్యుడు, ఈశ్వర ప్రకృతుల సంబంధ బాంధవ్యముల, తత్త్వతః విచారించెను. మరల, భక్తివిషయములకు శాండిల్యుడు తిరిగి, 'తత్పరిశుద్ధిశ్చ గమ్యా లోకవల్లింగేభ్యః' (43) భక్తి

పరిపక్వ లక్షణముల లౌకిక చిహ్నములచే గాంచనగును. అనగా, ఆనందాశ్రుచయము, పులకితశరీరము, గాద్గదికము మొదలైన బాహ్య లక్షణములుగ భక్తిస్థితిని సూచించును. మరియు భక్తి చిహ్నముల గ్రోడీకరించి, 'సమ్మాన బహుమాన ప్రీతివిరహేతర విచికిత్సా మహిమాఖ్యాతి తదర్థప్రాణస్థానతదీయతా సర్వతద్భావ ప్రతికూల్యాదీని చ స్మరణేభ్యో బాహుల్యాత్' (44) (1) సమ్మానము (2) బహుమానము (3) ప్రీతి (4) విరహము (5) ఇతరవిచికిత్స (6) మాహాత్మ్యము (7) ఖ్యాతి (8) తదర్థప్రాణము (9) స్థావనము (10) తదీయభావనము (11) సర్వమయత్వజ్ఞానము (12) అప్రాతికూల్యము అనువాని దెలుపును.

పెద్దల సమక్షమున, ప్రత్యుత్థానము గావించి నిలుచుట సమ్మానమగును. ఇష్టదైవ లక్షణములు గలవారిని గౌరవించుట బహుమానము నబడును. భగవదాగమమున ప్రేమ జూపించుట ప్రీతి యగును. ఈశ్వరునుండి ఎడబాటునకోర్వలేనిస్థితి విరహము. భగవద్భక్తితోగూడిన నీచ జన్మములనైన వాంఛించి, భక్తిలేని రాజజన్మలనైన ద్రోసిపుచ్చుట ఇతర విచికిత్స యందురు. పరమాత్మ నర్చించుచో నరకబాధలుగూడ నివారించునని మాహాత్మ్యము నెరుంగవలెను. యముడుగూడ నితరములకు ప్రభువుగాని భక్తులకుగాదను ఖ్యాతి గ్రహింపవలెను. పావనభగవత్కథా తోయముచే, బవిత్రమైన లోకమునందుండ దీర్మానించుకొనుట తదర్థప్రాణము స్థావనములగును. తన సర్వస్వమును భగవంతునిదిగ దృఢభావమునమందుట తదీయతాభావము. ఈశ్వరుడు సర్వవ్యాపియు సర్వాంతర్యామి యని ఎరుగుట సర్వమయత్వజ్ఞానము. భగవత్సంకల్పమునకు లొంగుట అప్రాతికూల్యము అనబడి, యిట్లు

యీ పండ్రెండు లక్షణముల భక్తుని గ్రహింపగలుగుదుమని శాండిల్య సూత్రము.

కాని పై లక్షణములకు వ్యతిరేకములైన 'ద్వేషాదయస్తు నైవం' (45) ద్వేషాదులు భక్తి చిహ్నములుమాత్రము కావు. కేవలము పరమేశ్వరునియందేకాక, భగవద్విభవము నాబడు రామకృష్ణాద్యవతారములగూర్చి భక్తియు భక్తియే యగును. జన్మము, కర్మము మొదలైన విషయ రహస్యముల గ్రహించి, అవ్వాని నిష్ఫలత్వముల నెరింగి, వాని తూష్ణీభావమున జూచి, భక్తినభివృద్ధి గావించుకొనినవాడు ముక్తిని బొందును. మరియు, నవతారముల గన్పడు పుట్టుపూర్వోత్తరముల, అసంఖ్యాక లీలల, వాని రహస్యముల నెరింగి, ఆ యవతారమూర్తులయందు భక్తిప్రపత్తుల నభివృద్ధి నొందించువాడును ముక్తుడగును. జీవుని దేహాదికము భోగార్థము ఏర్పడియుండినను, అవతార పురుషుల శరీరాదికము ఐచ్ఛికము, తేజోమయము (48). దుఃఖక్లేశమగ్న జీవకోటిపై గలుగు కారుణ్యమే భగవదవతరణమునకు ముఖ్య కారణము (49). భగవద్విభూతిగ గీర్తింపబడు చక్రవర్తిత్వాదికము, ముక్తిహేతువు కాదుగాని, గీతాశాస్త్రమున వాకొనబడిన వాసుదేవాది విభూతి కృష్ణునికే అన్వయముగాన, శ్రీకృష్ణుడు కేవలము పరమాత్మ యగుటచేత సతడారాధ్యుడే యగును (52). ఈ విధముగ అవతారభక్తి వలనగూడ ముక్తి లభ్యము.

జ్ఞానయోగములు, గౌణభక్తియు, విఘ్నముల తొలగించి, పరభక్తిని, బోధింపజేయును. ప్రథమమున భక్తిగౌణమే యగు

చున్నది (56). 'రాగార్థప్రకీర్తిసాహచర్యాచ్చేతరేషాం' (57). భజన, అర్చన, కీర్తనాదులు, భక్తిసాఫల్యమునకంగభూతములు. భక్త్యంగములచే పవిత్రత లభించుచున్నది (58). ఈ అంగ ములు పరభక్తికి ద్వారతుల్యములు. వీని సమయానుకూలముగ నభ్యసింపవలయును (62) 'ఈశ్వరతుష్టిరేకోపి బలీ' (63) వీనిలో నే యొక్కటియైనను దృఢమగుచో, భగవత్ప్రీతిని బొందించును. సర్వకర్మార్పణవిధానము సదా సన్నిహితమై యున్నది. 'ధ్యాన నియమస్తు దృష్టసౌకర్యాత్' (65) ధ్యాననియమాదులు చిత్తవిక్షేప ముల నడంచుచు, దృష్టఫలితములనే యొసంగును. సదా భగవదా రాధనమే యజ్ఞము. ఇతరములు కానేరవు. పాద్యమును పాదోదక బుద్ధితో (67), భగవదర్పిత పదార్థములను ప్రసాదబుద్ధితో స్వీక రింపవలెను. అర్చనకాలముల క్రమత్వము వీడుట అపరాధము నాబడును. దానికి ప్రాయశ్చిత్తములు గలవు. భక్తితో నర్పిం చిన పత్ర పుష్ప ఫలాదికములన్నియు, సమాన ఫలమునే యొసంగును.

ఈవిధముగ నభ్యసింపబడిన భక్తి పుణ్యప్రదము, పరభక్తికి కారణము, సర్వోత్తమము (71). 'ఆర్తోజిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ' అన బడు చతుర్విధ భక్తులలో, ప్రథమ త్రయము గౌణ భక్తి రూపములు. జ్ఞానభక్తి అన్నింట గొప్పది. అది పరభక్తి యగును. కీర్తనాదులు భక్తికి బాహ్యాంగములుమాత్రముగాక అంతరంగములుగూడనై యున్నవి (73). పాపాత్ముడైనను, భగవద్గుణాది స్మరణ కీర్తన శ్రవణముల నొనర్చినచో, నతని సర్వపాపక్షయము అగును. సంకీర్తనాదులు సులభమను భ్రాంతిని, 75వ సూత్రము తొలగించు చున్నది. కష్టసాధ్యములగు కర్మాదులవలె నిదిగూడ కష్టతరమే

యగును. వాని నిరంతరముగ అమరణాంతము గావించినగాని, పాపపరిహారము గానేరదు. 'లఘ్వపి భక్తాధికారే మహత్ క్షేపక మపరసర్వహానాత్' (76) సామాన్యభక్తి గలిగినను, క్రమమున మహాపాతకములుగూడ నశించును. సంపూర్ణ శరణాగతియు మహాపాతక పరిహారము చేయును. 

ఈ భక్తి సాధనమునకు అధికారి యెవడు అను విషయమును 78 వ సూత్రము నిర్ణయించినది. 'అనింద్యయోన్యధిక్రియతే పారంపర్యాత్ సామాన్యవత్' నింద్యజన్ములకుగూడ గురుపరంపర ననుసరించి, సామాన్యధర్మములనెట్టి అధికారము గలుగుచున్నదో, భక్తి విషయమునగూడ నట్టి అర్హతయు గలదు. 

అధికారి పరభక్తిని బొందనేరక, గౌణభక్తియందేయున్న చో, నతనికి సాలోక్యముక్తి లభించునుగాని అతడు భ్రష్టుడు కానేరడు (77). భక్తుడు క్రమముగ భక్తి సాధింపవలెను. అందుచే మహాపాపాత్ముడు ప్రథమమున, ఆర్త భక్తిని అనుసరింపవలెను (82). ఏకాంతభావమైన పర భక్తివలననే ముక్తి గలుగును (83, 84). 

మూడవ అధ్యాయమున మరల శాండిల్యుడు, కొన్ని తాత్త్విక విషయముల, నిర్ణయించుచున్నాడు. 'భజనీయే నాద్వితీయమిదం కృత్స్నస్య తత్స్వరూపత్వాత్' (85) ఈ సృష్టి సర్వము, ఆ పూజ్యుడైన భగవత్స్వరూపమే, అన్యముకాదు. 'తచ్ఛక్తిర్మాయా జడ సామాన్యాత్' (86) భగవంతుని ఐశ్వర్యశక్తియే మాయా నాబడును. ఆ మాయాశక్తి జడము. పరమాత్మను గ్రహించిన సర్వము గ్రాహ్యము. కారణజ్ఞానముచే కార్యజ్ఞానము గలిగినట్లు అది సాధ్యము (87). ఈ సృష్టి జీవకల్పితము కానేరదు. ఈశ్వరుడు,

జీవుల పుణ్యపాపకర్మానుసారముగ, ఉచ్చనీచములగూడ సృష్టించి తండ్రివలె వేదములనైతము నిర్మించెను. ప్రళయకాలమున నీ సృష్టియంతయు నా యీశ్వరునియందే లయించి, అందిమిడి యుండును (92).

ముక్తి యన, జీవేశ్వరైక్యమని శ్రుతులుగూడ వాకొనును. జీవుడు బ్రహ్మాంతరముగాక అభిన్నమే యగును. అతడు బ్రహ్మవికారము అనుటయుగాదు, బ్రహ్మము నిర్వికారముగదా! ఇట్టి బ్రహ్మైక్యము, 'అనన్యభక్త్యా' (98) అనన్యభక్తివలన గలుగు తన్మయ బుద్ధికారణముగ లభించును. సామాన్యులకు ప్రారబ్ధము ఆటంకమును కలుగజేయునుగాని, పరభక్తునకు నే యాటంకము లేదు. జన్మకారణము అజ్ఞానమువలనగాక, భక్తి శూన్యతవలన నేర్పడుచున్నది. ఈ విషయముల గ్రహించుకొనుటకు ప్రత్యక్ష, అనుమాన, శబ్దములు, ప్రమాణములు (99). 'అవి స్థిరోభావావికారాః స్యుః క్రియా ఫలసంయోగాత్' (100) పై వివరింపబడిన సృష్టి లయములు, ప్రకాశ వివరిలోపములు అవగా, సంకోచ వికాస రూపములుమాత్రమే యగుచున్నవి. అని శాండిల్య మహర్షిసత్తముడు తన శత సూత్ర భక్తి మీమాంసను సంపూర్తి గావించెను.

ఈ మీమాంసలో, చతుర్వ్యూహ ప్రస్తావనము గానము. కాని ప్రపత్తి పరభక్తి మొదలగు భక్త్యంశములు, బహుళముగ నొక్కి వక్కాణింపబడి యున్నవి. అందుచే, నీ శాండిల్య భక్తి సూత్రములుగూడ, వైష్ణవ గ్రంథావళిలో నతి ప్రధానస్థానము నధిష్ఠించియున్నవి.

## శ్రీమద్రామాయణము

శ్రీమద్వాల్మీకి రామాయణముగూడ రామానుజానంతర వైష్ణవమున, ముఖ్యముగ నుత్తరభారతమున నతి బాహుళ్యమున బ్రాధాన్యమును బొంది, శ్రీకృష్ణునకు గల ప్రచారముకంటె కొన్ని సమయముల, నధికతర ప్రభావమును సంఘమున గాంచినట్లు తెలియును. శ్రీరాముని నామము వేదముల నెచ్చటను, అన్వయార్థముననైన నగోచరమైనను ముఖ్యముగ, రామరహస్య, రామపూర్వోత్తరతాపినీ మొదలగు నుపనిషత్తుల గానబడును. కాలక్రమమున, మహాభారతమునగూడ నీరామాయణము జొచ్చినది. అంత రామానంద, కబీరు, తులసీదాసాది ఆచార్య ప్రచారముచే, నత్యధికతర ప్రాబల్యమును సంపాదించి, అజేయముగ వెలసినది. ఇందులకు, శ్రీరామచంద్రుని సర్వాదర్శమూర్తిమత్త్వము, సీతామహాదేవియొక్క అసమాన పవిత్రతలు గొప్ప కారణములు. ఏ కోణమునుండి చూచినను శ్రీరాముని ఆదర్శము, సర్వవిధ మనోప్రవృత్తులకు ఎదురు నిలిచి, మార్గదర్శకమగుచుండును. ఇందుగూడ, మహదాదర్శమును భక్తిసాధనమున జొప్పించు, గుహ, శబరి, విభీషణాదులేగాక, భక్తిసాధనములో సర్వవిధముల ఆదర్శమును రూపించి, మించి, భక్తిమూలముగ నద్వైతమునుగూడ సాధించి, శ్రీరామచంద్రునిసేవాకైంకర్య ఆనందమున సదా మునిగియుండెడు శ్రీ హనుమంతుడు, భక్తిసిద్ధాంతమున ఒక శిరోభూషణముగ రామాయణగాథలో గలడు. 'దేహబుద్ధ్యాస్మి దాసోహం జీవబుద్ధ్యా త్వదంశకః। ఆత్మ బుద్ధ్యా త్వమైవాహం....॥' అని చెప్పగలిగి, ద్వైతాద్వైత విశిష్టాద్వైతముల మూడింటినొక్కచో దనలో

నిమిడ్చి, సర్వముముక్షు కోటికాదర్శమైన పరమ భాగవతశిఖామణి యగు మారుతి శ్రీమద్రామాయణమున నొక దివ్యజ్యోతి. ఆధ్యాత్మిక ప్రపంచమున కోటి సూర్య భాతిగల ఒక మహాజ్యోతి. ఈ వివరములు సౌరభము 8 వ సంపుటమున గాంచెదముగాక !

## వైష్ణవవిధి — జననాదికము

'భగవంతం వాసుదేవం ప్రపన్నః స ప్రియో హి మే' (భాగవత. 4-24-28) విష్ణువునకు ప్రపన్నమైన భక్తుడు నాకు ప్రియతముడుసుమా, అని శ్రీ సాంబశివునిచే ప్రస్తుతింపబడిన నీ వైష్ణవము, 'వరం బ్రహ్మ పరం ధామ యోఽసౌ బ్రహ్మ తథా పరం। తమారాధ్య హరిం యాతి ముక్తిమప్యతిదుర్లభాం॥' (వి పు. 1-11-46) హరి నాశ్రయించి, అనన్య భక్తితో నారాధించి, ఎవరు ప్రపన్నులై విరాజిల్లుదురో, వారు బ్రహ్మాదులకలభ్యమైన ముక్తిని బొందుదురు అని, విష్ణుపురాణముచే గీర్తింపబడిన వైష్ణవము, దాని పుట్టుపూర్వోత్తరములను జాలవరకు జూచి యున్నాము. అది adumbrated in the Vedic hymns and partly developed in the Upanishads. It blossoms forth in the epics and in the later devotional literature[114] వేదసూక్తములలో సూచింపబడి, కొంతవరకు ఉపనిషత్తులలో నభివృద్ధి జెందెను. పురాణేతిహాసములలోను, పిమ్మట స్తోత్ర వాఙ్మయమునను, అది తర్వాత పుష్పించినదను ఆచార్య రాఘవన్ వాక్యము, వైష్ణవ జన్మ వృత్తాంతముల నిసుమంత సమీక్షించినది.

---

114. *Prof. T. S. Raghavan : Vedanta Kesari, p 36, 1959*

విష్ణ్వారాధనము ఋగ్వేదకాలమునుండి యతిప్రాచీనమై వచ్చు చున్నట్లు గాంచి యున్నారము. కాని కాలాంతర వైష్ణవమున ప్రధానమైన భక్తి ప్రసారములు వైష్ణవ సూక్తములయందుకంటె వేదముల, వరుణునకు అన్వయించు సూక్తముల గలదని హేమచంద్ర మహాశయుని అభిమతము.[115] అదే అభిప్రాయ మును రాధాకృష్ణ పండితుడును సూచించును.[116] భక్తి మార్గ మునగల యిష్టదైవ నిర్ణయములు, వేదముల గోచరించుననియు, నవియే భక్తి సంప్రదాయమునకు ఋనాదులనియు పండిత రాఘవన్ నిర్ధారణము.[117] మరియు, వేదమున వరుణ, సావిత్రి, ఉషస్సులగూర్చి గల సూక్తముల బఠించునపుడు, It is impossible ... not to feel thereln the presence of true bhakti, however inadequate, may have been its philosophical back ground [118] తాత్త్వికాధారములెంత అసంపూర్ణ ముగ గోచరించినను, అందు భక్తియొక్క యునికిని మనము గాంచక నుండజాలమని బెల్వాల్కర్, రానడే పండితుల అభి ప్రాయము. విష్ణుపరమైన సూక్తములలో గొన్ని, విష్ణువే విశ్వ మునకు సర్వాధారమనియు, సాతనికృప భూమిపై బ్రసరింప,

---

*115. Prof. Hemachandra Roy Chaudhuri : Materials for the Study of the Early History of the Vaishnava Sect, p 10*

*116. Dr. S. Radhakrishnan : Indian philosophy, Vol. I, p 78*

*117. Prof. T. S. Raghavan : Vedanta Kesari, p 35,1959*

*118. Dr. Belvalkar & Ranade : Indian Philosophy, Vol. 3 p 409*

మనము అతని ప్రార్థింపగలమనియు, నిట్టి సూక్తములే తర్వాతి వైష్ణవమునకు పరమాధారములనియు త్యాగీశానందుని తాత్పర్యము.[119] భక్తిమార్గము అర్వాచీనమని పలుకుట సాధారణమే గాని, వేదముల పఠించు విద్యార్థికి యీ సామాన్యాభిప్రాయము దోషభూయిష్టముగ దోచకమానదు అనియు, ఋగ్వేదమున, అనేక దేవతలకు సంబోధింపబడిన సూక్తసంచయము, భక్తినే ప్రతిపాదించునని పండిత రాఘవన్ వచించి, The Vedic literature shows that devotion was there already in a highly developed form. What is more surprising is that this literature of the earliest phase of our Bhakti, viz. the Vedic hymns, shows an extraordinary richness of moods in which the ancient worshipper approached his God, a richness which often excells the later stotra literature in respect of ideas[120] అత్యున్నత స్థాయిలో భక్తి వేదముల గలదని, వైదిక వాఙ్మయము తెలుపుచున్నది. వేద సూక్తములు నాబడు, యీ ప్రథమ భక్తి స్థితి, తర్వాత స్తోత్ర వాఙ్మయమును గూడ నధిగమించు అత్యున్నత భావములతో నా ప్రాచీన భక్తుడు, తన యిష్టదైవమును అర్చించినట్లు సువిస్పష్టమని విశదము చేసెను.

మరియు, వేదములలో విష్ణువు నదిత్యులలో నొక్కడై, గీతాశాస్త్రమునగూడ, 'ఆదిత్యానాం అహం విష్ణుః' (10-21) ఉత్తమాదిత్యుడనబడి. అతడే పాదత్రిన్యాసముతో అంతరిక్షమును

---

119. *Swami Tyagisananda : Prabuddha Bharata, p 146, 1946*

120. *Prof. V. Raghavan : Vedanta Kesari, p 330, 1955*

ప్రతిదినము లంఘించుచు, ద్వివిక్రముడనిగూడ యనబడి యుండెను. అంత, వేదముల లేకున్నను, సాత్త్వతము నాబడు విధి, 'ప్రాక్ సూర్యముఖనిఃసృతః' (శాంతి. 335. 19) పూర్వము సూర్యముఖమునుండి జనితము అనియు, నా సూర్యునినుండియే బహిర్గతమై. మనువిక్ష్వాకులకు జెంది పరంపరాప్రాప్తమై, రాజర్షుల ద్వారమున దనకు అందినట్లు శ్రీకృష్ణభగవానుడు గీతాశాస్త్రమున (4-1-2) వచించినట్లను, అంత. ఆ కృష్ణుడును ఆంగీరసుడైన ఘోరమహర్షి చెంత గ్రహించిన విద్యగానుండి, ఘోరుడు సూర్యోపాసకుడగుటచే, నిదియు సూర్యోపాసనా విధానమేయై యుండి, కృష్ణసన్నిధికి జేరినట్లును గాంచియున్నాము. మరల నీవిద్యయే శతపథ బ్రాహ్మణము, మహాభారత ప్రమాణముల ననుసరించి, ఏకాంతవిధి యనియు బాంచ రాత్రవిధియు నాబడి, శ్రీ విహావిష్ణువుచే మహర్షులకు, లేక చతుర్ముఖ బ్రహ్మకు, లేక ప్రజాపతులకు బోధింపబడి, నారదుని మూలమున బరివ్యాప్తి నొందినట్లును మున్ను చూచియున్నాము. క్రమముగ వేదములగల 'భగ' దైవము, భగవతుడై, భగవానుడై, భగవంతుడై, విష్ణువుతోనే నేకీభూతము నొంది, మార్గమధ్యమున దోచు హరి, నారాయణ, వాసుదేవ, కృష్ణ, రామ శబ్దముల నన్నింటి తనయందు లయింపజేసికొనుచు, భగునివలెను విష్ణువునివలెను అనంతవ్యాప్తమై, సర్వతోముఖమై, సర్వాకర్షణీయమై, శక్తివంతమై, జ్ఞానదాయకమై,

Vaishnavism, which in its various forms, is now recognised to be the most predominent and the most popular

religion among the Hindus 121 తన వివిధరూపములతో వైష్ణవము, హిందువులకు నతిప్రఖ్యాతమును, అతిప్రేమపాత్రమునునైన మతముగ గుర్తింపబడి విరాజిల్లుచున్నది. ఈ విధముగ నభివృద్ధి గాంచి, వైష్ణవము చాలవరకు ఆర్యావర్తము నాబడు ఉత్తరభారతముననే విస్తరించినట్లు దోచును. ఆ మహర్షి చంద్రులందరును ఔత్తరాహులేమో! అట్టి ఉత్తర భారతమునకు జెందిన సాత్త్వత, భాగవత, ఏకాంతిక, పాంచరాత్ర, నామముల బ్రశస్తమైన వైష్ణవము, ముఖ్యముగ శ్రీకృష్ణునితో, అతని జీవిత విశేషములతో, అతని బంధువర్గమైన సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ పురుషులతో నేకమై, మధుర బృందావన ప్రాంతముల బ్రఖ్యాతమై యుండి, క్రమముగ ప్రాక్పశ్చిమోత్తరముల బ్రసరించి, అంత దక్షిణా పథమును జొచ్చినట్లు ప్రస్ఫుటము. బండితాభిప్రాయము గూడ నిదియే. అది దక్షిణయాత్ర సాగించి, అందు వృద్ధిగాంచి, మరల ఉత్తరయాత్ర గావించి, ఎట్లు అటగూడ విస్తరించి, సర్వవ్యాప్తి నార్జించెనో గాంచెదము గాక!

## వైష్ణవము - దక్షిణాపథము

South India has made very valuable contributions to the religious thought of India. In fact, when Hindustan was passing through a period of great political convulsions, when her ancient civilization with its magnificient heritage of culture was being overthrown and subdued by the Muslim invaders from

---

*121. Prof. M. Rangacharya : The Three Great Acharyas, p 141*

outside, it was in Southern India that Indian culture was preserved and promoted [122] దక్షిణభారతము, భారతీయ మత, భావనా విధానములో నత్యమూల్య విషయముల నందించినది. యథార్థమున ఉత్తర హిందూస్థానము గొప్ప రాజకీయ సంక్షోభసమయముల ననుభవించునప్పుడు, అన్యదేశముల నుండి ఏతెంచిన మహమ్మదీయ దండయాత్రికులచే, దాని ప్రాచీన నాగరికతయు, పరంపరాయుక్తమైన అద్భుతసంస్కృతియు ద్రొక్కబడి పరాధీనమగు సమయమున, దక్షిణ భారతమున మాత్రమే భారతీయ సంస్కృతి పదిలపరుపబడి, అభివృద్ధిగావింపబడియున్నది. మరియు, It will be generally admited that Hindu religion found its best exponents in the South, and that its philosophy was put into a systematic form in that region [122] దక్షిణా పథమునందే హిందూమతము, తన సర్వోత్తమ వ్యాఖ్యాతల బొందినట్లును, ఆ మతమున దాని సిద్ధాంతము, ఒక క్రమవిధాన రూపమును దక్షిణ భారతముననే గాంచినట్లు, ఎల్లరంగీకరించు విశేషమే. మరియు, ఉత్తర భారతము సంతత దండయాత్రలచే నలమరుగుచు, గష్టకాలముల ననుభవించుచు, సంస్కృతి గోల్పోవు సమయముల, and it is precisely in the dark ages of the North, that often intervened between brighter epochs, that the South sent out its light to redeem the darkness [123] తేజోవంత సమయముల మధ్య కల్పించుకొనునట్టి అంధకారబంధుర కాలముల,

122. *Ramananda to Ramathirtha : pl*

123. *Dr. S. Krishnaswami Aiyangar : The Three Great Acharyas, p 95, 12*

శము ఆ చీకటిని బారద్రోల, ప్రకాశమును ప్రసరింపజేసెను ాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు వచించెను. అంతియగాక భక్తి విధానము ఉత్తరమునుండియే దక్షిణమునకేతెంచినది. మునగల భక్తులు, దానికి ద్రావిడ సంస్కృతిని జోడించి, మహా వెల్లువగ నొనరించి, యావద్భారతావనిని ముంచెత్తిరి ం నతని భావము.[123] నానాఘాట్ శాసనము ననుసరించి త మతము దక్షిణాపథమునకు క్రీ. పూ. మొదటి శతాబ్దమున యుండునని, రాధాకృష్ణ పండితుని తలంపు.[124] అయినను, నానికా హాండూ తాత్పర్యమున, The torch of faith was ht from the South, which was still a centre of culture, to what has been described as the gated and distracted North[125] పరాధీనమై చలించిన భారతమునకు, నేటికిని భారతీయ సంస్కృతికి మూలకేంద్ర క్షిణ భారతము, భక్తిజ్యోతిని దెచ్చియున్నది. ఈ చారిత్రక మున గాంచినచో, శ్రీశంకర, రామానుజ, మధ్వాచార్యులన ఆచార్య త్రియమును, వల్లభ నింబార్క రామానందాది ర్యులును, నాగార్జున దిఙ్నాగాది బౌద్ధ భిక్షువులును దక్షిణా ననే జన్మించి, ఉత్తరము నధిష్ఠించి, యెల్లరకాచార్య ు నధిష్ఠించి ఆదర్శప్రాయులగుటయేగాక, నా మత సిద్ధాంత ాక వినూత్న శోభను గల్పించి, తాత్త్వికాకారము నిర్మించి,

---

*Dr. S. Krishnaswami Aiyangar:*
*The Three Great Acharyas, p 95, 12*

*Dr. S. Radhakrishnan:*
*Indian Philosophy, Vol. 2. p 667*

*Prof. Nonika Handoo: Vedanta Kesari, p 278, 1960*

సర్వాకర్షణీయముగ గావించి, నాటి నాటి సాంఘికవ్యవస్థనేకాక, సంస్కృతీ రూపమునుగూడ, వైభవోపేతము గావించుట సర్వవిజ్ఞ విదితము. అయ్యాచార్య మండలికి దక్షిణాపథముమాత్రముగాక, యావద్భారతముమాత్రముగాక, సర్వప్రపంచ మానవకోటియు కృతజ్ఞతాంజలుల నర్పింపక నుండజాలరు. ఆ మహాత్ముల శక్తి సామర్థ్యములు అజేయములు. జ్ఞానవైభవములు అద్భుతములు. వారలకు సహస్రాధిక నమస్కారములు.

పద్మపురాణము, భక్తికాంత దక్షిణమునుండి ఉత్తరమునకు జేసిన ప్రయాణచారిత్రమును, విచిత్రముగ జిత్రించినది. నారద మహర్షి తన పరివ్రాజకమున నొక పర్యాయము, గోకుల బృందావన ప్రాంతములకు ఏతెంచెను. అట నొక ఎడారిభూమిలో, దుఃఖితయై యున్న ఒక యువతిని గాంచెను. ఆమెకిరుప్రక్కల క్రింద శవములవలె, నిరువురు పెద్ద వయస్కులు పడియుండిరి. దీనిగాంచి విస్మయముజెంది, నారదుడు ఆమెను సమీపింప, నా మహర్షి దర్శనముతో నామె యిసుమంత దేరుకొని, తన ప్రస్తుత దీనస్థితికి కారణమైన తన సమస్యను నిర్ణయింప నారదుగోరెను. 'ఉత్పన్నా ద్రవిడే సాహం వృద్ధిం కర్ణాటకే గతా। క్వచిత్క్వచిన్మహారాష్ట్రే ఘూర్జరే జీర్ణతాం గతా॥' నేను ద్రవిడదేశమున జనించితిని. కర్ణాటకమున నభివృద్ధి గాంచితిని. కాని మహారాష్ట్రమున గొంచెము, ఘూర్జరదేశమున సంపూర్ణముగ జీర్ణించిపోయితిని. అంత నా సుతద్వయముతో ముందుకు సాగిపోవ, ప్రయాణము అసాధ్యమగుచున్నను గష్టించి యిట జేరితిని. ఈ భూమిని నే స్పృశించుతోడ, నే యౌవనవతినై వెలుగొంద, నా పుత్రద్వయము వృద్ధులై నేలబడి మరణించిరి, అని తన దీన వృత్తాంతమును,

నారదునకా వనితారత్నము వివరించి, యీ మార్పులకు గారణము నారదునుండి అర్థించెను. నారదుడొకించుక యోచించి, సర్వమును గ్రహించి, దుఃఖకారణమావంతయు లేదని ప్రథమతః ఆమె నోదార్చెను. ఆమె భక్తికాంతయై యుండ, పుత్రులు జ్ఞాన వైరాగ్యములు. పూర్వము ముక్తి సాధనమునకు భక్తికంగభూత ములుగ జ్ఞాన, వైరాగ్యము లవసరములు. కాని యీ కలికాలమున, భక్తిమాత్రము చాలును. అంతియుగాక, శ్రీకృష్ణ పాదారవింద రజముచే బవిత్రమైన యీ మహాక్షేత్రమున, నిక జ్ఞానవైరాగ్య ములతో నవసరమేమి? అందుచే, నీ పుత్రులగు జ్ఞానవైరాగ్యము లిచట అంతరింప, భక్తి స్వరూపము తేజోవంతమై యొప్పారినది. అందుచేత నిక దన పుత్రులైన, జ్ఞాన వైరాగ్యము లామె కనావశ్యకములు. ఈ విధముగ, తన గాథా రహస్యమును నారదు వలన గ్రహించి, సంతృప్తచిత్తగ నా భక్తికాంత యైనదట!

ఈ విషయమును సమీక్షించుచు కృష్ణస్వామి అయ్యంగారు The points worth noting in this story for our purpose is that the Dravida country was the land of birth of Bhakti which flourished to a gradually diminishing extent in the Karnataka, Maharastra and Gujarat [126] ఈ కథననుస రించి, ద్రవిడదేశము భక్తికి జనన స్థానమనియు, నది కర్ణాటక మహారాష్ట్ర ఘూర్జరదేశముల క్రమక్రమ క్షీణత్వమునకరుదెంచి నట్టుల, ముఖ్యముగ మనకు దెలియుచున్నదని వచించెను. కాని దీనివలన ద్రవిడేతరస్థానములందు భక్తిపూర్తిగ లేనట్లు అర్థమా?

126. *Dr. S. Krishnaswami Aiyangar: Early History of Vaishnavism in South India, p 10*

అని సంశయము. భారతీయ భక్తవరేణ్యుల చరిత్రల ననుసరించి చూచిన, మహాభక్తులు యావద్భారతదేశమున వ్యాప్తమై యున్నట్లు విదితము. పూర్వోక్త విధానమున దాక్షిణాత్య వైష్ణవమునకాధారభూతమైన పాంచరాత్రాగమము దక్షిణాపథమున జనించినట్లు దోచదు. అటులే, ఆళ్వారులకు ముఖ్యమైన శ్రీకృష్ణ చరితామృతరంగము దక్షిణదేశమున జరుగలేదు. శ్రీకృష్ణ లీలా ఘట్టములు, ఆ దివ్యమకరందాస్వాదనాతన్మయులైన వృష్ణికాంతలు, వారి భక్తిచైతన్యదర్శనమున చైతన్యము తప్పిన మహాభక్తవరేణ్యుడు ఉద్ధవుడు, మొదలగువారి భక్తితన్మయతా రంగము, మధుర బృందావనములు, ఉత్తరఖండముననేగదా గలవు!

శ్రీ మద్భాగవత మహా గ్రంథమున, మరియొక విషయము గూడ ప్రస్తావింపబడియున్నది. వివిధ యుగముల, శ్రీమహావిష్ణువు యే యే రూపములదాల్చి భక్తులదరింపజేయునో అభివర్ణించుచు, ద్వాపరంబున భగవానుడు శ్యామలవర్ణుడై, పీతాంబరుడునై, బాహుద్వయుడై, మహారాజోపలక్షణుడునై యొప్పునని తెలిపి, 'నమస్తే వాసుదేవాయ నమస్సంకర్షణాయ చ। ప్రద్యుమ్నాయానిరుద్ధాయ తుభ్యం భగవతే నమః॥' (11-5-29) అని, చతుర్వ్యూహముల సంస్మరించి యుండెను. అంత కలిలో, 'కృష్ణం త్విషా కృష్ణం సాంగోపాంగాస్త్ర పార్షదం॥' (11-5-32) అని కృష్ణపరమాత్మను సూచించినది. అంత, 'కలౌ ఖలు భవిష్యంతి నారాయణపరాయణాః' (38) 'క్వచిత్క్వచిన్మహారాజ ద్రవిడేషు చ భూరిశః। తామ్రపర్ణీ నదీ యత్ర కృతమాలా పయస్వినీ॥' (39) 'కావేరీ చ మహాపుణ్యా ప్రతీచీ చ మహానదీ। యే పిబంతి జలం తాసాం మనుజా మనుజేశ్వర॥ ప్రాయో భక్తా భగవతి వాసుదేవేఽమలాశయాః॥' (40) ద్రవిడ

దేశంబునందు తామ్రపర్ణి, సహ్యజా, కృతమాలాది సకల నదుల కెవ్వడేని భక్తితో సేవింపుచట. 'బొదలితర్పణ మొగిజేయు బుణ్యు మొదవు' (అం. భా. 11-78). 'ఇవ్విధంబున బ్రశంసింపదగిన కావేర్యాది మహానదీ పావనజల స్నాన పాన దానంబులను విష్ణు ధ్యాన కథాసుధారసానుభవంబుల నిరూఢులగు భాగవతోత్తములు గలిగి దేనిం జెడని పరంబునుం బొందుదురని' (11-79) అని భాగవత గ్రంథము దెలుపుచున్నది. దీనిగురించి వ్రాయుచు, His real devotees will be found scattered here and there in the whole of Bharatavarsha, but they will be found in large numbers in the Dravida country on the banks of the Tamraparni, the Vaigi (Kritamala), the Palar (Payasvini), the Kaveri and the Mahanadi ..... It is in this favourable spot that He would descend to do the work of salvation [127] భగవంతుని యథార్థ భక్తులు భరతవర్షమంతటను వ్యాపించియున్నాను, ద్రవిడదేశమున తామ్రపర్ణి, వైఘి, పాలారు, కావేరి, మహానదుల ప్రాంతముల, నధిక సంఖ్యలలో నుందురు. ఇట్టి అనుకూల ప్రదేశమున, ముక్తికార్య నిర్వహణార్థము భగవంతుడవతరించునని కృష్ణస్వామి అయ్యంగారు వ్రాసెను. కాని మరల దీని సమీక్షించుచు, This citation would make the Bhagavatam a work posterior to the age of the Alvars, but it is possible that this chapter is a later interpolation [127] ఈ రచనము భాగవతమును, ఆళ్వారుల యనంతర కృత గ్రంథముగ గావించును. కని యీ స్కంధము, కాలాంతర ప్రక్షిప్తమై యుండనోపునని యు వాకొనియున్నాడు. ఈవిధముగ,

---

*127. Dr. S. Krishnaswami Aiyangar: Early History of Vaishnavism in South India. p 7*

ఉత్తరదేశమున జననము నొందిన భక్తిస్రవంతి, దక్షిణమునకు ప్రవహించి, దేశమున భక్తికల్పకములచే సమృద్ధి గావించి, మరల ఉత్తరమునకు ఎగప్రాకి, అందు విశ్వతోముఖాభివృద్ధి గాంచి, వికసించి, వ్యాప్తినొందినది. అట్టి వర్ధమానమునకు గారణభూతు లైన, మహాభక్త శిఖామణులైన, వైష్ణవాళ్వారుల చరితా విశేష ముల నొకించుక గాంచెదముగాక!

## ఆళ్వారులు

The saints are truely citizens of the world; they belong to the mankind [128] మహాత్ములు సర్వవిశ్వపౌరులు. వారు సకల మానవకోటికి జెందుదురు. These are the saints who live their life in God and form a spiritual nobility [129] ఈ మహాభక్తులు భగవంతునిలో జీవించుచు, పారమార్థిక ప్రభుగణ ముల నిర్మించిరి, అని భక్తి తన్మయత్వమున బాహ్యాభ్యంతర ముల మరచి, ఎల్లెడల నా పరమాత్మ వీక్షించుచు, నాలించుచు, పలుకరించుచు, స్తుతించుచు, క్రీడించుచు, గీర్తించుచు, నాట్యము సేయుచుండు నా అలౌకికానందోన్మాద పీయూష ఆస్వాదనాశీలుర గూర్చి విజ్ఞుల సూక్తులు.

An Alvar is a golden river of love and ecstasy which finds its dynamic peace in the boundless ocean

128. *Prof. T. M. P. Mahadevan : A Seminar on Saints p 8*

129. *Dr. S. Radhakrishnan : A Seminar on Saints, p 4*

of Divine Love, is a living Gita, breathing Upanishads and Shastras, a moving temple and hymning torrent of divine rapture [130] నిరవధిక భగవత్ప్రేమసాగరమున, ప్రచలిత శాంతిని గనుంగొనిన తన్మయత్వమును, సువర్ణ భక్తి ప్రవాహ మును ఆళ్వారు అగును. అతడొక సజీవమైన భగవద్గీత, సప్రాణ మైన ఉపనిషచ్ఛాస్త్రములు, పర్యటించు దేవాలయము, భక్తితన్మ యత గీర్తించు వెల్లువ, అని స్తుతింపబడును, మహాత్ముడైన ఆళ్వారు. ఆళ్వారులు, represent a very strong school of Bhakti which melts our hearts [131] హృదయమును ద్రవీక రింపజేయు ప్రభుభక్తి విధానమునకు ప్రతినిధులని నాగరాజారావు మహాశయుడు వచింప, were the poineers of the religion of love [132] భక్తి మతమునకు మూలపురుషులని స్మరణానందస్వామి వాకొనెను. The hymns of the Alvars were out bursts of God-filled souls [133] ఆళ్వారుల కీర్తనములు భగవత్ప్రపూరి తాత్ముల హృదయోద్భూతములని పండిత రాధాకృష్ణుడన, Their utterances contain the pearls that they have gathered from the depths [134] వారి పలుకులు అగాధమునుండి చేర్చు కొనిన ముత్యములని ఆచార్య శేషాద్రి సూక్తులు.

---

*130. The Editor : Aradhana, p 46, April 1958*
*131. Dr. P. Nagaraja Rao : Introduction of Vedanta, p 137*
*132. Swami Smarananda : Prabuddha Bharata, p 227. 1961*
*133. Dr. S, Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p 666*
*134. Prof. K. Seshadri : A Seminar of Saints p 161*

భగవంతుని అనంత కళ్యాణగుణ మహోదధిలోనికి దూరము జొచ్చి, ఆతనిలో నేకత్వముకొరకు దృప్తినొందని ఆర్తిచే ముంచి వేయబడి, అతని గుణాభివర్ణనములో స్థిరముగ నిలచియున్నవారు ఆళ్వారులు, అని రామకృష్ణానందుని వివరణము. [135] They are the eternal and ever free devotees of the Lord who once at His behest came down in human form to demonstrate, both by precept and example, the nature of true devotion to the benighted and erring mortals below [135] వివేక శూన్యులై, దోషభూయిష్ఠులై, క్రిందనున్న మానవులకు ఆదర్శోపదేశములచేత, యథార్థ భక్తిని ప్రదర్శింప, బరమాత్మచే నాదేశింపబడి, మానవాకృతి దాల్చిన, నిత్య స్వతంత్ర భక్తశిఖామణులు ఆళ్వారులనియు నా స్వామి వచనము. వారు, పరమాత్మని అమూల్యముగ గ్రహించి యుండుటచే, నట్టి భక్తితన్మయత్వము నొందిరని యతీశ్వరానందుడు వచించి, [136] వారు శ్రీకృష్ణునెక్కువగ గీర్తించిరి అని వక్కాణించెను.

ఈ ఆళ్వారుల సంప్రదాయముకూడ, దక్షిణదేశమునకు ఔత్తరాహులచే దీసికొని రాబడినదని దెలుపుచు, these Alvars, or the earliest of them, were the off-shoots of the Northern Bhagavatas [137] నీ ఆళ్వారులు, ముఖ్యముగ ప్రథములు

---

*135. Swami Ramakrishnananda : The Life of Ramanuja, p 10*

*136. Swami Yatiswarananda : Vedanta Kesari, p 188, 1957*

*137. Prof. Hemachandra Roy Chaudhuri : Meterials for the study of the Eerly History of the Vaishnava Sect, p 12*

ఉత్తరదేశ భాగవతులు, అనగా వైష్ణవులయొక్క శాఖ యని హేమచంద్రుడు వచించి, The first of the Acharyas was Nathamuni... was probably a descendant of the early Vaishnava immigrants from the North, who carried the Bhagavata cult to the Tamil country [138] ప్రథమాచార్యుడు నాథముని. ఇతడు తమిళదేశమునకు భాగవత మతమును గొని వచ్చిన ఉత్తరదేశీయ, వైష్ణవుల వలసవాడై యుండును అని హేమచంద్రుడు అభిప్రాయము నొందెను. దానినే బలపరచుచు, The Alvars were practically the earliest Brahmin missionaries to the South. They propagated the devotional aspect of the Vedanta in the Tamil land, and used the language of the people with great effect [139] ఆళ్వారులు, దక్షిణాపథమునకు అరుదెంచిన ప్రాచీన బ్రాహ్మణ ప్రచారకులు. వేదాంతముయొక్క భక్తి విధానమును, తమిళదేశములో ప్రచారము చేసిరి. సామాన్య ప్రజానీకముయొక్క భాషనుపయోగించి, సత్ఫలితముల నొందిరి, అని పండిత రాజగోపాలాచారి స్పష్టము గావించెను. ఈ విధముగ, నీభక్తాగ్రేసరులైన ఆళ్వారులు ఉత్తర దేశముల, నాటికే బహుళ ప్రచారము నొంది, అధికసంఖ్యాకుల నవలంబకులుగా నార్జించి, సర్వముముక్షుకోటి హృదయముల స్థానము సంపాదించి, అంతట తానయై ప్రకాశించుచున్న భాగవత,

---

*138. Prof. Hemachandra Roy Chaudhuri : Materials for the study of the Early History of the Vaishnava Sect, p 112*

*139. Prof. T, Rajagopalachariar : Vaishnavite Reformers of India., p iii*

వాసుదేవ, సాత్త్వత సిద్ధాంతమును దక్షిణాపథమునకు గొనివచ్చి, సర్వసామాన్యజనులకందుబాటు గావించుటకై, వారి తమిళ భాష లోనే ప్రచారము గావించుటచే, నా భక్తిప్రవాహము దక్షిణము నంతయు నావరించి, అభివృద్ధిగాంచి, సమృద్ధినొంది, పొంగి పొరలి, మరల ఉత్తర ఖండమున ప్రవేశించి, వినూత్న వైభవ మున ప్రసరించి ముంచివేసెను. 'ఆళ్వారు' పదమునకు భక్తితన్మ యత నుండువాడని అర్థము. లేక భగవద్భక్తిలో సంపూర్తిగ మునిగినవాడని తాత్పర్యము. అట్టిచో వారికి సాధ్యముకానిదేది ప్రపంచమున నుండగలదు! వారి శక్తి అపూర్వము, అజేయము, సామాన్యులకు దుర్జ్ఞేయమును గూడనై యున్నది. ఇక, అళ్వా రుల జీవితచరిత్ర విశేషముల గాంచెదముగాక!

## ఆళ్వారుల జీవితములు

'భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ। శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్। భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్। శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోస్మి నిత్యం॥' పూదత్తా ళ్వారు, పొయ్‌గైయాళ్వారు, పెయాళ్వారు, పెరియాళ్వారు, అండాళ్, తిరుమళిశైయాళ్వారు, కులశేఖరాళ్వారు, తిరుప్పాణి యాళ్వారు, తొండరడిప్పొడియాళ్వారు, తిరుమంగైయాళ్వారు. మధురకవియాళ్వారు, నమ్మాళ్వారు అని యీ పండ్రెండుగురును అళ్వారులక్రింద గణుతింపబడిరి.

The precise dates of the different Alyars cannot be determined. But it is generally agreed that they lived

at different periods during the three centuries beginning from A. D. 500 [140] వివిధాళ్వారుల నిశ్చయకాలముల నిర్ధారణముజేయ నసాధ్యము. కాని క్రీ.శ. 500 సంవత్సరములనుండి, తర్వాత మూడు శతాబ్దములవరకు జీవించియుందురని సామాన్యముగ నంగీకృతము అని, స్మరణానందస్వామి అభిప్రాయము. వారు ౬వ శతాబ్దము నుండి, ౯వ శతాబ్దమువరకుండినట్లు కృష్ణస్వామి అయ్యంగారు తలంచును. [141] మూలాళ్వారులనబరగు పెయాళ్వారు, పూదత్తాళ్వారు, పేయ్‌గై యాళ్వారు, వారి సమకాలికుడైన తిరుమలేశాళ్వారును, ద్వాపరయుగమున దొండమండలమున పల్లవరాజ్యకాలమున నుండినట్లు వచింపబడుట యుక్తి బాహ్యమనియు, పల్లవులు కంచీపురమును పాలించినది క్రీ. శ. నాలుగవ శతాబ్దమున అనియు, మహాశయుడైన గోపీనాథరావు తెలుపుచు, భూదత్తాళ్వారు రచనమున నేటి మహాబలిపురము, నాటి మామిళ్ళ తన జన్మస్థానమని స్పష్టముగ నుండుటచే, నా మామిళ్ళపురము ఏడవ శతాబ్దమున వేర్పడుటచే, నీ ఆళ్వారును తన సహచరులును, ఏడవ శతాబ్ద మధ్యమున నుండియుందురని, చారిత్రాత్మకముగ విశదపరచెను. [142] ఈ కాలనిర్ణయమున బహుళ కృషి గావించిన దివాన్ బహదూర్ స్వామి కణ్ణుపిళ్ళెగూడ, నీ మూలాళ్వారులకు క్రీ. శ. 720 సంవత్సర ప్రాంతము నిర్ణయించెనని అతని వచనము.

---

*140. Swami Smaranananda : Prabuddha Bharata, p 228, 1961*

*141. Dr. S. Krishnaswami Aiyangar : Early History of Vaishnavism in South India. p 89*

*142. Prof. T. A. Gopinatha Rao : The History of Sri Vaishnavas, p 16*

అందుచే, నీ యాళ్వారుల కాలనిర్ణయము, గురువరంవర ప్రకారము ద్వాపరముగాక, క్రీస్తు తర్వాతనే యని నిర్ణయము. కేవల ప్రాచీనత్వముచే శ్రేష్ఠత్వ, ఔన్నత్యములు సంప్రాప్తించునా ?

పండిత భాండార్కర్, ఆళ్వారులను త్రివిధముగ విభజించి, ప్రథను మధ్యమ అంతిమముల నిర్ణయించి, పొయ్‌గై, భూత పెయాళ్వారులు వారి సమకాలికుడు తిరుమలేశ ఆళ్వారును గలిపి, నలుగురు ప్రథమ శ్రేణికిని, నంత నమ్మాళ్వార్, మధురకవి, కులశేఖర, పెరియాళ్వారులు ఆండాళ్లును జేరి అయిదుగురు మధ్యకాలమువారుగను, నట, తొండరడిప్పొడి, తిరుప్పాణి, తిరుమంగై, ఆళ్వారులు ముప్వరు, అంతిమకాలమువారుగ తెలిపియున్నాడు.

## మూలాళ్వారులు 1. 2. 3

'కాంచ్యాం సరసి హేమాబ్జే జాతం కాసార యోగినం । కలయే యశ్శ్రియఃపత్యురరవిందమకల్పయత్॥' కాంచీపురమున, నొక సరోవరంబున కమలమధ్యమున, కాసారయోగి నాబడు పొయ్‌గై యాళ్వారు జనించెను. అటులే, సముద్రతీరమున, నాడు మల్లాపురము నాబడు మహాబలిపురమున, మాధవీపుష్పమునందు భూతయోగి నాబరగు పూదత్తాళ్వారును, అంత మయూరపురము నాబడి, నేడు మైలాపురము అనబడు ప్రదేశమున, నొక్కసరసిలో దెల్ల కలువలో మహాయోగి నాబడు పెయుళ్వారును జనించిరి. వీరిలో పొయిగై ఆళ్వారు, భక్తి సంప్రదాయమునకు భానుమూర్తి యని గౌరవింపబడును. అతడు ఆళ్వారుపరంపరకు ప్రథముడుగదా! వీరి ముప్వురి జన్మదినములు వెంట వెంట నొక్కొక్కదిన వ్యత్యాస

మున నుండుట ఆశ్చర్యకరము. సిద్ధార్థి నామ సంవత్సర, ఆశ్వయుజ మాస, శుక్ల పక్ష, అష్టమీ, మంగళవారము, శ్రవణా నక్షత్రమున, సరోయోగి నాబడు పొయ్‌గై యాళ్వారు జనింప, మరుదినమే నవమి, ధనిష్ఠా నక్షత్రమున, బూదత్తాళ్వారును, ఆ మరుదినము, దశమి, శతతారా నక్షత్రమున, పెయాళ్వారుగూడ జనించెను.

ఇట్లు, కవలపిల్లలరీతి జనియించియున్నను, ఒకరి నొకరి దెలియక మువ్వురును, వైరాగ్యజ్ఞానభక్తిసంపూర్ణులై, గ్రామైక రాత్రముల బర్యటించుచు, భక్తి తన్మయత్వమున, ఆనంద మగ్న మానసులై విరాజిల్లుచుండిరి. కాని, కాలపరిపక్వవశమున, వీరు ముగ్గురును గలియక దప్పినదికాదు. ఒక పుణ్య దివసమున ప్రథము డగు సరోయోగియైన పొయ్‌గై ఆళ్వారు, సూర్యాస్తమయ సమయమునకు దిరుక్కోమూరను గ్రామమునకేతెంచి, ఆ రాత్రి విశ్రాంతికై స్థలమునకై అన్వేషింప, నొక్కచో నొక్కడు శయనింప ననువగు స్థలము లభించెను. అతడచటనే రాత్రి విశ్రాంతిని గైకొనుచుండ, నింతలో భూతయోగియు నా యూరు జేరి, ప్రదేశమునకై తిరిగి, సరోయోగిదగ్గరకేతెంచి స్థలమునకర్థించెను. ప్రశ్నోత్తరముల, వారిరువురును విష్ణుభక్తులని గ్రహించి, ఇరువు రును గూర్చుండుటకు అనువుగ సర్దుకొని కూరుచుండియుండిరి. కొంతకాలమునకు, మూడవవాడైన మహాయోగియు, నా గ్రామ మున విశ్రాంతి స్థలమునకై వెదకి, సరో, భూతయోగులున్న చోట కరుదెంచి, కొంచెము స్థలమునకై అడిగెను. ఇతడును వైష్ణవ భక్తుడని తెలిసికొని, యిరువురు ఆసీనులగుటకు వీలగు నా స్థలము, మువ్వురు నిలుచుండుటకు సరిపోవునుగాన నతనిగూడ నాహ్వానించి,

అందు ముప్వురును యిమిడి, నిలుచుండియుండిరి. గాఢాంధకార ముగ రాత్రి యున్నది. కాని కొంతకాలమునకు దమ్ముగోరకయే మరియొకరు వారిమధ్య జేరినట్లును, అందుచే దమకు ఎక్కువ ఒత్తిడి దగిలి, ఇరుకు అయినట్లు గ్రహించి, యొకరి నొకరు ప్రశ్నించుకొన, నాల్గవ వారెవరును గానుపింపరైరి. అందుల కాశ్చర్యచకితులై వారు, భగవంతు బ్రార్థింప, నంత శ్రీపరమాత్మ వారికి సాక్షాత్కరించెను. ఆనందోత్సాహములు మిన్నుముట్ట, వెంటనే వారు ముప్వురును, దమిళమున వరుసగ మూడు పాశుర ముల ననగా బద్యములచే, నా దేవదేవు స్తుతించిరి. 'వైయంద గళియా వార్కడలే నెయ్యాగ వెయ్యకదిరో న్విళక్కాగ శెయ్యశుడ రాగియా నడిక్కే శూట్టిననే శొన్మాలై ఇడరాళి నంగవే యెన్ను'

క॥ ధారుణి ప్రమిదగ పారా, వారము ఘృతపూరముగను వనజాత హితుం, డారోపిత దీపముగా, నారతి నిడి సూక్తిమాల హరి కర్పింతున్' అని పొయ్గై ఆళ్వారు వచింప, 'అన్బె తగళియా అర్వమేనెయ్యాగ ఇన్బురు గుశిందై ఇడుతిరియావంబురుగి ఞానచ్చుడ ర్విళక్కేత్తి నేన్ నారనార్కు ఞానత్తమి పురిందినాన్'

క॥ మనమును బ్రమిదగ భక్తిని, ననువగు నెయిగాగ ప్రేమ నధికోజ్వలమైన। తనరెడు చిత్తమువర్తిగ, ఘనదీపము నెత్తితిపుడు కమలాక్షునకున్' అని పూదత్తుడు వచించెను. వెంటనే పెయాళ్వా రును 'తిరుక్కండెన్ పొన్మేనికండేన్ తిగమరుక్కవణి నరముం కండేన్ శెరుక్కిళరుం పొన్నా-కండేన్ ఎన్నా-వణ్ణి న్పాలిన్ను'

క॥ కంటిని నురమున లక్ష్మిని, గంటిని కనకంపు మేను కమలాప్త

రుచిన్, గంటిని కరయుగమును నే, గంటిని చక్రాబ్జములను గమలాక్షు నెడన్' అని ఆ పరమాత్మ గీర్తించెను. ఇంతకుమించి, యీ ముప్పురు ఆళ్వారుల జీవిత విశేషములు అలభ్యము. అయినను, వీరు దక్షిణాపథమున భక్తిలతకు బీజమువంటివారని ఎల్లరు గౌరవించెదరుగాక! భక్తి నమస్కరించెదరుగాక!

## తిరుమలేశైయాళ్వారు 4.

తిరుమలేశైయాళ్వారు ప్రథమమున శైవుడై యుండుటచే, శివవక్కియార్ అనియు, పిమ్మట భక్తిసారుడనియు నాబడియెను. ఇతని జన్మవృత్తాంతము అగోచరము. కాంచీ పురమునకు జేరువగల మహీసారపురమున, భార్గవుడను బ్రాహ్మణునకు, కనకాంగీ గర్భమున నతడుద్భవించెను. కనకాంగి భార్గవుని భార్య కాదనియు, నతడు గావించుచున్న యజ్ఞము నాటంకపరుప ఇంద్రునిచే బంపబడిన అప్సరస యనియు గొందరందురు. కాని పుట్టుకతో నతడు, శిశురూపమునగాక బండరూపమున నుండుట జనకులు గాంచి, చింతాక్రాంతులై, అడవిలో నొక వేప పొదయందు బారవేసిరి. అట్లుకాక, శిశువునే, అట త్యజించిరని కొందరి గాథ. శిశువు ఏడ్చుచునుండ, వేటకై ఆ ప్రాంతముల కరుదెంచిన దిరువాలన్ యను పల్లెవాడు, ఆ శిశువును గొని, తన భార్య పంకజవల్లికియ, నామెయు బిడ్డలు లేనిదగుట ఆనందముతో నా బాలు బోషించుచుండెను. కాని ఆ బిడ్డడు, సామాన్య శిశువులవలె క్షీరము నారగింపక, నీరమునైన స్వీకరింపక, నారోగ్యముగనే యుండుట వారికి ఆశ్చర్యమును గలుగజేసెను. ఈ విచిత్రము నాలకించి, యటగల యొక వృద్ధదవంతులు, క్షీరమును గొని

బిడ్డనికీయగ నతడు దాని ఆనందించెను. అందుచే ప్రతిదినము ఆ వృద్ధులు, నా బాలు నసాధారణ ప్రవర్తనమునకు సమ్మోద మొంది, నిత్యము నట్లాచరించుచు, నా బాలు భుక్తశేషమును బ్రసాదముగ తాము స్వీకరించుచు నుండిరి. కొంతకాలమునకు వారికి, అదృష్టము యినుమడించి, పుత్రసంతానము గలుగ, కుర్రనికి గణికన్నరు అనగా కణ్ణకృష్ణుడని పేరుంచిరి.

భక్తిసారుడును బెద్దవాడై సకలవిద్యా పారంగతుడై, సాధన ఆరూఢత్వమును సంపాదించి, దేశముల దిరిగి, తిరువక్కోళిని జేరి, యట వాసంబుండెను. తపోసిద్ధిచే నతనికి ననేక సిద్ధులుగూడ సంప్రాప్తించెను. ఆ కాలమున గొంకణీయుడైన యొక రసిసిద్ధుడు తన సిద్ధులకు గర్వము నొందుచు, దేశముల బర్యటించుచు, భక్తిసారు జేరి తన శక్తుల వివరింప, భక్తిసారుడు తన శక్తుల జూపించి, అతని గర్వమడంచెనని చారిత్రము.

తిరువక్కోళికి సమీపమునగల మైలాపురమున అప్పుడు పెయాళ్వారుండెను. అతడు భక్తిసారుని విషయమువలోకించి, అతని శైవభక్తి మార్పుజేయ సంకల్పించి, అతడు తన వనము ప్రక్కగ బోవుచుండు సమయమున అతడు చూచునట్లు మొక్కల దలక్రిందులుగ బాతుచుండెను. దాని గాంచి భక్తిసారుడు అతని బరిహసించి, 'యున్మత్తవా' అని ప్రశ్నింప పెయాళ్వారు, విష్ణుభక్తి లేనివారలే యున్మత్తులని సమాధానమొసంగెను. అంత వారిరువురకు శివ, కేశవ ప్రాధాన్య విషయు చర్చ జరిగి, భక్తిసారు డపజయముగాంచి వైష్ణవమును స్వీకరించెను.

అటనుండి గ్రుమ్మరుచు నతడు కాంచీపురమును జేరి వాసం బుండ, వరప్రసాద జన్ముడైన కణ్ణకృష్ణుడు భక్తిసారునికై వెదకుచు నటకేతెంచెను. అతడును నాటికి సకలవిద్యా పారంగతుడై, కవిభూషణుడై యొప్పియుండెను. ఇట్లు గురుశిష్యు లిరువురు కాంచీనగరమున మధుకరమున జీవించుచు నాశ్రమముననుండ, నొక ముదుసలి వారాంగన అట గల దేవాలయమున పరిచర్య గావించుచు, నీ యాశ్రమసేవగూడ జేయుచుండ, నొకదినమున భక్తిసారులు సంతసించి, ఆమెను దీవించి యౌవనత్వమును ప్రసాదించెను. అయ్యంగనా సౌందర్య మోహితుడైన నా కాంచీపుర ప్రభువు ఆమెను బరిణయమాడి, తనకుగూడ యౌవనప్రాప్తి గలిగింప భక్తిసారుని కణ్ణకృష్ణునిద్వార నర్థింపగోరెను. కాని కణ్ణకృష్ణుడు దా నియ్యకొననందున, నా రాజు కుపితుడై తన నగరము వీడిపో నాజ్ఞ నిడెను. అందుచే గురుశిష్యులిరువురును గాంచీపట్టణమును బాసి వెడలిపోవ, అందున్న దేవాలయములోని శేషశాయియు నదృశ్యమయ్యెను. దాని విని, భక్తి అధిగమింప నా ప్రభువు అర్థించి, మరల గురుశిష్యుల గాంచీపురమునకు బిలిచికొనివచ్చెను.

అట్లు కొంతకాలము, తిరుమలేశైయాళ్వారు కణ్ణకృష్ణులు కాంచీపురమున తపోభరితముగ నుండి, తిరుక్కొడంద నాబరగు కుంభకోణమునగల రమాకాంతుని సేవించి ధన్యతగాంచు నుద్దేశ్యంబున భక్తిసారులు వెడలిపోవుచు, దారి మధ్యమునగల పెరుంబులి యూరునుండి పోవుచుండెను. అచట వేదాధ్యయనము గావించుచుండు బ్రాహ్మణులితని అబ్రాహ్మణునిగ భ్రమించి, అధ్యయన

ు నిలిపి, అతడు రవ్వంత దూరమరిగిన యంత పునః ప్రారం
 యత్నించ, విడిచిన పాఠము స్ఫురింపదయ్యెను. ఆశ్చ
ునొంది వారలు, భక్తిసారుల క్షమాపణము గోరి అర్థింప,
ు మరల వారికా పాఠమును గుర్తుకు దెచ్చెను.

ఈతని అద్భుత శక్తుల నాలకించి, అందు యజ్ఞము
రించుచున్న బ్రాహ్మణుడు యాతని ఆహ్వానించి, అగ్రస్థాన
ి గౌరవింప, నితర బ్రాహ్మణులు అసూయావరులై, కుపితులై
క్షితుని నిందించిరి. అయినను భక్తిసారులు చలింపక దన
ల గొన్నింటి నట జూపించి, ఎల్లర లొంగదీసి, ఎల్లర నాశీర్వ
 కుంభకోణమును జేరెను.

ఈ కాలముననే యితడు అనేక రచనముల జేసియుండెను.
కోణమున గొన్ని వత్సరములు నివసించి, విష్ణు సాయుజ్య
ు బొందెను. అతని రచనములలో 'తిరుచ్చంద విరుత్తం'
్మఖం తిరు అండాడి' అను రెండు గ్రంథములుత్తమములు.
ీ మహానుభావుడు విద్యాపాటవములతోబాటు సాధన సిద్ధుల
 నార్జించి, దేశముల దిరిగి, తన అద్భుతానుభవకోటిని రచన,
ముల ద్వారమున భక్తకోటికి బ్రసాదించి, దివ్యత్వమును
ెను.

## నమ్మాళ్వారు, మధురకవి ఆళ్వారు 5, 6.

దక్షిణ భారత వైష్ణవమునకు, కులపతి యని ప్రఖ్యాతి నొందిన
ళ్వారు చాల సుప్రశస్తుడు. Indeed, the tide of spiritual
om that arose from saint Nammalvar, born in the

extreme South of India, embraced in tts wide sweep even the distant Gangetic valley, and in a sense, enriched and purified it [143] భారత దక్షిణాగ్రమున జనించిన నమ్మాళ్వారు మహాత్మునినుండి వెల్వడిన, పారమార్థిక జ్ఞాన ప్రవాహము, తన విశాల ప్రసారమున బహుదూరస్థగంగా తీరమునుగూడ గౌగిలించి, దానిని సారవంతమొనర్చి, పరిశుద్ధము గావించెను. అతని రచనములు సంస్కృతమునగల ఉపనిషద్వేదములవలె ప్రాధాన్యము నార్జించి, 'ద్రవిడ వేదము' నా బేరొందినవి. అందుచే నాళ్వారులలో నీతనికి గల గౌరవము అన్యులకు లేక, నితని మూర్తి అన్ని దేవాలయముల నర్చింపబడుచున్నది.

ఇతడు ఉత్తర దేశమున, గౌతమబుద్ధుడుద్భవించిన వైశాఖ శుద్ధ పౌర్ణమి దినముననే జన్మించుట, విశేషము. అతడు క్రీ.శ. 5 వ శతాబ్దమున నుండెననుట సముచితమని కృష్ణస్వామి అయ్యంగారు వాకొనెను. [144] తామ్రపర్ణీ నదీ ప్రాంతమున, దిరుక్కురుగూరునకు పాలకుడైన కారి యను ఉత్తమ శూద్రప్రభువు నమ్మాళ్వారునకు దండ్రి, ఉడయనంగ తల్లి. సకలైశ్వర్యములతో గూడి యున్నను కారికి సంతానప్రాప్తి లేకుండుటచే వగచి, తిరుక్కురుంగుడికి బోయి, అందు వేంచేసియున్న వైకుంఠవాసుని బుత్రభిక్షకై ప్రార్థింప, నా దేవదేవుడు అతని భక్తికి సంతసించి, తానే యతని గర్భమున జనించుచున్నట్లు వాకొని వరమిచ్చెను. అంత గొంత

143. *Prof. J. Pardhasaradhi : Vedanta Kesari, p 103, 1955*

144. *Dr. S. Krishnaswami Aiyangar ; Early History of Vaishnavism in South India, p 84*

కాలమునకు పుత్రోద్భవము అగుటచే ఆనందమొంది, ఆ బిడ్డనికి 'మారుడు' అని నామకరణము జేసిరి. శఠులను అనగా వంచకుల నడంచుటచే శఠకోపుడనియు, కాక 'శఠ' యన సంసారదోషముల నిర్జించుటచే శఠకోపుడనియు నతనికి బేరు గలిగెను. అట గల ఆదినాథస్వామి ప్రసాదించిన బొగడపూల మాలలను ధరించుటచే, వకుళాభరణుడు అనియు, పర మతముల నిరసించుటచే పరాంకుశుడనియు, నామాంతరములు గలవు. కాని ఎల్లరకు తరుణోపాయము నుపదేశించి, సర్వముముక్షుకోటికి సన్నిహితుడగుటచే నందరిచే 'నమ్మాళ్వారు' అని ప్రఖ్యాతి వడసెను. 'నమ్' అనగా 'మన' అని అర్థము.

శిశుజననమున యానందాతిరేకమున నాట్యము సలిపిన నా జననీ జనకులకు నిరుత్సాహము గలిగెను. సామాన్య శిశువులవలె గాక నీ కుమారుడు పాలుత్రావడు, మీదుమిక్కిలి నేత్రముల నైన దెరువడు! ఈ వింత శిశువును గాంచి దుఃఖితుడై, కారుడు తన మంత్రుల రావించి యోచింప, వారు సర్వేశ్వరుడైన ఆదినారాయణు సన్నిధానమున సర్వము స్పష్టమగునని వాకొనిరి. అటులే యని కారుడు, శిశువును ఆలయ ప్రాంగణమునకు గొంపోయి, దేవసన్నిధి నుంప, నా బిడ్డ యందరికాశ్చర్య, ఆనందములుప్పొంగునట్లు కన్నుల దెరచి, ఆ పరమేశ్వరు వీక్షించి, ఆలయ ప్రాంగణమున నున్న చింతచెట్టు దగ్గరకు ప్రాకుచు వెడలి, అందుగల నొక రంధ్రములో దూరి పద్మాసనాసీనుడై తపమున గూరుచుండెను. ఈ విచిత్రమును గాంచిన వారలత్యంతానందము నొంది, ఈతగి దైవాంశసంభవునిగ విశ్వసించి, అతనికి తపోభంగము వాటిల్ల

కుండు ఏర్పాటుల గావించిరి. ఈ విధముగ నీ బాలక తపస్వి, నిశ్చలముగ ఆహార నిద్రాదుల మరచి, నిరవధికముగ పదునారు వత్సరములు ఏకరూపమున ఉగ్రతపమాచరించెను. అట్టి అసాధారణ తపోశక్తిచే ఆతనిచుట్టు నొక తేజస్సు జనించి ప్రకాశించుచుండెడిది.

నమ్మాళ్వారుని స్థితి యిటులుండ, పాండ్యదేశమున గోశూరు అను గ్రామమున, సామశాఖీయుడగు బ్రాహ్మణుడు నారాయణుడనువాడు గలడు. అతనికొక బాలకుడుదయించెను. అతడు పిన్ననాటికే వేదవేదాంగాది శాస్త్రముల నధ్యయనము గావించి, మహాభక్తుడై, సంసార సాగరమున బడనొల్లక, దేశాటనమున తీర్థయాత్రల జేయుచు, నందందు తపము గావించుచు దిరుగుచుండెను. అటుల నతడు, హిమాలయమునగల నరనారాయణ తపోగరిమచే బ్రఖ్యాతమైన బదరికాశ్రమమున దపము గావించెను. అంత బర్యటనాశీలుడై యయోధ్యానగరమున నుండ, నొకనాటి రాత్రి అతనికి దక్షిణమున నొక మహాతేజస్సు గోచరించెను. మధురకవి ఆ తేజోదర్శనమున ఆశ్చర్యమునొంది, దాని కారణమారయ దాని నన్వేషించుచు బయనమై, కొంతకాలమునకు దిరుక్కురుగూరునకు జేరి ఆలయమునగల చింతచెట్టు తొర్రలోగల నా బాల మహాత్ముని గాంచి, నా ప్రకాశకారణమా తపోధనుడని గుర్తించెను. ఆతనితో బ్రసంగించు నిచ్ఛతో నెంత యత్నము గావించినను నిష్ప్రయోజనమగుటచే నా మధురకవి, యొక పెద్ద రాయితో గొప్ప శబ్దము గావించెను. ఆ శబ్దముచే తపోభంగమై నమ్మాళ్వారు కన్నుల దెరచెనందురు. అంత కవి ప్రశ్నములకు ముని సమాధానముల వచింప, శాస్త్రీయము అనుష్ఠాన యోగ్యమునగు నా

ప్రత్యుత్తరములకు నా పండితకవి నిశ్చేష్టుడై, నమ్మాళ్వారును తన శరణ్యముగ స్వీకరించి, గురుదేవునిగ విశ్వసించి, అందే యుండి సేవ గావించుచు నుండెను.

ఈ కథనము ప్రకారము మధురకవి నమ్మాళ్వారునకు పెద్ద వాడై యుండెను. అంతియగాక, మధురకవి గురుమరణానంతరము ఏబది వత్సరములు జీవించినట్లు కొందరందురు.[145] అట్లుగాక, మధురకవి నమ్మాళ్వారుని పరమపదప్రాప్త్యనంతరము, నేడు ఆళ్వారు తిరునగరి నాబడు తిరుక్కురుగూరికి ఏతెంచి, నమ్మాళ్వారు దేశికేంద్రుని అసాధారణ అమానుష ప్రజ్ఞావైభవమును విని, తపోబలమున నా మహాత్ము దర్శనప్రాప్తి నొంది, సంతృప్తచిత్తుడై అట సేవించుచు, తపోనిష్ఠనున్నట్లు కొందరి రచనములు.

ఆ విధముగ, శిష్యసేవ గొనుచున్న నమ్మాళ్వారు, ఆ దేవదేవుని ఆనందధాముని పరమాత్ముని గీర్తించుచు ననేక గ్రంథముల జెప్పెను. అవి ఆ యాళ్వారు హృదయ కుహరమున జనించి, పొంగి, ముఖతః బహిర్గతమైన ఆధ్యాత్మికానంద రసప్రవాహములు. అందు ముఖ్యములు ఋగ్యజురథర్వణ వేదసారభూతములుగ, 'తిరు విరుత్తము' 'తిరువాశరియము' 'తిరువందాది' అను

145. Prof. T. A. Gopinatha Rao : The History of Sri Vaishnavas, p 4

మూడును, సామవేదసారమయిన 'తిరువాయిమొళి' యను నాలుగు.

వానిని పఠించి, అందుండు పారమార్థిక రహస్యముల గ్రహించి, ఆనందాతిరేకమున మధురకవి, వానిని విరివిగ ప్రచార మొనర్చెను. కొంతకాలమునకు, సుమారు తన ముప్పదియైదవ యేట శఠాంకుశముని యనియు, శఠకోపుడనియు ప్రఖ్యాతుడైన నమ్మాళ్వారు, శరీరమును చాలించి పరమపదమునకేగెను. అంత గొన్ని సంవత్సరముల సద్గురు సందేశముల దేశముల జాటుచు, మధురకవియు దేహమును జాలించి గురుసన్నిధానమును జేరెను.

## కులశేఖరాళ్వారు 7.

'శ్రీ వల్లభేతి వరదేతి దయాపరేతి భక్తప్రియేతి భవలుంఠన కోవిదేతి। నాథేతి నాగశయనేతి జగన్నివాసేత్యాలాపనం ప్రతిపదం కురు మే ముకుంద॥' అని ప్రారంభించి, 'హే గోపాలక హే కృపా జలనిధే హే సింధు కన్యాపతే' అనియు, 'భక్తాపాయభుజంగగారుడ మణిః త్రైలోక్య రక్షామణిః॥' అనియు అనర్గళ ధాటిగ, మధురామృతరుచుల విజృంభించి, సంస్కృత వాఙ్మయాస్వాదనాశీలురకు అమృతపానముగ, వారి ముఖములకు 'ముకుందమాల' రూపమున నందించిన కులశేఖరాళ్వారుని స్మరింపనివారుండరు. ఆతని అమర కవిత దేశముల వ్యాపించి, తన్మయత్వము గలుగజేసెను. ఆ 'ముకుందమాలా' నిర్మాతయే ఆళ్వారులలో బరిగణింపబడిన కులశేఖరుడు.

ఇతడు, కొందరి లెక్కప్రకారము 9 వ శతాబ్దమున, కేరళ రాజ్యమును బాలించుచుండిన, క్షత్రియ చేరవంశమునకు జెందిన దృఢవ్రతునకు పుత్రుడుగా జనించెను. కేరళీయ రాజులకు, కుల శేఖర పదము తర్వాత బిరుదమై యందరికన్వయించుచు, కొందరు కులశేఖరులు కవితామతల్లి నారాధించువారై యుండుటచే, నే కులశేఖరుడు 'ముకుందమాలా' రచయిత యని పండిత లోకమున భేద భావములు గలవు. మరియు నొక కులశేఖరుడు మహమ్మదీయ మతమునుగూడ స్వీకరించి, మక్కా యాత్రకు వెడలియుండి అట నిర్యాణమొంద, నట అతని సమాధి నేటికిని గలదని వాడుక. ఎట్లైనను వీరందరికి దొలుత 'ముకుందమాలా' రచయితయై, పరమ భక్తాగ్రగణ్యుడైన కులశేఖరుడే ఆళ్వారుడై యుండునని తోచెడిని. ఇతనికి కులశేఖర పదము బిరుదముగాక నిజ నామముగాన, నితని ప్రఖ్యాతిని గౌరవించి, ఆ వంశమున కులశేఖర పదము నెల్లరు ధరించుచుండిరనుట సమంజసము.

దృఢవ్రతుడు నాడు 'కొల్లి' పట్టణమును బరిపాలించు చుండెను. అదియే నేటి క్విలాన్ పట్టణము. పుట్టినదాది బాలకు డల్లారుముద్దుగ రాజకుటుంబమున బెరుగుచు, గాలాంతరమున సకల శాస్త్రేతిహాసముల విద్యానిధియై ప్రకాశింప గాంచి, తండ్రి యగు దృఢవ్రతుడు రాజ్యభారమును పుత్రుపై నుంచి, వనముల దపోదీక్షకై వెడలెను.

కులశేఖరుడును, నైజమున గులశేఖరుడై, ధర్మపాలనమున బేరొంది, నెల్లర బిడ్డలనుగా జూచుచు, రాజ్యపాలనము గావించు చుండెను. కాని క్రమక్రమముగ విద్యాబలమెక్కువ యగుటచేతను

అతడు అంతర్ముఖుడై, ప్రాపంచిక సుఖముల దూరమున నుంచి, శ్రీరామచంద్ర పాదారవింద పూజాకైంకర్యలాలసుడై, భక్తి తన్మయత్వమున నుండెను. తన శరణాగతిని వెల్లగక్కుచు, 'పెరుమాళ్ తిరుమొళి' అను నొక దివ్యప్రబంధమును, శ్రీరఘురామునిపై రచించెను. ఇతని భక్తికి సంతోషించి స్యేనముదలి అను వైష్ణవాచార్యుడు, కులశేఖరుని శిష్యునిగ గైకొని, పంచ సంస్కార దీక్ష నిచ్చి అనుగ్రహించెను. అంత నితనికి భక్తి యినుమడించి, శ్రీరంగమహాక్షేత్ర దర్శనలాలసుడై నిత్యము ప్రయాణముగావింప నెంచినను, సంకల్పమీడేరకుండెను. ఈతడు శ్రీరంగమునకేగిన మరల దిరిగి రాడను అనుమానముచే నమాత్యులు అటంకముల గల్పించుచుండిరి. అంతియుగాక, కులశేఖరులు యిట్లు మార్పు చెందుటకు, నిత్యము అతని జేరుచుండు వైష్ణవాచార్యులని విశ్వసించి, వారి దూరముజేయ సంకల్పించి, ఆ మంత్రివర్యులు, పూజాగృహమునగల రత్నహారమును దాచి, ఆ నేరమును ఆచార్యులపై మోపిరి. కులశేఖరుడు విశ్వసింపక, నేర నిర్ధారణమునకు, ఒక కాల సర్పమును ఒక ఘటమున నుంచి, అందు దన ఉంగరమును వైచి, దానిలో జేయి యుంచి ఉంగరమును దీయ రండని అజ్ఞాపించెను. నేరస్థులు సర్పవాతబడుదురనియు దెలిపెను. వైష్ణవాచార్యులపై దన విశ్వాసమును ప్రదర్శించుచు కులశేఖరుడు, ఘటమున కరముంచి ఉంగరమును బైకి దీసినను, సర్పము కాటు వేయకుండుటకు ఎల్లరు ఆశ్చర్యమొంది, తమ నేరమునకు మంత్రులు సమ్మతించి, సత్యమును వాకొనిరి.

అంతియగాక నితడు, శ్రవణ భక్తిలో నుత్తీర్ణత నొంది యుండెను. స్యేనముదల్యాచార్యుడు, నిత్యమును కులశేఖరునకు శ్రీమద్రామాయణమును శ్రవణము గావించుచుండెను. ఒక దిన మున, అరణ్యకాండమున, ఖరదూషణవధా ఘట్ట వివరణమున, స్యేనముదలి 'చతుర్దశసహస్రాణి రక్షసాం భీమకర్మణాం। ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి॥' వదునాల్గువేల భీమ పరాక్రములైన రాక్షసులతో, ధర్మాత్ముడైన రామచంద్రుడొంటి నెట్లు యుద్ధము సేయగలడు అను శ్లోకము వివరించుచుండ, కుల శేఖరుడున్మత్తుడై, శ్రీరామ సేవాధన్యత్వము నొందవెంటనే లేచి, యుద్ధసన్నాహముల నాచరింప మంత్రివర్యులకాజ్ఞనిడ, స్యేనముదలి తన తప్పిదమును గ్రహించి, పరిస్థితిని నివారించుటకై, వెంటనే తర్వాత శ్లోకముల జదివి, ఖరదూషణాదుల మరణ వృత్తాంతమును వినిపించెను. అంత కులశేఖరుడు విశ్రాంతి నొందెను.

ఆదేవిధముగ మరొక దినమున, సీతాపహరణ విషయమును గురువు వివరించుచుండ, సన్యాసిరూపమున నేతెంచిన రావణుని దా వెంటనంటి, తన తల్లి శ్రీసీతా మహామాతను, రావణు బాహు బంధములనుండి విడిపింప, గులశేఖరుడు ఆయత్తుడాయెను. కాని వెంటనే గురువు, యుద్ధకాండానంతరము రావణ వధ, సీతారామ చంద్రుల సమాగమ వృత్తాంతమును జెప్ప విని, కులశేఖరుడు సమ్మోదమొందెను. ఈ విధముగ నితడు రాజ్య పాలనముకంటె, శ్రీ పరమాత్మసేవా నిమగ్న చిత్తుడై, నిత్య తన్మయత్వమున మునిగియుండుటచే, పండ్రెండుగురు ఆళ్వారులలో నొకడుగ బరిగణింపబడెను. అది ఎంతయు సముచితముగదా!

## పెరియాళ్వారు, ఆండాళ్లు 8, 9.

విష్ణుచిత్తుడను నీ పెయాళ్వారు, ధన్వినవ్యపురము నా శ్రీవిల్లి పుత్తూరను పాండ్యదేశ గ్రామమున, విష్ణ్వాలయమున పరిచారకుడైన ముకుందాచార్యునకు, పద్మావతీ గర్భమున జనించెను. ఇతనికి మధురాధినాథుడైన వల్లవరాయునితో సంబంధము చెప్పబడుటచే, 9 వ శతాబ్దమున జనించి యుండునని పండితాభిప్రాయము. 146 ఈ బాలునకు చిన్ననాటనే యుపనయనాది సంస్కారముల గావించి విద్యాదీక్ష నొసంగ, నా శ్రీ మహావిష్ణు భక్తియుక్తచిత్తుడగుట, ఆతని మనస్సు విద్యలలో జొచ్చదయ్యెను. సంతతము తిరుమంత్రమైన అష్టాక్షరీ మంత్రానుష్ఠానరక్తుడై కాలమును బుచ్చుచుండెను.

కాని కొంతకాలమునకు, నతడు భాగవత గ్రంథమున శ్రీ కృష్ణుడు పుష్పమాలాకారు గృహమునకు జని, మాలల ధరించి, మాలాకారుని దరింపజేసిన గాథ నవలోకించి. తాగూడ ధన్యత నొందు యదియు పరమోపాయమని విశ్వసించి, ఒక్కచో వివిధ పుష్పసంశోభితమైన వనమును బెంచి, నిత్యము నా గ్రామమున వేంచేసియున్న శేషశాయికి అర్పించుచు, ఆనందమున మునుంగుచుండెను.

ఈ సమయమున, దక్షిణ మధురాధిపతి వల్లవదేవరాయుడు, సామాన్య మానవ వేషమును ధరించి, తన నగర విషయముల

146. *Prof. T. A. Gopinatha Rao: The History of Sri Vaishnavas, p 23*

ప్రత్యక్షముగా వీక్షించు గుతూహలమున, నొక రాత్రి వీధుల దిరుగు చుండ, నొక వేదికపై నొక బ్రాహ్మణోత్తముడు పరుండి యుండెను. అట నా బ్రాహ్మణ పుంగవుడు ఒంటరిగ నుండుట గమనించిన రాజోత్తముడు దరికేగి ప్రశ్నింప నాతండును, దానొక యాత్రికుడననియు, కాశీబృందావనాది దివ్య క్షేత్రముల దర్శించి రామేశ్వరమునకు బోవుచు, మధురా నగరికి చేరినట్లును, అప్పటికి రాత్రి యగుటచే, నా వేదికపై విశ్రమించెననియు, సవిస్తరముగ వాకొనెను. అందులకు ప్రభువు సంతసించి, నబ్బ్రాహ్మణు మహాజ్ఞానిగా విశ్వసించి, ఒక పరమోత్కృష్ట విషయమును బోధింప నర్థింప నాతండును 'వర్షార్థమష్టౌ ప్రయతేత మాసాన్ నిశార్థమర్థం దివసం యతేత। వార్ధక్య హేతోర్వయసా నవేన పరత్ర హేతోరిహ జన్మనా చ॥' అను శ్లోకమును జదివి, వర్షాకాలమునందు ప్రయాసా రహితంబుగ జీవితమును గడుపుకొనుటకై, వత్సరమున మిగిలిన ఎనిమిది మాసములు కష్టించి, యార్జింపకున్నచో వ్యర్థమేగదా! అటులే, రాత్రి యవసరమైన వస్తుసామాగ్రిని, పగలు వెలుగుండ గనే సేకరించుకొనుట యుక్తముగదా! అటువలెనే వార్ధక్యము రాకపూర్వమే, జవ్వనముననే పరమేశ్వరు భక్తి సాధించుకొని యుండుట యవసరముగదా అను తాత్పర్యమును, సోదాహరణ ముగా నా బ్రాహ్మణుడు వివరింప నా రాజశేఖరుడు పశ్చాత్తాపము నొంది, తరువాత రాజగృహమునకేగి, మంత్రుల రావించి, జన్మ సార్థకము నొందు మార్గము నన్వేషింప, పండితసభ నొండు బిలి పించెను.

సభామధ్యమున నొక కంబము నెత్తించి, దాని శిఖరమున నొక సంచిని, బంగారు నాణెములతో నింపి కట్టించెను. సర్వేతర

పండితుల నోడించి, స్వీయ సిద్ధాంతము నే పండితుడు స్థాపించు కొనునో, అతనికి ఆ సువర్ణము బహూకరింపబడుటయేగాక, నాతని గురువుగా స్వీకరించి ప్రభువు సేవ గావించునని ప్రకటించెను. ఆ పభకు మూరుమూలలనుండి, అసంఖ్యాక పండిత ప్రకాండు లేతెంచిరి. విద్యాసుగంధమెరుగనివాడై యుండియు నా పర మేశ్వరు ప్రేరణముచే ధైర్యోత్సాహముల బొంది, పెరియాళ్వారు గూడ సభకేతెంచెను. బ్రహ్మతేజోవిభూషితుడైన నా విష్ణుచిత్తుని ఆ రాజు దూరమునుండియే గాంచి, గ్రహించి, ఉచితరీతి గౌర వించెను. వాద ప్రతివాదులచే సభాస్థలము ప్రతిధ్వనించెను. కాని పెరియాళ్వారు వాదములు భక్తి యుక్తములై, పరమేశ్వర ప్రేరణములై యుంట, నితరములు దుల్లవోయెను. సభాసదు లెల్లరు ఆనందము నొంది, పెరియాళ్వారును గజారోహణము గావించి, ఆ పట్టణమున గొప్ప యుత్సవము చేసి గౌరవించిరి.

కాని ఏమియు గర్వము సెందక, విష్ణుచిత్తుడు తిరిగి శ్రీవిల్లి పుత్తూరునకరిగి, తన పూర్వవనప్రవేశము గావించి, మాలాకారుడై, శ్రీ మహావిష్ణుని సేవాభాగ్యమున నిత్య మంత్రానుష్ఠానతత్పరిత నుండెను.

ఇట్లుండ నొకనాడు, విష్ణుచిత్తుడు తన వనమునకేగి, తోటపని గావించుచుండ, నందు జనకునకు సీత లభించినట్లు, ఒక శిశువు సంప్రాప్తించెను. సంతాన ప్రాప్తిలేని అతడు అత్యంతానందాతి రేకమున గృహమునకరిగి, తన సతీమణికా సుత నిచ్చి, మిగుల ప్రేమ వాత్సల్యములతో బెంచుకొనుచుండెను. గోదాదేవి అని యా బాలికకు నామమునుగూడ బెట్టిరి.

కాలక్రమమున నా బాలిక విద్యాబుద్ధుల నార్జించి మేధావి యయ్యెను, సంస్కార బలమున హృదయాంతర్గత భక్తియు ల్లువమై పెకుబుక, నెల్లవేళల శ్రీమన్నారాయణ పాదపద్మ యుగళ ధ్యానపరాయణయై యుండెను. తండ్రి విష్ణుచిత్తుడు వ కైంకర్యమునకై నిర్మించు మాలా కార్యమున నిమగ్న యయ్యెడిది. తన సౌందర్యము ఆ మహావిష్ణువునకు దులదూగునో దో యని యోచించి, తండ్రి లేనిసమయమున నామాలల ధరించి, దర్పణమున జూచుకొని, తన అందచందము కు బొంగి, వాని శ్రీరంగనాథునికర్పించుకొనెడిది. దాని గమ ంచి, యొక దినమున దండ్రి పెరియాళ్వారు కూతు వారించి, లికి మాలల భగవంతునకర్పింపకుండుటచే, నా రాత్రి శేషశాయి స్వప్నమున నాతనికి దోచి, గోదాదేవి భక్తిని వివరించి, ఆమె ముపయోగించిన మాలలు తనకు సమ్మతమగుటయేగాక, అవసర నియు బోధించి, వానినే తనకర్పింప శాసించెను. గోదాదేవికిని, క్తి వర్ధమానమై, యౌవ్వనప్రాప్తితో శ్రీ విష్ణుభక్తిపారవశ్యము ాడ సంప్రాప్తించ, 'దిరుప్పావై' అను ముప్పది పాశురములను, ాచ్చియార్ తిరుమొళి' అను నూట నలువది పాశురముల ించి. ఏకాంతమున బాడుకొనుచు దన్మయత నుండెడిది.

జవ్వని యగు పుత్రికకు వివాహము జేయ సంకల్పించి, రియాళ్వారు యత్నించ, ననువగు సంబంధము దొరకమికి ంచుచుండ గాంచి, గోదాదేవి, తా భగవంతునిగాక మానవుని ముమాడనని తెలియబల్కెను. అంత దండ్రి ముఖతః, 108

మహావిష్ణు క్షేత్రముల వైభవముల నాలకించి, గోదాదేవి తనకు శ్రీరంగధాముడే యిష్టుడనియు, నాతనికే తననిచ్చి వివాహము జేయుమనియు నర్థించెను.

అందులకానంద మొందిన తండ్రి సర్వ సన్నాహముల జేసి, శ్రీరంగ క్షేత్రమునకరిగి, యథావిధి శ్రీరంగనాథునికి గోదాదేవి నిడి వైభవముగ నుద్వాహము గావించెను. అంత నా గోదాదేవి యందరితో నాలయమునకేగి, లోని శ్రీరంగనాథుని పాదశుశ్రూషా భాగ్యమునకై గర్భాలయ ప్రవేశము గావించి, భగవానుని పాదసన్నిధి జేర, దృటికాలములో నామె అదృశ్యమై, నా అర్చా మూర్తిలో నైక్యమాయెను. ద్రష్టలెల్లరు ఆశ్చర్యానందవార్ని ధుల మునిగిపోయిరి. విష్ణుచిత్తుండును దాత్కాలిక దుఃఖము నొకింత బొంది, తెప్పరిలి, తన గూతు ధన్యతకేగాక, నట్టి పుత్రిక తనకు లభించి, తన జన్మ సార్థకత నొందజేసినందులకెంతయో యానం దించి, శ్రీ విల్లిపుత్తూరునకరిగి, అత్యధికతర భక్తివిశేషమున, వన మాలా కైంకర్యమహాసేవానిరతి కాలము గడుపుకొన శ్రీరంగమహా క్షేత్రమునుండి వెడలిపోయెను.

గోదాదేవి అని చిన్ననాట పేరు గలిగిన యీ ధన్యజీవి, భక్తుల నేలుకొనునది అను యర్థమున 'ఆండాళ్ళు' అనియు, స్వామికి దా నుపయోగించిన మాలికల నిచ్చుటచే 'శూడి కొడుత్తాళ్' అనియు నామాంతరముల గలిగి, ఆండాళ్ళు అను నామమున ముముక్షు కోటికి సుప్రఖ్యాతమై ప్రకాశించి మార్గదర్శి యయ్యెను. She led captive the proud conqueror of her heart, her devine Lover, by binding Him first with the garlands of flowers

and then with the garlends of her immortal lyrics glowing with divine fervour [147] తన పరమ ప్రేమికుని, తన హృదయమును జయించిన గర్వశాలిని, మొదట పూలమాలతోడను, పిమ్మట దివ్యపరిమళమును ప్రసరించు అమృత పాశుర మాలల చేతను ఆండాళ్ళు బంధించెను అను పరమాత్మానందుని వచనము లెంతయు ననుగుణములు. ఆ ధన్యజీవికి, శరణాగతి స్వరూపమునకు, సహస్రాధిక సాష్టాంగములు సర్వముముక్షువులర్పింపవల నుండగలరా!

## తొండరడిప్పొడియాళ్వారు 10.

విప్రనారాయణుడు అని సుప్రఖ్యాతుడైన, తొండరడిప్పొడియాళ్వారుని చరిత్ర చాల విషాదకరము, ముముక్షు లోకమునకొక అద్భుత గుణపాఠము. ఇంద్రియ ప్రవృత్తులతి బలవత్తరములై, ఎంతటివానినైన అజాగ్రత సమయముల లొంగదీసి, అతిదీనస్థితికి గొంపోయి, మానాభిమానముల మంచి చెడ్డలనైన పాటింపజాలని, ప్రపంచములోని పరిహాసముల, నిందల, సరకు సేయని అత్యంత హేయత్వమునకు దారితీయునని సాధకులకు యీతని జీవితము హెచ్చరిక జేయును.

చోళరాజ్యమున, మడంగుడి అను గ్రామము గలదు. అందుగల యొక బ్రాహ్మణ దంపతులు సంతానములేక భగవంతుని ప్రార్థింప కొంతకాలమునకు మగశిశువుద్భవించెను. ఆ శిశువు

---

*147. Swami Paramatmananda : Prabuddha Bharata, p 202, 1954*

శ్రీమన్నారాయణ వరప్రసాదుడగుటచేత, నతనికి విప్రనారాయణుడు అని పేరుంచిరి. గురువుల చెంత నీ బాలుడు విద్యల గ్రహించి, భక్తి జ్ఞాన వైరాగ్యముల బొంది, బ్రహ్మచర్యమున గాలము భగవత్సేవలో నుపయోగింప వివాహమును మాని, నిష్ఠాపరుడై యుండెను.

కాని ఆ యూర తృప్తి గాంచక, జేరువనున్న శ్రీరంగమునకు బయునించి, అట పరమాత్మ సేవానిమగ్నత నొందు కాంక్ష వెన్నాడ, శ్రీరంగ మహాక్షేత్రమును జేరెను. అట శ్రీరంగనాథునకు బుష్పమాలా కైంకర్యమునకై, తన జీవితమును, పెరియాళ్వారునివలె ధారవోయ నుద్యమించి, నొక్కచో శ్రమించి, యొక పుష్పవనమును బెంచి, పుష్పముల వివిధరూపముల మాలికలుగ నిర్మించి, శ్రీరంగశాయికర్పించి ఆనందించుచుండెను. అతనికి ఆ పుష్పవనము, శ్రీరంగనాథాలయముగాక, నితరముతో నెట్టి సంబంధములేక, విరాగియై భిక్షాటన ప్రాప్తమును భుజించుచుండెను.

ఇట్లుండ నొకదినమున, శ్రీరంగమునకు సమీపమున నిచుళాపురంబునగల, చోళరాజేశ్వరుని సన్నిధిలో గాన నృత్యముల గావించి, స్వగ్రామమైన కదంబనూరునకేగుచు నిరువురు వేశ్యాంగనలు, మార్గమధ్యమునగల ఈ పూదోటకువచ్చి, వన సౌందర్యమున కచ్చెరువందుచు, ఆనందించుచు, నందు వృక్షములకు సేవజేయుచున్న విప్రనారాయణునకు అంజలి ఘటించి మ్రొక్కిరి. కాని నిత్యభగవన్నామసంస్మరణాసక్తుడైన విప్రనారాయణుడు, అస్ఖలిత బ్రహ్మచర్యదీక్షా దక్షుడు కావుటచే వారి గన్నెత్తియైన వీక్షింపక,

నిరాదరణ మొనరించెను. అందులకు దేవదేవి యను చిన్నది కుపితయై, అతని నెట్టులైన తన దాసునిగ జేసికొనుటకు దీక్షాబద్ధయై యట నుండి వెడలెను. కాని మరునటి దినముననే తన దుస్తుల మార్చి, ఒక యోగినివలె గాషాయాంబరముల ధరించి, సాయం సమయమున వనమునకేతెంచి, తానొక వేశ్యననియు, దన జీవిత మునంతవరకు వ్యర్థము గావించి చెడగొట్టుకొంటిననియు, కాని జరిగినదానికి జింతించి, జీవిత శేషమును భగవత్సేవలో గడుప దీర్మానించుకొని, అందులకై విప్రనారాయణు నాశ్రయింప నట జేరితి ననియు గద్గద కంఠమున బలుకుచు, గన్నీరు గార్చుచు వివరించెను. అందులకు అమాయకుడై, అంతవరకు ఏ పాపమెరుగక, ప్రపంచము నెరుంగక, నందుండు బహువిధ వంచనములగూడ నెరుంగని అలౌకికుడగుట విప్రనారాయణుడు, యువతి వచనముల విశ్వసించి, తనతో నా వనమున నుండనియ్యకొనెను.

నాటగ్రోలె నా కపటి అతని వెన్నంటి దిరుగుచు, సర్వకార్యముల నండదండయై పనుల జేయుచు, నతని ప్రమత్త స్థితికొరకు వేచియుండెను. ఒకనాడు, సంధ్యాకాలమున, గారు మేఘము లతో జడివాన ప్రారంభింప, విప్రనారాయణుడు తన కుటీరమున నుండ, నీమె ఆ కుటీరమున నింతవరకు ప్రవేశింపనిదగుటచే, నాడైన లోనికరుగ ధైర్యము గాసక, నా వర్షమున దడిసి, యొక వృక్షము క్రింద నిలువబడియుండెను. విప్రనారాయణుడు ఆమె దీనస్థితిని గాంచి, కరుణించి, కుటీరము లోనికి రమ్మని పిలువ, నవకాశము సంసిద్ధముగదా అని సంతోషమున నా కుటీల ప్రవేశించెను. అంతటితో నూరకుండక నా అమాయకుడు, దేవదేవి

తడి వస్త్రములలో వడంకుచుండుట గాంచి, కనికరము పొ
వస్త్రము నొండు ధరింప నొసంగెను. ఇటుల నితడు
అడుగు కరుణచే ముందుకు వేయుచుండ, నా దుష్టయు
యవకాశము గదా యని, తన ప్రతిజ్ఞ నెరవేరుటకై పన
గట్టిగ వైచుచుండెను. అచట నామె వస్త్రముల మార్చి,
నతని దరి జేరి, సేవానెపమున నతని పాదశుశ్రూష గా
గ్రమక్రమముగ నతని లొంగదీసి, నాడు స్వాధీనపరచుకొ

ఆ దుర్ముహూర్తమునుండి, ఆతడు దేవదేవి దాసు
యాడించినట్లాడుచు, భగవత్సేవల మరచి, దేవదేవి సేవయే
ముగ నెంచి, సంపూర్ణ విషయసుఖలోలుడై యుండెను
దేవియు, నాతని తన యూరగు కదంబనూరునకు జేరి
ఎందరెన్ని యన్నను, ఎంత దూరినను, అవమాన
పరిహసించినను విప్రనారాయణునికి నవి యంటక, దేవదే
దాసుడై మెలంగుచుండెను. కాని తన ప్రతిజ్ఞ నెరవేరిన
నతనితో నా వేశ్యకు అవసరమేమి? ధనమాదాంధులుగ
దృష్టి దీర్పగలరు! అందుచే నొకనాడు, విప్రనారాయణు
నించి, దూషించి, యింటనుండి నెట్టివేసెను. అందులకు
కడుంగడు దుఃఖించి, అయినను పరితాపముగాని, పశ్చా
గాని యింకను బొడమకుండుటచే, నా జారిణీ సాహచ
వీడజాలక, నా గ్రామముననే పిచ్చివానివలె నుండెను.

ఆ సమయమున శ్రీ రంగనాథుడు, అర్చకుని
ఆలయమున బ్రవేశించి, అందుగల యొక బంగారు
దొంగిలించి, నాటి రాత్రికి దేవదేవీ గృహమునకు ఆ
విప్రనారాయణుడు పంపినట్లుగ నామెకిడెను. అందు

షించిన ఆ వేశ్యాంగన ఆతని బిలిపించి, మరల యథాపూర్వముగ నతనితో నుండెను. కాని దేవాలయాధికారులు నగరపాలుడైన రాజునకు చోర విషయము ఫిర్యాదు జేయ, వారు విచారించుచుండ, ఆ గిన్నె వృత్తాంతమును కనియున్న దేవదేవి గృహమును శోధించి, గిన్నెను గ్రహించి, దేవదేవీ విప్రనారాయణుల జెరసాలయందుంచిరి. మరల శ్రీరంగనాథుడు భక్తుని రక్షింపనెంచి, ఆ నగరపాలునికి స్వప్నమున దోచి, విప్రనారాయణుడు నిర్దోషి యని దెలుపగ, నా రాజు దేవదేవీ విప్రనారాయణుల వదలివేసెను.

అంత బశ్చాత్తాపము గలిగి విప్రనారాయణుడు, తన పూర్వ జీవిత హేయత్వమునకు బరితాపము నొంది, మరల వనమాలా కైంకర్యమున బ్రివేశించెను. కాని యిచ్చట రంగనాథుని సంబంధము ఆశ్చర్యకరము. ప్రారబ్ధానుభవమవసరమను నెపమున, రంగనాథుడు పై ఘట్టముల నెల్ల గల్పించి, చివరకు రక్షించినట్లు గాథ. తన స్వతస్సిద్ధమైన భక్తిప్రవృత్తుల గాలదన్ని, చౌర్యమును గూడ జేసెననినను దోషము కానేరదు. జారత్వముతో జోరత్వమును గలిసియే యుండును లోకమున. అందుచే విప్రనారాయణుడే చోరత్వమునకు గారణమై, కారాగార వాసమును అనుభవించి, విడిచిపెట్టబడిన పిమ్మట బుద్ధి గలిగి, పూర్వస్థితికరుదెంచెననిన సమంజసముగ నుండునని తోచెడిని. ఈతని భక్తికి సంతోషించి శ్రీరంగనాథుడే, యితని 'తొండరడిప్పొడి' భక్తాంఘ్రి రేణువు అని అనుటచే, నితడు తొండరడిప్పొడియాళ్వారు అను నామమున బ్రఖ్యాతుడయ్యెనట! ఇతడును, రంగనాథునిపై ననేక పాశురముల నిర్మించి కీర్తించెను.

## తిరుప్పాణియాళ్వారు 11.

యోగివాహుడు అని ప్రశస్తుడైన ఈ తిరుప్పాణియాళ్వారు, శ్రీరంగ మహాక్షేత్రము సమీపమున, చూళాపురము అను ఊరై యూరున నొక పంచమవర్ణ దంపతులకు జనించెను. జనింపక దొరికెనని కొందరందురు. కాని ఆ పంచమదంపతులు, అధిక భక్తి యుక్తులై యుండువారు. తండ్రి మాలదాసరి అనుపేర గౌరవ నీయుడై యుండెను. అట నీ శిశువు పెరిగి పెద్దవాడై, హృదయ కుహరమునగల భక్తిచే నా పరిసరముల నుండనొల్లక, గావేరీ తీరమున దిరుగుచు, భక్తిసాధించుచు, సంపూర్ణ ప్రపత్తితో శ్రీరంగ నాథుని గీర్తించుచు నుండెను. కాని మాలడగుడచే శ్రీరంగని దర్శనప్రాప్తి ఆ జన్మమునకు లేదుగదా యని చింతించుచు, అధికతర భక్తిమెయి నా దేవదేవుని బ్రార్థించుచు నుండెడివాడు.

ఇట్టులుండ నొక్క దినమున శ్రీరంగనాథాలయ ప్రధానార్చ కుడయిన సారంగయోగి కావేరీ స్నానార్థమై యరుగుచు, దారి ప్రక్కనున్న నా పంచముని బ్రక్కకు, దూరముగ నేగ నాజ్ఞ యిడెను. కాని అత్యంత బక్తి పారవశ్యమున బాహ్యమును సంపూర్తిగ మరచి, నిమిలితాక్షి నేత్రములతో శ్రీరంగని గీర్తించు చున్న నా భక్తాగ్రేసరునికి, యీ మాటలు హెచ్చరికలు చెవులకు సోకినవి కావు. అంత బ్రాహ్మణులు కొందరు అగ్రహోద్రేకమున నా భక్తితన్మయుని ఉన్మత్తులై రాళ్ళతో గొట్టిరి. తీవ్రముగ గాయములు గగిలి రక్తము స్రవించ నతడు బాహ్యస్మృతికి వచ్చి, ిస్థితుల గ్రహించి, నేరస్థునివలె భీతిజెంది, దూరముగ వెడలి ిరల శ్రీరంగనాథ సంకీర్తనారతిలో మునిగిపోయెను.

సారంగముని యథాప్రకారము ఆలయమున బ్రవేశింపగ లోని శ్రీరంగనాథుని లలాటముపై రక్తము గోచరించెను. ఇది యేమి అపరాధమో యని జింతింప, దేహమునగూడ గాయములు రక్తము గానుపించెను. వెంటనే రంగనాథుడతనికి గోచరించి, కావేరీ తీరమున నా భక్తాగ్రమణిని హింసించుట స్ఫురణమునకు దెచ్చి, ఆ మహాభక్తుడు తనకిష్టుడనియు, నాతని కపచారము గావించిరనియు దెలియజెప్పి, ఆ అపరాధ నివారణార్థమై ఆ మహాత్ము తన భుజస్కంధములపై మోసుకొని ఆలయమునకు రావలయుననియు, బ్రధానార్చకునికి శ్రీరంగనాథుడు వక్కాణింప, నా సారంగమునియు, విషయము నెల్లరకు దెలిపి, యందర వెంట నిడికొని కావేరీ తటమునకు జేరెను. బ్రాహ్మణులు అధిక సంఖ్యాకులు తన దగ్గరకు వచ్చుట గాంచి, ఇంకేమి అపరాధము దా జేసెనో, వీరింక నేవిధముగ దనను శిక్షింతురో యని, యా తిరుప్పాణియాళ్వారు భయభ్రాంతుడై దూరముగ నేగుచుండెను. కాని, ఎల్లరు వెంట నంటి, భయము లేదని బోధించి, శ్రీరంగని యాజ్ఞను దెలుప, నతడు అధికతర భయము జెందుచు, బ్రాహ్మణుల దగ్గరకు వచ్చుటయే ప్రబలాపరాధముగ నుండ, బ్రహ్మణోత్తము భుజముల నెక్కుటయు, శ్రీరంగనాథుని ఆలయ ప్రవేశము గావించుటయు నింకెన్ని మడుంగుల నేరమగునో యని భీతి జెంది, చింతించి వాపోవజొచ్చెను. ఎన్నివిధముల నెందరు బోధింపజూచినను అకర్ణింపని అతని, బలవంతముగ సారంగముని తన భుజములపై

నిడికొని, వేదఘోషతో, సంకీర్తనానాదములతో, మంగళ వాద్యము లతో దీసికొనిపోయి శ్రీరంగనాథ ఆలయమున బ్రవేశము జేసిరి.

ఆలయ ద్వారమున బ్రవేశించుతోడ నా భక్తాగ్రమణి తన్మయత్వము ముంచెత్త, బాహ్యాభ్యంతరముల మరచి, కన్నీరు ఏక ధారగా బ్రవహింప, నానందనృత్యమును జేయుచు లోన బ్రవేశించెను స్వప్నమునందైన గలుగ శక్యముకాని శ్రీరంగనాథు సాక్షాద్దర్శన మహాభాగ్యమున ఆతనికి ఉన్మత్తస్థితి గలిగినట్లయ్యెను. శ్రీరంగని సన్నిధికరిగి, అందు సాష్టాంగవందన మాచరించి, ఎల్లరు చూచుచుండగ శ్రీరంగనాథునియందు లీనమైపోయెను. అట్టి అసామాన్య మహాభక్తునికే అట్టి మహాభాగ్యము లభించునుగాని ఎల్లరకు సాధ్యమా? అసాధ్యము. భక్తి ప్రధానము గాని కులము ముఖ్యము గాదని యితడు, మహోత్కృష్ట సత్యమును దన జీవితమున ప్రపంచమునకు జాటి ఆదర్శపాత్రియుడయ్యెను.

## తిరుమంగైయాళ్వారు 12.

పరకాలుడని కీర్తిగాంచిన తిరుమంగైయాళ్వారు జీవితము అత్యద్భుతము. శ్రీ వైష్ణవ కైంకర్యమునకును, శ్రీరంగ నాథాలయ జీర్ణోద్ధరణ కార్యమునకును చోరవృత్తినైన స్వీకరించి, కార్యసాఫల్యము నొందిన కఠిన దీక్షాదక్షుడు. ఇతడు 9 వ శతాబ్దమున చోళదేశమున తిరుక్కొరయతారను గ్రామమున జనించెను. అందొక మ్లేచ్ఛదంపతులకు పుత్రుడుగా నితడు పుట్టెనని కొందరు 'శ్రీగురుభక్తవిజయ' గ్రంథమున వచింప, శూద్రకులమున జనన

మని 'మహాభక్త విజయము' వాకొానెను. ఇతని దండిప్రియే, ఆ చోళభూపతివద్ద సామంతుగనుండి కప్పముల గట్టువాడనియు, దాని, నీలనాముడైన తిరుమంగై యాళ్వారు పొందెనని మహాభక్త విజయ కర్త రచనము.

ఈ బాలకుడు, అధికబల ధైర్య స్థైర్య వీర్య సంపేతుడై, చిన్న నాటనే దుస్సాంగత్యముచే జోరత్వమున బ్రవేశించి, ఆ ధనమును వైష్ణవారాధనమునకు వెచ్చించుచుండెను. ఈతనితో బాధలు పడుచున్న ప్రజానీకము, చోళరాజేంద్రుని దగ్గరకు వెడలి విన్న వించుకొన, నాతడు నీల నామకుడయిన తిరుమంగని బట్ట రక్షకులకు శాసనము గావించెను. కాని అతని బట్టుట సాధ్యము కాజాల దయ్యెను. నీలుడే యొక రాత్రి చోళభూనాథుని అంతఃపురము జొచ్చి, ఆ రాజేంద్రుని శయ్యామందిరమున కేగి, రాజచంద్రుని మేల్కొలిపి, తాను నీలుండనబడు తిరుమంగడనని ఎరుక పరచెను. అతని స్వరూపము కేవలము శ్రీ వైష్ణవాకృతిగా ఊర్ధ్వ త్రిపుండ్ర ములతో శోభిల్లుచు, అతని భక్తి వెలి గ్రక్కుచున్నటుల నుండుట భూవల్లభుడు అవలోకించి, ఆశ్చర్యమొందెను. తిరుమంగై యాళ్వారు తన చోరవిధానమును రాజునకు దెలియజెప్పి, నాస్తిక, లుబ్ధ, స్వార్థులనుండి ధనమపహరించి, సాధు వైష్ణవ వినియోగార్థము దాని వ్యయపరచుచుండుట దెలుప, నా భూపతి ఆనందించి, అందులకై తానొక మండలము నీలునకొసంగి, చోరవృత్తి మాను మని ఆదేశించి పంపెను. ఆ మండలమునుండి, కొంత కప్పముగ రాజునకు తిరుమంగై యాళ్వారు చెల్లింప నియమము.

ఈ విషయమటులుండ, నా చోళరాజ్యమున, తిరునాంగూరను గ్రామమున, నొక వైద్యశిఖామణి విష్ణుదాసుడనువాడు గలడు. అతడు ఒక దినమున బరిసర గ్రామమునకేగి, తిరిగి వచ్చుచుండ, దారిమధ్యమున నొక పంచవర్షప్రాయముగల బాలికను గాంచి, ఆమెకు ఎవ్వరు పోషకులు లేకుండుటచే, దా సంతాన విహీనుడుగాన, వెంట నిడుకొనివచ్చి పెంచుకొనుచుండెను. ఆ బిడ్డయు గ్రమమున విద్యాబుద్ధుల నార్జించి జవ్వనియై, అతి సౌందర్యవతియై యుండుటయు, నామె వృత్తాంతము పరకాళ నామకుడైన తిరుమంగైయాళ్వారు ఆకర్ణించి, ఆమెను వివాహమాడగోరి అర్థింప, నా బాల పంచ సంస్కారవంతునిమాత్రమే పరిణయమాడుదునని వెలిబుచ్చెను. వెంటనే ఈ పరకాళుడు గురువర్యు జేరి, వైష్ణవమున బ్రధానమైన పంచ సంస్కారముల బొంది, మరల నామెజేర, నామెయు, దా గోరువారు, నిత్యము 1008 వైష్ణవులకు భోజనాదుల సత్కరింపవలయుననియు వచించెను. వల్లె యని పరకాలుడా పద్మవల్లి యనియు, కుముదవల్లి యనియు నాబడు నా కన్యను వివాహమాడెను.

కుముదవల్లి కోర్కె ననుసరించి, వైష్ణవ సమారాధనమునకెంత ధనమైనను చాలకుండెను. స్వీయము నంతయు వ్యయము గావించి పరకాళుడు, చోళరాజునకర్పింపవలసిన ధనమునుగూడ నుపయోగించుచుండెను. చోళభూపతి దీని నెరింగి ధనమునకై సందేశమును బంపగ, బరకాళుడు ధిక్కరించి చారుల బంపివైచెను. అందులకు రాజు కినిసి, సైన్యముల బంపి, అతని కష్టముపై వోడించి, బంధింప, మూడు రాత్రుల యనంతరము శ్రీరంగ

నాథుడు తన భక్తునికి గల్గు కష్టమునకు వగచి, రక్షింపనెంచి, అతనికి స్వప్నమున దోచి, కాంచీనగర ప్రాంతముల గల గుప్త ధనమును జూపించెను. అందులకు మోదమంది, పరకాలుడు అందరిగి, ధనమును బైకిదీసి, రాజధనమును జెల్లించి, శేషించిన దానిని మరల వైష్ణవ కైంకర్యమునకు వినియోగించెను.

కాని యీ ధనమెంతకాలమునకు సరిపోవును! కాన అతడు మరల చోరవృత్తికి జారి, దీనుల, వైష్ణవుల, సాధుల పేదలగాక నితరుల దోచుచు, తన కైంకర్యమునకు భంగము వాటిల్లకుండునట్లు కాపాడుకొనుచుండెను. కొంతకాలమునకు శ్రీరంగనికి గరుణ గలిగి, అతని కృతార్థుని జేయనెంచి, పెండ్లికుమారునిచందము రూపు ధరించి, పెండ్లివారల నిర్మించి, పరకాలుడుండు అరణ్యమున బయనించుచు వచ్చుచుండెను. దాని గాంచి పరకాలుడు ఆనందము నొంది, తన పరివారముచే బెండ్లివారిని జుట్టుముట్టి, గూడ సర్వము లాగికొని, వరుని కాలివేప్రిలికి గల బంగారు యుంగరమును నోటబట్టి కొరికి లాగి, మోసికొనిపోవ యత్నింప, నది అతనికి వశముకాని భారవంతమై యొప్పారెను. అందులకతడు ఆశ్చర్యము బొంది, వరుని జేరి, 'మంత్రప్రయోగము జేసితివా' అని ప్రశ్నింప, నాతడును 'నా' వని, తనకుగూడ నా మంత్రోపదేశము గావించెనన్, అతని దక్షిణ కర్ణమున అష్టాక్షరీ మహా మంత్రోపదేశము గావించి, తన నిజ స్వరూపమున నప్పరకాలునకు దర్శనమిడెను. అంత నతడు చింతించి, శ్రీరంగని స్తుతించెను.

అంత నతడు శ్రీరంగ క్షేత్రమును జేరి, అందలి దేవాలయ ప్రాకార మంటపాదులు శిథిలములై యుండుట గాంచి, చింతించి,

వాని జీర్ణోద్ధరణమార్గమునకై యోచించి, అది స్వల్ప ధనమున జరుగనేరదని గ్రహించెను. అందులకై నాగవట్టణమున గల బౌద్ధాలయమున బూజింపబడుచున్న సువర్ణ బుద్ధ విగ్రహమును దొంగిలించి, కరిగించి, ఆ ధనముతో శ్రీరంగనికి బ్రాకారాదికమును నిర్మించి ఆనందించెను.

అట శ్రీరంగముననే కుముదవల్లీ సమేతుడై వాసంబుండి, నిత్యము శ్రీరంగని సేవించుచు, వైష్ణవ సమారాధనముల గావించుచు, కాలక్రమమున బరమపదము నొందెను. అతని జీవితము, విచిత్రము, అద్భుతము అసమము.

## ఆళ్వారుల రచనలు

The works of the Alvars may be described as welling with a genuine love of an extremely intense degree for Vishnu and in their earnestness and fervour they stand only on a par with the equally strong and touching appeals to God made in their Tevaram by the Saiva Saints [148] ఆళ్వారుల రచనములు, విష్ణుదేవుని కొరకు తీవ్రతరమును పవిత్రమునునైన ప్రేమచే నుబుకుచున్నవని వర్ణింపవగును. వాని యాతురతయందు, రక్తియందు శైవ భక్తుల తేవారమునకు సరిసమానముగ నుండగలవు. అంతియగాక, Even the hardest heart cannot resist the extremely pathetic and beautifully poetic appeals of Kulasekhara

148. *Prof. T. A. Gopinatha Rao: The History of Sri Vaishnavas, p 29*

and Andal or a Tiruppanalvar [148] అత్యధిక అర్ధ్రములు అలంకారికములైన కులశేఖర, ఆండాళ్ళు తిరుప్పాణి యాళ్వారుల విన్నపములకు, ఎట్టి కఠిన హృదయమైన ద్రవింపకమానదు అని, పండిత గోపీనాథరావుయొక్క చక్కని వివరణము. ఆళ్వారుల రచనములనుండి, తర్వాత వైష్ణవమున బ్రధానమైన ప్రపత్తి అభివృద్ధి జేయబడినదని స్మరణానందుని అభిప్రాయము. [149] ఈ విధముగ బండితులనేగాక, పామరులగూడ నాకర్షించి, భక్తి తన్మయత్వమున గన్నుల నశ్రుసంతతుల బ్రవహింపజేసి, ద్రవిడ దేశమును భగవద్భక్తిరసామృతసింధువులో ముంచి ఎత్తి, పాడి, ఆనందనృత్యము జేసిన ఆళ్వారుల గీతా ప్రశంస కష్టతరము.

ఆళ్వార్లు పండ్రెండుగురు రచియించి ప్రసాదించిన ప్రబంధముల ద్రావిడవేదము అనియు, నాలాయిర ప్రబంధము అనియు నందురు. అందు మొత్తమునకు నాలుగువేల పాశురములు, అనగా పద్యములు గలవు. అందు

ప్రథమ సహస్రము:—

| | | |
|---|---|---|
| పెరియాళ్వారు | తిరుపల్లాండు | 12 |
| ,, | పెరియాళ్వారు తిరుమొళి | 461 |
| శ్రీ ఆండాళ్ళు | తిరుప్పావై | 30 |
| ,, | నాయ్చ్చియార్ తిరుమొళి | 143 |
| కులశేఖరాళ్వారు | పెరుమాళ్ తిరుమొళి | 105 |

149. *Swami Smarananda: Prabuddha Bharata, p. 228, 1961*

| | | |
|---|---|---|
| * తిరుమళిశై యాళ్వారు | తిరుచ్చంద విరుత్తమ్ | 120 |
| తొండరడిప్పొడియాళ్వారు | తిరుప్పళ్లి యెళుచ్చి | 10 |
| ,, | తిరుమాలై | 45 |
| తిరుప్పాణియాళ్వారు | అమలనాదిపిరాన్ | 10 |
| మధురకవియాళ్వారు | కణ్ణినుణ్ శిరుత్తాంబు | 11 |
| | | 947 |

ద్వితీయ సహస్రము:—

| | | |
|---|---|---|
| తిరుమంగై యాళ్వారు | పెరియ తిరుమొళి | 1084 |
| ,, | తిరుక్కురుండాండకం | 20 |
| ,, | తిరునేడుందాండకం | 30 |
| | | 1134 |

తృతీయ సహస్రము:—

| | | |
|---|---|---|
| నమ్మాళ్వారు | తిరువాయి మొళి | 1102 |

చతుర్థ సహస్రము:—

| | | |
|---|---|---|
| పొయ్గై ఆళ్వారు | మోదల్ తిరువందాది | 100 |
| పూదత్తాళ్వారు | ఇరండాం తిరువందాది | 100 |
| పెయాళ్వారు | మూనాం తిరువందాది | 100 |
| తిరుమళిశై యాళ్వారు | నాన్ముగం తిరువందాది | 96 |

| | | |
|---|---|---|
| నమ్మాళ్వారు | తిరువిరుత్తం | 100 |
| ,, | తిరువా శిరియం | 7 |
| ,, | పెరియతిరువందాది | 87 |
| తిరుమంగై యాళ్వారు | తిరువెళు క్కూత్తిరుక్కై | 1 |
| ,, | శిరియ తిరుమడర్ | 77½ |
| ,, | పెరియ తిరుమడర్ | 148½ |
| | | 817 |

ఈ విధముగ $947 + 1134 + 1102 + 817 = 4000$. ఇవి యింత అధిక సంఖ్యాకములుగ నున్నను, యిందు తత్త్వవిషయ విచారణమునకుపయుక్త విషయములు అరిది. అన్నియు భగవద్భక్తి ప్రపూర్ణములై పూర్వోక్త చందము, ఆనంద, విరహప్రవృత్తులచే శ్రోతల హృదయముల గదల్చును. కాన, నివి వైష్ణవ సిద్ధాంతమున తాత్త్వికముగ గాకపోయినను, అందుగల శరణాగతి, భగవదనుగ్రహానుగ్రహ విషయ ప్రదర్శనమున నెక్కుడుపయుక్తములు. కేవలము విషయోపదేశములను, మహత్తరాదర్శమును గూడ ముముక్షువులకు నెదుటనుంచి, అధికతర సహాయభూతము లగుచున్నవి.

యతీశ్వరానందుల వచనములలో, నీ వైష్ణవాళ్వారులు వివిధ భావముల నా భగవంతుని గీర్తించు విధానము హృదయముల

గదలించును.[150] పెరియాళ్వారు భగవంతుని వాత్సల్య భావమున, యశోదా దృష్టి గాంచి గానము చేసెను. అతని పుత్రిక ఆండాళ్ళు, ఆ పరమాత్ముని కృష్ణునిగ చిత్రించుకొని మధుర భావమున గీర్తించెను. అదేవిధముగ బురుషుడయ్యును నమ్మాళ్వారు, మధుర భావమున మున్గి, భగవంతుని కృష్ణపరమాత్మగ భావించి పారవశ్యము నొందెను. కులశేఖరుడు సంపూర్ణ ప్రపన్నుడై, వైష్ణవమున జివరి సాధనయైన శరణాగతి నవలంబించి, పాడి ఆనందించి ధన్యుడయ్యెను.

అన్నింట ప్రధానస్థానము నలంకరించిన 'తిరువాయిమొళి' దివ్య ప్రబంధము మణిపూస. ఆ పదమునకర్థము 'నోటి పలుకులు' అనదగును. అది వేదము నా ప్రశస్తము. ఇందు the secrets of the Vedas and the inspiration of the Vedic seers of old have been recaptured[151] వేద రహస్యములు, వైదిక మహాత్ముల ఉద్వేగములు మరల పట్టుబడి, లోకమున వెలువరింప బడినవి. మరియు out of the sublime experiences of the lofty soul has grown the spiritual wealth, garnered by a succeeding generation under the name of Ramanuja Siddhanta[151] ని మహాత్ముని దివ్యానుభవ సంచయము నుండియే, రామానుజుని సిద్ధాంతముపేర, పర్యాత తరములవారు అనుభవించుటకై, పారమార్థిక సంపద పెరిగినది. అంతటితో

---

*150. Swami Yatiswarananda : Vedanta Kesari, P 188, 1957*

*151. Prof. J. Pardhasaradhi : Vedanta Kesari, p 103, 1955*

నిలువక, దక్షిణాగ్రమున నుండిన యీ నమ్మాళ్వారునుండి వెలు వడిన ఆధ్యాత్మిక జ్ఞానము, తన సువిశాల బాహుయుగ్మముచే నార్యావర్తమునుగూడ గౌగిలించినది అని, ఆచార్య పార్థసారథి వచనము. అతఃపూర్వము, ద్రవిడ దేశమునగల భక్తకవుల భావ పరంపరల మధురామృతముగూడ, నమ్మాళ్వారు రచనముల పునః ప్రవహించినది అనియు, తజ్ఞుల అభిప్రాయము. కృష్ణస్వామి అయ్యంగారు అభిప్రాయమున, మొదటి ఆళ్వారులు నల్వురును కేవలము విష్ణుభక్తులగుటయేగాక, శైవ భక్తికిగూడ దమ ఆనందమును వెలిబుచ్చి, విష్ణుభక్తితో సమానముగ జూచిరి. The earliest Alvars go the length even of declaring Siva and Vishnu as one, although they do recognize the united form of Vishnu [152] మొదటి యాళ్వారులు విష్ణువు యొక్క ఏకస్వరూపము గుర్తించి యున్నను, శివ విష్ణువుల సమానత్వమును జాటునంత ముందునకేగియుండిరి. నమ్మాళ్వారు శివునకు, విష్ణు సమాన స్థానము నొసంగక, ఆదరభావమున జూచెను. తర్వాత యాళ్వారులలో, నీ గౌరవాదరములు కాను పింపవు అని అతని భావము.

వేదకాలముల బీజరూపముననుండి, మెల్లన విష్ణు, భగ రూపముల నంకురించి, ఉపనిషత్తుల ఉపాసన విద్యల రూపమున బెరిగి, పురాణేతిహాసముల బుష్పించిన వైష్ణవము, ఆళ్వారుల దివ్య ప్రబంధమున ఫలింప బ్రారంభించినట్లు అయ్యెను. వైష్ణవ సంప్రదాయమున నీ ఆళ్వారుల రచనములు, సంప్రదాయ

152. *Dr. S. Krishnaswami Aiyangar: Early History of Vaishnavism in South India p 77*

విచ్ఛిన్నత్వమును గాపాడి, తర్వాతి వారలకు వైష్ణవామృతమును నోటికందించి యిచ్చినట్లు గావించినది. అందులకెల్లరు ఆ ఆళ్వారు సమూహమునకు, సహస్రాధిక నమోవాకముల నర్పించెదరుగాక! కృతకృత్యులగుదురుగాక!

## వైష్ణవాచార్యులు

The Vaishnava teacher accepted as such among the Vaishnavas of South India, fall into two broad classes, the Alvars (saints) and the Acharyas (teachers) [152] వైష్ణవ గురువులుగ స్వీకరింపబడిన దక్షిణ హిందూస్థాన వైష్ణవులు, ఆళ్వారులు అనగ జ్ఞానులనియు, ఆచార్యులు అనగా బోధకులు అని ద్వివిధముగ విభజ్యము. ఈ తారతమ్యమును గోపీనాథరావు పండితుడు వివరించుచు, the former being the saints who had realised Brhaman and had persona enjoyment of His grace, whereas the latter were the learned propounder and elaborator of the philosophy contained in the works of Alvars and were certainly far lower than the Alvars [153] మొదటివారు మహాత్ములై బ్రహ్మము బొంది, ఆతని దివ్యానుగ్రహప్రాప్తి ననుభవించినవారై యుండ, దర్వాతవారు పండితవ్యాఖ్యాతలై, ఆళ్వారుల రచనముల గల తాత్త్విక విషయ వివరణము గావించెదరు. వీరు ఆళ్వారుల

---

*152. Dr. S. Krishnaswami Aiyangar: Early History of Vaishnavism in South India, p 77*

*153. Prof. T. A. Gopinatha Rao: History of Sri Vaishnavas, p 29*

కంటె తక్కువవారు అని ఆచార్య గోపీనాథరావు అభిప్రాయము. ఆచార్యులు, ఆళ్వారులంతటి అనుభవ సంపన్నులుకాక, సామాన్య ప్రజానీకముకంటె నధికులని కృష్ణస్వామి అయ్యంగారు తలంచెను.[154] వీరు ద్రవిడ వైష్ణవమునకు మేధాసంపద గల వారు అని, పండిత హేమచంద్రుని తాత్పర్యము.[155] అయినను వీరు కేవలము పండితమాత్రులు కాదనియు వాకొనుచు, As philosophy and religion are not divorsed from each other in India, the great Indian philosophers have all been saints[156] భారతదేశమున తత్త్వవివేచనము, మత జీవనములు వ్యతిరేకములు కాదు కావున, మహోత్తమ భారతీయ తత్త్వవేత్తలు అందరును అనుభవసంపన్నులే యని, ఆచార్య మహదేవన్ సమర్థించెను. అందుచేత, ఆళ్వారులనుండి వైష్ణవ సిద్ధాంతము ఆచార్యుల హస్తములకెట్లు అందినదియు, అట నది ఎట్లు రూపము నొందినది మొదలగు విషయముల నింక, బరిశీలించెదముగాక!

## నాథముని ఆచార్యులు

వైష్ణవ సిద్ధాంత విస్తరణమున ఆళ్వారుల బిమ్మట, ఆచార్యుల ప్రభావము నాథముని ఆచార్యునితో ప్రారంభించును.

---

154. Dr. S. Krishnaswami Aiyangar: The Three Great Acharyas, p 98
155. Prof. Hemachandra Roy Choudhuri. Materials for the study of the Early History of Vaishnavism, p 112
156. Prof. T. M. P. Mahadevan: A Seminar on Saints, p 6

ఇటనుండి ఆళ్వారుల శబ్దమదృశ్యమై, యాచార్య నామముపయోగింపబడును. ఇక వైష్ణవము భక్తిభావముతో సహ, మేధా విజృంభణముగూడ గలిగి, సర్వ సౌందర్యమున ప్రకాశించును. నాథముని ప్రపత్తి సిద్ధాంతమునకు ప్రాధాన్యము నొసంగెను. రామానుజీయ మతమునకు నితడు మూలాధారమని యనదగును. ఇతడు ద్రవిడ వేదమునకు ప్రాముఖ్యము నిడి, సంస్కృత వేదములతో సమానప్రతిపత్తిని గూడ సంప్రాప్తింపజేసి, వైష్ణవాలయముల ప్రత్యేక ఉత్సవములకాలమున, నా ద్రావిడ వేదపఠనమునకు ప్రోత్సాహమొసంగెను. ఇతడు గావించిన యీ మార్పుచే, సంస్కృత ద్రావిడ భాషలుభయములు వైష్ణవులకు ముఖ్యమై, 'ఉభయ వేదాంత' మను వినూత్న పద్ధతి వైష్ణవమున రూపొందెను. కాని యిదియే, మరియు కాలాంతరమున, సంస్కృత ద్రవిడ విభేదములచే వైష్ణవులలో విభేదముల గల్పించి, వడగళై తెంగళై శాఖలుగా వైష్ణవము చీలుటకవకాశమొసంగినది. ఈ వివరముల తర్వాత గాంచెదముగాక!

నాథముని ఆచార్యుడు 500 సంవత్సరములు జీవించినట్లు ప్రతీతి. క్రీ. శ. 920 సంవత్సరమున కాలధర్మము నొందినట్లు చరిత్ర. పండిత రాజగోపాలాచారి అభిప్రాయమున, 2 వ శతాబ్దమునుండి 7 వ శతాబ్దమువరకు, దక్షిణ భారతమున నెలకొల్పబడి వ్యాపించిన భాగవత పాంచరాత్రమును ఉత్తర హిందూస్థానమునుండియు, యమునానది తీరమునుండియు దెచ్చిన వలస ప్రజకు జెందినవాడీ నాథమున్యాచార్యుడు. 157

157. *Prof. T. Rajagopalachriar: Vishnavite Reforrners of India, p 1*

చోళదేశమున వీరనారాయణపురము ఇతని జన్మస్థలము. ఈతని తండ్రి ఈశ్వర భట్టారకుడు. పితామహ నామమైన నాథముని ఇతనికి బేరుంచిరి. ఆ గ్రామాధిష్ఠాన దైవము మన్నారు కృష్ణుని, మిక్కిలి భక్తిప్రపత్తుల గొలుచుచుండును. అయినను దృప్తిగాంచక నాథమునివరుడు ఉత్తర భారత యాత్రకు జని, పాదచారియై గోకుల, బృందావన, హరిద్వార, మధుర, ద్వారక, బదరీ, కేదార, ప్రయాగాది పుణ్యక్షేత్రములయందా యా భగవన్మూర్తుల దర్శించి, ప్రార్థించి, జగన్నాథ, సింహాచల, అహోబిళ, వెంకటాచలముల గాంచి, ఆనందించి, మరల వీరనారాయణపురి కేతెంచి శాస్త్రాధ్యయనమున నుండెను.

ఈ విధమున జీవితము గడుపుచున్న నాథముని, ఒక్క దినమున యిర్వురు వైష్ణవులు ఆ యూరునకరుదెంచి 'నారావముదే' అను 'తిరువాయి మొళి' పాశురముల బాడుచుండుట విని, ఆనందించి ఆశ్చర్యచకితుడై, వాని కర్తయొక్క వివరముల నాలకించి, ఎటులైన నీ అమృతరసమయ గ్రంథమును సేకరించు సంకల్పము బొడసూప నా వైష్ణవుల బ్రశ్నించెను. కాని వారు తమ అసమర్థతను తెలియపరచుచు, నమ్మాళ్వారు సన్నిధికిం బోవ సలహా నొసంగిరి. వల్లె యని నమ్మునీంద్రుడు సత్సంకల్పబద్ధుడై, శఠకోపుని కురుకాపురికి (ఆళ్వారు తిరునగరి) అరిగి, అందుగల మధురకవి శిష్యుడు పరాంకుశదాసును పృచ్ఛ సేయ, నాతండును దన యశక్తతను వెల్లడించెను. కాని నమ్మాళ్వారు సన్నిధి, నియమితవిష్ఠుండై తపంబొనర్చిన, నతని దర్శన ప్రాప్తియు గ్రంథప్రాప్తియు గలుగునని పరాంకుశదాసు వచింప,

నాథమునియు నట్లు గావించెను. అంత నతని తపమునకు మెచ్చి శఠకోపుడు దర్శనమొసంగి, గ్రంథమునంతటిని జెప్పి, యీ విధముగ నితర ఆళ్వారులచేగూడ నిర్మింపబడిన ద్రవిడ గ్రంథము సేకరించి, వేదముల వ్యాసుడు విభజించినరీతి చతుర్విధముగ విభాగింపుమని ఆదేశమిడెను. ఈ విషయమున, నమ్మాళ్వారు సాక్షాత్తు తన గ్రంథముల దెలుపుట ఎటులున్నను, నాథముని పట్టుదల వహించి, అందందు అన్వేషించి, సంపూర్ణ గ్రంథమును సంపాదించెను.

దాని పఠించి, మాధుర్యమును గ్రోలి, అటులే ఆళ్వారుల పండ్రెండుగురి ప్రబంధములగూడ సేకరించి, పూర్వోక్తము రీతి నాలుగు భాగముల విభజించెను. అంత జోళరాజాస్థానమున గల యొక వేశ్యాంగనా సహాయమున, నీ ద్రవిడవేదమును దేవగాన బద్ధమొనరించి, క్రమబద్ధము గావించెను. ఈ విధముగ వైష్ణవము నకు, ద్రావిడ సాంప్రదాయమును సమన్వయించి, ఒక వినూత్న శోభను గల్పించిన కీర్తి నాథమునీంద్రునిది.

## యామునాచార్యులు

పై వచింపబడిన నాథముని ఆచార్యునికి, ఈశ్వరమునియను కుమారుడు గలడు. నాథముని ఉత్తరదేశ యాత్రలు గావించుచు యమునానదీతీరమున నుండ, నీశ్వరముని భార్య మగశిశువును కనియెను. యమునాతీరమున బుట్టుటచే పితామహుడు, ఆ శిశువు నకు యామునాచార్యుడని నామమిడినట్లు చరిత్ర. అట్లుగాక నాథముని నిర్యాణానంతరము యాతడు జనించెననియు,

నాథముని శిష్యుడైన శ్రీరామమిశ్రుడు యీ శిశుజన్మ వృత్తాంత మును ముందుగా, నాథముని దనకు జెప్పియుండుటచే సంతోషించి, నామకరణంబొనర్చెననియు గాథ.

బాలకుడసాధారణ మేధాసంపత్తి గలిగి, మహా భాష్య భట్టరువద్ద సకల విద్యల నార్జించి, అపర సరస్వతీ స్వరూపమువలె శోభాయమానంబుగ నుండెను. నాటి చోళభూపతి యాస్థానమున, అఖిల విద్యాభూషణుడై విద్వాంసులనెల్ల జయించి, వారినుండి తన యాధిక్యతా ప్రకటనమునకై గప్పముల గొనుచుండిన అక్కియాళ్వాన్ పండితుడు, మహాభాష్య భట్టరు కప్పము పంపనందున, దన సేవకునిచే నాజ్ఞను బంపెను. కాని దరిద్రుడైన భట్టరు చేయజాలునదిలేక జింత మునింగి యుండ, నందుండిన యామునాచార్యుడు, గురు చింతకు వగచి, ఆ యాక్కియాళ్వాన్ సేవకుని ధిక్కరించి పంపివైచెను. అందులకు గుపితుడై ఆ పండిత సింహము, యామునాచార్యుని చోళ ప్రభు ఆస్థానమునకు విద్వ ద్వాదమునకాహ్వానించెను.

సభాస్థలి, నీ బాలభాస్కరుని గాంచి అమందానందాశ్చర్య ముల బొందనివారుండరు. రాజపత్నియు సభ నలంకరించి, ఆ బాలసింహము జయము గాంచ నీప్సించుచుండెను. కుర్రని జూచి, తనకు సమప్రత్యర్థికాడని తలంచి, ఆ ఉద్దండ పండితుడు, నిర్లక్ష్యభావము వహించి, శాస్త్రచర్చకు యితడు చాలడను భావ మున, నొకరు మూడు ప్రశ్నముల వేయ, రెండవ వాడు, ఆరు

విధములుగా ఖండింపవలయునని బలికి, చిన్నవాడైన యామునా చార్యునకు ప్రశ్నములు వడుగ ప్రథమావకాశమొసంగెను. అందు లకు యామునాచార్యుడు ఆలోచించి, (1) నీ తల్లి గొడ్రాలు కాదు. (2) ఈ రాజు సార్వభౌముడు. (3) రాజమహిషి పతివ్రత యని తెలిపి, వాని ఖండింప ఆక్కియాళ్వాన్‌ను గోరెను. తన తల్లి గొడ్రాలనుట ఎట్లు? అసందర్భము. తన రాజు సార్వభౌముడు గాదనిన, రాజాగ్రహమునకు గురి కాగలడు. అటులే రాజమహిషి పతివ్రత కాదనినచో నురికంబము సంప్రాప్తించును. అందుచే నెటుల సమాధానము నీయక, నా పండితుడు తన యపజయము నకు సమ్మతించెను.

అంత నా రాజదంపతులు, యామునాచార్యుని మేధాసంప త్తికి సంతోషించి, కౌగిలించి, 'వమ్మై ఆళవదిరో' అనగా మమ్మేలు కొనుటకు వచ్చితివా అని రాణి అనుటచే, నాటనుండి యామునా చార్యుడు ఆళవందారు అనియు ప్రశస్తి నార్జించెను. అంతటితో నూరుకొనక, రాజదంపతులు, అతని అమితముగ ధనసంపదల సత్కారము గావించి, అనేక అగ్రహారంబులగూడ అతని కర్పించిరి. అర్ధరాజ్యమునే రాజు యిడెననియు చరిత్ర. అట్లు తలవని తలం పుగా లభించిన సిరికి బద్ధుడై, విషయ సుఖసంపదల మునిగి, పూర్వ విద్యాసంపదను గోల్పోయి, ధనమదాంధుడై అతడుండెను.

కాని, నాథమునివర్యు శిష్యుడైన శ్రీరామమిశ్రుడు యితిని స్థితికి జింతించి, ఎటులైన పతని రక్షింప సంకల్పించి, అచ్చోనరిగి అతని దర్శింప యత్నించెను. కాని అవకాశము గలుగజాల దయ్యెను. అంత నెట్టులో వంటవాని మిత్రత్వము సంపాదించి,

ఆళవందారునకిష్టమగు కూర నెరింగి, నిత్యము దాని గొనివచ్చి యిచ్చుచుండ, నా పాచకుడును ఆ కూరను ప్రత్యేకముగ పచనము గావించి, ఆళవందారునకు భుజింప నిడుచుండెను. అయినను ఆ అనుపాక వృత్తాంతమును ఆళవందారు ప్రశ్నింపడయ్యెను. ఈ విధముగ కాలక్షయమగుచుండ మిత్రుడాలోచించి, వరుసగ గొన్ని దినములు కూరను దీసికొనిరాక నూరకుండెను. ఆళవందారు అప్పుడు ఆ కూరనుగూర్చి ప్రశ్నించి, నాడు ఎందులకు జేయ లేదని పాచకుని బ్రశ్నించి, ఒక వృద్ధ వైష్ణవుడు నిత్యము దెచ్చు చున్నాడని ఎరింగి, ఆతని తన సన్నిధానమునకు దీసికొనిరా యాజ్ఞాపించెను. మరుసటి దినమున శ్రీరామమిత్రునకు ఆ విధ ముగ ఆళవందారు దర్శనము లభింప, ఆళవందారు ధన సంపద లొసగ సంసిద్ధత జూపినను, ఆళవందారుని పితామహులు తన దగ్గర నొక పెన్నిధి నుంచి, తన పౌత్రునికొసంగ నాజ్ఞాపించెనని జెప్పి, తన వెంట వచ్చుచో దాని ఆళవందారునకిడి తన కర్తవ్యము నేరవేర్చుకొందునని శ్రీరామమిత్రుడు వచించెను.

అందులకానందము జెంది, ఆళవందారు శ్రీరామమిత్రుని వెంట శ్రీరంగమునకు జేరి, అష్టాక్షరీ మహామంత్రోపదేశము స్వీక రించెను. అంత మిత్రుడు, యామునాచార్యుని శ్రీరంగనాథుని సన్నిధికి గొంపోయి, ఆ ప్రసన్న గంభీర సౌందర్యరాశియైన ఆ శ్రీరంగనాథమూర్తియే నాథముని తనకొసంగిన అమూల్య సంపద యని వాకొనెను. అంత నా సౌందర్య మధురామృత మూర్తి రంగని గాంచి, మైమరచి, తన పూర్వస్థితి స్మరించి, సర్వమును త్యజించి, సన్న్యసించి, ఆ శ్రీరంగ మహాక్షేత్రముననే

మఠము నిర్మించుకొని నివాసముండిపోయెను. అట నా శ్రీరంగ క్షేత్రమునగల వైష్ణవ పీఠాధిపత్యముగూడ, నితనికి అటగల వైష్ణవులెల్లరు ఏక కంఠమున నర్పింప, దాని నధిష్ఠించి, దాని తోడుగ, శ్రీరంగనాథాలయ పాలనమునుగూడ స్వీకరించి, అనేక విధములగు మార్పుల నతడు గలుగజేసెను.

కాలక్రమమున ఆళవందారు వృద్ధుడగుచు, నీ వైష్ణవ పీఠాధిపత్యమునకు నర్హునికొరకై యన్వేషించుచు, గాంచీపురమున, యాదవప్రకాశుని దగ్గర విద్యాభ్యాసమును, వేద వేదాంగాధ్యయన మును గావించుచున్న రామానుజ వృత్తాంతము విని, ఒక పర్యాయము అందరిగి బాలకుని జూచి, తృప్తి జెంది, తిరిగి శ్రీరంగమును జేరెను. కాని తన జీవిత కాలమున తన పీఠమునకు, శ్రీరామానుజుని అధిపతిగ జేసి సంతోషింపకయే సిద్ధి పొందెను. ఈ విషయములు శ్రీరామానుజ చరిత్రయందు ముందు గాంచెదము గాక!

ఇతడు రచించిన గ్రంథములు (1) సిద్ధిత్రయము (2) ఆగమ ప్రామాణ్యము (3) పురుష నిర్ణయము (4) చతుశ్శ్లోకి (5) గీతార్థ సంగ్రహము (6) స్తోత్రరత్నము (7) మాయావాద ఖండనము.

మరియు నతని భావపరంపరను, కేవలము గ్రంథరూపమున బ్రపంచమున నుంచుటయేగాక, గొందరు ముఖ్యశిష్యులకు శిక్షణ మొసంగెను. అందు పెరియ నంబి (మహాపూర్ణులు), తిరుకొట్టియార్ నంబి (గోష్ఠిపూర్ణులు), పెరియ తిరుమల నంబి (శ్రీశైలపూర్ణులు), తిరుక్కచ్చి నంబి (కాంచీ పూర్ణులు), తిరుమలై యాండాన్ (మాలాధరులు) మొదలగువారు ముఖ్యులు. కాలాంతరమున,

వీరు అయిదుగురు రామానుజాచార్యునకు గురువులైనను, అందు పెరియ నంబి రామానుజునకు పంచ సంస్కారముల బ్రసాదించెను.

## రామానుజాచార్యులు

క్రీ. శ. 1017 వ సంవత్సరమున జనించి, 1127వ సంవత్సరమున ననగా 120 సంవత్సర జీవితకాలానంతరము సిద్ధి బొందిన శ్రీ మద్రామానుజాచార్యుల పాత్ర అఖిల భారతీయ వైష్ణవ చారిత్రములో అతి ప్రముఖము, ప్రధానము అద్భుతము. ఆచార్య నాగరాజారావు వచనములలో రామానుజుడు was the first to present a systematic school of theistic Vedanta [158] జీవ బ్రహ్మ విభేద సిద్ధాంతమునకు, ఒక క్రమరూపము నొసంగిన ప్రథమాచార్యుడు. అతడు సామాన్య ముముక్షువుల హృదయ సన్నిహితుడై, వారి హృదయముల ఆశను పెంపొందించి, శాంతిని, భగవదనుగ్రహమును బ్రసాదించుననియు నా అచార్యుని మతము [159] మాక్సుముల్లరు వాక్యములలో Ramanuja attempts to give the soul back to the Vedantins. The soul is lost in Brahman according to Advaita [160] రామానుజుడు, వేదాంతులకు దాము గోల్పోయిన ఆత్మను దిరిగి యిచ్చెను.

---

158. *Prof. P. Nagaraja Rao : Introduction to Vedanta, p 124*

159. *Prof. P. Nagaraja Rao : Introduction to Vedanta, p 81*

160. *Prof. P. Nagaraja Rao : Introduction to Vedanta, p 73*

అద్వైతము ననుసరించి బ్రహ్మములో నాత్మ అదృశ్యమైనది. అతడు శంకర భావముల గైకొని, మహత్తర హృదయముతో, సువిశాల పాండిత్యముతో, అద్భుత తత్త్వముతో, విశిష్టాద్వైత అన్వయమును గావించెనని పండిత రాధాకృష్ణుని ప్రస్తుతి.[161] యుక్తి అనుభవముల మధ్యగల వ్యత్యాసము నతడు నిపుణతతో నన్వయించి, తత్త్వ విచారణము మత జీవనములకు బొందిక రామానుజుడేర్పరచెననియు నననగును. వివిధ పురాణేతిహాసముల వివరింపబడిన శ్రీవిష్ణువే, అతనికి ఆరాధ్యదేవతయై యొప్పారెను. పూర్వము వివరింపబడిన భాగవత, పాంచరాత్ర, సాత్వతముల నేకముగనే యతడు జూచి, వానిపై తన విశిష్టాద్వైతమును నిర్మిం చెను. ద్రవిడ వేదమును, సంస్కృత వేదాది శాస్త్రముల సమన్వ యించి, ఉభయ వేదాంతముల నేకోన్ముఖము గావించి, సర్వజ్ఞుడై, ఆ యుభయ వేదాంత మహాపీఠమునకు రామానుజాచార్యులు ప్రథమాచార్యుడనదగును. అతడా విషయమున నద్వితీయుడు. ఈతని జీవిత గాథను ముందు జూచెదముగాక!

ఆళవందారు సన్నిధి జేర యత్నించియు, నాతని జీవిత కాలమున జేరజాలక, ఆ మహాత్ముని నిర్యాణానంతరము శ్రీరంగ వైష్ణవ పీఠాధిపత్యము నధిష్ఠించి, అలంకరించి, నయ్యామునా చార్య కోరికలలో ప్రథమమునైన వేదాంత సూత్రభాష్యమును నిర్మించి కృతకృత్యుడయ్యెను. దానికి పూర్వముగల బోధాయన మహర్షి వృత్తి ననుసరించి, రచించి దానికి ప్రాశస్త్యముచే

161. *Dr. S. Radhakrishnan : The Brahma Sutra, p 51*

శ్రీభాష్యము నా కీర్తియు నార్జించిపెట్టెను. అతని అసాధారణ శక్తి సంపన్నతచే, మతత్రయాచార్యులలో నొక ప్రముఖ స్థానముగూడ నాతనికి లభించెను. శంకర, రామానుజ, మధ్వాచార్యులు, తమ అద్వైత విశిష్టాద్వైత ద్వైతముల స్థాపించి, సర్వముముక్షుకోటి ప్రవృత్తుల అయింపజేసికొని సర్వస్వరూపులైరి.

## దక్షిణ వైష్ణవ విభేదములు

శ్రీ రామానుజాది వైష్ణవాచార్యులును, శఠకోపాది ఆళ్వారులును, సమరసదృష్టి అద్భుత వైష్ణవ మహాపీఠమును దక్షిణాపథమున నెలకొల్పి, అజేయమొనరించి యున్నను, దురదృష్ట వశమున నది కాలాంతరమున ద్వివిధముగ జీలి వడగళై, తెంగళై శాఖలుగ నేర్పడెను. ఆళ్వారులచే రచింపబడిన ద్రవిడ ప్రబంధము, ముఖ్యముగ తెంగళై శాఖయు, సంస్కృత శాస్త్రములు ద్రావిడ వేదముల ప్రధానముగ వడగళై శాఖయు నేర్పడినది. వేదగళై శాఖకు వేదాంత దేశికులని ప్రఖ్యాతి గనిన వెంకటనాథుడును, తెంగళై శాఖకు పిళ్లెలోకాచార్య, మనవాళ మహామునులును నాయకులు. వీరిరువురును సమకాలికులై యున్నను యిందు పిళ్లెలోకాచార్యులు జ్యేష్ఠుడు. పిళ్లెలోకాచార్యునికి ద్రవిడవేదము అతి ప్రధానమై, ఆచరణమున నాగమము ప్రాముఖ్యము కాగ, రామానుజీయ విశిష్టాద్వైతమునకు నొక ప్రత్యేకతను అతడు రూపొందించెను. అతడు రచించిన 'తత్త్వత్రయు' 'అర్థపంచక' మొదలగు గ్రంథములు శ్రీవైష్ణవులకు ప్రధానములై, దక్షిణాపథమున నసంఖ్యాకుల వైష్ణవమున జేర్పగలిగెను. ఈ తెంగళై శాఖకు ప్రపత్తి ముఖ్యస్థానము వహించును. భగవంతుని విశ్వసించి,

తదనుగుణ కార్యకలాపముల నాచరించు భక్తికంటె వీరికి ప్రపత్తియే చాల ముఖ్యము. ఈ శాఖకు మర్కటకిశోర న్యాయము కంటె, మార్జాలకిశోర న్యాయము ప్రధానము. భగవంతుడు జీవకర్మానుసారము ప్రవృత్తుల గల్పించి, జీవుని గర్మరతునిగా జేయునని వీరి తాత్పర్యము. కాన స్వతంత్ర కర్మ జీవునికి అభావమగుటచే, నా బరమాత్మకు ప్రపత్తి జేయుటకంటె నన్య మార్గము గానరాదని, ఈ శాఖీయుల విశ్వాసము. భగవంతుడు gives knowledge to the ignorant, power to the weak, mercy to the sufferers and goodness of heart to the wicked. His qualities are for the sske of others, not for Himself [162] అజ్ఞునకు జ్ఞానమును, అబలులకు బలమును, దీనునకు అనుగ్రహమును, క్రూరునకు హృదయము నొసంగును. అతని గుణములు తనకొరకుగాక నితరులకొరకే యుపయుక్తము అను తెంగలై శాఖవారి తాత్పర్యమును పండిత రాజగోపాలా చార్యుడు తెలిపెను. ఈ శాఖా ద్వయమునకు అష్టాదశ విభేదము లున్నట్లు విజ్ఞుల తాత్పర్యము. తెంగలై శాఖదృష్టికి, వడగలై శాఖకు ముఖ్యస్థానమలంకరించి, ప్రపత్తికాదర్శమై యలరారిన లక్ష్మీదేవి కేవలము జీవసమానము. ఆచార్యునియందు ప్రపత్తియే ముక్తి హేతువగుటచే, గురు శుశ్రూషాదికము అతి ముఖ్యము. అంతియుగాక It was also taught that even the sins of men are agreeable in the eyes of God and megnify His voluntary and condescending and causeless grace [163]

162. *Prof. T. Rajagopalachariar : Vaishnavite Reformers of India. p 57*

163. *Sri K. S. Ramaswami Sastri : Vedanta Kesari, p 229. 1931*

మానవుని పాపజాలముగూడ బరమాత్మదృష్టికి సమ్మతములేయై, ఆ భగవంతుని ఐచ్ఛిక సులభ నిర్వ్యాజ అనుగ్రహమును బ్రబలి పరచును అని, పండిత రామస్వామి శాస్త్రి వివరించును.

పిళ్లైలోకాచార్యునకు బూర్వము పరాశరభట్టు మైసూరులో నొక వేదాంతిని జయించి, నాంజియ్యరు అని నామకరణమొసంగెను. ఆ నాంజియ్యరు నమ్మాళ్వారు రచించిన ప్రఖ్యాత 'తిరువాయిమొళి'కి 'దొమ్మిది వేలు' అను వ్యాఖ్యను రచించెను. అతని శిష్యుడు నాంపిళ్ళై వానికి బ్రచారమొసంగ, నాతని శిష్యుడు వడక్కు తిరువేధి పిళ్ళై 'ముప్పది వేలు' అను వ్యాఖ్యను దానిపై నిర్మించెను. ఇంకెందరో యిట్లు ఈ గ్రంథమునకు, మరియు నితర ద్రావిడ గ్రంథములకసంఖ్యాక వ్యాఖ్యానముల రచించిరి ఈ తరమువారి తర్వాత 'ముప్పది వేలు' రచయిత వడక్కు తిరువేధి పిళ్ళైకు తనయుడుగ, అసాధారణ ప్రజ్ఞానిధి పిళ్ళైలోకాచార్యుడుదయించెను. అతనికి బూర్వమే, ద్రవిడ వేదమునకు మహత్తర ప్రశస్తి గలిగినను, పిళ్ళైలోకాచార్యుని హస్తమున దానికి బ్రత్యేకత గలిగి తెంగళై శాఖగ, దక్షిణ శాఖగ రూపొంది ప్రఖ్యాతి గలిగెను. ఇతని 'వచన భూషణము' ఆచార్య ప్రపత్తిని ఎక్కువ బోధించును. అందుచే గురు శరణాగతి దక్షిణ శాఖకు చాల ముఖ్యము. గురు అనుగ్రహముచేతమాత్రమే శిష్యుని అభివృద్ధి అని వీరి విశ్వాసము.

ఇతని యనంతరము యీ శాఖకు జాల ప్రధానాచార్యుడు మనవాళ మహాముని. ఇతడు, క్రీ. శ. 1370 వ సంవత్సరమున, ఆళ్వారు తిరునగరి యనబడు నమ్మాళ్వారు జన్మస్థలమునకు సమీప మున జనించెను. ఇతడు శ్రీశైలేశుడను గురుసన్నిధిని విద్యా పారంగతుడై, క్రమమున శ్రీరంగ మహాక్షేత్రముననే నివాస మేర్పరచుకొని, అసంఖ్యాక శిష్యకోటిచే బరివృతుడై యుండెను. అతడు సంస్కృత, ద్రావిడముల మహావిద్వాంసుడు. పిళ్ళైలోకా చార్యుని రచనములకు వ్యాఖ్యానములనేగాక, ఇతర గ్రంథముల రచించెను. ఈ శాఖకు ముఖ్య శిష్యగణములలో జేరినవాడు, వానమామలై అనియు తోతాద్రి యనియు బ్రఖ్యాతమైన ప్రదేశ మున గురుపీఠము నలంకరించు జియ్యరు. అటులే వడగలై శాఖకు జెంది, అసంఖ్యాక శిష్యుల నాకర్షించిన అహోబిళ పీఠము, ఆ శాఖకు మూలకేంద్రము అనబడుచున్నది.

శ్రీమద్రామానుజానంతరము ఏర్పడిన శాఖాద్వయమున, వడగలై శాఖకు ప్రముఖ నాయకుడు వేదాంతదేశికులు. ఇతడు కాంచీపుర ప్రాంతముల తిప్పుల్ అను గ్రామమున, అనంతసూరి అను సద్వైష్ణవునకు పుత్రుడుగ క్రీ. శ. 1268 లో జనించెను. ఇతడు 102 వత్సరములు జీవించి, క్రీ. శ. 1969 వ సంవత్సరమున సిద్ధి పొందినట్లు ప్రఖ్యాతి. శ్రీరామానుజుని అనంతరము విశిష్టాద్వైత మున నింతటి ప్రతిభావంతుడు లేడని పండితాభిప్రాయము. నాటి కాలమున నఖండ పండితుడని ప్రశస్తి గనిన ఆత్రేయ రామానుజుని సోదరి కుమారుడే యీ వేదాంతదేశికాచార్యుడు. ఆ పుణ్యదంప తులు తిరుమలకు యాత్రార్థము వెడలియుండి, తిరిగి వచ్చిన

తర్వాత నీ పుత్రుడు కలుగుటచే వెంకటనాథుడని, వెంకటాచార్యు డని పేరుంచిరి. కాని, పిమ్మట తన యసాధారణ పాండితీ ప్రతిష్ఠచే వేదాంతాచార్యుడనియు, వేదాంతదేశికుడనియు గీర్తి నార్జించెను. అందుచే నితడు, ఆ వేదాంతదేశిక నామముననే వ్యవహరింపబడు చున్నాడు. కాంచీపురమున అత్రేయ రామానుజునిదగ్గర విద్యల నార్జించి, 'కవితార్కిక సింహ' 'సర్వతంత్ర స్వతంత్ర' మొదలగు ననేక బిరుదములచే నలంకృతుడయ్యెను.

బహుళముగ దేశపర్యటనము గావించుచు, నందందుగల పండితుల నోడించుచు, దాన, విద్యా ప్రచారమును వేదాంత దేశికుడు చేసెను. శ్రీరంగములో దానుండుకాలముల, ముప్పది పర్యాయములు శ్రీరామానుజుని శ్రీభాష్యమును వ్యాఖ్యానించెను. శ్రీభాష్యముపై దానొక వ్యాఖ్యను రచించి, 'తత్త్వటీక' అని పేరుంచెను. అటులే భగవద్గీతపై 'తాత్పర్యచంద్రిక' అనెడు వ్యాఖ్యానమును నిర్మించెను 'శత దూషణి' అను గ్రంథమున, నద్వైత సిద్ధాంతమును వివిధ విషయముల ఖండించెను. 'తత్త్వముక్త కలాప' 'న్యాయ సిద్ధాంజన' 'సేశ్వర మీమాంస' 'రహస్య త్రయసార' మొదలగు ననేక కృతుల నతడు నిర్మించెను. మరియు, భూగోళ శిల్పాది శాస్త్రముల సంస్కృత, ద్రావిడ భాషలలో ప్రజ్ఞాశీలుడై, శతాధిక గ్రంథముల రచించి, తన సర్వజ్ఞత్వమును ప్రకటించుకొనెను.

ప్రథమమున నతడు, తన అసాధారణ పాండిత్యప్రభావమున, ఆత్మవిశ్వాసమును బట్టుదల గలవాడై, రచన వచనముల నిసుమంత కరకుగనున్నను, కఠినముగ వాదములకు దూరుడై,

శాంతస్వభావము నలవరచుకొనెను. His learning and piety, his absolute unselfishness and meekness of character ensured the love of his followers, and the respect of those who differd from his views [164] అతని విద్యానిష్ఠలు, అతని సంపూర్ణ నిస్స్వార్థత్వము నమ్రతలు, తన అనుచరుల యొక్కయు, తన భావముల వ్యతిరేకించు వారియొక్కయు ప్రేమను జూరగొనెను. అయినను, మతేతరులేగాక, దన విశిష్టా ద్వైత మతమువారుగూడ అతనికి బరమ విరోధులై, యతని అనేక బాధలలో బడవేసిరి.

అంతియగాక, క్రీ. శ. 1310 వ సంవత్సరమున, మాలిక్ కాఫరు అను అల్లాఉద్దీను, ఢిల్లీ చక్రవర్తియొక్క సనుపున దక్షిణాపథమును జొచ్చి, అతి హేయముగ హింసా కాండమును సాగించుచు, శ్రీరంగము నాక్రమించి, అందుగల అసంఖ్యాక వైష్ణవుల వధించెను. కనిసము 12000 మంది వైష్ణవులు మరణించి, పట్టణమంతయు శిథిలమై పోయెను. అపుడు వేదాంత దేశికుడు ఆ శవముల క్రింద దాగి, ఎట్టులో దప్పించుకొని, కొందరను చరులతో మైసూరునకు బలాయనమయ్యెను. శ్రీరంగము మరల హిందువుల స్వాధీనమైనంతవరకు, గొన్ని సంవత్సరములతడు అందే యుండి, వైష్ణవ ప్రచారము సాగించెను. అతి నిరాడంబర జీవియై, దరిద్రుమునైన యాహ్వానించెనుగాని ప్రముఖ అద్వైతా చార్యుడైన విద్యారణ్యుడు కోరినను, విజయనగర సామ్రాజ్యాధి పతిని కలుసుకొనడయ్యెను. అన్య శాఖీయులసూయాపరులై,

164. *Prof. T. Rajagopalachariar : Vaishnavite Reformers of India, p 86*

యితని గృహదహనము గావించుటయు మొదలగు నెన్నియో నీచ కార్యముల జేసినను, దేశికుడు చలింపక, మేరువువలె స్వీకరించి, అచలుడయ్యెను.

శ్రీరామానుజుని ఉభయవేదాంత సిద్ధాంతమును దేశికుడు అనుసరించి, సంస్కృత ద్రావిడ గ్రంథములకు ప్రాధాన్యము నొసంగుటచే, నితని శాఖ వడగళై శాఖగ నయ్యెను. ఈ శాఖకు యీతడే ప్రధాన నాయకుడు. ఈ శాఖకు ప్రపత్తి భగవంతుని వరముగాని గురువునకుగాదు. అంతియేగాక నా ప్రపత్తియు భక్తియుక్తముగాన, ముముక్షువు మర్కటకిశోర న్యాయము ననుసరించి, కార్యసాధనము గావింపవలయును. మరియు నీ శాఖా ద్వయమునకు, గ్రమన్యాయమున అనేక విభిన్నత్వము లేర్పడి, హేయముగ బోరాటములుగూడ సాగుట కడు చింత నీయము. ముఖమున ధరించు తిలకమునగూడ వీరికి వైరుద్ధ్యము గలదు. వడగళై శాఖవారు పాదములేని ఊర్ధ్వ త్రిపుండ్రము ధరింప, తెంగళై శాఖీయులు పాదమును ధరించి, ఒక్కొకవేళ, నాశికమీదకుకూడ దాని జిత్రించెదరు. అటులే ఆలయ అర్చనా విధానమునగూడ వ్యత్యాసములే. కొన్ని కార్యములకువక్రమముగ బఠించు 'పత్రము' నాబడు శ్లోకములగూడ, వీరికి భేదాభిప్రాయ ములు ప్రబలము. వడగళై శాఖవారు 'రామానుజదయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవం। యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిం॥' అని పఠింప, 'శ్రీశైలేశదయాపాత్రం....' అని తెంగళై శాఖీయులు పఠింతురు. పై శ్లోకమున రామానుజుడు విశిష్టాద్వైత సిద్ధాంత సంస్థాపకాచార్యుడుకాక, వేదాంత దేశికుల మేనమామ

యును గురువును అగు ఆత్రేయ రామానుజుడై యుండ, శ్రీ శైలేశుడు పిళ్ళైలోకాచార్యుని ఉపదేష్ట. అటుల విశిష్టాద్వైతమున, నాడి ఆచార్యుల బ్రస్తావనము యీ శ్లోకముల లేకుండుటయేగాక, యీ శాఖాద్వయ నిర్మాతలు అయిన వేదాంతదేశికాచార్య, పిళ్ళై లోకాచార్య నామములుగూడ నదృశ్యమగుట చింతనీయము. ఈ విధముగ నీ శాఖాద్వయము బొట్టు పేరులకై పోరాడుచు, వైష్ణవ సిద్ధాంతమునకే భంగము గలుగజేసిరేమో అని యని పించును. ఈ సంక్షోభము, శ్రీమద్రామానుజుని యనంతరము రెండు శతాబ్దములకే ఏర్పడినది. ఈ రెండు శాఖలును, దక్షిణ హిందూస్థానమున గొప్ప పీఠముల గలిగి, అసంఖ్యాక అనుచరుల గలిగి, ప్రజానీకముపై అద్భుత ప్రభావమును జూపించుచున్నవి. అనేక ముముక్షువులకు మార్గదర్శకములై, సాధకులకాత్మశాంతి బొందింపజేయుచున్నవి.

## వైష్ణవ సిద్ధాంత ఉత్తరవాహిని

ఇంతదనుక ఉత్తర భారతమునుండి దక్షిణమునకు బ్రవహించి యున్న వైష్ణవామృతసింధువు, ఉత్తరమున కేవలము భక్తిప్రవృత్తిరూపమున వెలుగొంది ప్రసరించి యున్నను. దక్షిణ దేశమున ముఖ్యముగ శ్రీరామానుజాచార్య సిద్ధహస్తముచే విచారణ రూపమున దాత్త్వికమై, సంపూర్ణత్వము నొందియున్నది. అందుచే రామానుజుని అద్భుత ప్రభావము, తర్వాత హిందూమత సంప్రదాయముల నన్నింట ప్రస్ఫుటముగ గోచరము. The movements of Madhwa, Vallabha, Chaitanya, Ramananda, Kabir and Nanak, and the reform organisations of

Brahmoism are largely indebted to Ramanuja's theistic idealism [165] మధ్వ, వల్లభ, చైతన్య, రామానంద, కబీరు, నానకుల విధానములు, సంస్కరణ సంఘములైన బ్రాహ్మమతము మొదలైన ఉద్యమములు, రామానుజుని ద్వైత సిద్ధాంతమునకు ఎక్కువగ ఋణపడియున్నవని, ఆచార్య రాధాకృష్ణుని అభిప్రాయము.

'సంప్రదాయవిహీనా యే మంత్రాస్తే విఫలా మతాః। అతః కలౌ భవిష్యంతి చత్వారస్సంప్రదాయినః॥ శ్రీ బ్రహ్మ రుద్ర సనకా వైష్ణవాః క్షితిపావనాః। చత్వారస్తే కలౌ భవ్యాహ్యుత్కళే పురుషోత్తమాత్॥' (ప్రమేయరత్నావళి. 341) సంప్రదాయము నకు జేరని మంత్రములు వ్యర్థములు. కలియుగమున నాలుగు సంప్రదాయములుండును. శ్రీ బ్రహ్మ రుద్ర సనక సంప్రదాయ ములు. ఇవి వైష్ణవములు. ఇవి పృథ్విని పవిత్రము చేయును. కలియుగమున నుత్కళ దేశమున జనించును అనియు, 'శ్రీబ్రహ్మ రుద్రసనకాది వైష్ణవాః క్షితిపావనాః। చత్వారస్తే కలౌ భావ్యా సంప్రదాయ ప్రవర్తకాః॥' అనియు భవిష్యత్పురాణము తెలుపుచు, 'శ్రీ విష్ణుస్వామి నింబార్క మధ్వరామానుజాఖ్యయా। భవిష్యంతి ప్రసిద్ధాస్తే హ్యుత్కళే పురుషోత్తమాత్॥' నా చతుస్సంప్రదాయ ముల విష్ణుస్వామి, నింబార్క, మధ్వ, రామానుజులు స్థాపించెదరని తెలిపి, వీరు ఉత్కళమునందు జనించెదరని పురాణ వచనము. కాని ఈ ఆచార్యులొక్కరును ఉత్కళమున జనింపలేదని విదితము. అందుచే నా పదము కాలాంతర ప్రక్షిప్తమై యుండును.

---

165. *Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol. 2. p 670*

"విష్ణుస్వామీ ప్రథమతో నింబాదిత్యో ద్వితీయకః। మధ్వాచార్య స్తృతీయస్తు తుర్యో రామానుజః స్మృతః॥" అను శ్లోకపాఠము, ఆచార్య చతుష్టయమును స్పష్టపరచినది. అందు మరల "రామానుజం శ్రీః స్వీచక్రే మధ్వాచార్యం చతుర్ముఖః। శ్రీవిష్ణుస్వామినం రుద్రో, నింబాదిత్యం చతుస్సనః॥" శ్రీదేవి శ్రీరామానుజాచార్యుని, బ్రహ్మ మధ్వాచార్యుని, రుద్రుడు విష్ణుస్వామిని, సనకుడు నింబార్కుని స్వీకరించుటచే రామానుజార్యునిది శ్రీసంప్రదాయమై, యితని సిద్ధాంతము విశిష్టాద్వైతము నాబరగును. నింబార్కాచార్యునిది సనకాది సంప్రదాయమై, యితని సిద్ధాంతము ద్వైతాద్వైతమగును. విష్ణుస్వామిది రుద్రసంప్రదాయమై, యతని సిద్ధాంతము శుద్ధాద్వైతమయినది. మధ్వాచార్యునిది బ్రహ్మసంప్రదాయము నాబరగి, అతని సిద్ధాంతము ద్వైతవాదము అగుచున్నది.

ఈ విధముగ చతుష్టముగ నిర్మింపబడిన సంప్రదాయము లన్నియు దక్షిణ భారతముననే జనించి, ఉత్తరమునకెగబ్రాకి, సర్వముముక్షువుల నాలింగనమొనర్చినవి. భరత ఖండమునగల వైష్ణవ సంప్రదాయములన్నియుం నీ చతుష్టయమున నంతర్గత ములని స్పష్టము. పూర్వము-ఉత్తర ఖండమునగల పాంచరాత్ర భాగవతాది భక్తిమార్గముల, నా యా యాచార్యులు తాత్త్విక పరములుగ గావించి, సాధన భాగముతోబాటు వానికై ప్రత్యేక తత్త్వశాస్త్రములగూడ నిర్మించుటచే, నా వైష్ణవము నాలుగు విధముల రూపొందియుండును. ఈ సంప్రదాయములు సిద్ధాంత భాగములలోమాత్రమేగాక, అనుష్ఠాన విధానముల, మంత్రోపా

సనముల, ఆచార వ్యవహారముల, చాల వ్యత్యస్తములు. కొందరికి కృష్ణుడు యిష్ట దైవము అగుచుండ గొందరికి రామచంద్రుడు అగుచున్నాడు. వీరిరువురునుగాక కేవలము విష్ణువే, రామానుజాదులకు పరమాత్మ యగును. దక్షిణమున శ్రీకృష్ణలీలలకు ప్రాధాన్యమే లేదు. కాని దాక్షిణాత్యులై యుండి ఉత్తరమున కరిగి ఆచార్యులై ప్రకాశించిన వల్లభ నింబార్కాది ఆచార్యులు, అందుండు శ్రీకృష్ణ భక్తిని బునరుద్ధరణము గావించి, అపూర్వచైతన్యమును గలుగజేసిరి. అటులే రామానందుడును శ్రీరామ భక్తిని స్వీకరించి, పెంచి, ఉత్తర దేశమును రామమయము గావించెను. శ్రీగౌరాంగుడు శ్రీకృష్ణ చైతన్యుడై, శ్రీకృష్ణ నామామృతముచే వంగ, ఉత్కళ, దేశముల ముంచివైచెను. పై ఆచార్యుల అనుచరులైన కబీరు, నానక్, తులసీదాసు, మీరా మొదలైన అనేక భక్తులు, యావత్ ఉత్తర భారతమున భక్తిరసమును, అనంతకోటి ముముక్షువుల ఆర్ద్ర హృదయములకందించి, పారవశ్యమును గలుగజేసిరి. ఈ బాహుళ్యమైన ప్రచారమున, శాస్త్రజ్ఞానమవసరములేని యీ భక్తి ప్రవాహమున, నెక్కువగ నగ్రజాతులుగాక, హీనజాతులవారు మునిగి తదవలంబకులైరి. ఈ విషయముల వివరముగ ముందు భాగమున గాంచెదముగాక।

ఈ విధముగ, వేదాదుల నంకురించిన వైష్ణవ కల్పలత, నానాటికి ఉపనిషత్తులు, పురాణములు, ఇతిహాసములు, స్మృతులు, మొదలగు గ్రంథముల ద్వారమున దేశవ్యాప్తము ప్రాకి, అసంఖ్యాక గురువరేణ్యులను, సత్ఫలముల నుద్భవింపజేసి, వారి

ముఖముల నతి వ్యాప్తి నొంది, ఎల్లెడల దావయై, ఆర్తులకు శరణ్యమై, పారమార్థిక శాంతిప్రదాయియై, ప్రేమ మాతయై రూపొందియుండుట, దాని ప్రభావము సర్వ ముముక్షుకోటిపై బడి ఉపయుక్తమగుట, దాని విశిష్టతకు నిదర్శనము. అట్టి వైష్ణవ మహావృక్షమును సర్వసమత్వమున రూపొందించి, సర్వతోముఖ మొనర్చి, ఎల్లరనుకూలము గావించిన సర్వవైష్ణవాచార్యులకు ముముక్షుజనులు కృతజ్ఞులుగాక నెట్లుండగలరు! వారొనరించిన యీ ఆధ్యాత్మిక మహోపకారము నెవరు విస్మరింపగలరు! వారి గ్రహించి, అనుసరించి, అనుష్ఠించి, వారివలె ఆనందము నొందుటయే ఎల్లర కర్తవ్యము. అదియే వారి ఆకాంక్ష. ఆ విధముగ మన విధ్యుక్త ధర్మమును నెరవేర్చుకొందుముగాక!

——

# విశిష్టాద్వైత సిద్ధాంతము
# శ్రీ రామానుజ జీవితము

## ఉపోద్ఘాతము

'యో నిత్యమచ్యుతపదాంబుజయుగ్మరుక్మ వ్యామోహిత స్తదితరాణి తృణాయ మేనే। అస్మద్గురోర్భగవతోఽస్య దయైక సింధో రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే॥' ఎవరు, ప్రతి దినము స్వర్ణమువలె గోచరమగు నారాయణ పాదకమలముల యందు వ్యామోహముచే, నితరవిషయముల దృణమువలె దుచ్ఛముగ దలంచునో, మనకాచార్యుడై దయాసముద్రుడైన అట్టి, భగవద్రామానుజాచార్యుల చరణ కమలముల శరణు బొందుచున్నాను.

'నమో రామానుజార్యాయ తస్మై నిస్సీమతేజసే। విశ్వత్రాణాయ యస్యాసీదవతారో మహీతలే॥' నిరవధిక తేజోస్వరూపుడును, విశ్వరక్షణమునకై మహీతలమున నవతరించినవాడునైన రామానుజాచార్యులకు నమస్కారములర్పించుచున్నాను అని వే విధముల నసంఖ్యాక భక్తకోటిచే నిత్యము ప్రార్థింపబడుచు, గీర్తింపబడుచు, నిత్యశాంతి ప్రదాతయై ప్రకాశించిన ఆదిశేషావతారమగు శ్రీరామానుజాచార్యుని ప్రతిభా విశేషములు ఆదర్శప్రాయములు అద్భుతములు. 'స్వయంభూర్నారదశ్శంభుః

కుమారః కపిలో మనుః। ప్రహ్లాద జనకో భీష్మో బలిర్వైయాసిక ద్వయం। ద్వాదశైతే విజానీమో ధర్మం భాగవతం భటాః। గుప్తం విశుద్ధం దుర్బోధం యద్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే॥' బ్రహ్మ, నారద, శంభు, సనత్కుమార, కపిల, మను, ప్రహ్లాద, జనక, భీష్మ బలి, వ్యాసాదులును, నేను, ఈ భాగవత ధర్మమును గ్రహించి యున్నాము. ఈ ధర్మము వేదముచేతను, ఋషులచేతను, రహస్యముగ నుంచబడెను. ఇది శుద్ధము, దుర్బోధము అగుటచే దీని దెలిసినవారు, అమృతత్త్వమును బొందుదురు అని, భాగవత శాస్త్రముయొక్క తాత్పర్యమును మనసా విశ్వసించి, అనాది పరంపరాగత భాగవత ధర్మమును అందుకొని, ఆ కాలమున ప్రఖ్యాతియు వ్యాప్తియు నొందియున్న, ద్రవిడ వేద సంప్రదాయముకూడ స్వీకరించి, ఆ ద్వయమునకు మేలి కలయిక గలుగజేసి, ఉభయవేదాంత విధానమును నెలకొల్పి, 'స తరతి స తరతి లోకాంస్తారయతి' (నా. భ. సూ. 50) అనురీతి దా దరించి, లోకమున ముముక్షుజన తారణోపాయమును ప్రసాదించిన శ్రీరామానుజాచార్య సద్గురువరేణ్యుడసమానుడు. అందుచేతనె యుండనోపు బ్రహ్మాండపురాణమున బదరికాశ్రమ మాహాత్మ్యమున, 'మన్నియోగాద్భూతపుర్యా మహీనామీశ్వరః కలౌ। శ్రీరామానుజరూపేణ భవిష్యతి సతాం ముదే॥' నా నియోగమున, గలియుగమున, భూతపురమున, ఆదిశేషుడు రామానుజుడను పేర నవతరించునని తెలిపి, 'విశిష్టాద్వైతసిద్ధాంతప్రతిపాదనతత్పరః। భాష్యం నిర్మాతి వేదాంతసూత్రాణామస్తి తత్త్వవిత్॥ సదాశ్రియాస్సదాచారాస్సాత్త్వికాస్తత్త్వదర్శినః। వేదాంతద్వయతత్త్వజ్ఞాః భవిష్యంతి గురూత్తమాః॥' అతడు, విశిష్టాద్వైత సిద్ధాంతము

నుజ్జీవింపజేసి, బ్రహ్మసూత్రముల తత్త్వమారసి, భాష్యమును రచించును. ఆతని దర్వాత అనేక గురోత్తంసులు, సదాచారులు, సదాశ్రయులు, సాత్త్వికులు, వేదాంతద్వయ తత్త్వవిదులు, తత్త్వబోధకులు జనించెదరు అనియు వచించి, రామానుజావతరణ మును, విశిష్టాద్వైత సంస్థాపనాది మహత్కార్యముల భగవంతుడు సంస్తుతించియున్నాడు.

క్రీస్తుకు పూర్వము 6 వ శతాబ్దమునందు, హిందూ సంప్ర దాయమున, సుమారు 62 భిన్నమతములుద్భవించి, సంఘీ భావమును జెదరకొట్టెను. శంకరాదులు మతాంతర్గత విభేదముల నెదుర్కొనజాలకపోయిరి. ఈ దుర్భరస్థితి నెదుర్కొనుటయే శ్రీరామానుజుని కర్తవ్యము. ఎదుర్కొనుటకు వలయు జీవిత పరిమాణముగూడ శ్రీ శంకరునకు లభింపలేదు. ఆ మహత్కార్యము శ్రీరామానుజుల భుజస్కంధములపై బడెనని, గోవిందాచార్యుల అభిప్రాయము.[166] జైన, బౌద్ధ, అద్వైత వాదములచే సడలి పోయిన మత విశ్వాసమును, హిందూ ప్రజా సామాన్యమునందు జనింపజేయుటయే రామానుజ ప్రథమ కర్తవ్యమనియు, నాతని తాత్పర్యము. మరియు వర్ణ మత విభేదములచే గ్రుంకిపోవుచున్న హిందూ సంఘము నంతటిని, బ్రాహ్మణ సంఘముగ రూపొందింప నెల్లర వైష్ణవ భక్తులనుగ జేసి, సద్బ్రాహ్మణులనుగ మార్పు జేయుటయే రామానుజుల సంకల్పమనియు నాతని భావము.

---

166. శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులు : శ్రీ రామానుజ కీర్తి కౌముది. 1 భా. పు. 54

అందుచేతనే, వివిధ వర్ణములకు జెందిన ఆళ్వారుల ప్రబంధముల గైకొని, వేదముతో సమానగౌరవము వానికొసంగి, ఆళ్వారుల విగ్రహముల నెల్ల వైష్ణవాలయముల ప్రతిష్ఠించి పూజింపజేయుట, రామానుజుని విశాలత్వ సూచికమని గోవిందాచార్యుడు భావించును. మరియు నొకే హిందూమతమున, వివిధ దేవతల, నవతారమూర్తుల ప్రతిష్ఠించి ఉపాసించుట విభిన్నత్వమునకు గారణము గాన, నా వివిధ దేవోపాసనముల నేకము గావించి, అఖిల దేవతలకాధార భూతుడైన శ్రీమన్నారాయణునే పరమ దైవముగ నర్చించుట ముఖ్యమని, ఏకేశ్వరోపాసనా విధానమును బ్రకటించి, ఆచరణ యోగ్యముగ శ్రీరామానుజుడొనరించినట్లు అతడు తలంచును.

ఇట్టి మహత్కార్యాచరణము గేవలము తత్త్వవిచారణముచే గాదని తలంచి, గీతా శాస్త్రమున 'శాధి మాం త్వాం ప్రపన్నం' అని ప్రారంభింపబడి, 'యే యథా మాం ప్రపద్యంతే' (4-11) 'మామేవ యే ప్రపద్యంతే' (7-14) 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' (18-66) అని వివరింపబడి, పరిసమాప్తి నొందింపబడిన ప్రపత్తి మార్గమును గ్రహించి, దాని సౌలభ్యమును అవలోకించి, దీనికాధారములైన సాత్త్వత, భాగవత, పాంచరాత్రముల వేద పురాణములనుండి పెకలించి, ఆళ్వారుల శరణాగతితో నన్వయించి, తత్త్వశాస్త్రమును ఆధారముగ జేసి, భక్తి మార్గమును రామానుజుడు ప్రతిపాదించెను. అందుచే నతని సిద్ధాంతము మాక్డొనెల్ వాక్యములలో theological rather than philosophical [167] తాత్త్వికముకంటె భక్తియుక్తముగ నైనది.

---

*167. A. A. Macdonell : India's Past, p 149*

అయినను అతనిలో Philosopher and the devotee happily combind[168] తత్త్వవేత్తయు భక్తుడును జక్కగ మేళవించి యుండుటచే, నీ రెండు ప్రవృత్తులును నేకమై, మోనియర్ విలియమ్సు వాక్యముల ననుసరించి, the most tolerant of systems[169] మిగుల ఔదార్యము గలిగిన విధానమై, It is always ready to accomodate itself with the religious ideas of all the nations of the world[169] ప్రపంచమున గల సకల జాతుల మత తత్త్వముల నన్వయించుకొనుటకు సదా సంసిద్ధమైన విశిష్టాద్వైతమునకు, రామానుజాచార్యుడు సంస్థాపకుడయ్యెను.

అందుచేత రామానుజుడు, సిద్ధాంతమున ప్రథమాచార్యుడు కాకపోయినను, వైష్ణవ సిద్ధాంత మహాసముద్రమున నొక మహాతరంగమై యుండి, దానికొక స్వరూప కల్పనము గావించి కృతకృత్యుడౌటచే, డాక్టరు Nicol నికోల్ అభిప్రాయమున the greatest name in the whole history of Vaishnava development[170] వైష్ణవ సిద్ధాంత చారిత్రమంతటిలో నతనిది సర్వోన్నత నామముగా వెలసెను. 'పరమాత్మా చ సర్వేషామాధారః పరమేశ్వరః। విష్ణునామా స వేదేషు వేదాంతేషు చ గీయతే॥' (విష్ణు. పు. 6-4-40) పరమాత్మ యన సర్వమునకాధారుడు, పరమే

168. *Prof. T. Rajagopalachariar : Vaishnavite Reformers of India, p 113*

169. *Prof. Moniar Williams : History of Religious Thought and Life in India*

170. *Ramananda to Ramtirtha : p 11*

శ్వరుడు, విష్ణునామకుడై వేదవేదాంతముల కీర్తింపబడుచున్నాడని తెలిపి, అతడు 'అసంఖ్యేయ కల్యాణగుణగణః॥' (శ్రీభా. 1-1-1) అసంఖ్యాక కళ్యాణగుణగణ విభూషితుడని వివరించి, కల్యాణమన 'సత్యార్జవదయాదానాఽహింసానభిధ్యాః కళ్యాణాని॥' (శ్రీ భా. 1.1.1.) సత్య, సరళత్వ, దయ, దాన, అహింసా, క్షమాదులు అని నిరూపించి, అట్టి శ్రీమహావిష్ణువు కేవలము భక్తునేగాక, తనకు సచ్చిదానంద లక్షణములతోబాటు కృపాగుణముగూడ నుండుటచే, అపరాధులగూడ మన్నించు తత్త్వము గలవానిగా జూపదలచిన రామానుజుడెల్ల రకారాధ్యుడై వెలుగొందుట నందు ఆశ్చర్యమేమిః పండిత అనిమా సేన్ గుప్త వచనములలో, Ramanuja gives us the conception of living and loving God[171] రామానుజుడు, సచేతనమై ప్రేమస్వరూపుడైన భగవంతుని మనకొసంగెను. అందుచే నతడు, సర్వద్వైత సిద్ధాంతములకు మేటి నాయకుడనియు ననదగును. వివేకానందుని వాక్యములలో, శంకరుడు అద్భుత మేధావియైనను, had not as great a heart [172] అంతటి హృదయము అభావము. Ramanuja's heart was greater[172] రామానుజుని హృదయము బృహత్తరము. అయినను శంకరా ద్వైతమునకును, ఆళ్వారుల భక్తి భావమునకు సమన్వయింపజేసి, రామానుజుడు విశిష్టాద్వైతమును నిర్మించెను. అందుచే బూర్వా చార్యులెల్లరు అతనిలో పునర్జన్మ నొందినట్లు అగుచున్నది. అతని

---

*171. Dr. Anima Sen Gupta : Prabuddha Bharata, p 506, 1959*

*172. Swami Vivekananda : Complete Works Vol. 3, p 265*

సిద్ధాంతమున నేకత్వ నానాత్వములు అద్భుతలీల సమన్వ యించును. అందుచే నట్టి the great life of a mighty and magnanimous world teacher [173] అద్భుత, సువిశాల హృదయు జగద్గురువరేణ్యుని మహోత్కృష్ట జీవిత విశేషమును, గొంచెము జవిచూచెదముగాక !

## అవతరణము

'చైత్రార్ద్రాసంభవం విష్ణోర్దర్శనస్థాపనోత్సుకం। తుండీర మండలే శేషమూర్తిం రామానుజం భజే॥' (దివ్యసూరిస్తోత్రం. 16) తుండీర దేశమున విష్ణుదర్శన సంస్థాపనార్థమై, చైత్ర శుద్ధ షష్ఠి పుణ్యదినమున అవతరించిన, శ్రీ ఆదిశేషావతారుడైన భగవాన్ శ్రీ రామానుజాచార్యునకు ప్రణామములర్పించెదను అనియు, 'శేషవర్యాయమూర్తి' (1-23) అని 'శ్రీరామానుజ చంపూ' గ్రంథముచేతను గీర్తింపబడిన 'శ్రీమాన్ రామానుజాచార్యో జయతి' (చంపూ. 1-23). కాని జన్మదినమున గొన్ని భావ వ్యత్యాస ములు గోచరము. 'ఏవం గతే బహుతిథే తస్యాం జజ్ఞే మహామతిః। చైత్రే మేష శుక్ల పక్షే పంచమ్యాం గురువాసరే। మధ్యాహ్నే కర్కాటే లగ్నే నక్షత్రే రుద్ర దైవకీ॥' అను శ్లోకమున నితర వివర ములు తెలుపబడి, పంచమీ తిథిగ తెలుపబడినది. అటులనే 'కల్యబ్దే దివ్యకుంభే బుధజనవిదితే వత్సరే పింగళాఖ్యే। చైత్రే మాసి గతేషు

173. *The Publisher : The Life of Ramanuja of Swami Ramakrishnananda, p ii*

ద్వియుత దశదినేషేధ్వమాసే హిమాంశౌ॥ పంచమ్యార్ద్రాసమేతే సురగురుదివసే కర్కటాఖ్యే లగ్నే। శ్రీమద్రామానుజార్యస్సమజని నిగమాంతార్థసంరక్షణార్థం॥' కలియుగ 418 పింగళ నామ సంవత్సర, వసంత ఋతు, చైత్రమాస, శుక్లపక్ష పంచమి గురువారము, ఆర్ద్రా నక్షత్రయుక్త కర్కట లగ్నమునందు, అగమార్థ సంరక్షణార్థము శ్రీరామానుజుడవతరించెను. అను శ్లోకమున నింకను వివరములు గోచరించును. ఇట పంచమీ తిథియే చెప్పబడి యున్నది. ఈ పింగళ నామ సంవత్సరము క్రీ. శ. 1017 వ సంవత్సరమగును.

'శ్రీమన్మహాభూతపురీ నివాసీ హారీతవంశార్ణవ కల్పశాఖీ। యజ్వా మహాన్ కేశవసోమయాజీ భాగ్యోత్తరో బ్రహ్మవిదావిరస్తి॥' (శ్రీరా. చంపూ. 1, 86) భూతపురి వాసియు, హారీత గోత్రస్థుడును అగు కేశవసోమయాజి, రామానుజుని జనకుడు. ఈ భూతపురియే శ్రీ పెరుంబుదూరు అని నేడు అనబడును. పండిత కోట వేంకటాచలము అభిప్రాయమున, నీ కేశవ సోమయాజి ఆంధ్ర వెలనాటి బ్రాహ్మణుడును, 'ఆసూరి' యింటిపేరు గలవాడు. 174 ఈ విషయమునే శ్రీగోవిందాచార్యులు స్థిరపరచి, శ్రీపెరుంబుదూరులో గల శ్రీరామానుజ మతము నేటివరకు ఆంధ్రుల ఆధిపత్యముననే గలదనియు, నా మతాధిపతులకు పుత్రసంతానము లేనిచో, ఆంధ్రులనే నేటికిని దత్తస్వీకారము జేసికొందురని వచించెను. 175 అట్లుగాక,

174. శ్రీ కోట వేంకటాచలం : కలిశకవిజ్ఞానము. 3 భా. పు 67
175. శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులు : శ్రీరామానుజ కీర్తికౌముది 1భా. పు 54

అరవ దేశమునకు వలస వెళ్ళిన వడమలు అనబడు (ఉత్తరాదివారు) వైష్ణవ బ్రాహ్మణ కుటుంబమున రామానుజుడు జన్మించినట్లు, పండిత రమాకాంతాచారి తాత్పర్యము.[176]

పై గ్రంథముల ననుసరించి చూచినచో, శ్రీపెరుంబుదూరు నకు బూర్వ ఆంధ్ర బ్రాహ్మణులు, ఆసూరి యింటిపేరు గలవారు వలస వెడలియుండిరి. ప్రస్తుతము శ్రీపెరుంబుదూరు ద్రావిడ దేశమున జేరియున్నను, బూర్వము ఆంధ్రులు చెంగల్పట్టు మండలము, కొంత ఉత్తరార్కాటు మండలముల వ్యాప్తి జెంది, వాని గూడ నాంధ్రదేశముగనే బరిగణించుచు, నాంధ్ర ప్రభువుల పాలనములో నుండుటచే, వీరు ఆంధ్రమునుండి ద్రవిడ దేశమునకు వలస వెడలియుండిరనుట కంటె నుత్తర మండలములనుండి యాంధ్ర దక్షిణ మండలములకరిగిన యాంధ్రులనుట ఉచితము. అట్లైనను, రామానుజుడు ఎచ్చటను దా నాంధ్రుడనని ప్రసంగ వశమున దెలుపకుండుటయేగాక, నాంధ్రభాషనైన నుపయోగించినట్లు కానుపింపదు. త్యాగరాజు ఆంధ్రుడై యుండి, ఆంధ్రముననే కీర్తనల వ్రాసి, తంజావూరు ప్రాంతమునగల తిరువైయారు గ్రామమున యుండెగదా! రామానుజుడు, తెలుగుభాషను మరచి యుండవచ్చుననుటకు గారణము గానరాదు.

ఆ గ్రామమున, ఆసూరి కేశవ సోమయాజి యను ద్విజోత్తముడుండెను. ఆతని కేశవభట్టరు అనియు నందురు. శ్రీరంగ

176. పండిత గొట్టుముక్కల రమాకాంతాచారి : శ్రీరామానుజ కీర్తికౌముది 1భా. పు 153

క్షేత్రమున, ప్రఖ్యాత వైష్ణవ పీఠమునకు నధిపతియైన, ఆళవందారు బిరుదాంకితుడగు యామునాచార్యుని ముఖ్యశిష్యుడైన, శ్రీశైల పూర్ణుడనువాడొకడుండెను. అతడు గురుసేవారక్తుడై, గురువరు అనుగ్రహమున సర్వ విద్యల నార్జించి, గురు అనుజ్ఞ గొని, తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామి సేవాభాగ్యము నొంద నందరిగి, సేవాకైంకర్యమున నుండెను. అతనిని పెరియ తిరుమలై నంబి యనియు నందురు. అతనికి కాంతిమతి యనియు, శ్రీదేవి యనియు, నిర్వురు సోదరీ మణులు గలరు. వారినే భూమిపిరాట్టి పెరియపిరాట్టి యనియు నందురు. కృష్ణస్వామి అయ్యంగారు అభిప్రాయమున నీ శ్రీశైలపూర్ణుడు ఆళవందారుని పౌత్రుడు.[177] శ్రీ పెరుంబుదూరునగల ఆసూరి కేశవ దీక్షితులు కాంతిమతిని వివాహమాడెను. అచ్చటనే గల అహరం గ్రామవాసి యగు కమల నయన భట్టరు శ్రీదేవిని బరిణయమాడెను. కేశవాచార్యుడు కర్మ కాండరతుడై, అనేక యజ్ఞముల జేసియుండుటచే, 'సర్వక్రతు' బిరుదమును గల్గి సోమయాజియు ననబడెను.

సంతాన ప్రాప్తి లేకుండుటచే వగచి, కేశవార్యుడు సతీసమేతుడై తిరువల్లికేని యను (ట్రిప్లికేన్) స్థానమునకరిగి, పార్థసారథి ముంగిట యజ్ఞాదుల సల్పి, ఆ దేవరాయని అనుగ్రహమును బొందెను. ఆ శ్రీ మహావిష్ణువే కేశవునకు బుత్రుడుగా జన్మింప ననుగ్రహించెను. కేశవార్యుడావందమునొంది స్వగ్రామమున కేతెంచి యుండ, పూర్వోక్తచందము శ్రీ రామానుజుడుద్భవించెను. ఈ

177. *Dr. S. Krishnaswami Aiyanger: The Three Great Acharyas, p 98*

శుభవార్త నాలకించి శ్రీశైలపూర్ణుడరుగుదెంచి, శిశువు లక్షణముల దిలకించి, లక్ష్మణ నామము నుంచెను. అదియే రామానుజ నామముగ ప్రఖ్యాతమయ్యెను. కాలాంతరమున రామానుజుని పెరుమాళ్ళు అనియు బిలువసాగిరి.

అదేకాలమున కాంతిమతి సోదరి మహాదేవియు నొక కుమారుని గనుటచే, నా బిడ్డనికిగూడ గోవింద మిశ్రుడని శ్రీశైల పూర్ణుడు నామంబొసంగి, యథాస్థానమునకు వెడలిపోయెను. శ్రీమద్రామాయణమున, సుమిత్రాదేవి లక్ష్మణస్వామిని గనిన లగ్నముగూడ, రామానుజ జనన ముహూర్తమునకు సరిపడుటచే, నతనికి లక్ష్మణనామముంచినటుల వచించెదరు.

శిశువులు బాలకులై, విద్యాభ్యాసమున ప్రవేశించి, ఆశ్చర్యకర మగు ధీకుశలత ప్రదర్శించుచు, విద్యాసౌష్ఠవము నార్జించుచుండిరి. ఆ గ్రామ పాఠశాల విద్య సంపూర్తి నొందు కాలమునకు అతనికి షోడశవర్షములగుట జూచి, తండ్రి యగు కేశవ దీక్షితుడు, కుమారునికి వివాహము వైభవముగ గావించెను. అంత నచిరకాలమున కేశవ దీక్షితుడు అకాల మృత్యువాతబడెను. కాన నా శ్రీపెరుంబుదూరు వారికి భారమనిపించుటచే, నా కుటుంబము కాంచీపురమునకు దరలివచ్చి, అందు గృహాదుల నిర్మించుకొని వాసంబుండిరి.

## విద్యాభ్యాసము

ఆ కాలమున గాంచీపురమున, ప్రఖ్యాతుడైన యాదవ ప్రకాశుడను నొక అసాధారణ ప్రజ్ఞానిధి యగు పండితుడుండెను. రామానుజుడు విద్యాతృష్ణ పెన్నొడ నా పండితవర్యుని జేరి, విద్యా

వ్యాసంగముల జేయుచుండెను. యాదవుడును రామానుజుని అద్భుత మేధాసంపత్తికి అచ్చెరువంది, అధికతర ప్రేమవాత్సల్యముల ప్రదర్శించుచు, నా శిష్యరత్నమునకు విద్య గరుపుచుండెను. శిష్యుడును నయ్యాచార్యునికి భక్తిమెయి సేవ జేయుచు, శ్రద్ధాయుక్తుడై విద్య నకుంఠితలీల నార్జించుచుండెను.

కాని క్రమముగ, గురు శిష్యులకు సిద్ధాంత వ్యత్యాసము లేర్పడజొచ్చెను. యాదవప్రకాశుడు అద్వైత సిద్ధాంతి యగుటచే, మపనిషద్వాక్యముల శంకర సిద్ధాంతానుసారము వ్యాఖ్యానించుచుండ, రామానుజుడు భక్తి ప్రపన్నుడగుటచే నా వివరణములకు అసంతృప్తి నొందుటయేగాక, హృదయావేదనయుగూడ బొందుచుండెను. ఒక దినమున రామానుజుడు గురుసేవ గావించుచుండ, గురువర్యుడు ఛాందోగ్య పాఠమును వివరింపదొడగెను. అందు 'తస్య యథా కప్యాసం పుండరీకమేవమక్షిణీ' (ఛాం. 1-6-7) అను మంత్రార్థమును దెలుపుచు, యాదవప్రకాశుడు. శంకరాచార్యుని సిద్ధాంతము ననుసరించి, 'కప్యాసం' అను పదమునకు, మర్కట పృష్ఠభాగము నన్వయించి, వివరించి, ఆ హిరణ్య పురుషుని నేత్రియుగ్మము, మర్కట పృష్ఠభాగముల బోలు ఎఱ్ఱని కలువలవలె నున్నవి అని వచింప, ఖిన్నుడైన రామానుజుడు అశ్రువుల రాల్ప నవి గురుశరీరమున బడెను. అందులకు కారణమేమని గురువు ప్రశ్నింప, రామానుజుండు భయము స్వాంతయులేక, నా వివరణము తనకు బాధగలిగించినదనివచించి, ఆ యర్థము దోషభూయిష్టమనియు దెలిపెను. తనకు దోచిన యర్థమును యాదవునకు దెలిపి, 'కం' అనగ జలము, ఆ జలము ద్రాగు

వాడు సూర్యుడు. అవ్వాని కిరణ ప్రభావముచే వికసించునది 'కప్యాసం' అనగా పద్మము అని, రామానుజుడన్వయించి వచించి, ఆ హిరణ్యపురుషునకు, సూర్యకిరణములచే వికసించిన కమలముల వలె గనుగవ గలదని, మంత్రార్థమును వివరించెను. ఈ భావ మును రామానుజుడు, పూర్వ వ్యాఖ్యాతలైన వ్యాఖ్యాకార తంకుని నుండి గైకొనెనని యందురు.[178] కాని యీ యర్థము సాక్షాత్పద మునకర్థముగాక అవ్వయార్థమని యాదవుడు త్రోసిపుచ్చెను. శక్తి వృత్తి కన్వయము పరిపోవుచుండ, గౌణార్థము అనవసరమని అతని వాదము.

శిష్యుడైన రామానుజుడు గురువును ధిక్కరించి, వ్యతిరేకార్థ ముల జేయుటచే యాదవునికు ప్రేమ సన్నగిల్లసాగెను. శిష్యుడైన రామానుజునకుగూడ, తన మనస్తత్వమునకు వ్యతిరేకార్థముల జూపించు యాదవునిపై భక్తియు క్షీణింపజొచ్చెను. ఇట్లుండ నొక దినమున యాదవప్రకాశుడు, 'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ' (తై. 2-1) అను ఉపనిషద్వాక్యమును వివరించుచు, బ్రహ్మము సచ్చిదానంద స్వరూపుడని అన్వయింప, రామానుజుడు ప్రతిఘ టించి, ఆ బ్రహ్మమునకు సత్య జ్ఞాన అనంతములు లక్షణము లగునుగాని స్వరూపముకాదని తెలిపి, ఆ పదములు, అసత్య అజ్ఞాన, సాంతత్వములు ఆ బ్రహ్మమునకు అభావమని దెలుపునని వచించి, లక్షణముల స్వరూపముగ నన్వయించుట దోషమనియు హెచ్చరించి, ఆ గుణములు బ్రహ్మము నన్వయించునుగాని, అవి

178. *Prof. T. Rajagopalachariar ; Vaishnavite Reformers of India, p 47*

బ్రహ్మము కానేరవని స్పష్టపరచెను. అందులకు యాదవప్రకాశా చార్యుడు గినిసి, శిష్యుని మందలించినను, లోన నతనికి భయము ప్రబలజొచ్చెను. క్రమమున నీ శిష్యుడు గురుద్రోహ మొనర్చి, తన సిద్ధాంతముల ఖండించునేమో! యను సంశయము!! అంకురించెను అందులకై యీ శిష్యుని ఎటులైన దుదముట్టింప సంకల్పించి, వారణాసీ యాత్రా వ్యాజమున శిష్యులతోగూడ బయనమయ్యెనట. గంగాస్నాన సమయమున, నీ బాలకుని గంగపాలు గావింప నతడు సంకల్పించెను. కాని మార్గమధ్యమున రామానుజుని సోదరుడైన గోవిందుడుగూడ యాదవుని శిష్యుడై వెంట నుండుటచే, ఎట్టులో గురు సంకల్పమును బసిగట్టి, అగ్రజునకు ఎరుకపరుపగ, రామానుజుడు వారి బారినుండి తప్పించుకొని, కాంచీపుర మార్గమును గానక, ఒక పుణ్య దంపతుల సహాయమున స్వగ్రామమునకేగు దెంచెను. యాదవప్రకాశుడును కాశీయాత్రను బూర్తి గావించుకొని, కాంచీపురమునకు మరలి వచ్చి, యథాపూర్వముగ నుండెను.

గోవిందుడు మాత్రము, తనకు భాగీరథిలో సంప్రాప్తించిన బాణలింగమును గురుపనుపున స్వీకరించి, కాళహస్తికి సమీపమున మంగళ గ్రామమున బ్రతిష్ఠించి, శైవుడై, యిష్టదైవము నర్చించుచు నుండెను.

యాదవప్రకాశుడు యాత్రానంతరము, కాంచీపురమున రామానుజుని గాంచి ఆనందము నొంది, అరణ్యముల శిష్యుడు తప్పిపోవుటకెంత తా వగచినదియు దెల్పి, పూర్వరీతి విద్యావ్యాసంగముల జరుపుచుండెను ఈ సమయమున గాంచీపుర అధిపతి పత్నికి, బ్రహ్మరక్షస్సు ఆవేశించి బాధించుచుండ, నా పాలకు

డెందరో మంత్రవేత్తల రావించి, బాధా నివారణము నొనరింప యత్నించి విఫలమనోరథుడై, యాదవప్రకాశు నర్థించెను. యాదవ ప్రకాశుడును శిష్యులచే బరివేష్ఠితుడై, అందేగి, ఆ బ్రహ్మరక్షస్సుపై మంత్ర, ప్రయోగముల జేయుచుండ, నా రక్షస్సు యాదవుని ధిఃకరించి తనకు లొంగనట్లును, దన శిష్యుడైన రామానుజుని ప్రభావమునకు లొంగునట్లును దెలిపెను. అంత రామానుజా చార్యుడు, ఆ రక్షస్సును సంబోధించి పలుక, నదియు నా రాచ వనితను వదలిపోయెను. అంత రామానుజుని ప్రతిష్ఠ మిన్ను నంటెను. అయినను రామానుజుడు, యాదవు నాశ్రయించి విద్య నభ్యసించుచునే యుండెను.

అయిన నొక దినమున యాదవప్రకాశుడు, 'సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత' (ఛాం. 3-14-1) అను మంత్ర మును వివరించుచు, ఆత్మబ్రహ్మముల ఏకత్వము నద్వైత పరముగ నన్వయించుచు నుపన్యసించెను. అదేవిధముగ 'నేహ నానాస్తి కించన' (బృ. 4-4-19) అను మంత్రమునుగూడ వివరించెను. అందులకు రామానుజుడు చింతాక్రాంతుడై, గురు తాత్పర్యము లోపభూయిష్టముగ వచించి. 'తజ్జలానితి శాంత ఉపాసీత' అను వాక్యము లేకున్నచో నా యర్థము కుదురునుగాని, ఆ వాక్య ముండుటచే, సృష్టి, బ్రహ్మమున జనించి, అందే యుండి, మరల అందే లయించుననియు, నందుచే విశ్వము బ్రహ్మముకాక, బ్రహ్మ ముచే బరివ్యాప్తమనియు, సోదాహరణముల వివరించెను. అటులే బ్రహ్మమునకన్యముగ సృష్టి లేదనియు, నన్నియు నాతనిపై

నాధారపడి యుండుననియు నాతడు వివరించెను. అందులకు యాదవప్రకాశుడు, తరుచు రామానుజుడు తన సిద్ధాంతముల ఖండించుటచే బాధనొంది, తన యొద్ద గ్రహించుటకిక రామానుజు నకు నేమియులేదని దెలిపి, అందుచే నిక దనదగ్గరకు రానవస రముగూడ లేదనియు గట్టిగ వచించి, శిష్యుని బంపివైచెను. కాల క్రమమున రామానుజుడు సన్న్యసించి, శిష్యపరివృతుడై యుండుట గాంచి, స్వీయ అద్వైత సిద్ధాంతమును విడనాడి, రామానుజునికి శిష్యుడై, యూర్ధ్వ త్రిపుండ్రధారియై, గోవింద జియ్యరుగా మారినట్లు చరిత్రా కథనము.

## యాదవప్రకాశుడు

యాదవప్రకాశుని వృత్తాంతమిటులుండ, నీ యాదవుని వ్యక్తిత్వమున బండితులలో అభిప్రాయ భిన్నత్వము గలదు. Yadava Prakasa who succeeded Bhaskara made his theory more realistic.... Yadava Prakasa adopts the views attributed to అస్మరథ్య in Brahma Sutras (1-4-21) which is said to be one of Bhedabheda. He accepts బ్రహ్మపరిణామవాద or the theory of the transformation of Brahman in to the world [179] భాస్కరాచార్యునికి ఉత్తరాధికారి యగు యాదవప్రకాశుడు, తన సిద్ధాంతమును మిగుల సత్కార్యవాదము నకు మార్చెను. అతడు, బ్రహ్మసూత్రముల బ్రస్తావింపబడిన అస్మరథ్యునికన్వయింపబడిన భేదాభేదమును అవలంబించెను.

179. *Dr. S. Radhakrishnan: The Brahma Sutra p. 45*

ఆతడు బ్రహ్మపరిణామ వాదమునకు సమ్మతించెను అని, రాధాకృష్ణ పండితుడు భేదాభేదవాదిగ యాదవుని తెలిపెను. కాన అతడు అద్వైత వాది కాడని స్పష్టము. Very little is known of Yadava and his system of Vedanta; and his commentary on the Vedanta Sutras is not, at present, available [180] యాదవుడు, ఆతని వేదాంత సిద్ధాంతములు, చాల స్వల్పముగ దెలియబడెను. అతని వేదాంతసూత్ర వ్యాఖ్యానము, ప్రస్తుత మలభ్యము అని ఆచార్య శ్రీనివాసాచారి తెలుపుచున్నారు. కాని రామానుజ కాలమున గాంచీపురమున, నొక యాదవుడున్నటుల, నతడు అద్వైత భావముల గల్గియున్నటుల వ్యక్తము. అయినను There is no clear evidence to establish the identity of this Yadava with the exponent of Bhedabhedavada [180] భేదాభేదవాది యగు యాదవుడు యితడే యని దీర్మానింప విస్పష్ట ప్రమాణమెందును గానరాదనియు, నా ఆచార్యవర్యుని అభిప్రాయము. అంతియగాక, రామానుజుని గురువైన యాదవుడు, కాలాంతరమున రామానుజు నాశ్రయించి, సన్న్యసించి, గోవింద జియ్యరు నామమున రచించినట్లు చెప్పబడుచున్న 'వేదార్థ సంగ్రహము' న, భేదాభేదవాదమును ఖండించెను. అందుచే వీరిరువు రును అన్యవ్యక్తులగుదురు. రామానుజుని గురువు యాదవుడు, అద్వైత సన్న్యాసి యని 'రామానుజచంపూ' గ్రంథముగూడ తెలుపుచున్నది. ఈ యాదవుని మతాంతర స్వీకారమునుగూర్చి సందేహించుచు, సంప్రదాయము యీ యిరువురు యాదవులు ఒక్కరే యని తెలుపుచున్నను, భేదాభేదవాదమున ననేక కృతుల

180. *Prof. P. N. Srinivasachari: Bhedabheda. p. 169*

రచించిన యాదవుడే, రామానుజుని గురువని నిర్ధారణపరచు ప్రమాణములు, రామానుజ జీవితమున గానరావని, బండిత రాజ గోపాలాచార్యులు వచించి, రామానుజుని ఉపదేష్ట అద్వైతిగనే ప్రస్తావింపబడియుండుట స్పష్టమనియు తెలిపి, if this Yadava had developed a new philosophy, materially deffering from Sankara's, it is strange that no allusion is made to that fact in the existing lives. It is, however, certain that Ramanuja did not controvert [181] ఈ యాదవుడు శంకర సిద్ధాంతమునకు వ్యతిరేకమైన వినూత్నవాదము నభివృద్ధి జేసి యుండిన, బ్రస్తుతము గల జీవితములలో నా సూచన ఎందును గానరాకపోవుట ఆశ్చర్యకరము. అయినను రామానుజు డెచ్చటను దానిగూర్చి వివరించి యుండకుండుటయు స్పష్టమని అతని యుద్దేశ్యమును వ్యక్తపరచెను. కృష్ణస్వామి అయ్యంగారు యీ వివాదము బ్రస్తావించి, కాంచీపురమున యాదవుడు సుప్రసిద్ధ అద్వైతాచార్యుడనియు, ఎన్నియో గ్రంథములకు గర్త యనియు, నితని గ్రంథముల వేదాంతదేశికుడు ఖండించెననియు దెలిపి, In the face of these facts, it would appear impossible that he should have been the first convert to the teachings of his ex-disciple Ramanuja, whom he did not love over much as a disciple. So it does, and I had long thought that the story was a pious fabrication [182] యీ సాక్ష్యము లిట్లుండ, యాదవుడు తాను శిష్యునివలె బ్రేమిం

---

*181. Prof. T. Rajagopalachariar: Vaishnvite Reformers of India, p 47*

*182. Dr. S. Krishnaswmi Aiyangar: The Three Great Acharyas, p. 119*

పనితన పూర్వశిష్యుని సిద్ధాంతమునకు, బ్రథమతః మతాంతరావలంబడగుటకు దుర్లభమని స్పష్టము. కావున, నీ గాథ భక్తియుక్తమైన కల్పిత కథ యని యోచించిన కొలదియు నాకు దోచుచున్నదని, అతడు విదితము గావించెను.

అందుచే నీ యాదవప్రకాశఘట్టము, రామానుజ జీవితమున కాలాంతర బ్రక్షిప్తముగ స్పష్టమగుచున్నది. గురువైన యాదవుడు, విరోధియైన శిష్యుని దుదముట్టింప యత్నించుట అనూహ్యము. అయినను అందులకు వారణాసీ యాత్రయే అవసరము కాదు. మరియు బ్రథమమున మిగుల వైరుధ్యము బ్రకటించిన యాదవుడు, మాతృవచనముల ననుసరించి, రామానుజునకు శిష్యుడగుటయు అసంభవము. అద్వైత సన్న్యాసికి దల్లి యాజ్ఞ ఎచట? అంతకాలము తా నాశ్రయించి, అనేక విద్యల గడించి, యిసుమంత సిద్ధాంతభేద వ్యాజమున గౌరవ స్థానమునుండి గురువర్యుని గూలద్రోసి, శిష్యునిగ గావించి, తా గురుపీఠము నలంకరించుట, ప్రేమప్రచారము, ప్రపత్తి ప్రబోధముల గావించు రామానుజాచార్యునికే కళంకము. కావున నే కోణమునుండి జూచినను, యాదవ రామానుజ సంబంధము, కాలాంతర రచయితలచే నిసుమంత అతిగ నైనదని స్పష్టము.

## కాంచీపూర్ణుడు

శ్రీ రామానుజుడు, కాంచీపురమున యాదవుని దగ్గర విద్యల నభ్యసించు కాలమున, శ్రీ వరదరాజు నాశ్రయించి, ఆలయ సేవా కైంకర్యమున నున్న కాంచీపూర్ణునితో మైత్రి ఏర్పడెను. ఆతడు,

శ్రీరంగ వైష్ణవ పీఠాధ్యక్షుడైన యామునాచార్యుని ముఖ్య శిష్యుడు. కాంచీపూర్ణుని భక్తిప్రపత్తులు, సత్ప్రవర్తనము రామానుజునాకర్షించి, అతనియందు గౌరవభావము వృద్ధిచెందెను. శ్రీరంగమునగల యామునాచార్యునికి రామానుజుని వృత్తాంతము దెలిసి, తన యనంతరము పీఠాధిపత్యమునకు దగిన శిష్యుడు లేకుండుటచే నీ బాలునికై యత్నింపదలంచెను. నిస్సారమగు అద్వైత సిద్ధాంతమును, రామానుజుడు యాదవునిదగ్గర అధ్యయనము గావించుచుండుటచే నాతడు విచారించెను. అయినను బాలకుని జూచుటకై, యొక పర్యాయము కాంచీపురమునకరిగి, దూరమునుండియే రామానుజుని గాంచీపూర్ణుని సహాయమున జూచి, ఆనందము పొంది, రామానుజుడు తన దగ్గరకు రాగలడు అని వచించి, యామునాచార్యుడు స్వస్థానమునకు వెడలిపోయెను.

యాదవునుండి చీలిపోయిన రామానుజునకు, గాంచీపూర్ణునకు మైత్రి నానాటికి నభివృద్ధి గాంచుచుండెను. గౌరవ భావమేగాక గురుభావముగూడ రామానుజునకు గాంచీపూర్ణుని పై గుదురసాగెను. కాని శూద్రుడును, నిరక్షరుడును అయిన కాంచీపూర్ణుడు అందులకు జంకుచుండెను. రామానుజుడు కాంచీపూర్ణునికి ఆలయ కైంకర్యమున దోడ్పడుచు, నతనితో నభిషేక జలమును దెచ్చుచు, నతని అనుగ్రహమునకై యత్నించుచుండెను. కాంచీపూర్ణుడు భగవత్సేవ గావించుటయేగాక, పారవశ్యమున నా వరదరాజుతో బ్రసంగించుచుండుటయు రామానుజుని హృదయము నాకర్షించెను.

## యామునాచార్యుడు

రామానుజుని జూచి సంతృప్తుడై శ్రీరంగమును జేరిన ఆళవందారు, రామానుజుని స్మరించుచు, అతనిరాకకై నిరీక్షించుచు, ఆతనికొరకై శ్రీరంగని బ్రార్థించుచుండెను. అప్పటికే శత వృద్ధు కావుటచే దుర్బలుడై, వ్యాధిగ్రస్థుడై, పీఠబాధ్యతల రామానుజునికి నొప్పగించు సంకల్పమున, దన ముఖ్య శిష్యులలో నొక్కడైన మహాపూర్ణుని, రామానుజుని గొనిరా కాంచీపురమునకు బంపెను. యాదవునుండి రామానుజుడు వీడిపోయెననియు విని, యామునాచార్యుడానందించెను.

మహాపూర్ణుడు గురుదేవు యాజ్ఞను గొని, కాంచీపురమును జేరి, కాంచీపూర్ణుని అతిథిగ నుండి, రామానుజుడు ఆలయమును బ్రవేశించువేళ యామునాచార్యుడు రచించిన చక్కని శ్లోకముల దేవసన్నిధి గానము జేయుచుండ, వాని తాత్పర్యముచే నాకర్షింపబడిన రామానుజుడు, వాని కర్త ఎవరని మహాపూర్ణుని బ్రశ్నించెను. అందులకు సమాధానముగ మహాపూర్ణుడు, యామునాచార్యుని విషయముల సవివరముగ దెల్పి, తా గాంచీపురమునకు అరుదెంచిన కార్యముగూడ నెరిగింప, రామానుజుడమితానందము నొంది, మహాపూర్ణునితో శ్రీరంగక్షేత్రమునకు బయనమయ్యెను.

సత్వరము ఆళవందారు దర్శనభాగ్యమునకై నిరీక్షించుచున్న రామానుజునకు, ఆ అదృష్టము లేకపోయెను. వీరిరువురు శ్రీరంగము జేరు సమయమునకు గురువరుడు యామునాచార్యుడు దివంగతుడగుటచే, శిష్యకోటి భౌతిక శరీరమును సంస్కారములకై

కావేరీ తీరమునకు గొనివచ్చిరి. ఈ శిష్యులిరువురు దుఃఖాతిరేకమున గురు శరీరమునుజేరి, వృత్తాంతమును సాకల్యముగ ఆకర్ణించి, మిగుల విచారించిరి. శిష్యవర్యునికొరకై ఆశించి ప్రేమించి నిరీక్షించిన గురువు, శిష్యుని రాక జూడజాలక పోయెను! ప్రేమస్వరూపుడై, తనమీద అద్భుత ప్రేమవాత్సల్యముల బరోక్షముగ బ్రదర్శించి, తన యనంతర పీఠాధిపత్యమును బ్రసాదించిన గురువరేణ్యునితో నొక్కమాటయైనను శిష్యుడు పలుకలేకపోయెను! రామానుజుని హృదయము ఆశాభంగముచే నిండి, దుర్భర మగుటలో నాశ్చర్యమేమి?

అట్లుండుసమయమున, యామునాచార్యుని దక్షిణహస్తమున మూడు వ్రేళ్ళు ముడుచుకొని, రెండుమాత్రము నిలచియుండుట రామానుజుడు వీక్షించి, కారణమునకై పరివారమును బ్రశ్నించెను. కాని వారు స్పష్టపరుపజాలకుండిరి. అందులకు రామానుజుడు ఆలోచించి, అందు ఏదేని నిగూఢ రహస్యముండునని విశ్వసించి, 'అహం విష్ణుమతే స్థిత్వా జనానజ్ఞానమోహితాన్। పంచ సంస్కార సంపన్నాన్ ద్రావిడామ్నాయపారగాన్। ప్రపత్తి ధర్మనిరతాన్ కృత్వా రక్షామి సర్వదా॥' (ప్రపన్నామృతం. 9-68-69) సదా వైష్ణవావలంబకుడనై, ప్రపత్తిమార్గమును అనుసరించి, అజ్ఞులకు పంచ సంస్కార దీక్షనొసగి, ద్రవిడామ్నాయమును వారికి బోధించి, వారి యజ్ఞానమును బోనాడుదునని రామానుజుడు వచింపగా, యామునాచార్యుని యొక వ్రేలు లేచెను. అంత, 'సంగృహ్య నిఖిలానర్థాన్ తత్త్వజ్ఞానపదం శుభం। శ్రీభాష్యం చ కరిష్యామి జనరక్షణ హేతునా॥' (971-72) సర్వభాష్యముల శోధించి, ప్రజా

హితముకొరకు, శుభమును తత్త్వజ్ఞానపరమునైన శ్రీభాష్యమును నిర్మించెదనని రామానుజుడు మరల వచింప, మరియొక వ్రేలు నిలిచెను. మరల యోచించి రామానుజుడు, 'జీవేశ్వరాదీన్ లోకేభ్యః కృపయా యః పరాశరః । సందర్శయన్ తత్స్వభావాన్ తదుపాయ గతీస్తథా॥ పురాణరత్నం సంచక్రే మునివర్యః కృపానిధిః। తస్య నామ్నా మహాప్రాజ్ఞ వైష్ణవస్య చ కస్యచిత్ । అభిధానం కరిష్యామి నిష్క్రియార్థం మునేరహం॥' (9-74-75-76) జీవేశ్వర జగత్తుల స్వభావ విషయముల, విస్పష్టలీల వివరించు పురాణ రత్నమైన విష్ణుపురాణమును, కృపామయుడై రచించిన పరాశర మునివరేణ్యునికి, ఋణవిమోచనమునకై అతని నామము నొక పండితవైష్ణవున కుంచెదనని పలుక, మూడవ వ్రేలుకూడ పైకి లేచెను.

కాని, అట్టి దుఃఖసమయమున రామానుజుడు యీ శ్లోకముల పఠించుట దుర్లభము. అట్లుగాక, శిష్యులనుండి యామునాచార్యుని మూడు కోరికలను ఆలకించి, వ్యాస పరాశర నామముల నిలుపుటకు, అటులే నమ్మాళ్వారుని స్మారకముగ ద్రావిడ వేదమును ప్రచారము జేయుటకు, వైష్ణవమున నంతవరకులేని బ్రహ్మసూత్ర భాష్యమును రచించుటకు రామానుజుడు ప్రతిజ్ఞ గావించెనని కొందరు తలంచిరి. [183] కష్ణస్వామి అయ్యంగారు, On further enquiry Ramanuja was told that the master had three of his cherished objects unfulfilled, namely, an easily-read

---

*183. Swami Ramakrishnananda : The Life of Ramanuja, p 119*

and understood commentary upon the Brahma Sutras; the giving of the names of Parasara and Shadagopa to suitable persons that would make these names live among the people [184] ఇంకను రామానుజుడు ప్రశ్నింప, యామునాచార్యునకు నెరవేరని మూడు కోరికలు గలవనియు, నందు సులభ గ్రాహ్యమగు బ్రహ్మసూత్ర భాష్యము, పరాశర, శఠగోప నామముల ప్రజానీకములో, నా నామముల సజీవముగ చేయగల అర్హులకు నా నామముల నుంచుట యని తెలిసినది అని వచించి, వానిని నెరవేర్చుటకై రామానుజుడు ప్రతిజ్ఞ జేసెనని రచించెను. కాలాంతర రామానుజ కార్యముల నీ ఘట్టమునకు ముడి వైచి కల్పించినట్లు దోచును గురుభావములదా శ్రీరంగమును జేరినవెనుక గ్రహించి, వాని రామానుజుడు నెర వేర్చెననినను బ్రమాదము కానరాదు.

### అశాంతి

కాని ఎందులకో రామానుజుడు, యామునాచార్య నిర్యాణా నంతరము శ్రీరంగమున నిలువక, దిరిగి కాంచీపురమును జేరెను. ఇంతలో దన తల్లి కాంతిమతియు దివంగతయయ్యెను. భార్య యగు రక్షకాంబ రామానుజుని సంసార విముఖత్వమునకు జింతిం చెను. అయినను ఆమెను నిర్లక్ష్యముగ జూచి, రామానుజుడు అధిక కాలము కాంచీపూర్ణునిదగ్గర కాలము గడుపుచుండెను. తన కాత్మశాంతి కలుగుటకై ఉపదేశింపుమని, కాంచీపూర్ణుని రామానుజు

184. *Dr. S. Krishnaswami Aiyangar : The Three Great Acharyas p 101*

దర్శించెను. కాని శూద్రుడగు కాంచీపూర్ణుడు వెనుదీయుచుండెను. ఈ వర్ణవిభేద నిర్మూలనకై రామానుజుడాలోచించి, కాంచీపూర్ణుని తన యింట నాతిథ్యమునకాహ్వానించి, అతని భుక్తశేషమును భుజింప నాతడు సమకట్టెను. అందులకు దగు ఏర్పాటుల గావించి, కాంచీపూర్ణు వాహ్వానించి, రక్షకాంబచే వంటకముల జేయించెను. అంతవరకు కాంచీపూర్ణుడు రాకుండుట గాంచి, రామానుజుడు అతని వెంటగొనిరా ఆలయంబునకరుగ, కాంచీపూర్ణుడు రామానుజుని సంకల్పమును గ్రహియించి, వేరొక మార్గమున రామానుజు గృహము జేరి, రక్షకాంబ నర్థించి, భుజించి, స్థలమును శుభ్రపరచి వెడలి పోయెను. అంత రక్షకాంబయు శూద్రుడు భుజింప శేషించిన పదార్థముల భర్తకిడనొల్లక, వాని ద్యజించి, పునః పచనమునకు గడంగెను. రామానుజుడు గృహమునకరుదెంచి, సర్వవృత్తాంతము నెరింగి, ఆశాభంగము నొంది, భార్య, కాంచీపూర్ణుని శూద్రదృష్టి జూచినందులకామెపై వలిగి అసంతృప్తుడయ్యెను.

కాంచీపూర్ణుడును, రామానుజుని సంకల్పములకు భీతిజెంది, కాంచీపురము వీడి, కొంతకాలము దూరముగ నుండ నిచ్ఛగించి తిరుపతికేగెను కొంతకాలమునకు అతడు మరలివచ్చుట గమనించి, రామానుజుడు యథాపూర్వముగ నతనిజేరి శాంతిభిక్షకై యర్థింప జొచ్చెను. అందులకు గాంచీపూర్ణుడు శ్రీ వరదరాజస్వామి ఆదేశమున 'అహమేవ పరంతత్త్వం జగత్కారణకారణం। క్షేత్రజ్ఞేశ్వరయో ర్భేదః సిద్ధ ఏవ మహామతే॥ మోక్షోపాయో న్యాస ఏవ జనానాం ముక్తిమిచ్ఛతాం। మద్భక్తానాం జనానాం చనాంతిమస్మృతిరిష్యతే॥ దేహావసానే భక్తానాం దదామి పరమం పదం। పూర్ణాచార్యం

మహాత్మానం సమాశ్రయ గుణాశ్రయం । ఇతి రామానుజాచార్యాయ మయోక్తం వద సత్వరం॥" (ప్రపన్నామృతం. 10-66-69) జగత్కారణమైన ప్రకృతి హేతువు బ్రహ్మమును నేను. జీవేశ్వర విభేదము సిద్ధము. ముముక్షువులకు ప్రపత్తియే మోక్ష హేతువు. అవసానకాలమున నన్ను మరచువారి కైనను ముక్తి గలుగును. దేహ విముక్తితో నా భక్తులు పరమపదము నొందుదురు. సర్వలక్షణ లక్షితుడైన మహాపూర్ణుని ఆశ్రయింపుము. ఈ వచనముల వెంటనే రామానుజునకు దెలుపుము అని వరదుడు వచించుటచే, కాంచీ పూర్ణుడును రామానుజున కెరింగించెను. ఈ వచనములకు రామానుజుడు, చిరకాలముగ బాధించుచున్న సంశయములు నివారణ మగుటచే ఆనందించి, కాంచీపూర్ణునకు నమస్కరించి, మహాపూర్ణ దర్శనార్థమై శ్రీరంగమునకు బయనమయ్యెను.

## మహాపూర్ణుడు

శ్రీరంగమున, యామునాచార్య నిర్యాణానంతరము, తిరువంగ అనియు వరంగ యనియు నా శిష్యుడు అధిపతియై, పీఠకార్యముల నిర్వర్తించుచుండెను. కాని తన శక్తి చాలనిది యని అతడు గుర్తించి, రామానుజుని స్మరించి, అతడే దీని కర్హుడని విశ్వసించి, మహాపూర్ణుని, కాంచీపురమున కేగి, కాంచీ పూర్ణుని సహాయమున రామానుజుని ఆహ్వానించి వెంట గొనిరా బంపెను. రామానుజునకు ద్రవిడ ప్రబంధము బోధించుటయు మహాపూర్ణునిపై మోపబడెను. అందులకై మహాపూర్ణుడు బ్రయాణించి కాంచీ శ్రీరంగములకు మధ్యగల మధురాంతక క్షేత్రమును జేర, నాటికి రామానుజుడును, శ్రీరంగక్షేత్రమునకు వెడలుచు నట

విడిసెను. మహాపూర్ణ రామానుజులొండొరులు, యీ తలవని సంఘటననమునకాశ్చర్యానందముల పరిష్వంగము గావించికొని, యిరువురి సంకల్పముల నాకర్ణించి అద్భుతాశ్చర్యముల మునిం గిరి. అంతయు దైవానుగ్రహముగ స్మరించిరి. రామానుజు గోర్కిపై మహాపూర్ణుడు అతనికి బంచ సంస్కార దీక్ష నొసంగి, మంత్రోపదేశమును గావించెను. అంత వారు, కాంచీపురమునకు దిరిగి వచ్చి, రామానుజు భార్య రక్షకాంబకుకూడ దీక్ష నొసంగి, కాంచీపూర్ణునితో సంతోషముగ నుండిరి. రామానుజుని గృహ భాగమున మహాపూర్ణుడు తన సతితో గాపురముండెను. సమ్మతించిన రామానుజుని, వెంటనే శ్రీరంగమునకు మహాపూర్ణుడెందులకు గొని పోవలేదో అనూహ్యము. కాని, ద్రావిడ వేదాధ్యయనమును గాంచీపురమున జేయింప నతని సంకల్పమేమో!

ఈ విధముగ నారు మాసములు గడిచిపోయెను. కాని రామానుజుని భార్యకు దృప్తి కలుగలేదు. ఒక దినమున బచన కార్యమునకు సర్వమును సిద్ధపరచి, రక్షకాంబ నూతికి జలమునకై వెడలెను. అదే సమయమున మహాపూర్ణుని భార్యయు నచటికి నీటికై ఏతెంచెను. నీరమును దోడు సమయమున, రక్షకాంబ జలములపై మహాపూర్ణుని భార్యయొక్క ఉదకము కొంచెము చిందుటచే గోపించి, రక్షకాంబ దూషింప, నిరువురికి దగవులాట బెరిగి, మహాపూర్ణుని భార్యను అల్పవర్ణజగ రక్షకాంబ నిందించి, యింతకు తన భర్తయే యీ వర్ణసాంకర్యమునకు గారణముగ దన్నుదా నిందించుకొనెను. ఈ విషయముల నాకర్ణించిన మహా పూర్ణుడు, వెన్వెంటనే శ్రీరంగమునకు బయనమై వెడలిపోయెను.

## సన్న్యాసము

ఆ సమయమున నెటకో కార్యార్థియై వెడలియుండిన రామానుజుడు గృహమునకేతెంచి, గురువృత్తాంతము నాలకించి, రక్షకాంబను బ్రశ్నింప, జరిగిన విషయమునెల్ల నామె వినిపించెను. దీనికంతటికి మూలకారణము తన భార్యయే యని రామానుజుడు గ్రహించి, కోపించి చింతించెను. కాని ఎటులైన భార్యను బరిత్యజింప సంకల్పించి, ఆమె తండ్రి యాహ్వానముగ నొక లేఖను కల్పించి, ఆమెను మాతృస్థానమునకు బంపి, వెంటనే రామానుజుడు శ్రీ వరదరాజాలయమునకరిగి, సాష్టాంగ ప్రణామ మాచరించి, కాషాయముల ధరించి, హోమాదుల నాచరించి సన్న్యసించెను. అందులకానందించి, కాంచీపూర్ణుడు రామానుజుని 'యతిరాజు' అని సంబోధించెను. ఆ 'యతిరాజ' బిరుదమే సార్థకమై రామానుజునకలంకారమై రూపొందెను.

రామానుజాచార్యుడు సన్న్యసించి యతిరాజుగ మార్పు చెందినబిమ్మట, నతని ప్రఖ్యాతి అనంత ముఖముల విస్తరింప దొడంగెను. అతని దర్శన సంభాషణములకై ఆశించి, అనేకులు అతని జేరుచుండిరి. అతని బంధువగు దాశరథి ప్రథమ శిష్యుడయ్యెను. ఇతడు వేదవేదాంతముల బఠించి, వైష్ణవ విశ్వాసము గలవాడు. హారీత వంశజుడైన గురునాథ లేక, కురేశుడను వాడు ద్వితీయుడు. ఇతని జ్ఞాపకశక్తి అద్భుతము. ఏకసంతగ్రాహి. ఈ కాలముననే యాదవప్రకాశుడు కాంచీపూర్ణునియొక్కయు, నిజమాతయొక్కయు బోధిద్బలమున రామానుజు నాశ్రయించి, గోవింద జియ్యరుగ నయ్యెనని చరిత్ర.

## పీఠాధిపత్యము

రామానుజుని సన్న్యాస స్వీకరణమును ఎరింగి, శ్రీరంగ క్షేత్రమున మహాపూర్ణ, వరరంగాచార్యులు అమితానందము నొందిరి. మరల నాతని శ్రీరంగ వైష్ణవ పీఠమునకాహ్వానింప వరరంగాచార్యుని మహాపూర్ణుడు బంపెను. అందుచే రామానుజుడు కాంచీపురమును వీడి, తిరువరంగనితో శ్రీరంగమును జేరి, వైష్ణవుల కానందము జేకూర్చెను.

కాని రామానుజుడు, తన పినతల్లి కుమారుడైన గోవిందు రక్షించు మార్గమునకై యన్వేషించుచుండెను. అతడును దనతోడ నిట లేకుండుట లోపముగ నాతడు భావించెను. కాళహస్తిలో శైవమతాచార్యుడై యున్న గోవిందుని, వైష్ణవమునకు మార్చి గొనితే శ్రీశైలపూర్ణుని రామానుజుడర్థించెను. శ్రీశైలపూర్ణుడు కాళహస్తికేగి, తీవ్ర యత్నముల సాగించి, గోవిందుని శైవము నుండి వైష్ణవమునకు మరల్చి, మంత్రోపదేశము గావించి, అతని రామానుజ సన్నిధానమునకు బంపెను. అందుచే శ్రీరంగ మఠము శోభాయమానముగ, నెల్లరకు సంతృప్తి నొసంగుచు బ్రకాశించు చుండెను.

గురుస్థానము నలంకరించియు రామానుజుడు నిత్యవిద్యార్థి యగుటచే, పూర్వము కాంచీనగరమున మహాపూర్ణుని సన్నిధాన మున ద్రవిడ ప్రబంధము నధ్యయనము గావించియు, శ్రీరంగ మున మరల నా గురువును జేరి, 'న్యాసతత్త్వ' 'గీతార్థ సంగ్రహ' 'సిద్ధిత్రయ' 'వ్యాససూత్ర' 'పాంచరాత్రాగమ' ముల మహాపూర్ణుని వద్ద పఠించెను.

యామునాచార్యుని ముఖ్యశిష్యులలో నొకడైన గోష్ఠీపూర్ణుని, అతని గ్రామమైన తిరుక్కొట్టియూరున, వైష్ణవ మంత్రోపదేశమునకై మహాపూర్ణుని పనుపున రామానుజుడర్థించెను. కాని రామానుజుని బరీక్షించుటకై పదునెనిమిది పర్యాయములు అతడు త్రిప్పిబంపెను. అందులకు దన అనర్హతయే గారణమని చింతించి మరల రామానుజుడు గోష్ఠీపూర్ణుని మహామంత్రోపదేశమునకై గోర, గోష్ఠీపూర్ణుడు సంతృప్తమానసుడై మంత్రోపదేశమును నొనరించి, ఆ మంత్ర శ్రవణముననే నెల్లరు ముక్తు, లగుదురు గాన, నీ మంత్రమును ఎవరికినిగూడ నుపదేశింపవలదని శిష్యుని, గోష్ఠీపూర్ణుడు శాసించెను. 'వల్లె' యని రామానుజుడు గుర్వాజ్ఞ గొని శ్రీరంగమునకు బోవుచు, గోష్ఠీపురముననే గల విష్ణ్వాలయమునకరిగి, గోపుర ద్వారమునెక్కి, ఎల్లర నాహ్వానించి, మంత్రోపదేశము నెల్లరకు గావించెను. అందులకు గురువాగ్రహించి, శిష్యుని రావించి మందలింప, శాసన ధిక్కార ఫలితము నరకముగ నెరిగి, రామానుజుడు, 'అనేకులు మంత్ర శ్రవణమాత్రమున ముక్తి బొందుచుండ నేనొక్కరుండ నరకమును బొందిననేమి?' అని ప్రత్యుత్తరమొసంగ, అతని విశాల హృదయమునకుప్పొంగి, గోష్ఠీపూర్ణుడు గాఢాలింగనము జేసి, ఆశీర్వదించి రామానుజుని బంపెను.

మరల రామానుజుడు, యామునాచార్యుని శిష్యుడైన వరరంగనివద్ద ద్రవిడ ప్రబంధముల నధ్యయన మొనరించెను, అటులే ఆళవందారుని మరియొక శిష్యుడైన మాలాధరునివద్ద శఠారియొక్క 'శఠారి సూక్త' మును, వెయ్యి పాశురముల జదివెను.

ము వారి అన్వయముల ననుసరింపక, దన యర్థములగూడ
౯ దెలుపుచు నుండెను. అట్లు ఒక సమయమున గావింప,
ంధరుడు అలిగిపోయెనుగాని మరల గోష్ఠిపూర్ణుని ప్రోద్బల
రామానుజునకు పాఠముల పొగించెను. వరరంగనిదగ్గర
ముల జదువుకొనునపుడు రామానుజుడు, గురువర్యుని పాదసేవ
గావించి ఆనందించెడువాడు. పై విధముగ యామునా
న్యనకు ముఖ్యశిష్యులైన కాంచీపూర్ణ, మహాపూర్ణ, గోష్ఠిపూర్ణ,
ంధర, వరరంగలనుండి ఆ యా విషయముల గ్రహించి,
ంర్తిగ యామునాచార్యుని ప్రధాన శిష్యుడై, రామానుజా
న్యడు రూపొందెను.

శ్రీరామానుజుని అసాధారణ ప్రభావము ప్రజానీకము పై
ంచుట గాంచి, కొందరికి అసూయ చెలరేగుటయు సహజము.
ు శ్రీరంగనాథాలయ ప్రధానార్చకుడు ఒకడు. అతడు రెండు
యములు రామానుజుని విషానల బారిబడునట్లు వ్యూహముల
, విఫలమనోరథుడై, రామానుజుని మాహాత్మ్యమును గుర్తించి
గతుడయ్యెను. యజ్ఞమూర్తి నా యద్వైత పండితుడుత్తర
ులు, దన విద్యా వైభవమున జయించి, దక్షిణ దేశమున
నుజుని కీర్తి గౌరవముల నాలకించి, ఎదుర్కొన శ్రీరంగమున
ుదెంచెను. ఇరువురు మహావిద్వాంసులకు వరుసగ పదునేడు
ులు విద్యారణము జరిగెను. కాని విద్యల నోడించు రామా
ు భక్తిప్రపత్తులును, సద్గుణగణములును యజ్ఞమూర్తి

నాకర్షించి, విద్యావాదములు నిష్ప్రయోజనములని పరితాపము పొంది, రామానుజునకు ప్రపన్నుడై, వైష్ణవమును స్వీకరించి, దేవరాజమునిగా మారెను. కాని యజ్ఞమూర్తినిగూర్చి ఎందును యింతకంటె నా కాలమున గానుపింపబడుండుటచే, నతని మతాంతరస్వీకార గాథను కృష్ణస్వామి అయ్యంగారు సందేహించెను. [185]

శ్రీరామానుజుడంత శ్రీపతి దర్శించు కాంక్ష యుదయింప శిష్యులతో బయనమై, మార్గమధ్యమున అష్ట సహస్ర గ్రామమున ప్రియశిష్యుడైన యజ్ఞేశునింట నాతిథ్యము స్వీకరించి, కాంచీపురమును జేరెను. అంత గాంచీపూర్ణుని దర్శించి, ఆనందించి, మూడు రాత్రులకు తిరుపతికి రామానుజుడు జేరెను. శ్రీశైలము నధిరోహించి, అందుగల శ్రీశైలపూర్ణుని ఆతిథ్యమును స్వీకరించెను. శ్రీ వేంకటనాథుని యతిరాజు దర్శించి, ఆ మోహన విగ్రహమునకు ఆనందతన్మయుడై, స్తుతించెను.

పూర్వము శ్రీశైలపూర్ణునిచే వైష్ణవమును స్వీకరించిన గోవిందుడు, కొంతకాలము రామానుజునివద్దనుండి, మరల శ్రీశైలపూర్ణ సేవకై తిరుమలకు వచ్చియుండెను. ఈతడు రామానుజు ఆగమమునకమితానందమున నుప్పొంగెను. రామానుజుడు శ్రీశైలపూర్ణు కోరికపై తిరుపతిలో వత్సరము వాసముండి, శ్రీశైలపూర్ణుని వద్ద రామాయణ శ్రవణము గావించి, అనేక రహస్యార్థముల నామహాత్మునుండి గ్రహించెను.

---

185. *Dr. S. Krishnaswami Aiyangar : The Three Great Acharyas, p 120*

అచటనుండి శ్రీరామానుజాచార్యుడు, శ్రీరంగ ముఖమున ప్రయాణించి, కాంచీపురమునకరుగుదెంచెను. గోవిందు వెంటరా రామానుజుడు శిష్యవర్గముతో దిరిగి శ్రీరంగము జేరి, యథాపూర్వముగ శిష్యులకు బోధించుచుండెను. గోవిందుడును రామానుజ శుశ్రూషా భాగ్యమున నతని సంతృప్తుని గావించి, పంచ సంస్కార దీక్షానంతరము సన్న్యాసాశ్రమ స్వీకారము నొందెను. అతనికి మన్నాథనామ మొసంగబడెను. ఆ నామమే తమిళములో 'ఎంపెరుమానారు' అనియు, 'ఎంబారు' అనియు మారెను. అతని పేరనే జగన్నాథమున 'ఎంబార్ మఠము'ను రామానుజుడు స్థాపించెను. ఈ కాలమున రామానుజు నాశ్రయించి, సర్వవిద్యాపారంగతులైన శిష్యులు డెబ్బదినల్వురుండిరి. వారు సింహాసనాధిపతులనియు, పీఠాధిపతులనియు నాబరగిరి.

## శ్రీభాష్యము

ఈ విధముగ సకల వైభవోపేతముగనున్న రామానుజునకు, యామునాచార్యుని మూడు కోరికలు స్ఫురణమునకు వచ్చెను. భాష్యరచనమునకు పూర్వాచార్యుల ముఖ్యగ్రంథమైన బోధాయన వృత్తి అతనికి అవసరమని దోచెను. అది దక్షిణ భారతమున లేదని గ్రహించి, విచారించి, ఉత్తరమున గాశ్మీరమున గలదని ఎరింగి, కురేశుని వెంటగొని ఉత్తరఖండ యాత్రకు రామానుజుడు వెడలెను. మూడు మాసములు ప్రయాణించి, గురుశిష్యులు కాశ్మీరమును జేరి, శారదాపీఠమునకు బోయిరి. అచట బండితులు ఆ గ్రంథము నిడ నిరాకరింప, చింతాక్రాంతుడై రామానుజుడా రాత్రి యుండ, సరస్వతీదేవి కనికరించి, ఆ గ్రంథమును రామానుజునకిడెనని

కథనము. అట్లు గ్రంథము లభింప వెన్వెంట, రామానుజ కురేశులు పయనమై దక్షిణమునకు వచ్చుచుండిరి. కాని గ్రంథము మఠమున లేకుండుట ఆ పండితులు అచిరకాలమున గ్రహించి, వీరి వెంట నంటి, ఆ గ్రంథమును బలాత్కారముగ గైకొనిపోయిరి. అందు లకు రామానుజుడు చింతింప, కురేశుడు ఆచార్యు నూరటపరచి, ఆ గ్రంథమును పగ్రతిరాత్రియు దా నధ్యయనము గావించితిననియు, కాశ్మీరము నుండియు బయలుదేరినదాది అది సాధ్యమైనదనియు, నందుచే నా గ్రంథము తనకు కంఠగతము కాన దా చెప్పెదనని వచించెను. అట్లు ఆ గ్రంథమును కురేశుడు స్మరించి, గురువున కిడెను. రామానుజాచార్యుని ఆనందమునకు మేరలేకపోయెను. బోధాయన వృత్తి వీరికి లభించుట కాశ్మీరమునగాక, వారణాసి యందని శ్రీరామానుజ చంపూ గ్రంథ కథనము. [186] కాని యీ కథనమునకు కొందరు సమ్మతింపరు. అందు రాజగోపాలాచా ర్యుడు వ్రాయుచు, భాష్యరచనమునకు బూర్వమే రామానుజుడు బోధాయన వృత్తిని దెలిసి చూచి యుండెననియు, నందు కొరకై అతడు కాశ్మీరమునకు బోయియుండడనియు దెలిపి, The fact may be that Ramanuja produced the Vritti from some library in the North, but not from Kashmir [187] కాశ్మీరమునగాక, ఉత్తర దేశమున నొక గ్రంథాలయమునుండి వృత్తిని, రామానుజుడు సేకరించి యుండుననుట సత్యమనియు నాతడు తలంచును. అట్లు గ్రంథమును గైకొని, రామానుజుడు

186. *Sri P. P.S. Sastri: Sri Ramanuja Champu, p. vi*

187. *Prof. T. Rajagopalachariar: Vaishnavite Reformers of India, p. 51*

శ్రీరంగమును జేరెను. అంత రామానుజాచార్యుడు ఏకాగ్రచిత్త మున, వేదవేదాంతముల గమ్యమైన ముక్తి, ధ్యానోపాసనా భక్తి విధానముల సాధ్యమని తీర్మానించుచు, బ్రహ్మసూత్రములకు బృహత్తరమైన మహాగ్రంథమును భాష్యముగ రచించెను. దాని గని, సరస్వతీదేవియే అఖిలేతర భాష్యములకంటె ఉత్తమ మగుటచే శ్రీ భాష్యమని నామకరణమొనరించెనని కొందరందురు.

అంత రామానుజుడు వేదాంతదీప, వేదాంతసార, వేదార్థ సంగ్రహ గీతాభాష్యములగూడ తన అసాధారణ ప్రజ్ఞచే, అఖండ పాండిత్య ప్రదర్శనమున నిర్మించి, సర్వ ముముక్షుజనోపకార మొనరించెను. ఈ విధముగ యామునాచార్యుని ప్రథమ వాంఛను రామానుజుడు నెరవేర్చెను. ఈ భాష్య రచనముతో రామానుజ సిద్ధాంతము, విశిష్టాద్వైతము నా బ్రఖ్యాతి గాంచెను.

## దిగ్విజయ యాత్ర

అటుపిమ్మట యతిరాజు స్వసిద్ధాంత ప్రతిష్ఠాపనమునకై సంకల్పించి, దిగ్విజయయాత్రకు గడంగెను. కాంచీపుర, కుంభకోణ, మధురల దర్శించి, అందుండు పర సిద్ధాంతముల మరలించి, అంత శఠారిని దర్శించెను. తిరువనంతపురమును జూచి, ఉత్తర భారతమునకేగి, అందు ద్వారక, మధుర, బృందా వన, సాలగ్రామ, సాకేత, బదరికాశ్రమ, నైమిశారణ్య, పుష్కర తీర్థముల గుర్మ్మరి, ఆనందించి కాశ్మీరమును జేరెను. అటనుండి కాశీ, జగన్నాథములకు వెడలెను. జగన్నాథమున గోవిందునికై 'ఎంబారు మఠము'ను నెలకొల్పెను.

జగన్నాథమున ఆలయ అర్చనావద్ధతిని పాంచరాత్రమునకు మార్పు చేయింప రామానుజుడు యత్నింప, బ్రబల ప్రతిఘటనము నెదుర్కొనెను. కాని రామానుజుడు చర్చకు సంసిద్ధము కాగ నా యర్చకులు జగన్నాథుని బ్రార్థింప, నా రాత్రి జగన్నాథుడు రామానుజుని అతని శిష్యులతోసహ కొన్ని యోజనముల దూరమున నుంచెననియు, వారు నిద్రలేచుటతో జగన్నాథమునగాక శ్రీ కూర్మ క్షేత్రమున నుండిరనియు చరిత్ర. తన సంకల్పమీడేరక రామానుజుడు ఆంధ్రమున బ్రవేశించెనని దోచును. అటనుండి సింహాచలమును దర్శించి, అహోబిళము చేరి, అందు ఒక మఠమును స్థాపించెను. అంత తిరుపతికేగి మూలవిగ్రహ స్వరూప నిర్ణయమునకై శైవులు వైష్ణవులు పోరాటముల సల్పుచుండుట రామానుజుడు గాంచి, తీర్మానమునకై ఒక విధానమును దెల్పెను. మూలవిరాట్టు పాదములయొద్ద శైవ, వైష్ణవ ఆభరణములనుంచి, రాత్రి ఆలయమును బంధించి, ప్రాతఃకాలమున జూచిన, మూల విగ్రహము ఏ ఆభరణముల ధరించునో, ఆ మూర్తి ఆ దేవత యని రామానుజుడు వచింప నెల్లరు సమ్మతించిరి. అట్లే గావించిరి. ఉదయము అందరటకరిగి చూడ, వైష్ణవ చిహ్నముల మూర్తి ధరించి యుండుటచే నా మూర్తి విష్ణువుగ దీర్మానింపబడెను. రామానుజుడే సూక్ష్మ రూపమును ధరించి, ఆలయమున బ్రవేశించి, వైష్ణవ చిహ్నములచే మూర్తి నలంకరించి వచ్చెననియు వాదు కలదు. అట కాంచీపురము, మధురాంతకము, వీరనారాయణ పురముల దర్శించి, రామానుజాచార్యుడు శ్రీరంగక్షేత్రమును జేరుకొనెను.

## దేశాంతరవాసము

సుమారు, తన ముప్పది రెండవయేట శ్రీరంగమునుజేరి, పీఠము నలంకరించి, సర్వసమర్థముగ బాలించుచున్న శ్రీ రామానుజునకు స్థానచలనము అవసరమయ్యెను. పూర్వోక్తచందము అపమానలీల సర్వశాస్త్ర సంపూర్ణమైన శ్రీ బాష్యరచనము, మరితర రచనముల గావించి, సహస్రాధిక శిష్యపరివృతుడై జేగీయమానముగ క్రీ. శ. 1078 వరకు రామానుజుడు, సర్వక్షేమైక విధానముగ శ్రీరంగమునకేగాక దక్షిణాపథమునకే భూషణముగ వెలుగొందుచుండెను. నాటికి అతనికి షష్టిపూర్తి అయినది. అట్టి వృద్ధాప్యమున గష్టములు సంప్రాప్తించుట దురదృష్టకరము.

ఈ విషమ సమయమున నత్యంత ప్రముఖ పాత్రము వహించి, అసాధారణ త్యాగమొనరించిన కురేశుని వృత్తాంత మిసుమంత చూచెదముగాక! ఈతనిగూర్చి బోధాయనవృత్తి సంపాదనా సందర్భమున వినియున్నాము. ఆతడు, కాంచీపుర సమీపమునగల కురాగ్రహారమున గల ధనవంతుడు. రామానుజ కాంచీపూర్ణులపై గొప్ప భక్తివిశేషములు గలవాడు. ధనధాన్యాది సంపదలు పరమాత్మను బొందింపజాలవను రహస్యము నెరింగి, త్యజించి, శ్రీరామానుజ సేవాభాగ్యమునకై భార్యాసమేతుడై శ్రీరంగమును జేరెను. భిక్షాటనము గావించుచు పోషణమును జేసికొనుచుండెను. మహా విద్వాంసుడై యుండియు మిక్కిలి భక్తి ప్రపత్తులతో శ్రీరంగ, రామానుజుల సేవ గావించుచు ధన్యజీవియై చెలరారెను. కొంతకాలమునకు అదృష్టవశమున భార్య యగు ఆండాళ్ళు గర్భవతియై, యిరువుర కవల బిడ్డల గనెను. వారికి

జాతకర్మాదికమును గోవిందునిచే నొనరింపజేసి, ఆ బాలకులకు పరాశర, వ్యాస నామముల రామానుజుడుంచెను. అటులే గోవిందుని అనుజుడగు బాలగోవిందునకు, బాలకుడుద్భవింప నా శిశువునకు పరాంకుశపూర్ణుడని నామకరణము జేసెను. ఈ విధముగ యామున మునీంద్రుని కోరికలన్నియు రామానుజుడు నెరవేర్చి, సుఖమున నిశ్చింతగ శిష్యులకుపదేశముల గావించుచు శ్రీరంగమున నుండెను.

ఈ కాలమున జోళదేశమున గ్రిమికంఠుడను ప్రభువు పరిపాలించుచుండెను. అతనికి గాంచీపురము రాజధానిపురము. అతడు శైవమతాభిమాని యగుటచే, తన రాజ్యమంతయు శివుని ఆరాధింపజేయ సంకల్పించెను. తత్సంకల్పసిద్ధికొరకై అతడు వైష్ణవ గురువుల రావించి, శివుడే పరమదైవముగ నంగీకరింప జేయుచు, నటుల రామానుజునిగూడ సమ్మతింపజేయ శ్రీరంగము నకు ఆహ్వానముల నందజేసెను. ఇందు అపాయ లక్షణముల వీక్షించి, రామానుజు బంపనొల్లక మహాపూర్ణ, కురేశులు కాషాయ ముల ధరించి, కురేశుడే రామానుజ పాత్ర వహించి, కాంచీపుర మును జేరిరి. గ్రిమికంఠుడు కురేశుని రామానుజునిగ భావించి, 'శివాత్పరతరం నాస్తి' శివునికంటె మించు దేవుడు లేడు అని వ్రాసి చేవ్రాలుంచి తనకిమ్మని ఆజ్ఞ నొసంగెను. దానికి 'ద్రోణమస్తి తతః పరం' దానికంటె ద్రోణము పెద్దది గలదు అని కురేశుడు వచించెను. అనగా ధాన్యమును గొలచుటకై యుపయోగించు గొలతలు శివద్రోణములని గలవట. వాని నిట నన్వయించి కురేశుడు ధైర్యముగ నా రాజ వచనముల ధిఃకరించి బలుక, నందులకు ప్రభువు కుపితుడై, కురేశ, మహాపూర్ణుల నేత్రముల బెరికి వంపి

వేయ నాజ్ఞ నిడెను, ఆ విధముగ రాజాగ్రహమునకు గురియై, యిర్వురు అంధులై, శ్రీరంగమునకు దిరిగి వచ్చుచు, మార్గ మధ్యమున కడువృద్ధుడగు మహాపూర్ణుడు మరణింప, కురేశుడు మాత్రము శ్రీరంగమును జేరెను.

రామానుజుని కాలమున జోళభూపతి కుళోత్తుంగుడనియు (1070-1118 A. D), అతడు శైవుడై యున్నను, మిగుల ఉదారుడై యితర మతములగూడ బోషించుచుండెననియు కృష్ణ స్వామి అయ్యంగారు వచించెను. నాగపట్టణమునగల బౌద్ధాలయ మునకు ఆ రాజు ధనసహాయము చేసినట్లు దెలియుచున్నది. శైవ మతస్థుల బోద్బలమున ఇతర వైష్ణవుల నెల్లగాక, శ్రీరంగమున అధిక ప్రఖ్యాతుడైన రామానుజునే అతడు రావించి, శివుని వర దైవముగ సమ్మతింపజేయ యత్నించెను. అనగ నీ రాజు వైష్ణవ ద్వేషిగాక, రామానుజుపై శైవులకుగల వ్యక్తిగత ద్వేషమునకు మాత్రము లొంగినట్లు ప్రస్ఫుటమని కృష్ణస్వామి అయ్యంగారి సిద్ధాంతము.[188] ఆచార్య గోపీనాథరావు తాత్పర్యమున, కుళో త్తుంగుడు రామానుజునైన హింసింప సంకల్పము లేదనియు, గాని రామానుజు రూపముననున్న కురేశుని ధిఃకారవచనములు అతనికా గ్రహకారణములై, కన్నుల దీయించి వంపెనుగాని, యితర వైష్ణ వులజోలికాతడు పోయినట్లాధారములు లేవనియు, Hence we

---

*188. Dr. S. Krishnaswami Aiyangar: The Three Great Acharyas p. 123*

may be sure that the harted of the king was personal and not sectarian. [189] నందుచే రాజుయొక్క ద్వేషము మత మునగాక, వ్యక్తిగతముగ మనము దీర్మానింపనగుననియు వ్రాసి యున్నాడు.

మహాపూర్ణ, కురేశులు రాజాజ్ఞ ననుసరించి కాంచీపురమున కరుగ, దనకును వైష్ణవులకెట్టి యుపద్రవము రానున్నదో యను భీతిచే, రామానుజుడు సపరివారముగ రహస్యముగ కురేశ దుస్తుల ధరించి, అర్థరాత్రిమున శ్రీరంగమునువీడి, పశ్చిమముగ బలాయనమయ్యెను. వైష్ణవాచార్యుడగు రామానుజుడితడే యని, క్రిమికంఠు సేవకులు తనను గుర్తించి బంధించెదరేమో యను భయము, రామానుజునకు అధికముగ నుండెను. రాత్రింబవళ్ళు నిలువక, ఆహారనిద్రాదుల వర్జించి, రెండు దినములు పయనము సాగించి, మూడవ దినమునకు రామానుజుడు చోళదేశమును దాటి, మైసూరు రాజ్యమున బ్రవేశించెను.

రెండుమూడు దినములనుండి, ఆహార నిద్రా విశ్రాంతులు లేని ప్రయాణమగుటచే వారు మిగుల యలసియుండుట గాంచి, అరణ్యమధ్యమునగల మాలపల్లె జనులు ఫలాదుల నర్పింప, యతిరాజు వాని స్వీకరించి, అందరి యాకలి దీర్చి, ఆ ఛండాలుర నాశీర్వదించి పంపెను. అంత మరలి ప్రయాణము సాగించి, యొక గ్రామమున శ్రీరంగదాస, చేలాంచలాంబల ఆతిథ్యమును గ్రహించి, వారి ననుగ్రహించి, పంచ సంస్కారదీక్ష నొసంగి,

---

189. *Prof. T. A. Gopinatha Rao: History of Sri Vishnavas, p. 39*

రెండుదినములందే శ్రీమదిర నుండి, వహ్నిపుష్కరిణిజేరి, అట రెండు దినములుండిరి. అంతా సాలగ్రామ గ్రామమున ఆంధ్రపూర్ణ బ్రహ్మచారిని శిష్యునిగ గావించి, తన యాప్తునిగ యతిరాజు జేసికొనినెను.

## మేల్కోటు

ఈ విధమున రామానుజుడు బయనించుచుండ, నా రాజ్యాధినేత యగు విఠలదేవుడు యతిరాజుని గొప్పదనముల నాలకించి, తన యాస్థానమునకాహ్వానించెను. ప్రభువు జైన మతాచార్యుల ప్రాపకమున నుండెను. ఆతని కుమార్తెకు భూతము సోకుటచే బ్రథమమున జైనుల నర్థించెను. కాని వారాగ్రహమును బారద్రోల నసమర్థులైరి. అందుచే యతిరాజు ఆగమన వార్త విని, రాజు యతిరాజును ఆహ్వానించెను, రామానుజుడు సర్వసమర్థుడు గాన నచిరకాలమున, నాగ్రహమును రాజపుత్రినుండి వైదొలగ జేయ, భూపాలుడమితానందము నొంది, రామానుజునుండి వైష్ణవ సిద్ధాంతమును శ్రవణము జేయుగోరెను. ఆ విధముగ వైష్ణవమును ఆలకించి విఠలదేవుడు అద్భుతానందములు గలిగి, విశ్వసించి, పండిత సభ నాహ్వానించెను. అందు యతిరాజు వాదమునకు జైనులు నిలువలేకబోవుటచే, వారు పరాజయులైనట్లు తీర్మానించి, విఠలదేవుడు వైష్ణవము స్వీకరించెను. యతిరాజు ఆ భూరాజునకు విష్ణువర్ధన నామము నొసంగెను. అనేక జైనులుగూడ వైష్ణవ మతావలంబకులైరి.

అంత రామానుజుడు శిష్యపరివృతుడై, యాదవాద్రియను మహాక్షేత్రమునకు వెడలెను. అదియే ఆధునిక మేల్కోట క్షేత్రము.

అతఃపూర్వము యీ క్షేత్రము మహమ్మదీయ దండయాత్ర వాతబడి శిథిలావస్థకు వచ్చెను. ఆలయమున గల నర్చామూర్తిని హిందువు లెందో దాచియుంచిరి కాని, తర్వాత వారికి లభ్యము కానందున, ఆలయము నిత్య నివేదనాధి కైంకర్యములులేక బాడుబడి యుండెను. రామానుజుడు, చరిత్ర నాకర్ణించి, అందలి తులసివనమున భూమిలోనున్న యాదవాద్రిపతిని బైకి దీయించి, యొక పర్ణకుటీరమును నిర్మించి, అందు నా విగ్రహములను నెలకొల్పి, పూజాదుల బ్రారంభించెను. అంత నచిరకాలమున ఆ స్థలమున యతిరాజు ప్రోత్సాహ ప్రోద్బలములచే, బ్రజాసహాయముచే నొక గొప్ప దేవాలయ ప్రాకారములు వెలసెను. అచట ఒక సరోవరము 'కల్యాణ' నామమున నిర్మింపబడెను.

ఆలయమున సర్వ పంబారములున్నను, ఉత్సవ విగ్రహములు లేకుండెను. పూర్వమూర్తుల విషయము నాలోచింప, నా మూర్తులు ఢిల్లీ పాదుషావద్దనున్నట్లు రామానుజుడు తెలిసికొనెను. ఆ సచలమూర్తికి సంపత్కుమారుడనియు, రామప్రియుడనియు నామాంతరములు గలవు. ఏతన్నియోగంబున రామానుజుడు రెండు మాసములు నడిచి, ఢిల్లీ పురమును జేరి పాదుషాను దర్శింప, నాతడు యతిరాజుయొక్క ఆకర్షవంతమైన మూర్తికిని, అసాధారణ విద్యా వైదుష్యమునకు దాసుడై, రామానుజు గోర్కి మన్నించి, సంపత్కుమార విగ్రహము నొసంగి పంపెను. అ విషయము నాకర్ణించిన పాదుషా కుమారి, ఆ సంపత్కుమారిని అధికతరముగ బ్రేమించుచు నిత్యము సేవించుచుండుటచే, నా విరహవేదనమును భరింపజాలక దండ్రిని సమ్మతింప

జేసి, తాగూడ జయులుదేరి రామానుజు జేరెను. మేల్కోటలో నామె తన జీవితశేషమును భక్తిప్రపత్తుల గడిపి, సార్థకజన్మ యయ్యెను. ఈమె బీబిలచిమారు అనియు బీబినాంచారు అనియు ప్రశస్త. దక్షిణ దేవాలయముల నర్చింపబడుచుండును.

## పునరాగమానము

ఈ విధముగ నా యతిరాజు శ్రీ రామానుజాచార్యుడు, మేల్కోట మహాక్షేత్రమున క్రీ. శ. 1117వ సంవత్సరము వరకు అనగా 39 సంవత్సరములుండి, ఆ ప్రాంతముల విరివిగ వైష్ణవ సిద్ధాంత ప్రచారము సల్పి, అసంఖ్యాక ముముక్షుకోటి కాత్మ శాంతిని ప్రసాదించెను. ఈలోపల జోళదేశాధిపతియైన క్రిమికంఠుడు మరణించుటచే, శ్రీరామాజుడు, మరల శ్రీరంగక్షేత్ర వైష్ణవుల ప్రార్థనల మన్నించి, అందుజేర సంకల్పించెను. అట్లు శ్రీరంగ ముఖముగ ప్రయాణించు రామానుజుడు, మార్గమధ్యమున మధురా నగర సమీపమునగల వృషభాచలమును దర్శించి, అందు పూర్వ ముండిన ఆండాళ్లును సంస్మరించి, అండాళ్లు జన్మస్థలమైన శ్రీ విల్లి పుత్తూరునుగూడ గాంచెను. అంత ఆళ్వారు తిరునగరిని జేరి నమ్మాళ్వారు దర్శనమున ధన్యత నొంది, శ్రీరంగమును క్రీ. శ. 1117వ సంవత్సరమున రామానుజుడు జేరెను.

శ్రీరంగ మహాక్షేత్రమున, రామానుజుని పునరాగమనమున కెల్లరమితానందమున మునిగి, ఘనస్వాగతము నిడిరి. రామానుజుడంత శ్రీరంగధామమున అగణిత శిష్యసమూహమధ్యమున, వారి కాధ్యాత్మికావసరముల జేకూర్చుచు, ఆత్మారతుల గావించుచు, అనేక

విధముల నానందము వారికొసగుచు, మరల అరువది వత్సరముల కాలము, శ్రీరంగనాథుని సేవా మగ్నుడై యుండెను.

శ్రీరామానుజాచార్యుని యునికిచే బవిత్రమైన యాదవగిరి అనగా మేల్కోటలో, రామానుజుడు శ్రీరంగమునకు తిరిగి ఏగు దెంచుకాలమున నా ప్రజానీకముయొక్క వాంఛ మన్నించి, తన రాతి విగ్రహము నొండు జేయించి, పూజార్థము వారికిడెను. అటులే జన్మస్థలమైన శ్రీపెరుంబుదూరులో శ్రీరామానుజునికి గొప్ప ఆలయము నిర్మించి, అందు యతిరాజు మూర్తి నొండు ప్రతిష్ఠించి, నిత్యపూజా కైంకర్యముల సేవింపసాగిరి. కాని శ్రీరంగమున శ్రీరామానుజుడు, తన కడపటి అరువది వత్సరములు అన్య స్థానములకరుగక నందే శ్రీరంగధామ సేవయందును, శిష్య హితకాంక్షయందును నిమగ్నతజెంది, నిశ్చలముగ నుండుట శ్రీరంగక్షేత్రముయొక్క భాగ్యము. అతని వాత్సల్యమును జవిచూచి, అతని వాగమృత ధారల గ్రోలి, ముక్తి సాంగత్యము నొందిన శ్రీరంగపౌరుల అదృష్టమేమనవచ్చును! అతని సన్నిధి వారు యైహిక బాధల మరచి, భక్తి పారవశ్యమున నుందురుగదా!

## సాయుజ్యము

కాని ఆదిశేషుని అపరావతారము, లక్ష్మణమూర్తి, ఉభయ వేదాంత చక్రవర్తి, యతిరాజ సార్వభౌముడు, శ్రీరామానుజా చార్యుడు ఎంతకాలముండగలడు! భౌతిక శరీరమునకు షడ్భావ వికారములుండునుగదా! ఇప్పటికే రెండు షష్టిపూర్తులు వయనించె గదా! అందులకై యీ జరాభరితమైన శరీరమును త్యజింప

సంసిద్ధుడై, శిష్యులనెల్లర రావించి, అంత్య సందేశముల నొసంగి, అంతర్ముఖుడై, శిరము గోవిందునొడిలో, పాదముల నాంధ్రపూర్ణుని యొడిలో నుంచి, దృష్టుల యామునాచార్య పాదుకలపై నునిచి, క్రీ. శ. 1137 వ సంవత్సరము మాఘ శుద్ధ దశమి శనివారము, మధ్యాహ్నకాలమున, సంపూర్ణముగ 120 వత్సరములు జీవించి, కృతార్థుడై, అసంఖ్యాకుల దరింపజేసి, శ్రీమహావిష్ణు సాయుజ్యమును బొందెను. 'రామానుజో జగామాశు తద్విష్ణోః పరమం పదం। మాఘ శుద్ధ దశమ్యాం తు మధ్యాహ్నే మంద వాసరే॥'

యో నిత్యమచ్యుతపాదాంబుజయుగ్మ రుక్మ
వ్యామోహతస్తదితరాణి తృణాయ మేనే।
అస్మద్గురోర్భగవతోఽస్య దయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే॥

కురేశ 'వైకుంఠస్తవ'

హరిః ఓం తత్ సత్

---

# విశిష్టాద్వైత తాత్పర్యము

## ప్రాశస్త్యము

శ్రీమాన్పరం తత్త్వం అహం మతం మే।
భేదాః ప్రపత్తిర్నిరపాయ హేతుః

లక్ష్మీనాథుడనైన నేను పరమాత్ముడను. పరమాత్మ జీవులకు భేదమని నా మతము. నిరపాయమైన ప్రపత్తి భక్తియే నన్ను జేర నుత్తమ మార్గము అని, కాంచీపుర వరదరాజస్వామి కాంచీపూర్ణుని ముఖతః విశిష్టాద్వైతాచార్యుడైన శ్రీరామానుజునకు ఆదేశించెను. అటులే మరియొక శ్లోకరాజముగూడ నీ సిద్ధాంతము నతి రమణీయ పద్ధతి దెలిపియున్నది 'సత్యపి భేదాపగమే నాథ తవాహం న మామకీ నస్త్వం। సాముద్రో హి తరంగః కచన సముద్రో న తరంగః॥' భిన్నత్వము లేకుండుట సత్యమైనను, దేవా! నేను నీవాడను, నీవు నేను కాదు. తరంగములు సముద్రమునకు జెందును కాని సముద్రము తరంగముకాదుకదా! ఈ సిద్ధాంతమున పరమాత్మ నిమిత్తోపాదానకారణములు దానెయై, ఆ సగుణ దైవము సూక్ష్మ స్థూలావస్థల నెల్ల జీవుల నంతర్యామియై యుండుటచే, విశిష్టాద్వైతము నా బడినది అని పండిత రామస్వామిశాస్త్రి వచనము. 190 బ్రహ్మైకత్వమును, బ్రతిపాదించుచు, నందు జీవజగత్తుల సూక్ష్మ

---

*190. Sri K. S. Ramaswami Sastri: Vedanta Kesari, p. 298, 1931*

స్థూల శరీరములుగ ప్రతిపాదించి, అద్వైత బ్రహ్మమున విశిష్టత్వ మును గలుగచేయుటచే, విశిష్టాద్వైతమనియు వాకొనబడును. అద్వైత వాదమునగల నిర్గుణ బ్రహ్మమునకు, 'సమస్త హేయ రహితం విష్ణ్వాఖ్యం పరమం పదం' (వేదార్థసంగ్రహం. 39) సమస్త హేయత్వరాహిత్యమే విష్ణువను పరమపదమనియు, అదియే 'భగవత్స్వరూపం' (39 పు) అనియు, 'అనవధికాతిశయా సంఖ్యేయకల్యాణగుణగణాశ్రయం' (వే. సం. 19 పు) అనవధిక మును, అతిశయమును, అసంఖ్యేయములైన, కల్యాణ గుణా శ్రయము అనురీతి సద్గుణముల ననుసంధించి, సగుణునిగా గావిం చుటచే విశిష్టాద్వైతమనియు ప్రశస్తము. Visistadvaita is constructed on the science of love or aesthetics [191] విశిష్టాద్వైతము, ప్రేమతత్త్వముపై నాధారముగ నిర్మితమని, ఆచార్య శ్రీనివాసాచారి వచింప, His school is essentially that which incalcates the way of Devotion or Love as the happiest and best means to reach God [192] రామానుజుని సిద్ధాంతము, భక్తిమార్గమే పరమాత్మ చేరుటకు సుఖకర మార్గ ముగ ప్రతిపాదించుననని, పండిత గోవిందాచార్యుడు వాకొనెను. కాని, రామానుజుని భక్తితత్త్వము పూర్వులకంటె, more philosophical and restrained [193] ఎక్కువ తాత్త్వికమును, నియమ

---

*191. Prof. P. N. Srinivasachari: Vedanta Kesari p. 30, 1926*

*192. Sri A. Govindacharya: Bhagavat Gita, p. xiv*

*193. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol. 2, p 669*

బద్ధములై యున్నదని, ఆచార్య రాధాకృష్ణుని వివరణము. డాక్టరు అనిమాసేన్ గుప్త వ్రాసినట్లు, God is the highest being and as such He naturally becomes the dearest treasure of a human heart [194] భగవంతుడు సర్వోత్కృష్ట తత్త్వముకాన, స్వాభావికముగ నతడు మానవ హృదయమునకు అతిప్రేమవిధానము అని, రామానుజుడు గ్రహించి, తన సిద్ధాంత రత్నమును యీ పవిత్ర మానవతృష్ణ సంతృప్తికొరకై సృజించియుండును. అయినను యీ సిద్ధాంత ప్రతిపాదనమునకతనికి immemorial tradition, logical consistency and religious satisfaction [195] అనాదిగత సంప్రదాయము, సహేతుక తర్కము, పారమార్థిక సంతృప్తులు గలిగి, అతడు, gave a highly spiritual philosophy to the world [196] ప్రపంచమునకు, అద్భుతాధ్యాత్మిక తత్త్వవిధానమును ప్రసాదించెను.

మరియు, రామానుజునకు పూర్వము ద్రవిడ స్థానమున ప్రచారమునగల జైన బౌద్ధ మతములు, ద్రవిడ జన ప్రవృత్తులకు సంతృప్తి గలుగచేయజాలవయ్యెను. హార్దభక్తిని స్వీకరించి, కనికరించి, సుఖము జేకూర్చు భగవంతుడు వారికవసరము. అటులే కేవలమగ్రవర్ణములకుపయుక్తమగుచు, హృదయముల గదలింపజాలని కుమారిలు మీమాంసా విధానముగూడ వీరినెక్కువగ

194. *Dr. Anima Sen Gupta : Prabuddha Bharata, p 500, 1959*

195. *Prof. P. N, Srinivasachari : Vedanta Kesari, p 24, 1926*

196. *Sri K. S. Ramaswami Sastri : Vedanta Kesari, p 297, 1931*

వాకర్షింపదయ్యెను. కర్మమార్గమునగల, తీవ్ర వర్ణ వ్యవస్థ జన సామాన్యమునకు భక్తిసాధనమునకాటంకముగ దోచెను.

అదేవిధముగ నంతవరకు దేశవ్యాప్తముగ విస్తరించి, పండిత లోకమును ఆకర్షించి విజృంభించియున్న శ్రీశంకరాద్వైతముగూడ, జనసామాన్యమునకందుబాటున లేకపోయెను. శంకరాద్వైతము పండితుల మతమై యొప్పారెను. భక్తితత్త్వముల నేకమొనర్చి సామాన్యులకందించువిధానమవసరమనిపించెను. అద్వైత శాస్త్రములకాధారమైన సంస్కృత భాషయు, జన సామాన్యమును దూరమునందుంచెను. Sankara's method, according to Ramanuja, leads him to a vaid—. His Nirguna Brahman is a black,—— which had every perfection except the one small defect of being dead [197] రామానుజుని అభిప్రాయమున శంకర విధానము, శూన్యత్వమునకు గొంపోవును. అతని నిర్గుణ బ్రహ్మము ఒక రిక్త. దానికి సర్వ సంపూర్ణత్వము కలదుకాని, అది నిర్జీవముగ నుండుటయే యొక స్వల్ప దోషము. The Nrguna Brahman which staresd at us with frozen eyes regardess of our selfless devotion and silent suffering, is not the God of religious insight [197] మన నిస్వార్థ భక్తిని, నిరుత్తర శ్రమమును గరుడువారిన నేత్రములతో దేరిచూచు నిర్గుణ బ్రహ్మము, పారమార్థిక దృష్టిగల దేవుడు కానేరడు. అందుచే, Sankara does not deal justly with the living sense of companionship which the devotees have

---

197. *Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p 683*

in their difficult lives [198] భక్తులు వివిధ జీవితముల ననుభవించిన భగవత్ సాహచర్యమును, శంకరుడు న్యాయముగ నవలోకింపలేదని దోచును. ఆ విధముగ శంకరాద్వైతము జనసామాన్యము నాకర్షింపజాలక, ప్రయోజనకారి కాజాలదయ్యెను. జన సామాన్యమునకు a God who would love him, who would come to help him and render protection unto him whenever he got into difficulties-a God at whose feet he might throw himself unreservedly [199] తనను ప్రేమించువాడును, కష్టకాలమున దనకండదండయై నిలచి సహాయము జేయువాడును, తా నిరంతరాయముగ పాదములపై బడు నవకాశము గలుగజేయునట్టి భగవంతుడవసరము.

కావున నై విధానమున, The need was felt for a personal God, and for a more emotional and less intellectual religion than of Sankara [199] శంకరుని ధీసంయుక్త మతముకంటె అధికతర ఉద్వేగముతోగూడిన మతము, సగుణ దైవములవసరమని తోచెను. అధికసంఖ్యాకులకు మనోవికాసము కంటె హృదయాభివృద్ధి సులభతరమనిపించును. ముఖ్యముగ బౌద్ధ శాంకరముల బిమ్మట, హృదయ వికాసమును గలుగజేయు విధాన ప్రబోధకులు అత్యవసరమైరి. అందులకై పెక్కురు మతసంస్కర్తలుద్భవించి, హిందూ సిద్ధాంతమును నవనీతముగ

198, *Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p 659*

199. *Prof. M. Rangacharya: The Three Great Acharyas, p. 172*

జేయుటకదనుకాలమేతెంచెను. అట్లు జనించిన ఆచార్య పరంపరలో రామానుజాచార్యుడు ప్రధానము, ప్రముఖము. అతడు యీ విషయమున గొప్ప పాత్రను నిర్వహించెను. To the cold abstraction of a Sankara's God, a Ramanuja lends a Glowing Living Presdence; to the intellectually sublime of Sankara's ideal, a Ramanuja lends an emotionally rapturous expression. If a Sankara ofers 'the stone of' abstract idea, a Ramanuja gives us 'the bread of a concrete Presence'[200] ఒక శంకరుని శీతల నిగూఢ బ్రహ్మమునకు బదులుగ, రామానుజుడు ప్రకాశమాన సచేతన స్వరూపమును నొసంగును. ఒక శంకరుని మేధాభరిత ఉన్నతాదర్శస్థానమున నొక రామానుజుడు పరివేదనా హృదయ ప్రకటనమును బ్రసాదించును. నిగూఢ భావ పాషాణమును ఒక శంకరుడిడ, స్థూలస్వరూప భగవంతుడను రొట్టెను ఒక రామానుజుడు సమర్పించును. శ్రీ శంకరుడు సర్వాతీతమైన బ్రహ్మమును ప్రతిపాదించి, అద్భుత భావ వికాసమును బ్రదర్శింప, రామానుజుడు సర్వాంతర్యామియై, సర్వాత్మయై, సర్వసన్నిహిత బ్రహ్మమును జూపి, సర్వసంతృప్తి గలుగజేసెను.

అందులకై రామానుచార్యుడు, శంకరభావ ప్రతిఘటనమున బ్రథమాచార్యుడై వెలసెను. మేధాయుక్తులకంటె హృదయమున కతడు ప్రాధాన్యమిడెను. తర్కముచే బీడువారిన హృదయములకు, రామానుజుని భక్తివృష్టి శాంతి ప్రశాంతుల నొసంగి సస్యశ్యామలము గావించెను. అతనిది అద్భుత అనుష్ఠాన వేదాంతముగ బేరు గాంచెను. అది హృదయముల గదలించెను.

*200. Sri A. Govindacharya: The Bhagavat Gita,*

శంకర, రామానుజులకు అత్యధిక అగాధ విభేదములున్నట్లు దోచినను, సత్యమున రామానుజునకు శంకారాద్వైతము మిగుల సహకారి యయ్యెను. బలీయమైన బౌద్ధ జైన కుమారిల మతముల, దన నిరంకుశ సునిశిత తర్క జ్ఞానఖడ్గముల ద్రుంచి, రామానుజ సిద్ధాంత ప్రావకమునకు శంకరుడు తోడ్పడెను. [201] అంతియ గాక గొందరు విశాల హృదయులైన వైష్ణవుల అభిప్రాయమున, నొక సమన్వయముగూడ గోచరము. శ్రీమన్నారాయణ జీయరు, అట్టి భావ ప్రకటనమున ముఖ్యుడు. 'శ్రీశంకర రామానుజులు జన్మించిన మాసములు నక్షత్రము ఒక్కటియే. వీరిరువురి ప్రమాణ గ్రంథములు, ప్రచార విధానములు ఒక్కటియే. విష్టాద్వైత స్థాపన మున శంకరాచార్యుల అవతారము పూర్వరంగము. రామానుజా వతారము ఉత్తరరంగము.'.... [202] 'శంకరాచార్యులు తన కృషి ఫలితముగ జ్ఞానయోగమును ప్రచారమొనర్ప గలిగెను. ఇంతలో దేహావసానము ఆసన్నమైనది. 32 సంవత్సరముల ప్రాయమున భౌతిక శరీరమును విడిచి వైచెను. ఇందువలన శంకరాచార్యులు తన లక్ష్యమును, భక్తిమార్గమును బ్రచారముచేయ నవకాశము లేకపోయెను.... 'శ్రీమద్రామానుజులు శంకరాభిప్రాయమైన భక్తిమార్గమును, దానికంటె విలక్షణమైన ప్రపత్తి మార్గమును ప్రచారము చేసిరి. శ్రీమద్రామానుజులుకూడ 32 సంవత్సరముల వరకు బూర్వమతముల నన్నింటిని సింహావలోకనము జేయుచు,

---

201. శ్రీ కర్ల రాజశేషగిరిరావు: శ్రీరామకృష్ణప్రభ 1956, పు 150

202. శ్రీనారాయణ జీయరు: శ్రీరామానుజ కీర్తికౌముది (1) పు 23

32 వ సంవత్సర ప్రాయము పూర్తి యగుసరికి, శంకరాచార్యుల జ్ఞానయోగపూర్వక అద్వైతమత విషయసారమును గ్రహించిన వాడై, పిమ్మట 33వ సంవత్సరమున భక్తి ప్రపత్తి పూర్వక విశిష్టాద్వైతమత ప్రచారమునకు దురియాశ్రమస్వీకారముతో బయలు దేరిరి' అని అతడు తన భావమును విస్పష్టము గావించెను. అట్లే రంగాచార్యుడును, It certainly cannot amiss to point out here that there is very good evidence in the writings of Sankaracharya to indicate that he was himself an ardent Vaishnava [203] శంకరాచార్యుని రచనముల ముఖ్య సాక్ష్యమున నతడు, ఒక ఉత్సాహవంతుడైన వైష్ణవుడని దెలుపుట నసందర్భము కానేరదని వచించి, ఒక మెట్టు ముందుకు నడచెను. కావున రామానుజుని విశిష్టాద్వైత ప్రచారమునకద్వైతస్థాన మెంతగనున్నదో, దీనివలన స్పష్టమగుచున్నది. కొంచెము సూక్ష్మదృష్టి జూచినచో, బ్రహ్మము శంకరునుండి రామానుజ మధ్వులవరకు గ్రమన్యాయమున, సూక్ష్మమునుండి స్థూలముగ బరిణమించినట్లు సువిదితము.

మరియు నీ విశిష్టాద్వైత సిద్ధాంతము బ్రహ్మమును స్థూలము గావించి, భక్తునికందు బాటు గావించుటయే గాక, భక్తుడు భగవంతుని చేరుటకాటంకముగ బరిణమించి యున్న జాతి మత వర్ణ లింగ భేదముల దొలగించెను. అచ్చట జన్మ ననుసరించి అధికార నిర్ణయముగాక, పారమార్థిక లక్షణములబట్టి గలదని రామానుజుడు

---

203. *Prof. M. Rangacharya: The Three Great Acharyas, p 172*

వ్యక్తపరచెను. అతని జీవితమునగూడ నతడు, శూద్రుడైన కాంచీ పూర్ణుని గురువుగ స్వీకరించెను. తా గావేరికి స్నానమునకు వెడలు చుండువేళల బ్రాహ్మణ శిష్యుల నూతగ గొనిపోవుచు, స్నానానంత రము దిరిగివచ్చు సమయమున శూద్రశిష్యుడైన పిళ్లె, ఉరంగ వల్లి దేశుని నాధారముగ గొనెడివాడు. The rich and the poor, the erudite the unlettered and the high and the low, all can lead the path shown by this Mahatma with great ease and much benefit [204] ధనికులు, పేదలు, పండితులు, పామరులు, గొప్పవారు, తక్కువవారు, ఎల్లరు యీ మహాత్ముడు చూపిన మార్గమును అతి సులభమ్ముగ దొక్కి, సత్ఫలితముల బొందగలరని రామకృష్ణానంద స్వామి వాగ్దానము. This liberal spirit of Vaishnavism enhanced the prestage of this religion to a very great extent; and because of this, it continued to be a powerful and popular religion in India... [205] వైష్ణవమున గల యీ విశాల తత్త్వము, దాని గౌరవమును చాల అధికమొనరించినది. అందుచేత భారతావనిలో నిది, అతి శక్తివంతమును ప్రతిభావంతమును నైన మతముగ నుండుచున్నదని డాక్టరు అనిమా సేన్ గుప్త వచనము.

రామానుజుని విశిష్టాద్వైత నిర్మాణమునకు, పాంచరాత్ర, భాగవత సిద్ధాంతములు, కపిలుని సాంఖ్యము, మిగుల తోడ్పడి నట్లు పండితాభిప్రాయము. అందులకై వేదవేదాంగ వేదాంతముల

---

204. *Swami Ramakrishnananda: The Life of Ramanuja, p. 2*

205, *Dr. Anima Sen Gupta : Prabuddha Bharata, p 506, 1959*

గూడ నతడు స్వీకరించి, స్మృతులైన పురాణేతిహాసముల ధరించి, ద్రావిడ ప్రబంధ సంప్రదాయమును మిళితముజేసి, అపూర్వమైన అద్భుతమైన ఆకర్షణీయమైన ఆధ్యాత్మికానందసార మైన విశిష్టాద్వైత సిద్ధాంతమును సర్వ శరణ్యముగ రామానుజుడు నిర్మించి, ముముక్షువులకు ప్రసాదించి, వంద్యుడై విరాజిల్లెను. ఈ మహాసిద్ధాంత నిర్మాణ కార్యమున 'యామునాచార్యసుధాంబోధి మవగాహ్య యథా మతిః। ఆదాయ భక్తియోగస్య రత్నం సంద ర్శయామ్యహం॥' యామునాచార్యుల సూక్తి సుధానిధి నన్వేషిచు టచే లభించిన భక్తియోగరత్నమును, నేను చూపించుచున్నాడనని శ్రీరామానుజులు, తన శరణాగతి గద్యమున దెలుపుటచే, నాతనికి యామునాచార్యుడును ఆధారమనుట నిర్వివాదము. అదేవిధముగ 'భగవద్బోధాయన టంక ద్రవిడ గుహదేవ కపర్ది భారుచి ప్రభృత్య విగీతశిష్టపరిగృహీత పురాతన వేదవేదాంతవ్యాఖ్యానసువ్యక్తార్థ శ్రుతినికర నిదర్శితోఽయం పంథా॥' (వే. సం. 24) అను వేదార్థ సంగ్రహ వాక్యమున రామానుజుడు, తనకు సిద్ధాంత ప్రాతిపదిక నొసంగిన బోధాయన, టంక, ద్రవిడ, గుహదేవ, కపర్ది, భారుచి మొదలైన యాచార్యుల నామముల స్మరించి యున్నాడు. ఈసంప్ర దాయము పురాతనమనియు, శిష్యులచే స్వీకరింపబడినదనియు దెలిపియున్నాడు. వారందరిలో రామానుజునికి 'భగవద్బోధాయన కృతాం విస్తీర్ణాం బ్రహ్మసూత్రవృత్తిం పూర్వాచార్యాస్సంచిక్షిపుః। తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యంతే॥' (శ్రీ భా. 1-1-1) భగవద్బోధాయన మహర్షి బ్రహ్మసూత్రములకు వృత్తి నాబడు

నొక గొప్ప వ్యాఖ్యను రచించిరి. టంక ద్రమిడాది పూర్వాచార్యులు ఆ వృత్తిని సంక్షిప్తముజేసి, స్వల్ప గ్రంథముల విరచించిరి. ఆ బోధాయనుని మతము ననుసరించి, బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానము జేయుచున్నాడను అను వాక్యరీతి, బోధాయన సిద్ధాంతమే ముఖ్యాధారమని విస్పష్టము. అందుచేగూడ నీ విశిష్టాద్వైత సిద్ధాంతము, అనాద్యవిచ్ఛిన్నపరంపరాగత సంప్రదాయ విశిష్టమే యని గ్రహింపనగును. అట్టి మహాచార్యుని కృషి సఫలము గావింప, నా యతిరాజు ననుసరించి, ప్రపత్తి నవలంబించి, ఆ విష్ణుపదమును భక్తకోటి ఆర్జించుట ముఖ్యము. అవిధముగ నెల్లరు గావించెదరు గాక! అత్యధిక కష్టసాధ్యమైన పారమార్థికానుష్ఠాన విధానముల, నతి సులభము గావించి మనకిడిన, ఆ యతిరాజు శ్రీమద్రామానుజాచార్యుని 'సౌరభము' వేనోళ్ళ జాటుచున్నది.

## బ్రహ్మము

'బ్రహ్మ శబ్దేన చ స్వభావతో నిరస్త నిఖలదోషాఽనవధికాతిశయాసంఖ్యేయకళ్యాణగుణగణః పురుషోత్తమోఽభిధీయతే॥'. (శ్రీ భా. 1-1-1) స్వభావసిద్ధముగ నిఖిల దోషములు లేక, అనవధికాతిశయాగణితమైన కళ్యాణగుణ సందోహముగల పురుషోత్తముడే బ్రహ్మశబ్దముచే వచింపబడును. 'సర్వత్ర బృహత్వగుణయోగేన హి బ్రహ్మ శబ్దః । బృహత్వం చ స్వరూపేణ గుణైశ్చ యత్ర అనవధికాతిశయం సోఽస్య ముఖ్యోఽర్థః । స చ సర్వేశ్వర ఏవ । అతో బ్రహ్మశబ్దస్తత్రైవ ముఖ్యవృత్తిః॥' (శ్రీ భా. 1-1-1) బ్రహ్మ శబ్దము అన్నిచోటుల బృహత్వము నా గొప్పతనము అను గుణమున, అను అర్థమున నొప్పును. ఎవ్వడు అంతములేని అతిశయ

ంను గలిగియుండునో అట్టివాడు బ్రహ్మ శబ్దమున కన్వయము. ట్టివాడు సర్వేశ్వరుడే యగును. అందుచే బ్రహ్మ శబ్దము ముఖ్య ృత్తిచే సర్వేశ్వరుని దెలియజేయును. ఈ వచనములచే ామానుజుడు does not make any dstinctioni between 'ahman and Iswara. Brahman is Iswara called Narayana Vishnu [206] బ్రహ్మేశ్వరులకు వ్యత్యాసమును పాటింపడు. ారాయణ, విష్ణువు నాబడు ఈశ్వరుడే బ్రహ్మము. బ్రహ్మ శబ్ద ్యుత్పత్తినిగూర్చి 'బృహ బృంహి వృద్ధౌ' 'మనిన్' తోకలసి ాడును ఒక్కటి యగునని, 'బృహతి బృంహయతీతి తత్పరం ్రహ్మ' అని రహస్యామ్నాయ బ్రాహ్మణము, 'బృహత్వాత్ ్రుంహణత్వాచ్చ తద్ బ్రహ్మేత్యభిధీయతే' అని విష్ణుపురాణము లుపుచున్నవి. కాన బ్రహ్మము యొక్కటియేగాక, దానిచే పెద్దదిగ యబడుటకు నితరము తనలో నిమిడి యుండవలెను. అందుచే ్రహ్మము మూడు తత్త్వముల గలిగియున్నదని అనబడినది. వియే బ్రహ్మ జీవ జగత్తులు.

బ్రహ్మ శబ్దమును సవివరముగ రామానుజుడు వేదార్థ సంగ్ర హమున, 'స్వభావతః మలప్రత్యనీకానంతజ్ఞానానందైకస్వరూపం, ్వాభావిః నవధికాతిశయాపరిమితోదారగుణసాగరం, నిమేషకాష్ఠా ళాముహూర్తాది పరార్థపర్యంతాపరిమితవ్యవచ్ఛేదస్వరూపసర్వో ్పత్తిస్థితివినాశాది పర్వపరిణామనిమిత్తభూతకాలకృతపరిణామా స్పృష్టానందమహావిభూతి, స్వలీలాపరికర స్వాంశభూతానంతబద్ధ ముక్తనానావిధచేతనతద్భోగ్యభూతానంతవిచిత్రపరిణామశక్తి చేత

206. Dr. S. Radhakrishna : The Brahma Sutra, p 53

నేతరవస్తుజాతాంఽతర్యామిత్వకృత సర్వశరీరత్వ సర్వ
వస్థానావస్థితం వరం బ్రహ్మ చ వేద్యం' (వే. సం. 10 పు)
వతః దోషవిరోధములైన అనంతజ్ఞానానంద స్వరూపుడును, 
వికములైన అనవధిక అతిశయ అపరిమిత ఉదారగుణ 
డును, నిమేషాదికాలము విభజ్యమైన సర్వోత్పత్తి స్థితి 
సర్వకాలకృత పరిణామములచే నంటని మహావిభూతియు, 
పరికరములై స్వాంశభూతములైన బద్ధ ముక్త నానావిధచేత
లును, తద్యోగ్యమైన విచిత్ర పరిణామశక్తి యగు చేతనేతర
ప్రకృతియందును అంతర్యామియై, సర్వ శరీరముల 
వాడును, బరం బ్రహ్మమునుగా గ్రహింపవలయునని స్పష్ట
యున్నాడు. అందుచే విశిష్టాద్వైత బ్రహ్మము, సగుణ విశి
ఈశ్వరుడై యున్నాడని విదితము.

ఉపనిషత్తులన్నియు నిర్విశేష బ్రహ్మ ప్రతిపాదన
గావించుచుండ, సవిశేష బ్రహ్మమునకు స్థానమెచ్చట? అందుచే
ప్రతిపాదనము ఔపనిషదమా అను సంశయము వొడమక మాన
కాని అందులకు, రామానుజుడు సమర్థముగ నా యా మంత్రవ
విశేషార్థములచే నన్వయించెను. శ్రీభాష్యమున, జిజ్ఞాసాధిక
మహాసిద్ధాంత ప్రారంభముననే, రామానుజుడు అద్వైత 
మును బూర్వపక్షమొనరించి, యా వాదము 'న్యాయాగృహీ
ప్రత్యక్షాది సకల ప్రమాణవృత్తయాథాత్మ్యవిద్భిరనాదరణీయ
(శ్రీ భా. 1-1-1) న్యాయముననుసరించిన ప్రత్యక్షాది ప్రమ
యథార్థస్థితి నెరింగినవారిచే నాదరింపదగినది కాదు అని స్ప
పరచెను.

బ్రహ్మము నిర్విశేషము నాబడినది. కాని అది ఎట్లు? యథార్థమున 'శాస్త్రీషు న నిర్విశేషవస్తు ప్రతిపాదనమస్తి' (శ్రీ భా. 1-1-1) శాస్త్రములందెచ్చటను నిర్విశేషవస్తువు ప్రతిపాదింపబడి యుండలేదు. ఎందుచేతనన 'సవిశేష వస్తువిషయత్వాత్ సర్వ ప్రమాణానాం॥' (శ్రీ భా. 1-1-1) సర్వ ప్రమాణములును, సవిశేష వస్తువునే నిరూపించును. నిర్విశేష వస్తువు అనుభవ సిద్ధమనుచో, నదియు 'ఆత్మసాక్షిక సవిశేషానుభవాదేవ' ఆత్మకు దెలియనగుటయు, నొక విశేషమే యగును. అందుచే 'న క్వచిన్నిర్విశేష వస్తుసిద్ధిః' (శ్రీ భా. 1-1-1) ఎచ్చటను నిర్విశేష వస్తువు సిద్ధింప నేరదు. మరియు 'శబ్దస్య తు విశేషణసవిశేష ఏవ వస్తున్యభిధాన సామర్థ్యం' వేదము, సవిశేష వస్తువును దెలియజేయుటయందు మాత్రమే సామర్థ్యము కలదిగ కనుపించును. అందుచే నిర్విశేష వస్తు ప్రతిపాదనమున, వేదము ఎట్లు ప్రమాణము కాదగును అనియు రామానుజుని సూటి ప్రశ్న. ప్రపంచమునగల ప్రత్యక్షాది ప్రమాణములన్న నో 'న నిర్విశేషవస్తుని ప్రమాణభావః' (శ్రీ భా. 1-1-1) నిర్విషయు వస్తువునకు ప్రమాణముకాక, సవిశేష వస్తువునకే ప్రమాణములగుచున్నవి.

అంతియగాక బ్రహ్మము, ఈక్షణాది లక్షణములు గలదిగ దెలుపబడుటచే, నిర్విశేషబ్రహ్మము ఎట్లు ప్రామాణికము (శ్రీ భా. 1-2-2)? ఈ విషయమున 'అత ఏవ నిర్విశేష చిన్మాత్రబ్రహ్మ వాదోఽపి సూత్రకారేణ అభిశ్రుతిభిః నిరస్తో వేదితవ్యః' (శ్రీ భా. 1-1-12) నిర్విశేష చిన్మాత్ర బ్రహ్మవాదము సూత్రకారునిచే, పై శ్రుతుల ప్రమాణముచే ఖండింపబడినదనియు రామానుజాచార్యుని

వాదము, అటులే నిర్వికల్ప శబ్దము 'నిర్వికల్పకం నామ, కేనచిద్వి శేషేణవియుక్తస్య గ్రహణం' (శ్రీ భా. 1-1-1) నిర్వికల్పకమనగ విశేషములెవ్వియు లేనిదిగాక, గొన్ని విశేషములు లేనిదిగ గ్రాహ్య మనియు నాతని తాత్పర్యము.

శాస్త్రముల గల 'నిర్గుణ' పదమునకుగూడ, బూర్వాచార్యులచే నపార్థము కల్పింపబడినది. దాని నిరసించి రామానుజుడు, 'నిర్గుణవాదాశ్చ ప్రాకృత హేయగుణనిషేధవిషయతయా వ్యవస్థితాః' (వే. సం. 21 పు) భౌతిక హేయగుణ నిషేధమునే నిర్గుణ పదము సూచించునని వాకొనెను. 'నిర్గుణం, అపహత పాప్మా' (శ్రీ భా. 1-1-21) నిర్గుణమనగా పాప లక్షణములు లేనివాడనియు వచించి, 'సమస్త హేయరహితం విష్ణ్వాఖ్యం పరమం పదం' (శ్రీ భా. 3-2-11) అనియు నతని తీర్మానము. దీనిని వివరించుచు, 'అపహతపాప్మత్వాది సమస్త కల్యాణగుణోపేతమపి బ్రహ్మ' (వే. సం. 2) ఏ పాపలక్షణములు లేక సమస్త కళ్యాణగుణసంభరితము బ్రహ్మము అని నిర్వచించి, 'పరస్యైవ బ్రహ్మణో నిఖిల హేయప్రత్యనీకానంత జ్ఞానానందైకస్వరూపతయా సకలేతరవిలక్షణస్య స్వాభావికానవధికాతిశయాసంఖ్యేయకల్యాణగుణగణాశ్చసంతి। తద్వదేవ స్వాభిమతానురూపైకరూపాచింత్యదివ్యాద్భుత నిత్య నిరవద్య నిరతిశయౌజ్జ్వల్యసౌందర్య సౌగంధ్య సౌకుమార్య లావణ్య యౌవనాద్యనంతగుణగణనిధి దివ్యరూపమపి స్వాభావికమస్తి।' (శ్రీ భా. 1-1-21) సర్వేశ్వరుడు హేయగుణరహితుడై, జ్ఞానానందైక స్వరూపుడగుటచే, సర్వేతర విలక్షణుడై, స్వాభావికములును, అమిత అతిశయ అగణిత కల్యాణ గుణములు అతనికి గలవు. అట్లే అతనికి ప్రియమైన, అనుగుణమైన, ఏకరూపమైన,

ంత్య దివ్య అద్భుత నిత్య నిరవద్య నిరతిశయ ప్రకాశమాన
ందర్య సౌగంధ్య సౌకుమార్య లావణ్య యౌవనాదులనెడు అనంత
ల్యాణగుణములకు నిధియై, స్వాభావికమైన దివ్యశరీరముగూడ
తనికి గలదు అని రామానుజుడు విదితపరచెను. ఆ లక్షణములు
త్కాలికములుగాక నిత్య స్వాభావికమనియు స్పష్టము గావింప
డెను (శ్రీ భా. 2-1-15). 'స్వాభావికానవధికాతిశయాపరిమితోదారగుణసాగరం
హ్మ' (వే. సం. 2) అనియు దెలుపబడినది. ఈ విషయము
మానుజ గ్రంథముల, నసంఖ్యాక స్థానముల, అగణిత సందర్భ
ుల, స్పష్టము గావింపబడియున్నది. 'సర్వజ్ఞస్సర్వశక్తిస్సర్వేశ్వ
శ్వరో నిరస్త నిఖిలదోషగంధోఽనవధికాతిశయాసంఖ్యేయ
ల్యాణగుణగణౌఘ మహార్ణవః పురుషోత్తమో నారాయణ ఏవ
ఖిల జగదేకకారణం' (శ్రీ భా. 1-1-12) 'సర్వజ్ఞం సర్వశక్తి
మస్తహేయప్రత్యనీక కల్యాణగుణైకతానం బ్రహ్మ' (శ్రీ భా.
.1-15) మొదలగు వాక్యములు, 'సమస్తకల్యాణగుణాత్మకోఽసౌ
్వశక్తిలేశాత్ ధృత భూతవర్గః' (వి. పురాణము. 6-5-84) పర
ుహ్మము సమస్త కల్యాణగుణ స్వరూపుడును, స్వశక్తిలేశముచే
ంచభూతముల ధరించినవాడును, 'తేజో బలైశ్వర్యమహావబోధ
ువీర్యశక్త్యాది గుణైకరాశిః' (శ్రీ భా. 3-2-11) తేజో బల
శ్వర్య వీర్య శక్తి గుణముల గలిగినవాడై తేజరిల్లును అను
చనములును బై భావముల దృఢపరచును. కల్యాణశబ్ద నిర్వచన
ున 'సత్యార్జవదయాదానాహింసానభిధ్యాః కల్యాణాని' (శ్రీ భా.
-1-1) సత్య భూత హితాదులు కల్యాణములని రామానుజుడు
ుచించెను.

ఈ విధముగ, నిర్గుణ పదము అన్వయింపబడెను. అట్లే 'నిరంజనం' అనగా వికారరహితుడనియు (శ్రీ భా. 1-1-1); అనగా 'స్వరూపపరిణామపరిహారాదేవ ముఖ్యార్థః' (వే. సం. 21) స్వరూపతః బరిణామము లేకుండుట యని నిశ్చయము. అదేవిధ ముగ 'నేతి నేతి' అను శ్రుతి తాత్పర్యముగూడ, బ్రహ్మముయొక్క మూర్తామూర్త స్వరూపమును నిషేధింపక, ఆ మూర్తామూర్తము లకు బరిమితత్వమునుమాత్రము నిషేధించును (శ్రీ భా. 3-2-21). అనగా మూర్తామూర్తములు మాత్రము బ్రహ్మ స్వరూపముగాక, గుణాదులు బ్రహ్మమునకు గలవని 'నేతి నేతి' 'నైవం నైవం' ఇట్టి దియే కాదు ఇట్టిదియే కాదు అని, బ్రహ్మముయొక్క అపరిచ్ఛిన్న త్వము 'ఇతి' అను శబ్దముచే బరామర్శింపబడినది అని రామానుజుని అన్వయము (శ్రీ భా. 3-2-24).

బ్రహ్మము సర్వాంతర్యామిగా నున్నను, అతడు నిఖిల దోష వివర్జితుడును, సకల కల్యాణగుణ విభూషితుడు నగుటచే నుభయ లక్షణుడు వాబడి, ఆ యా కార్యజాతమునందు గల నామరూపాది వికారములతో సంబంధము లేనివాడై యుండును. (శ్రీ. భా. 3-2-14, 17; 2-3-18).

పై కారణములచే నీ బ్రహ్మము, సర్వాకర్షణీయ శుభ లక్షణ లక్షితుండై, 'అమితమహావిభూతేః అనవధికాతిశయసౌశీల్య వాత్సల్యసౌందర్యజలధేః' (వే. సం. 44) అనియు రామానుజునిచే గీర్తింపబడెను.

ఈ పరమాత్మను 'అద్వితీయం' అని శ్రుతులు వాకొనును. 'అద్వితీయం' అను పదము సర్వేతరముల దోసిపుచ్చి, వాని

నభావముగ భావించుటగాక, జగత్తునకుపాదానకారణమగు బ్రహ్మము అద్వితీయము నాబడి, జగత్ సృష్టికి గారణము అన్యము లేదని తెలుపుచున్నది (శ్రీ భా. 1. 1. 1). అంతకంటె నుత్కృష్టమైన దేదియు లేదని తాత్పర్యము (శ్రీ భా. 3. 2. 36).

అదేవిధముగ 'ఆనందో బ్రహ్మ' మనగా ఆనందమే బ్రహ్మ నా యర్థము (శ్రీ భా. 1. 1. 1). 'విజ్ఞానమానందం బ్రహ్మ' అను చోట, జ్ఞానానందములు బ్రహ్మమనగా, ఆనందరూపమే యగు జ్ఞానము బ్రహ్మము నా గ్రాహ్యము. ఆనంద శబ్దముచే నానంద మయుడే శ్రుతి తాత్పర్యము. ఆనందమనినను, ఆనందమయుడని నను ఒక్కటియే యర్థము (శ్రీ భా. 1. 1. 20) అని, రామానుజుడు విశదపరచెను.

అట్టి బ్రహ్మము ఎట్లు సాధ్యము? 'నాయమాత్మా ప్రవచ నేన లభ్యః....' అని శ్రుతివాక్యము. పరమాత్మ వేదాధ్యయనము చేతను, యితర సాధనములచేతను, బొందబడడు. కాని ఈ పరమాత్మ యెవనిని ప్రేమించుచున్నాడో, అతనిచే బొందబడుననియు నా శ్రుతిని రామానుజుడన్వయించెను (శ్రీ భా. 1. 1. 1). ఈ విధ ముగ బ్రహ్మమును సగుణపరముగ విశిష్టాద్వైత సిద్ధాంతము ప్రతిపాదించినది.

అందుచే నీ బ్రహ్మము, కారణావస్థయందు సూక్ష్మ, కార్యావస్థ యందు స్థూలముగను, చిదచిత్పదార్థముల శరీరముగ గలిగి యున్నను, వాని దోషములు బ్రహ్మమునకు బ్రసక్తింపనేరవు

(శ్రీ భా. 2. 1. 8). అనగా బ్రహ్మకారభూతమగు ననగా శరీరమునం
దోషములు, పరికారికి ననగా శారీరికి సంబంధింపవు (శ్రీ భా. 1.2.
ఈ కార్యకారణావస్థలనే సంకోచ వికాసములందురు (శ్రీ భా. 2.1.
'ఐతదాత్మ్యమిదం సర్వం' అను ఛాందోగ్య వచనమున, చేతనా చే
విశిష్టమగు యీ సమస్త ప్రపంచమునకు, బ్రహ్మముతో తాదాత
ముపదేశింపబడినదిగదా (శ్రీ భా. 2. 1. 5)। సృష్టిలోని చేత
చేతనములు బహ్మములో నతిసూక్ష్మమున నవ్యక్తముగనుండ, న
కారణావస్థ నాబడి, బ్రహ్మము నాబడును. నామరూపముల
విభజ్యముగానుండు సమయమున, కార్యావస్థలో కార్య బ్రహ
మనబడును. అందుచే బ్రహ్మము ప్రపంచమునకెప్పుడును అన్యవ
కాదు (శ్రీ భా. 2. 1. 15).

ఈ బ్రహ్మము, యీ సిద్ధాంతమున నారాయణ, విష్ణు
భగవాన్, మొదలైన నామముల వ్యవహరింపబడెను. 'ఏకో హ వై
నారాయణ ఆసీన్న బ్రహ్మ నేశానః నేమే ద్యావా పృథివీ
(వే. సం. 25) చతుర్ముఖుడు, శివుడు, పృథివ్యాంతరిక్షములు లే
కాలమున నారాయణుడొక్కడే యుండెను. 'శ్రీమన్నారాయణ ఏ
చిద చిద్విశిష్టాద్వైత తత్త్వం' శ్రీ భా. 1. 1. 1.) నారాయణు
చిదచిద్విశిష్టమైన తత్త్వము అని తెలిపి, 'సత్ బ్రహ్మ శబ్దాభ్యా
ఆత్మైవాభిహిత ఇత్యవగమ్యతే నారాయణ ఏవాభిధీయతే ఇ
నిశ్చీయతే' (వే. సం. 25) అని సర్వము నారాయణుడుగ నిశ్చ
యము. అదేవిధముగ శంభు, శివ, శబ్దములు (వే. సం. 26, 27),
మహేశ్వర నామము (వే. సం. 27), ఈశ్వరనామము (వే. సం.
10) గూడ నారాయణునికే అన్వయింపబడినవి. జనార్దన పదము
గూడ నటులే బ్రహ్మమునకన్వయము (వే. సం. 30).

'సదేవ సోమ్యేదమగ్రమాసీత్' అను వాక్యమున 'సత్' బ్రహ్మమున తాత్పర్యము (శ్రీ భా. 2-1-15). ఈ బ్రహ్మము 'శక్తయస్సర్వభావానామచింత్యజ్ఞానగోచరాః। యతోఽతో బ్రహ్మణ స్తాస్తు సర్గాద్యా భావశక్తయః। భవంతి తపతాం శ్రేష్ఠ పావకస్య యథోష్ణతా॥' (వి. పు. 1-3-2,3) అనేకములైన అచింత్య శక్తులు బ్రహ్మమున గోచరము. అందుచే సృష్ట్యాది శక్తులు అతనికి, అగ్నియందు ఉష్ణత్వశక్తి వలె అంతర్గతము అని తెలుపుచు, నతడే సృష్టికి సర్వకారణముగ బోధింపబడినది. మరియు నీ సృష్టిని 'లోకవత్తు లీలాకైవల్యం' (శ్రీ భా. 2-1-33) స్వప్రయోజనము లేకయే క్రీడార్థముగ సృజించెను. అతనికిదియంతయు క్రీడ. ఆ యా జీవుల, పుణ్య పాప కర్మల నాధారముగ జేసి, సృష్టి నాతడు కల్పించును (శ్రీ భా. 2-1-34). అందుచే, జీవుని భోగాపవర్గరూప ఫలప్రాప్తి, సర్వేశ్వరునిచే నగునని వచింపబడును (శ్రీభా.3-2-37).

రామానుజుడు పాంచరాత్రము ననుసరించి, 'వాసుదేవాఖ్యం పరంబ్రహ్మ సంపూర్ణ షాడ్గుణ్యవపుః సూక్ష్మవ్యూహ విభవభేదభిన్నం యథాధికారం భక్తైః జ్ఞానపూర్వేణ కర్మణా అభ్యర్చితం సమ్య క్ప్రాప్యతే' (శ్రీ భా. 2-2-41) వాసుదేవుడనబడు పరబ్రహ్మము, సంపూర్ణ షడ్గుణశరీరుడు. ఈ పరబ్రహ్మము సూక్ష్మమనియు, వ్యూహమనియు, విభవమనియు రూపముల నుండును. ఈ బ్రహ్మ మును, భక్తులు తమ తమ అధికారమునకనుగుణమగు, జ్ఞానవిశిష్ట మగు కర్మముతో నర్చించుటచే బొందుచున్నారు అని వర్ణించెను. విభవము నర్చించుటచే వ్యూహమును, దాని యర్చనముచే సూక్ష్మ మును బొందుదురు. విభవమనగా రామకృష్ణాద్యవతారములు.

వ్యూహములన వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులగు దురు. సూక్ష్మము వాసుదేవుడగును. జీవత్వమునకు సంకర్షణు డనియు, మనస్తత్త్వమునకు బ్రద్యుమ్నుడనియు, అహంకారము నకు ననిరుద్ధుడనియు అధిష్ఠాన దేవతలు.

## జీవుడు

'అంశో నానావ్యపదేశాదన్యథా చ' (వే. సూ. 2-3-42) జీవుడు భేదమని కొన్ని మంత్రములును, అభేదమని కొన్ని పాఠము లును జెప్పుచుండుటచే, జీవుడు పరమాత్మయొక్క అంశము అను సూత్రము ననుసరించి, రామానుజుడు చర్చించి, 'ఏవం ప్రాప్తే ఒభి ధీయతే బ్రహ్మాంశ ఇతి' ఇట్లు ప్రాప్తింపగా, జీవుడు బ్రహ్మమున కంశమనుట యుక్తము అని నిర్ణయించెను. ఎట్లన, బ్రహ్మపర మైన శ్రుతులు సృష్టి స్థితి లయ కర్తగను, సర్వజ్ఞత్వాది లక్షణుడు గను, స్వతంత్రుడుగను, కల్యాణగుణాకారుడుగను సర్వాధిపతిగ వర్ణింప, జీవపర శ్రుతులు తద్వ్యతిరేక లక్షణముల వర్ణించియున్నవి. అందుచే జీవ పరమాత్మలకు విభేదము ప్రతిపాదింపబడియున్నది. అదేవిధముగ, గొన్ని జీవబ్రహ్మ అభిన్నత్వమును దెలుపుచున్నవి. అట్టి సందర్భముల 'సర్వజీవవ్యాపిత్వేనాభేదో వ్యపదిశ్యత ఇత్యర్థః' బ్రహ్మము సర్వ జీవులలో వ్యాపించి యుండుటచే నీ నీ శ్రుతులు, బ్రహ్మమును జీవాభిన్నముగ నిర్దేశించుచున్నవని గ్రాహ్యము. కావున 'ఏవముభయవ్యపదేశముఖ్యత్వసిద్ధయే జీవోఽయం బ్రహ్మణోంఽశ ఇత్యభ్యుపగంతవ్యం' జీవపరమాత్మలకు అభేదమును, భేదమును బ్రతిపాదించు ఈ యుభయ శ్రుతులును

ముఖ్యార్థములగుటకొరకు, జీవుడు బ్రహ్మముయొక్క యంశముగ అవశ్యమంగికార్యము అని రామానుజుని తీర్మానము.

ఈ భావమును తర్వాతి సూత్రముల 'మంత్ర వర్ణాత్' (2-3-43), 'అపి చ స్మర్యతే' (2-3-44), 'ప్రకాశాదివత్తు నైవం పరః' (2-3-45), 'స్మరంతి చ' (2-3-46), నాధారముగగొని రామానుజుడు బలపరచికొనెను. 'పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి' అను మంత్రమున, 'విశ్వాభూతాని' అను నానావిధ జీవుల గైకొని, అవి బ్రహ్మముయొక్క పాదముగ నభివర్ణింపబడెను. అటులే భగవద్గీతా శాస్త్రముగూడ 'మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః' (15-7) సనాతనమగు నా యంశమే జీవలోకమునందు జీవుడనువాడు అని జీవుని బ్రహ్మాంశముగనే పరిగణించుచున్నది. ఈ అంశాంశి భావమును విష్ణు పురాణాది గ్రంథములు బ్రతిపాదించుచున్నవని, రామానుజాచార్యుడు వివిధ ప్రమాణముల జూపించెను.

అయినచో జీవుడెట్టి యంశము అని సందేహించి, 'ప్రకాశాదివత్' (2-3-45) అగ్నికి బ్రకాశము ఎట్లు అంశమో అట్లు అని, 'ప్రకాశాదివజ్జీవః పరమాత్మనోంశః' అని వచించి, 'యథాగ్న్యాదిత్యాదేర్భాస్వతః భారూపః ప్రకాశోంశో భవతి' అగ్న్యాదికముయొక్క ప్రభారూపమగు ప్రకాశము వాని యంశమగుచందము, 'యథా గావాశ్చ శుక్ల కృష్ణాదీనాం గోత్వాదివిశిష్టానాం వస్తూనాం గోత్వాదిని విశేషణాన్యంశాః' గోత్వము గోవు ధర్మమై దాని యంశమైనరీతి, అశ్వధర్మము దాని యంశమైన విధమున, శ్వేతత్వ కృష్ణత్వములు ఆ యా వస్తువుల యంశములైన విధాన,

దేహవంతుడగు జీవునికి, దేహము అంశమైన పద్ధతి, జీవుడు పరమాత్మకు అంశము అని, సోదాహరణముగ రామానుజుడు తన వాదమును సమర్థించుకొనెను.

మరియు విశేష్య విశేషణ భావసంబంధమున, విశేషణము అనగా గుణము, విశేష్యమునకు అంశము అగును. కాన వాని విశేషణాంశము అని వాడుకయు గలదు. విశేష్యము అంశి యగును. అదేవిధముగ జీవ పరమాత్మలకు విశేషణ విశేష్య భావసంబంధరీతిగ, అంశాంశిభావసంబంధమేర్పడుచున్నదనియు రామానుజుని తాత్పర్యము (శ్రీ భా. 2-3-45). ఈ రెండింటికి అన్యత్వానన్యత్వములు పూర్వోక్తరీతి గలవు.

ఈ జీవాత్మలన్నియు 'జ్ఞానైకాకారతయా సమానేషు సత్సు' (శ్రీ భా. 1-1-1). సర్వ ఆత్మలును, జ్ఞానస్వరూపములగుటచే సమానములు. 'ఆత్మస్వరూపం జ్ఞానైకాకారం' (వే. సం. 44) అనియు, వేదార్థ సంగ్రహ వచనము. జీవుడు 'అయమాత్మా జ్ఞాతృస్వరూప ఏవ' (శ్రీ భా. 2-3-19) జ్ఞాతృస్వరూపుడు. ఇది శ్రుతి సమ్మతము.

జీవుడు జ్ఞానముగలవాడగుటయేగాక, 'విజ్ఞానగుణసారత్వాత్ ఆత్మనో విజ్ఞానమితి వ్యపదేశః' (శ్రీ భా. 2-3-29) విజ్ఞానము జీవునికి ప్రధాన లక్షణమగుటచే, శ్రుతులు అతని విజ్ఞానమనియే వచించును. ఈ జీవుడు విజ్ఞానమే స్వరూపముగా గలవాడగుటచే, బరమాత్మ సమానుడు. అయినను జీవ బ్రహ్మములకు భేదము, దేవ తిర్యగ్ మనుష్య స్థావరాత్మకముగ గలదు. కాని ఆ భేదము

'కర్మరూపాజ్ఞానమూలః న స్వరూపకృతః' (శ్రీ భా. 1-1-1) కర్మ యనబడు అజ్ఞానమూలమున నేర్పడునుగాని, స్వరూపముచే గాదు. ఈ కర్మ పరబ్రహ్మ ధ్యానముచే నివార్యము.

ఈ జ్ఞానప్రభావముచేత జీవుడు కర్తయు, భోక్తయునగుచున్నాడు (శ్రీ భా. 2-3-33). అందుచేత నతడు యజ్ఞాది కర్మలకు గర్తయు, తత్ఫలితముల భోక్తయు నగును. అంతియగాక కర్మలకు అకర్తగగూడ నుండగలడు (శ్రీ భా. 2-3-39). 'వాగాదికరణసంపన్నోఽప్యాత్మా యథేచ్ఛతి తదా కరోతి; యదా తు నేచ్ఛతి తదా న కరోతి' వాగాదీంద్రియములనెడి యుపకరణములతో గూడినవాడై, ఆత్మ దేనినైన జేయుటకిచ్ఛ గలిగిన చేయును, వాంఛ కలుగనిచో జేయడు అని భాష్యకార వచనము. అందులకు వడ్రంగి యుపకరణములు ఉదాహరణమీయబడినవి.

ఈ జీవుడు 'ఉత్క్రాంతి గత్యాగతీనాం' (వే. సూ. 2-20) అను సూత్రప్రకారము, అణుపరిమాణుడు. 'నాయం సర్వగతః' ఆతడు సర్వవ్యాపి కాడు. 'అపి త్వణురేవాయమాత్మా' (శ్రీ భా. 2-3-20) కాన ఆతడు అణుపరిమాణుడే. ఇంద్రియబద్ధమై సంకుచితమైన దేహమునుండి బయలు వెడలి, చంద్రలోకాదుల జేరి, పునరాగమనమున దేహమున బ్రవేశించువాడు సర్వవ్యాపి ఎట్లగును?

జీవ నిర్వచన సందర్భమున రామానుజుడు, 'తత్త్వమస్యా'ది మహావాక్యములగూడ వివరించి, సమన్వయించి, అంశాంశిభావమును జీవ పరమాత్మలకు సమర్థించియున్నాడు. 'అవిద్యాశ్రయత్వయోగ్యస్య తదనర్హత్వాసంభవాత్' (శ్రీ భా. 1-1-1)

అవిద్యకవకాశమిడు జీవుడు, అట్టి అవకాశమీయని బ్రహ్మమెట్లు కాదగును? అని రామానుజుని ప్రశ్న. 'పరమాత్మాత్మనోర్యోగః పరమార్థ! ఇతీష్యతే మిథ్యైతదన్యద్ద్రవ్యం హి నైతి తద్ద్రవ్యతాం యతః॥, (వి. పు. 2-14-27) ఆత్మ పరమాత్మలకైక్యము సత్యమని కొందరంగీకరించెదరు. అది అసత్యము. ఏలనన, అది కాని వస్తువు, అది యగుట యెట్లు సంభవము? అనియు విష్ణుపురాణము సందేహించుచున్నది. ఒకచో బూర్వపక్షమునకు సమాధానముగ, 'కథం వా నిరస్తనిఖిలదోషగంధస్య సత్యసంకల్పస్య సర్వజ్ఞస్య సర్వశక్తేరనవధికాతిశయాసంఖ్యేయకల్యాణగుణగణస్య సకలకారణ భూతస్య బ్రహ్మణః నానావిధానంతదుఃఖాకరకర్మాధీనచింతిత నిమిషతాది సకలప్రవృత్తి జీవస్వరూపత్వం' (శ్రీ భా. 1-1-13) నిరస్త నిఖిలదోషుడును, సత్యసంకల్పుడును, సర్వజ్ఞుడును, సర్వ శక్తుడును అనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణాకరుడును, సర్వమునకు గారణభూతుడును నగు బ్రహ్మము, నానా విధానంత దుఃఖాకరుడును, కర్మాధీనుడును, చింతిత నిమిషాది ప్రవృత్తి యుక్తుడునునగు జీవుడగుట ఎట్లు సంభవము? అని రామానుజుడు ముఖాముఖి ప్రశ్నించును. మరియు, 'జీవపరయోరపి స్వరూపైక్యం, దేహాత్మనోరివ న సంభవతి' (శ్రీ భా. 1-1-1) శరీరాత్మలు ఎట్లొకటి కానేరవో, అటులే జీవపరమాత్మలకేకత్వము సిద్ధింపదు. చిదచిదీశ్వరులకు స్వభావతః విభేదము గలదని శ్రుతి వాక్యములు గలవు (శ్రీ భా. 1-1-1). మరియు బ్రకృతికంటె వేరైనవాడగు బ్రహ్మము, జీవుడనబడు వానికంటెగూడ అన్యమని సిద్ధము (శ్రీ భా. 1-1-20). అంతియగాక, జీవుడు పరమాత్మకన్యమగు

వ్యవహారమునవే వారిరువురి అన్యత్వము దృఢమగుచున్నది (శ్రీ భా. 1-1-13).

అందుచే నిక తత్త్వమస్యాది మహావాక్య తాత్పర్య నిర్ణయ మెట్లు? జీవుడే బ్రహ్మమగుచో నీ దుఃఖభాజన సృష్టి ఏల? జీవుని కానందమయ సృష్టినే కల్పించియుండునుగదా (శ్రీ భా. 2-1-22)! అచేతన పదార్థములెట్లు చేతనుడైన బ్రహ్మము కాజాలవో అట్లు చేతనుడైనను అనంత కల్యాణగుణగణ వరిష్ఠుడైన బ్రహ్మము జీవుడు కానేరడు (శ్రీ భా. 2-1-23). 'తత్త్వమసి' అను వాక్యమున 'తత్' అను పదము శాస్త్రగోచరమై, అపహతపాప్మత్వాది సర్వజ్ఞత్వాది అనంతకల్యాణగుణుడైన బ్రహ్మమును దెలుప, 'త్వం' తద్విరుద్ధ మగు సంసారియైన జీవుని దెలుపుచున్నది. అందుచే నీ ఇరువురికి నైక్యత యెట్లు పొసగును? అయిన నీ వ్యాకార్థమెట్లు అనిన, 'త్వం' పదమునకు జీవుడుగాక జీవాంతరాత్మ యగు పరమాత్మయే స్వీకరింపబడవలెను. 'తత్' పదము సమస్త కల్యాణగుణ విశిష్టుడైన, సర్వ సృష్టి స్థితి కర్తయైన పరమాత్మను సూచించును. అతడంత ర్యామియై, ఆబ్రహ్మస్తంబపర్యంత సృష్టిలో నంతరుడై, "య ఆత్మని తిష్ఠన్నాత్మనో౽న్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మానమంతరో యమయతి స త ఆత్మాంతర్యామ్యమృతః" (బృ. 5-7-22) ఎవడు ఆత్మయందుండి, ఆత్మలోపలనుండి, ఆత్మచే దెలియబడక, ఆత్మను శరీరముగ గలవాడై, ఆత్మను లోనుండి నియమించుచున్నాడో, వాడు నీ యొక్క ఆత్మయు,

నంతర్యామియు, అమృతస్వరూపుడు అను బృహదారణ్యక వాక్యమురీతి, సర్వాంతర్వర్తియై నియంతయైయున్న పరమాత్మను దెలుపుచున్నవి. ఇచట చేతనుడైన జీవుడు, ఆ పరమాత్మకు శరీరముగ నున్నటుల సువిదితము. కావున జీవుని తెలుపునట్టివైనను శబ్దములు, అతనికి ఆత్మయగు పరమాత్మనే దెలుపును (శ్రీ భా. 1-1-13). శరీరమనబడునది శరీరవంతునికి ప్రకారమగుటచే, ప్రకారమును దెలుపు శబ్దములు ప్రకారవంతుని తెలుపుటయందే తాత్పర్యము గలవి యగుటచే, శరీరవాచక పదములు శరీరినే దెలుపును (శ్రీ భా. 1-1-13). ఈ విధముగ నచిత్తుతోగూడిన జీవుడు పరమాత్మకు శరీరభూతుడై, పరమాత్మకు ప్రకారభూతుడగుటచే జీవుని నిర్దేశించు 'అహం' 'త్వం' పదములు పరమాత్మనే దెలుపుచున్నవి. అందుచే శారీరకముగ, జీవుడు పరమాత్మతో నేకీభవించినంతమాత్రమున, జీవ ధర్మములు పరమాత్మకన్వయింపవు ఈ విధముగ 'తత్వమసి' అను మహావాక్యమున తత్, త్వం, అసి, అను పదములలో 'తత్' శబ్దము సత్యసంకల్పాది లక్షణుడైన పరమాత్మను జెప్పుచుండ, 'త్వం' పదము జీవుని శరీరముగగల పరమాత్మనే దెలుపుచున్నది. 'అతో జీవ సామనాధికరణ్యమపి విశేషభూతాజ్జీవాదన్యత్వమేవా పాదయతీతి విజ్ఞానమయాజ్జీవాదన్య ఏవానందమయః పరమాత్మా' (శ్రీ భా. 1-1-13) కావున బరమాత్మకు జీవునితో నైక్యము దెలిపియుండుటయును, విశేషణభూతుడైన జీవునికంటె బరమాత్మ అన్యమనియే నిరూపించును. అందుచే ప్రకృతమున విజ్ఞానమయుడైన జీవునికంటె, ఆనందమయుడైన పరమాత్మ అన్యుడనియే సిద్ధించుచున్నది. ఈ విధముగ 'అంతర్యామిరూపేణ సర్వస్యాత్మతయైక్యాభిధానం' (శ్రీ భా. 1-1-1) సర్వేశ్వరుడు, అంతర్యామిగ నన్నింటికి

నాత్మ యగుటచే, జీవ పరమాత్మలకైక్యము వచింపబడెనని విస్పష్టము. అందుచే 'ఐతదాత్మ్యమిదం సర్వం' అను పూర్వ వాక్యమునగల అర్థమునుమాత్రమే, 'తత్త్వమసి' అను వాక్యముగూడ దెలుపుచున్నది. ఈవిధముగ జీవుడు పరబ్రహ్మమునకు అన్యుడై, సర్వదా సర్వథా అన్యత్వమున నుండునని రామానుజుని తాత్పర్యము. కాని, అతడు పరబ్రహ్మమునకు శరీరమాత్రుడగుటచే నా బరమాత్మకు సన్నిహితుడై, నొక్కచో నేకముగగూడ వ్యవహరింపబడుచున్నాడని రామానుజాచార్యవర్యుని సిద్ధాంతము. అంశాంశములకు సంబంధము అంతియేగదా!

## ప్రకృతి - సృష్టి

'అనంతవిచిత్రమహాశ్చర్యరూపం జగత్' (వే.సం. 19) అనబడిన యీ జగత్తు స్వరూపమేమి? దీనికి గర్త ఎవరు? పాలకుడెవడు? ఈ ప్రశ్నములు అనాదికాలమునుండి మానవుని హృదయ గుహాంతర్గతమై, పైకుబికి గురులోకమునకు ఎదుట ప్రస్తావింపబడి యున్నవి. కాని నాటినుండి నేటివరకు నీ ప్రశ్నలకు సమగ్రమును, సర్వాంగీకారయోగ్యమునైన సమాధానము లేదయ్యెను. అందులకు నీ విశిష్టాద్వైత సిద్ధాంతము దీని నెట్లు నిర్ణయించెనో చూచెదముగాక!

'సూక్ష్మావ్యవిభక్తనామరూపం కారణావస్థం బ్రహ్మైవ ప్రకృతి శబ్దేనాభిధీయతే' (శ్రీభా. 1-4-23) సృష్టికి బూర్వము నామరూప విభాగములు లేనిదై, కారణావస్థలో నుండునట్టి బ్రహ్మమే ప్రకృతి శబ్దముచే దెలుపబడుచున్నది అని, ప్రకృతి నిర్వచనము. బ్రహ్మ

తర పదార్థము ఎప్పుడును, ఎందును నుండ నేరదుగదా! 'అచేతనా పదార్థా చ నిత్యా సతతవిక్రియా। త్రిగుణాకర్మిణాం క్షేత్రం ప్రకృతే రూపముచ్యతే॥' (శ్రీ భా. 2-2-41) జడమును, ఇతరులకొరకై యుండునదియు, నిత్యమును, సర్వదా వికారము నొందునట్టిది యును, త్రిగుణభూయిష్టమైనదియు, కర్తలగు జీవులకు భోగస్థానమైనదిగ నగుటయే, ప్రకృతి స్వరూపము అనియు వివరణము. అందుచే నీ సృష్టికి బూర్వము, కారణావస్థతోనున్న యీ కార్యజాతమునే ప్రకృతి యందురని నిర్ణయము. అది కార్యావస్థను బొంది, నామరూపాత్మకమై, త్రిగుణాలంకృతమై, భోక్త యగు జీవునికి భోగ్యసాధనమైగూడ నొప్పారుచున్నదనియు విదితము.

జీవ ప్రస్తావనమున నెట్లు, అతడు బ్రహ్మమునకు శరీరముగ దెలుపబడెనో అటులనే యీ ప్రకృతియు, నీ ప్రపంచముగూడ నా బ్రహ్మమునకు శరీరముగ బ్రతిపాదింపబడుచున్నది. 'ఏవం చ సర్వం చేతనాచేతనం ప్రతి బ్రహ్మణా ఆత్మత్వేన సర్వం సచేతనం జగత్ తస్య శరీరం భవతి' (శ్రీ భా. 1-1-13) సమస్త చేతన పదార్థములకు బ్రహ్మము ఆత్మయగుటచేత, చేతనవిశిష్టమగు జగమంతయు బ్రహ్మముయొక్క శరీరము. ఈ జగమునకు బ్రహ్మమంతర్యామిగ నుండును (శ్రీ భా. 1-4-27). 'ప్రకృతేరపీశ్వరశరీరత్వాత్' (వే. సం. 17) ప్రకృతిగూడ నీశ్వరుని శరీరము అని వచనము. ఆ పరమేశ్వరుడు సృష్టిని సంకల్పించి, అతఃపూర్వము తనలో లయమై, కారణావస్థనున్న ప్రకృతి క్రమముగ, దన నట్టి జగద్రూపమగు శరీరము గలవానినిగ బరిణమింపజేయుచున్నదని స్పష్టము (శ్రీ భా. 1-4-27). దీని వైజమును బృహదారణ్యక

వాక్యము వ్యక్తపరచుచున్నది. 'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీ మంతరో యమయతి స త ఆత్మాంతర్యామ్యమృతః' (బృ. 3-7-3) అని స్పష్టపరచుచు, సృష్టి బ్రహ్మమునకు శరీరమై యొప్ప, దాని తతడు అంతర్యామియై నియంతయై యుండునని విదితపరచి యున్నది. యథార్థమును బరికించుచో, 'వాచారంభణా' (ఛాం. 6-1-4) ది వాక్యస్మరణానంతరము, 'చిదచిదాత్మకస్య జగతః పరస్మాత్ బ్రహ్మణోఽనన్యత్వముపపాదయంతి' (శ్రీ భా. 2-1-15) చిదచిత్పదార్థములు శరీరముగాగల పరబ్రహ్మము, ప్రపంచము కంటె నన్యముకాదని విశదమగును. అనగా చేతనాచేతన పదార్థ ములు శరీరమగుటచే, నా పదార్థములు విశేషములుగా గల బ్రహ్మము, సదా సర్వశబ్దములచే గ్రాహ్యము. ఆ బ్రహ్మము ఒక ప్పుడు తన శరీరమని వేరుగ నిర్దేశించుటకు, అర్హము కానంత సూక్ష్మముగ నుండు చేతనాచేతన పదార్థముల శరీరముగ గలిగి యుండును. అది కారణావస్థగల బ్రహ్మము నాబడును. వేరొక కాల మున నామ రూప విభాగములు గలదియై, చేతనాచేతనముల శరీర ముగ గలది యగును. అప్పుడది కార్యావస్థనున్న బ్రహ్మమన బడును, అందుచే గారణభూతమగు బరబ్రహ్మముకంటె, గార్య భూతమగు ప్రపంచము వేరు కాదని నిర్ణయము (శ్రీ భా. 2-1-15).

అందుచేత జీవునివలె నచిత్పదార్థముగూడ బ్రహ్మేతరము గాక, బ్రహ్మముయొక్క విశేషణాంశమని చెప్పుట యుక్తము (శ్రీ భా. 3-2-28). ఇట్లనుటచే విశేషణము, విశిష్టవస్తువుయొక్క ఏకదేశమునందుండుటచేత, రెండు నభేదమనుటయు ముఖ్యమే

యగును. కాన మణియందుండు కాంతి మణికంటె వేరుగ గ్రహింపబడనిదై, మణియొక్క గుణముగ దాని యంశమగురీతి, జేతనాచేతన పదార్థములగు జీవ జగత్తులు బ్రహ్మముకంటె నన్యముగ గ్రహింపబడనివై, బ్రహ్మమునకు విశేషణములగుటచే నవి, బ్రహ్మముయొక్క అంశములనుట యుక్తము (శ్రీ భా. 3-2-28, 29). తేజస్సునకును, తేజోవంతునకును, శక్తికిని శక్తివంతునకును, శరీరమునకును శారీరికినివలె జగత్తునకును బ్రహ్మమునకును అంశాంశిభావము గ్రాహ్యము (శ్రీ భా. 2-3-46). విష్ణుపురాణ వాక్యము 'ఏకదేశస్థితస్యాగ్నేర్జ్యోత్స్నా విస్తారిణీ యథా। పరస్య బ్రహ్మణశ్శక్తిస్తదేదమఖిలం జగత్॥' (1-22-56) ఒక స్థానమున మాత్రముండు అగ్నియొక్క ప్రకాశము సర్వత్ర వ్యాపించి యున్నరీతి, ఈ ప్రపంచమంతయు బరబ్రహ్మముయొక్క శక్తియై యంతట వ్యాపించి యున్నది (శ్రీ భా. 2-3-46) అనురీతి, బై తాత్పర్యమును బలపరచుచున్నది.

ఆ కారణముగ, 'నామరూపవిభాగవిభక్తస్థూల చిదచిద్వస్తు శరీరం బ్రహ్మకార్యావస్థం। బ్రహ్మణః తథావిధస్థూలభావ ఏవ సృష్టిరిత్యుచ్యతే॥' (వే. సం 17) నామరూప విభాగమున, చిదచిద్వస్తువుల స్థూలశరీరము బ్రహ్మముయొక్క కార్యావస్థయై, అది సృష్టి యనబడుచున్నది. దాని 'కారణావస్థ ఈశ్వర ఏవేతి' (వే. సం.17) కారణావస్థయే ఈశ్వరుడు. అటుల గారణావస్థనున్న పరమాత్మయే, కార్యరూపముగ బరిణమించి స్థూల పదార్థముగను, అందంతర్యామిగను అగుచున్నాడు (శ్రీ భా. 1-4-27). అందుచే నాతడే యీ సృష్టి సర్వమునకు గర్తయు గర్మయు నగును (శ్రీ భా. 1-4-24).

క్షీరము స్వాభావికముగ దధి యగునట్లు, తనలోగల విచిత్ర శక్తి యోగముచే, బ్రహ్మము జగత్తుగ బరిణమించుచున్నాడని తాత్పర్యము (శ్రీ భా. 2-1-24). ఈ విధముగ స్వేతర సర్వవస్తువుల కంటె విలక్షణుడై, సర్వశక్తి సర్వజ్ఞత్వాది లక్షణములుగల బ్రహ్మమునుండియే, సర్వ సృష్టియు నుత్పన్నమగుచున్నది (శ్రీ భా. 1-4-23, 1-2-23, 1-3-29).

అట్టిచో జగత్తుగూడ బారమార్థికము గాకుండునా? 'పరం బ్రహ్మ సవిశేషం తద్విభూతిభూతం జగదపి పారమార్థికమేవేతి జ్ఞాయతే' (శ్రీ భా. 1-1-1) పరబ్రహ్మము గుణ విశిష్టమనియు, అట్టి బ్రహ్మముయొక్క విభూతియైన జగత్తుగూడ, బరమార్థమనియు స్పష్టము. జగత్తు పరబ్రహ్మమున కన్యముకాదుగదా? (శ్రీ భా. 2-1-20). ఈ సృష్టికార్యము భగవంతుని లీల యని పరాశరాదుల తాత్పర్యము (శ్రీ భా. 1-4-27). అయినను భగవంతుడు జీవుల పుణ్యపాపానుగుణముగ, వారికను భవయోగ్యమైన జగత్తును సృజించుచు, జీవునకు సుఖదుఃఖానుభవముల నొసంగు దానినిగ నిర్మించెను. (శ్రీ భా. 1-1-1).

అట్టి 'విష్ణ్వాత్మక' (శ్రీ భా. 1-1-1) మైన సృష్టిని మాయయనియు, భ్రాంతి యనియు ద్రోసిపుచ్చుట అసమంజసము. ఈ భ్రాంతికి గారణమైన అవిద్య ఎందుండును? అనగ జీవు నాశ్రయించియున్నదా, కాక బ్రహ్మమునా? అవిద్యాకార్యమైన జీవు నాశ్రయించుట అసంగతము. స్వయంప్రకాశుడై జ్ఞానస్వరూపుడైన బ్రహ్మము నాశ్రయించుట యుక్తిబాహ్యము (శ్రీ భా. 1-1-1). అట్లుకాక 'జ్ఞానరూపం పరం బ్రహ్మ తన్నివర్త్యం మృషాత్మకం।

అజ్ఞానంచేత్తిరస్కార్యాత్కః ప్రభుస్తన్నివర్తకః॥' (శ్రీభా. 1-1-1)
జ్ఞాననివర్త్యమును, అసత్యమునునగు అజ్ఞానము, జ్ఞానస్వరూప
మగు పరబ్రహ్మమును దిరస్కరించునేని, యిక నా యజ్ఞానమును
నివర్తింపగలుగువది యేది గలదు? అని నాథముని సూక్తి. కావున
జ్ఞానము, అజ్ఞానమునకు విరోధి యగునేని, స్వయముగ జ్ఞాన
స్వరూపమగు బ్రహ్మమే దానితో విరోధించును. అందువలన
బ్రహ్మము అవిద్యకు ఆశ్రయమగుట అసంభవము.

మరియు బ్రహ్మము నవిద్య ఆవరించుట యన, బ్రహ్మ
స్వరూపము నాశము గలదగుట యగును. అదియు నసంభవము
(శ్రీ భా. 1-1-1). మరియు నీ యవిద్య సదసదనిర్వచనీయ
మనుటయు నసందర్భము. 'తథావిధస్య వస్తునః ప్రమాణ
శూన్యత్వేన అనిర్వచనీయత్వైవ స్యాత్' (శ్రీ భా. 1-1-1) అవ్విధ
మగు వస్తువును దెలుపునట్టి ప్రమాణమేదియును లేదు. అందుచే
నిది అనిర్వచనీయమే యగును. లోకమున నెల్ల వస్తువులు
నిర్వచనీయములే. సత్తుగను అసత్తుగను ద్వివిధముగ లోకమున
బదార్థములు గలవుగాని, యీ అనిర్వచనీయ సదసద్వస్తువేది?
అభావము వస్తువుగాదు. అటులే అవిద్యయు అభావమువలె
నభావము, అనగా లేనిదే యగుచున్నది.

ఈ భ్రాంతికుదాహరణముగ రజ్జు సర్ప, శుక్తరజతాదికము
జూపబడినవి. ఒక్కదాని వేరొకటిగ తెలియుటచేతనే ఖ్యాతియు,
ప్రవృత్తి, బాధయు, భ్రమమును గలుగుచున్నవి. కాని
యెట్టులైన తెలియరానిది, కారణము లేనిది యగు వస్తువును
గల్పించుట అసంభవము, ఇట్లు గల్పింపబడునదియు, అనిర్వచ

నీయమునకు రజతము, అచట శుక్తముపై అనిర్వచనీయముగ దోచుటగాక సత్యముగనే దోచుచున్నది. అనిర్వచనీయముగ నున్నచో, భ్రాంతి బాధ కలుగుట దుర్లభముగదా! (శ్రీ భా. 1-1-1). అందుచే శుక్తము రజతాకారముగ దోచుచున్నది. లేకున్న సత్యమైన శుక్తముతో అసత్యమైన రజతమెట్లు సంధింపగలదు?

కావున 'సదసదనిర్వచనీయమజ్ఞానం శ్రుతి సిద్ధమితి తదసత్' (శ్రీ భా. 1-1-1) సత్ అసత్ అనిర్వచనీయము అజ్ఞానము అనుట శ్రుతిసిద్ధము కాదు. అటుల 'మాయాశబ్దస్యానిర్వచనీయవాచిత్వం న దృష్టం' (శ్రీ భా. 1-1-1) మాయాశబ్దము, అనిర్వచనీయమైన దానిని దెలుపునదిగ నెచటను గానబడదు. అది సర్వసమయముల మిథ్యావాచకము గాదు. 'మాయ' యనగా 'అతో మాయా శబ్దో విచిత్రార్థసర్గకరాభిధాయీ' విచిత్ర వస్తువుల సృజించునది యని అర్థము. అట్టి సృష్టిని గావించు ప్రకృతియు, శాస్త్రముల మాయ యనబడినది. ఆ ప్రకృతిని శరీరముగగల బ్రహ్మము 'మాయినః' అని వ్యవహరింపబడెను. అందుచే 'ఆత్మమాయయా' అను మంత్రముల, 'స్వసంకల్పరూపేణ జ్ఞానేనేత్యర్థః' (శ్రీ భా. 1-1-21) మాయ యనగా జ్ఞానము, అనగా సత్యసంకల్పము అని తాత్పర్యము. 'మాయా వయునం జ్ఞానం' అని నిఘంటువునందు గూడ, మాయా శబ్దము జ్ఞానవాచకముగ దెలుపబడినది (శ్రీ భా. 1-1-21). కావున మాయ యన భ్రాంతి అనియు, నందుచే నా మాయావాచక ప్రకృతిచే నిర్మితమైన యీ సృష్టియు భ్రాంతి యనుట అసంగతముగ ద్యాజ్యము. ఈ సృష్టియంతయు

సత్యమైన జీవుని చోద్యరూపమై, సత్యమై యున్నదని విశిష్టా ద్వైతవాద సిద్ధాంతము.

## సా ధ న

'సత్యం బ్రవీమి మనుజా స్స్వయమూర్ధ్వ బాహుః యో మాం ముకుంద నరసింహ జనార్దనేతి। జీవన్ జపత్యనుదినం మరణే ఋణేవ పాషాణకాష్ఠసదృశాయ దదామి ముక్తిం॥' (భాగవత....) మానవులారా! రెండు చేతుల నెత్తి నేను సత్యమును జెప్పుచున్నా డను. ఎవరు నన్ను, తమ జీవితకాలమున నరసింహా! ముకుందా! జనార్దనా! యని ప్రతిదినము అనుసంధించెదరో, వారు మరణ కాలమున స్మృతిలేక, పాషాణమువలె, కాష్ఠముచందము బడియు న్నను, నేనే వారిని స్మరించి ముక్తిని బ్రసాదించుదును అని, శ్రీనరసింహస్వామి భాగవతమున బ్రతిజ్ఞ గావించెను. అట్లు పరమాత్మ నాకర్షించి, నిశ్చింతనుండుటకై 'వపురాదిషు యోఽపి కోఽపి వా గుణతో తాని యథా తథావిధః। తదయం తవ పాదపద్మ యోరహమద్యైవ మయా సమర్పితః॥' (స్తోత్రరత్న) ప్రభూ! సారరహితమైన యీ సంసారమునగల సతీ సుత ధనాదుల నన్నిం టిని నేడే, నీ సదనుగ్రహమువలన, నీ పాదపద్మములయందు, నా నా ఆత్మతోగూడ సమర్పించుచున్నాడను అను నిర్ణయమున శీతెంచి, శరణాగతి నొందుటయే ముఖ్యము. కాని యట్టి స్థితి నొందుటకు భక్తి విషయము గొంత గమనార్హము.

భక్తిసాధనమునకు బూర్వము సాధకునకు, ముఖ్యముగ కొన్ని అర్హతలవసరములు. అవి 'వివేకవిమోకాభ్యాసక్రియా

కల్యాణానవసాదానుద్ధర్షేభ్యస్సంభవాన్నిర్వచనాచ్చ' (శ్రీ భా. 1-1-1) వివేక, విమోక, అభ్యాస, క్రియ, కల్యాణ, అనవసాద, అనుద్ధర్షములనబడు నీ సప్తకముచే, సాధకునకు నుపాసనా సామర్థ్యము గలుగును. వాని వివరముల గాంచెదముగాక।

వివేకము : 'జాత్యాశ్రయనిమిత్తా దుష్టాదన్నాత్కాయ శుద్ధిర్వివేకః' జాతి దుష్ట పదార్థములచే ననగా నుల్లి మొదలగు వానిచేగాని, ఆశ్రయ దుష్టపదార్థములచే ననగా ఛండాలాన్నాదిక ముచేగాని, నిమిత్త దుష్టపదార్థముచే ననగా ఎంగిలి అన్నము మొదలగు వానిచేగాని, దూషితముకాని యాహారముచే శరీరమును బరిశుద్ధము చేసికొనుట వివేకము నాబరగును. అందుచేతనే 'ఆహార శుద్ధౌ సత్వశుద్ధిః సత్త్వ శుద్ధౌ ధ్రువా స్మృతిః' (ఛాం. 7-26-2) అని ఉపనిషద్వచనము.

విమోకము: 'విమోకః కామానభిష్వంగః' కామము ననుభ వింపక నిలువజాలకుండు లక్షణము లేకుండుట. ఇట్టిది లేక 'శాంత ఉపాసీత' (ఛాం. 3-14-1) రాగద్వేషాదుల వర్జించి ఉపాసింపుమని ఉపనిషత్ప్రబోధము.

అభ్యాసము: 'ఆరంభణసంశీలనం పునః పునరభ్యాసః' ధ్యానింపదగుదానిని మాటిమాటికి దలంచుట అభ్యాసము. 'సదా తద్భావ భావితః' (భ. గీ. 8-6) ఎల్లప్పుడు దాని భావించుచుండ వలెను అని గీతోపదేశము.

క్రియ: 'పంచ మహాయజ్ఞాద్యనుష్ఠానం శక్తితః క్రియా' బ్రహ్మ, పితృ, దేవ, భూత, నృ, యజ్ఞములను బంచ యజ్ఞముల, శక్తికొలది యనుష్ఠించుట క్రియ యనబడును. 'క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః' (ముం. 3-1-4) క్రియావంతుడే బ్రహ్మ విదులలో శ్రేష్ఠుడని ముండకోపనిషత్తు స్తుతించుచున్నది.

కల్యాణము: 'సత్యార్జవదయాదానాఽహింసానభిధ్యాః కళ్యాణాని' భూతహితము, త్రికరణశుద్ధి, స్వప్రయోజనము నపేక్షింపని దయ, లోభ రాహిత్యము, అహింస, పరులొనరించిన అపకారమును జింతింపకుండుట యనునవి కళ్యాణములు.

అనవసాదనము: 'దేశకాల వైగుణ్యాచ్ఛోకవస్త్వాద్యనుస్మృతేశ్చ తజ్జం దైన్యమభాస్వరత్వం మనసోఽవసాదః' దేశకాలములు మంచివి కాకపోవుటచేతను, గతించిన దుఃఖస్మరణముచే గలుగు మనోదైన్యము అవసాదనము అగును. అట్టి దైన్యము లేకుండుట అనవసాదనము నాబడును. 'నాయమాత్మా బలహీనేన లభ్యః' (ముం. 3-2-4) అనిగదా శ్రుతివాక్యము.

అనుద్ధర్షము: 'తద్విపర్యయజా తుష్టిరుద్ధర్షః' దేశ కాలములు మంచివగుటచే, ప్రియ వస్తువును స్మరించుటచే గలుగు సంతోషము ఉద్ధర్షము. అట్టి సంతోషములేక, స్థిరముగ నుండుట అనుద్ధర్షము నాబరగును. 'శాంతో దాంతః' (బృ. 6-4-23) అనిగదా బృహదారణ్యక వచనము.

ఈ లక్షణములను గలిగి, వర్ణాశ్రమకర్మముల నాచరించుటచే బ్రహ్మవిద్య కలుగును (శ్రీ భా. 1-1-1). అటులే వివేక విమోకాది సాధన సప్తకానుష్ఠాన సహాయముగల శాస్త్రజ్ఞానము, అపరోక్షజ్ఞానమును గలుగజేయుననియు రామానుజ వచనము (శ్రీ భా. 1-2-23). ఈ పరోక్షాపరోక్షములు రెండును బ్రహ్మప్రాప్తికవసరము. అందుపరోక్షజ్ఞానము శాస్త్రాధ్యయన జనిత జ్ఞానము అగును. దానికి విమోకాది లక్షణములచే బునీతుడైనవాడే అధికారి. అంత దాని మూలమున నపరోక్షము సిద్ధించును. అపరోక్షమనగా యోగాభ్యాసాదులచే గలుగు జ్ఞానము. అపరోక్షజ్ఞానము బ్రహ్మప్రాప్తి కుపాయభూతమైనది. అదియే భక్తి యనియు రామానుజుని వచనము (శ్రీ భా. 1-2-23).

ఇట్టి సాధనమునకు ప్రాప్యవస్తువగు బరమాత్మేతర పదార్థములందు విరాగము, ప్రాప్యభూతమగు బరమాత్మయందాసక్తియు, నుపాసనారంభమునకు ముఖ్య సాధనములుగ గ్రాహ్యము (3-1-1) కర్మాచరణముల గూడ శమదమాదికములవసరములు, బ్రహ్మదృతు ఆవశ్యకములు (శ్రీ భా. 3-4-27).

విమోకాదికమున, క్రియాలక్షణమున, వర్ణాశ్రమోపయుక్త కర్మలు విధింపబడినవి. అందుచే భక్తిసాధనమున గర్మయు, బ్రముఖ స్థానము నలంకరించుట గమనార్హము. 'విద్యాం చ అవిద్యాం చ' (ఈశ. 14....) అను వాక్యమున 'అవిద్యా శబ్దేన విద్యేతరత్ వర్ణాశ్రమాచారాదిపూర్వోక్తం కర్మోచ్యతే। విద్యా భక్తిరూపాపన్న ధ్యానముచ్యతే' (వే. స. 23) అవిద్యాశబ్దముచే విద్యేతర వర్ణాశ్రమాచారపూర్వక కర్మలు తెలుపబడుననియు, విద్యా

శబ్దముచే భక్తి రూప ధ్యానము వచింపబడుననియు దెలిపి, 'సర్వా శ్రమకర్మాణి యావజ్జీవమనుష్ఠేయాని' (శ్రీ భా. 1-1-1) సర్వాశ్రమ కర్మములను యావజ్జీవము అనుష్ఠేయములు అని, విశిష్టాద్వైతము కర్మల సమర్థించును. అందుచేతనే, కర్మ సంయుక్తమైన జ్ఞానమే మోక్షసాధనమని శ్రుతులు వచించు చున్నందున, బ్రహ్మవిచారమవశ్యముగ గర్మవిచారము నపేక్షించు చున్నదని, ప్రారంభముననే రామానుజుడు కర్మవిచారము అవసర మనెను. 'యజ్ఞాది శ్రుతేరశ్వవత్' (వే.సూ. 3-4-26) సూత్రమున, బాదరాయణుడుగూడ భక్తికి కారణములు యజ్ఞాది కర్మములుగ, బ్రతిపాదించెను (శ్రీ భా. 1-1-1). ఈ విధముగ భక్తి సాధన కుపాయాంగములుగ గర్మముల రామానుజుడు సమ్మతించి సమర్థిం చెను. Not only Jnana Yoga but also Karma Yoga is necessary for the awakening of bhakti in the heart of a man. But Jnana Yoga and Karmayoga are necessary fore-runners of bhakti and as such they are regarded as doors of bhakti [207] మానవ హృదయములో భక్తిని మేల్కొలుపుటకు జ్ఞానయోగమేగాక, కర్మయోగముగూడ నవసరము. భక్తికి, జ్ఞాన కర్మయోగములు అవసర అగ్రగాములుగాన, నవి భక్తిద్వారము లుగ బరిగణింపబడెను. ఈ విధమున రామానుజీయ భక్తి మార్గము, కర్మ జ్ఞాన యోగములుగూడ స్వీకరించి, భక్తిమార్గమున నన్వయించుకొనెనని గ్రాహ్యము.

---

207. *Dr. Anima Sen Gupta: Prabuddha Bharata, p. 501, 1959*

అంతియగాక నీ భక్తికి, knowledge may be regarded as the cause of bhakti; knowledge is the very foundation of bhakti it is Jnana that produces bhakti and also nourishes and enriches it[207] జ్ఞానము కారణమని ఎంచనగును. భక్తికి జ్ఞానమే పునాది. జ్ఞానమే భక్తిని గలిగించి, పెంచి, అభివృద్ధి పరచునని, రామానుజ సిద్ధాంతము. భక్తికి, నుపనిషత్తులలో బర మాత్మగూర్చి దెలిపిన విషయగ్రహణ జ్ఞానము గలిగియుండుట ముఖ్యము. హృదయోద్వేగములేని భక్తి జ్ఞానము కాదు. భగవత్స్వ రూపమును ప్రేమతో ధ్యానించుట భక్తి నాబడును. అందుచే జ్ఞానము భక్తి విరోధికాదు అని విశిష్టాద్వైత మతము. భక్తి సాధనమున జ్ఞానము మూడు సోపానములుగ నుపయుక్తమగును. ప్రథమ దశలో నది, భక్తిని కర్మల పరిశుద్ధమొనరించును. దేహాత్మ భావము యీ దశలో దొలగును. భగవత్సాక్షాత్కారమే పరమ లక్ష్యముగ గ్రహించును. కర్మ కర్తృత్వముగూడ నీ దశలో భక్తునికి అదృశ్యమగును. ద్వితీయ దశయందు, దేహాత్మభ్రాంతి అణగి, పరమాత్మయందు భక్తి దృఢపడును. భగవంతుడే జీవుని ఆధారమని విశ్వాసమేర్పడును. జీవ పరమాత్మల సంబంధము స్పష్టపడును. అంశాంశిభావము విదితమగును. అందుచే భక్తి దృఢపడి, భగవంతునే పరమాశ్రియముగ భక్తుడు నమ్మును. తృతీయ దశయందు జ్ఞానము పరభక్తిగ రూపొందును. నిత్య ధ్యానము, మననము, భగవత్స్వరూపధ్యానము స్థిరపడును.

---

207. *Dr. Anima Sen Gupta: Prabuddha Bharata, p 501, 1959*

ఆ కారణమున, రామానుజ సిద్ధాంతమున, 'అతో వాక్యార్థ జ్ఞానాదన్యదేవ ధ్యానోపాసనాది శబ్దవాచ్యం జ్ఞానం వేదాంతవాక్యై ర్విధిత్సితం।' (శ్రీ భా. 1-1-1) వేదాంతవాక్యముల, మోక్ష సాధనముగ విధింపబడినది కేవలము వాక్యార్థ జ్ఞానమాత్రముగాక, తదితరమైన యుపాసనమనియు, ధ్యానమనియు వ్యవహరింపబడు వేరొక జ్ఞానమని యనదగును. అటుల, జ్ఞాన భక్తి సముచ్చయమును, రామానుజుడు సాధించి బోధించెను.

'భక్తి శబ్దశ్చ ప్రీతివిశేష వర్తతే' (వే. సం. 14) భక్తి యన ప్రేమ విశేషమనియు, ఈ ప్రేమవిశేషము జ్ఞానవిశేషమే యని వేదసంగ్రహ వచనము. ఈ భక్తి 'ధ్యానేనైవ లభ్యతే' (వే. సం. 23) ధ్యానముచే ఫలించుననియు నా గ్రంథ వాక్యము. 'స్నేహ పూర్వమనుధ్యానం భక్తిరిత్యభిధీయతే' (గీ. భా. 7) నిరంతర పరమాత్మ ధ్యానమే భక్తి యనియు నిర్వచనము.

భక్తి సాధనమును త్రివిధముగ విభజింపనగును. సాధన, భక్తి, పరాభక్తి, పరమాభక్తి అని నామములు. సాధన భక్తికి ఉపాయభక్తి అనియు, వైధిభక్తి యనియు, మర్యాద భక్తి అనియు నామాంతరములు. త్రిగుణములు సాధనభక్తిలో బ్రస్ఫుటముగ బనిజేయును. భక్తి పరిశుద్ధమై, త్రిగుణరహితమై, నిర్గుణ, ఐకాంతిక, అహైతుక, ఆత్యంతిక భక్తి యనియు నామాంతరముల పరాభక్తి యొప్పారును. సాధనభక్తునికి ఆర్తికంటె జ్ఞానమధికము. ఇచట శమదమాదులు అత్యవసర సాధనాంగములు. దీని ఆత్మావలోకన స్థితి యనియు నందురు. పరమాత్మగలడని దృఢ నమ్మకము, ఇహ పర ఫలములందు విరక్తి ముఖ్యము. ఇచట

జ్ఞానమే ప్రధానముగ నున్నను, ముముక్షువు యీ స్థితిలో భగవంతునివిశ్వసించును. అందుచే నిదిగూడ భక్తి నాబడినది. ఆత్మజ్ఞానాపేక్షయు, భక్తి యని వ్యవహార్యము. ఈ భక్తి సుస్థిరత్వము నొంద, పరాభక్తి యనబడును. ఇదియు గాఢతరమై, పరమాభక్తిగ రూపొందును. భక్తిపారవశ్యము, భక్త్యున్మత్తతలు, యిట సర్వ సాధారణము. ప్రియతమ పరమేశ్వర సాన్నిధ్యాకాంక్షగాక, యితరము అతనికి రుచింపదు. అదియే ప్రపత్తి యనియు నాబరగును. ఈ భగవదాగ్రహము భక్తుని జీవితమువంతటిని ఆవరించి, మైమరపు గలుగజేయును, కాని రామానుజు సిద్ధాంతమున భజనలు, సంకీర్తనములు, గీతములు, ఎచ్చటను బ్రతిపాదింపబడలేదు.

పూర్వ వచనములరీతి ప్రపత్తి, పరమాభక్తులకు దారతమ్యము అగోచరము. అదియే భక్తియోగ పర్యవసానస్థితి. భక్తి యోగమున కర్మ జ్ఞానములిమిడియుండ, నీ ప్రపత్తియందు అట్టివి లేక, ప్రేమతో దీనతతో నా పరమాత్మకు సంపూర్ణ శరణాగతి నొందుటయే యగును. ఇచట కర్తృత్వాదికములు లేవు. భక్తిమార్గము సుదీర్ఘము కాని, ప్రపత్తి మార్గము అక్లిష్టము సులభము. ఈ మార్గగామికి బాహ్య సాధనములనావశ్యకములు. భక్తియోగము కంటె దీని శ్రేష్ఠముగ బరిగణించెదరు. భక్తియోగము శరణాగతితో సమాప్తమగును. 'తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,' (భ. గీ. 18-62) 'మన్మనా భవమద్భక్తో మద్యాజీ మాం నమస్కురు' (భ. గీ. 18-65) 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ'

(భ. గీ. 18-66) అను గీతా శ్లోకములు శరణాగతి మార్గమును' తత్ఫలితములను విశదపరచియున్నవి. 'మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే' (భ. గీ. 7-14) అనియును గీతా శాస్త్రము, ప్రపత్తిని గొనియాడినది.

విశిష్టాద్వైతమున నీ ప్రపత్తి, మూడు మంత్రములపై నాధారపడియున్నది. 'ఓం నమో నారాయణాయ' అను మూల మంత్రము శరణాగతిని వివరించును. 'శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే' 'శ్రీమతే నారాయణాయ నమః' అను ద్వయ మంత్రము దాని విశదపరచును. దాని అనుష్ఠాన విధానమును గూడ బోధించును. చరమ శ్లోకమైన 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ। అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥' ముముక్షువునకా ప్రపత్తి విధానముగాక, అన్య మోక్షోపాయముభావమని స్పష్టపరచును.

ప్రపత్తికి షడంగములు కలవు. 'అనుకూలస్య సంకల్పః ప్రతికూలస్య వర్జనం। రక్షస్యతీతి విశ్వాసో గోప్తృత్వే వరణం తథా॥ ఆత్మనిక్షేప కార్పణ్యే షడ్విధా శరణాగతిః' భగవదనుకూల కర్మ వచనముల జేయుట, వ్యతిరేకముల వర్జించుట, పరమాత్మ రక్షించునని గాఢముగ విశ్వసించుట, రక్షణమునకై అతని ననుసరించుట, అతనికి శరణాగతుడై అధీనుడగుట, దీనత్వమున భగవత్కృపాప్రాప్తికై నిరీక్షించుట యను, నీ యారు లక్షణములు చాల ముఖ్యములు.

అదేవిధముగ ప్రపత్తి, స్వరూపస్మరణము, ఫలస్మరణము, భారస్మరణములు నాబడు లక్షణత్రయముతో విలసితము. తా భగ

వంతునినాడనను గాఢ నమ్మకము స్వరూప స్మరణమగుచుండ, ఫలమును నీశ్వరునకర్పించుట ఫలస్మరణమగును. పారమార్థికాభి వృద్ధిభారమును ఆ పరమాత్మకర్పించుట భారస్మరణము నాబడును. అనగా కర్తృత్వ భోక్తృత్వముల సంపూర్తిగ నా భగవదర్పితము గావించుట యని తాత్పర్యము. సంపూర్ణ శరణాగతి భక్తునికి అద్భుత ధైర్యము నొసంగును. మోక్షప్రాప్తికై తన సంకుచిత శక్తి సామర్థ్యములపై నతడు ఆధారపడక, సర్వశక్తిసంపన్నుడైన పరమాత్మునికి, భారస్మరణము గావించెనుగదా! భక్తి మార్గమున భక్తుడు త్రోవ తప్పవచ్చుగాని, ప్రపత్తి మార్గమున నట్టి అపాయ మావంతయు నసంభవము. అతడు పరమాత్మకు సంపూర్ణముగ వధీనుడు.

ఈ ప్రపత్తి విధానమునకాదర్శముగ శ్రీ వైష్ణవము లక్ష్మీ దేవిని గైకొనును. శ్రీమన్నారాయణునకు సర్వ సృష్టి స్థితి లయ కార్యములందు మహాశక్తి స్వరూపిణియై, ఆతని సర్వ కార్యముల దోడ్పడుచు, నైనను ఆ పరమాత్మనుండి ఏనాడును ఎడబాటులేక, తాదాత్మ్యమున వెలసి, అతనికి సర్వ సమర్పణముగ ప్రపన్నయై. ఆమె ప్రవర్తించును. అదియే ముఖ్యమైన శరణాగతి యని శ్రీ వైష్ణవ తాత్పర్యము. ఆకారణమున మాత్రమే రామానుజా చార్యుడు, తన శరణాగతి గద్యమున శ్రీ లక్ష్మీదేవిని సంబోధిం చుచు విరచించెను. ఆమెనే ఆద్యశక్తి యనియు, వైష్ణవీ మాయా అనియు, నారాయణీ అనియు బహువిధరీతుల బిలుచుచుందురు,

'ఏకైక పూరుషసురక్షితవంశరీత్యా గుప్తా ప్రపత్తిపదవీ పురుషైః పురాణైః। రామానుజస్తు పరయా దయయా దయాళుః

సీమామి మా మతియణౌ జగతాం హితాయ॥' (ఉపదేశరత్న
పూర్వాచార్యులందరును బ్రిపత్తి ప్రిధానమైన ఈ భ
ధర్మమును రహస్యముగ నుంచిరి. శ్రీరామానుజులు ఈ
చితాభిప్రాయమును సహింపజాలక నెల్లరకు దాన, అధిక
గలదని ప్రికటించెను.

పూర్వోక్తరీతి నిర్వచింపబడిన భక్తి ప్రపత్తులకంగభూ
లుగ, ధ్యానాదులును నియోగింపబడినవి. ఆ ధ్యానాదుల
వలెనని వివరించుచు, శ్రీభాష్యము 'ధ్యానం చ తైలధా
విచ్ఛిన్న స్మృతి సంతానరూపం' (1-1-1) ధ్యానము తై
వలె నవిచ్ఛిన్నముగ నెడతెగని స్మరణరూపముగ నుండవ
ఆదేశించును. 'ధ్రువా స్మృతిః' యనగా, అన్యచింతా రా
మని యర్థము. ఈ ధ్రువస్మృతి లాభమున సర్వబంధ
క్తియు ఫలించునని 'ధ్రువా స్మృతిః స్మృతిలంభే సర్వగ్రంథీ
విప్రమోక్షః' అని శ్రుతివాక్యము. మరియు నీ ధ్రువస్మృతి '
సనం స్యాత్ ధ్రువా స్మృతిః దర్శనాన్నిర్వచనాచ్చ' ఉపాస
ధ్రువస్మృతి అను వాక్యముచే ఉపాసనమని గ్రాహ్యము.
ప్రత్యక్షరూపమనియుగూడ దెలుపబడినది. ఆత్మ ప్రవచనా
గాక, ప్రేమచేతనే లభ్యము అని శ్రుతి తాత్పర్యము కా
బరమాత్మ సాక్షాత్కారమునకు, శ్రవణ మనన నిదిధ్యాసనాద
మాత్రమే యుపాయములుగాక, నా పరమాత్మను ప్రేమించ
యుగూడ మార్గమని దృఢపడుచున్నది. ఈ ధ్రువస్మృతికే భ
యనియు నామాంతరమని, 'ఏవం రూపా ధృవా స్మృతిరేవ భ
శబ్దేన అభిధీయతే' (శ్రీ భా.1-1-1) అని శ్రీభాష్య నిర్వచనము.

మోక్షసాధనకుపాయభూతమునైన జ్ఞానముగూడ ఉపాసనా రూపమనియు, అది భగవంతుని ప్రీత్యర్థమవలంబనీయమనియు గమనార్హము (శ్రీ భా. 1-3-39). ఉపాసనమైనను ధ్యానరూప మగుటచే దానికిగూడ చిత్తైకాగ్రత అవశ్యకము (శ్రీభా. 4-1-8). ఈ యుపాసనాదులకు కాల దేశ నిర్ణయము లేక, చిత్తైకాగ్రత ఎప్పుడెచట గలుగునో, అపుడచట గావింపదగును (శ్రీ భా. 4-1-11). కాని 'ఆసీనస్సంభవాత్' (శ్రీ భా. 4-1-7) ఉపాసన మును గూర్చుండియే గావింపవలెనను విధి ముఖ్యము. ఆసీనుడైన మాత్రముననే ఏకాగ్రత చిత్తమునకేర్పడి, ధ్యేయమునందు మనస్సు లగ్నమై ఉపాసనము సిద్ధించును.

పూర్వము పరమాత్మ స్వరూపములుగ, పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చారూప పంచ విధానములు గలవని చూచి యున్నాము. 'తదేవోపాసకానుగ్రహేణ తత్తత్ప్రతిపత్త్యనురూప సంస్థానం కరోత్యపారకారుణ్యసౌశీల్యవాత్సల్యౌదార్యజలనిధిః నిరస్తనిఖిల హేయగంధోపహతపాప్మా పరమాత్మా పరం బ్రహ్మ పురుషోత్తమో నారాయణ ఇతి' (శ్రీ భా. 1-1-21) తనకు ప్రియ మైన, అనురూపమైన, ఏకరూపమైన, అచింత్య దివ్యాద్భుత నిత్య నిరవద్య నిరతిశయోజ్జ్వల సౌందర్య సౌగంధ్య సౌకుమార్య లావణ్య యౌవనాద్యనంతగుణనిధియు, అపార కారుణ్య సౌశీల్య వాత్సల్య ఔదార్య జలనిధియు, నిరస్త నిఖిల హేయగంధుడును, అపహత పాప్ముడును, పరమాత్మయు, పరబ్రహ్మమును, పురుషోత్తము డును అగు నారాయణుడు ఉపాసకుల ననుగ్రహింప, వారి వారి జ్ఞానమునకనుగుణ శరీరమును దాను స్వయముగ గ్రహించు

చుండును. అందులకై 'తదిదం స్వాభావికమేవ రూపముపాసకాను గ్రహేణ తత్ప్రతిపత్త్యనుగుణాకారం దేవ మనుష్యాది సంస్థానం కరోతి స్వేచ్ఛయైవ పరమ కారుణికో భగవాన్' (శ్రీ భా. 1-1-21) పరమ కారుణికుడైన భగవంతుడు, స్వాభావికమగు రూపమున భక్తుల ననుగ్రహింప, వారి వారి యుపాసనానుగుణముగ, దేవ మనుష్యాద్యాకారములను, దన యిచ్ఛ ననుసరించి కలుగజేయు చున్నాడు. అయినను తన కర్మవశమున జన్మగాక, జీవుల కర్మవశ మున జనించుటచే నతనికి శరీరాదులు బంధహేతువులు గానేరవు. నిరవధికమైన బ్రహ్మమునకు, నిట్టి పరిమితులేర్పడుటయు నుపాస కులకొరకే అని గ్రాహ్యము (శ్రీ భా. 3-2-32). ఈ విధముగ శ్రీమన్నారాయణుడు వ్యూహరూపమున, వాసుదేవ, సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ చతుర్వ్యూహముల బొందుటమాత్రమేగాక, మత్స్య కూర్మాద్యనేక అవతారములగూడ బొంది, సాధురక్షణ మును గావించుచు, దుష్ట శిక్షణమును దానికై యొనరించుచు, నా యా యుపాసకులకుపాస్యమై, భక్తిసాధనకుపాయమై, సర్వభక్త కోటి ననుగ్రహించుచుండుట శాస్త్ర విదితము. అందుచే విశిష్టాద్వైత సిద్ధాంతమున నీ యవతారమూర్తులుగూడ భక్తికి మూల కేంద్రములై, భక్తుల నాకర్షించి, తరింపజేయుచుండుటయు సువిదితము.

అంతియుగాక, నా యా మూర్తులు, సాక్షాత్తు సర్వకాలముల లభ్యమగుటచే, వారి వారి అర్చామూర్తులుగూడ నుపాసనా యోగ్యములనియు, నవియు, నారాయణాంశములే యనియు వైష్ణవ విశ్వాసము, అవియే 'అర్చ' అని యనబడెను. ఈ అర్చా

రాధనము కేవలము వ్యక్తిగతముగ దేవతార్చనమున ముగియక, సర్వోపయుక్తముగ, సమష్టి ప్రజానీకముకొరకు ఆలయములై, యందర్చారూపములు వివిధాకృతుల, వివిధ పరిణాముల ధరించి, అనంత స్వరూపముల ఆవహించినవి. అందుచే నాలయ నిర్మాణ విధానము, అర్చామూర్తి స్వరూప నిర్మాణపద్ధతులు, అందర్చా విధులు మొదలగు కార్యకలాపములు బహుముఖ్యములై, పాంచ రాత్రమున, వైఖానసమున బ్రజ్వలించి, వివిధాగమస్వరూపమున విస్తరించినవి. ఈ విషయమున పాంచరాత్ర, వైఖానస, ఆగమ ములకు గించిన్మాత్ర విభేదములున్నను, రెండును వైష్ణవములే యగుచున్నవి. దక్షిణ భారతమున నెక్కువ పాంచరాత్రమున యుక్తమగుచుండ, తిరుపతి మొదలగు క్షేత్రముల వైఖానసము వాడబడుచుండును. పాంచరాత్రము, ఆలయ నిర్మాణ అర్చా ప్రతిష్ఠాదులమాత్రమే నిర్ణయించక, వైష్ణవ నిత్యవిధులగూడ విధించును.

దేవాలయములగల అర్చామూర్తులుగూడ, కేవలము ధ్యాన యోగ్యమైన ప్రత్యేకదృష్టి గైకొనబడక, గేవలము సచేతన నారా యణ స్వరూపముగనే వైష్ణవము పాటించును. వైష్ణవ భక్తుడు పంచ కాలజ్ఞుడనబడుచు అభిగమన, ఉపాదాన, ఇజ్య, స్వాధ్యాయ, యోగములనబడు పంచ లక్షణములతో నలంకృతుడు. మనో వాక్కాయకర్మల బరమాత్మ సన్నిధి జేర నాతురత గలిగియుండుట అభిగమనము. భగవత్కైంకర్యమునకై వలయు పుష్పాదిక పరి కరముల జేర్చికొనుట ఉపాదానము అగును. అర్చనా కార్యము ఇజ్య యనబడును. అవసర శాస్త్రముల నధ్యయనము గావించి,

మననము జేయుట స్వాధ్యాయము నా నామము. అష్టాంగ యోగ మార్గమున నుత్తీర్ణత నొంది, శ్రీమన్నారాయణ పాదపద్మముల పై జిత్తమును ఏకాగ్రము జేయుట, యోగమని వ్యవహారము. ఈ పంచ లక్షణములుగల వైష్ణవుడే యథార్థమగు భక్తుడని, వైష్ణవ తాత్పర్యము.

అందుచే విగ్రహారాధనము 'అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమా పరికల్పితా' అనురీతి, కేవలము మందప్రజ్ఞులకుమాత్రము గాక, నెల్ల సాధకులకు అత్యవసరమని వైష్ణవ సిద్ధాంతము. విగ్రహారాధన ఫలితమున గదాధరుడు శ్రీరామకృష్ణ పరమహంసగ బరిణమించినపుడు, విగ్రహారాధనము దోషభూయిష్టముకాగుగదా! అత్యధిక ప్రయోజనకారి యను వివేకానందుని వచనము సముచితము.

## సిద్ధుడు

వైష్ణవ సిద్ధాంతమును అనుసరించి, పరమ భక్తిని సాధించి, ఒక ఆధ్యాత్మిక స్థితిని బొందిన వైష్ణవ సిద్ధులు, దశవిధముగ విశిష్టాద్వైతము పేర్కొనును. 'అద్వేషశ్చానుకూలశ్చ దివ్యనామధర స్తథా। చక్రాంకీ మంత్రపాఠీ చ వైష్ణవశ్చ తతః పరం॥ శ్రీవైష్ణవః ప్రపన్నశ్చ ఏకాంతీ చ పరంతప। పరమైకాంతివిఖ్యాతో దశైతే వైష్ణవా స్మృతా॥' (ప్రపన్నధర్మసార సముచ్చయము) అద్వేషుడు, అనుకూలుడు, దివ్యనామధారుడు, చక్రాంకుడు, మంత్రపాఠకుడు, వైష్ణవుడు, శ్రీవైష్ణవుడు, ప్రపన్నుడు, ఏకాంతి, పరమైకాంతి అని, వైష్ణవులు దశ విధములు. శ్రీమహావిష్ణువును, అతని భక్తులగు వైష్ణవులను ద్వేషింపనివాడు అద్వేషి. భగవానుడగు వాసుదేవుని

ఉత్పవాదులకు, భాగవతులకు, అనుసరించువాడు అనుకూలుడై, భగవద్వాచకమైన నామమును ధరించినవాడు నామధారి. అనగా భగవన్నామమును పేరుగ నుంచుకొనుట. ఊర్ధ్వ త్రిపుండ్రధారియు, నామధారి యనదగును. చక్రాంకనముల ధరించినవాడు చక్రాంకుడు. అష్టాక్షరీ మహామంత్రము ననవరతము జపించువాడు మంత్రపాఠుడు. విష్ణుప్రాప్తిని గోరి, భక్తి నుపాయముగ గొని, అన్యదేవత, అన్య ప్రయోజనము, అన్యోపాయముల ద్యజించి, నిత్యము శబ్దాదుల గర్హించువాడు వైష్ణవుడు. ఆత్మేతర సర్వమును వీడి, సదాచారసంపన్నుడై, శ్రియఃపతియందు భక్తిగలవాడు శ్రీవైష్ణవుడు. శబ్దాదులందును, దేహాదులందును ప్రేమను ద్రోసి పుచ్చి, శ్రీ పరమాత్మపై దన యోగక్షేమ భారమునుంచువాడు ప్రపన్నుడు. కర్మ భక్తి జ్ఞాన ప్రపత్తి యోగములు భగవదాజ్ఞారూపములు కాన, వాని యథావిధి నిష్కామమున నిర్వర్తించు వానిని ఏకాంతి యనియు, భాగవతుడనియు నందురు. అనగా ఇంద్రియముల నిగ్రహించి, మనస్సును వశము గావించి, బరమాత్మ యందు సంతత భక్తిని బ్రసరింపజేయువాడు ఏకాంతి యని తాత్పర్యము. భగవత్ప్రీతికొరకు జ్ఞాన భక్తి ప్రపత్తి ఆచార్యాభిమానము అను నిష్ఠగలవాడు పరమైకాంతి యనియు, మహాభాగవతోత్తముడనియు నాబడును. ఈ పదుగుర త్రివిధముగ గూడ విభజించిరి. అద్వేషి, అనుకూలుడు, దివ్యనామధారుడు, వీరు సహవాసయోగ్యులు. చక్రాంకుడు, మంత్రపాఠుడు, వైష్ణవ, శ్రీవైష్ణవులు, సత్కారయోగ్యులు. ప్రపన్న, ఏకాంతి, పరమై

కొంతులు సదా ఆచార్యతుల్యులు. ఈ వైష్ణవ భక్తి విభజనము సాధకునుండి సిద్ధునివరకు, వారి వారి సాధన స్థితుల వచించి, కొంత వరకు వారి అనుభవ సంస్థితులగూడ దెలుపును.

బ్రహ్మవేత్తల యాచారముల బరిశీలింప, వారలకు గర్మయే ప్రధానమగుచున్నట్లు స్పష్టమనియు (శ్రీ భా. 3-4-3), కాని వారు ఫలాపేక్షారహిత కర్మల నాచరించుట సంభవమనియు (శ్రీ భా. 3-4-9) రామానుజుని తాత్పర్యము. ఉపాసనమును మరణపర్యంత మాచరింపవలెను (శ్రీ భా. 4-1-12). ఈ ఉపాసనా ఫలితముగ, సంచిత ఆగామి కర్మలు వానికి సంబంధింపనేరవు (శ్రీభా. 4-1-12). సంచిత పాపకర్మములు నశించి, ఆగామి పాపకర్మలు సంబంధింపవు. పాపకర్మములు క్షయించినను, సంచిత ఆగామి పుణ్య కర్మములుమాత్రము బ్రహ్మవేత్తయొక్క మరణానంతరమున నశించును (శ్రీ భా. 4-1-14). కాని ప్రారబ్ధముమాత్రము శరీరపతనము వరకు అతని నాశ్రయించి, తత్తత్ఫలముల ననుభవింప జేయుచుమండును (శ్రీ భా. 4-1-15). ఆ బ్రహ్మవేత్త అగ్నిహోత్రాద్యాశ్రమోచిత కర్మముల నాచరించుచుండవలయును. అయినను బ్రహ్మవిద్యాప్రాప్తికి బూర్వము బ్రహ్మవేత్తచే నొనర్పబడినవియు, అభుక్త ఫలములును, అనారబ్ధ ఫలములును, అనాదికాల సంచితమును, అవంతములును నగు పుణ్య పాపరూప కర్మలు బ్రహ్మవిద్యా మాహాత్మ్యముచే నశించుచున్నవి. బ్రహ్మవిద్యాప్రాప్త్యనంతరము బ్రహ్మవేత్తచే ననుష్ఠింపబడిన పుణ్య పాప రూపములగు కర్మములు వానికి సంబంధింపవు అనియు శ్రుతుల తాత్పర్యము (శ్రీ భా. 4-1-18).

విశిష్టాద్వైతమున భక్తులు, ముక్తులు, నిత్యముక్తులు, గలరు. సాధకస్థితినున్నవారెల్లరు భక్తులుగ బరిగణింపబడుదురు. భక్తిమార్గమును అనుసరించి, పర పరమభక్తినిగూడ సాధించి ముక్తులగుదురు. ఈ విధమైన జనన, సాధనక్రమముల బొందక, నిత్యము పరబ్రహ్మ సన్నిధానమున సంతతానందవిభూతినున్న వారు నిత్యముక్తులు నాబడుదురు. కాని యీ సిద్ధాంతమున జీవన్ముక్తస్థితి సమ్మతము కాదు. దేహపతన కాలమువరకు నతడు సిద్ధుడు నాబడుచు, బరమాత్మ స్మరణముచేతనే చైతన్యము గోల్పోవుచు, పరమాభక్తి నున్నవాడు యింకను ప్రారబ్ధకర్మవశుడై యుండును. కాని ఆ స్థితి జీవన్ముక్తి నాబడదు. దేహపతనానంతర మాతడు ముక్తుడగుచున్నాడు. అట్టివాడే యితరులకుపదేశకుడై, నితరుల దరింపజేయగల మహాత్ముడని పూర్వము చూచియున్నాము.

## ముక్తి

'ఏవం ప్రకారమమలం నిత్యం వ్యాపకమక్షయం। సమస్త హేయరహితం విష్ణ్వాఖ్యం పరమం పదం॥' (వి. పు. 6-4-40, శ్రీ భా. 1-1-1) అని యీ వైష్ణవ పదము వర్ణితము. సృష్టి స్థితి లయాదిక శక్తులతోసహ అనుగ్రహరూప మహాశక్తి గల ఆ పరమాత్మ, దనను బొంద తీవ్రముగ నాకాంక్షించు భక్తుని, దన సన్నిధి జేర్చుకొని యానందింప, నధికతర తీవ్ర తాపమున భక్తునికై, యాతురుడై యుండునని రామానుజీయ మతము. అందుచే నా పరమాత్మ భక్తుని ఆర్తిని మించిన ఆర్తితో ముందునకేతెంచి, భక్తుడు ముక్తుడగుటకు చేయినందించి తోడ్పడును. దుఃఖమూలమైన దేహాదిక బంధములనుండి వాని సహాయముచే విడవడి,

దేహాంతరమున దన సన్నిధికి జేరిన భక్తునికి, పూర్వానుభవములైన దుఃఖాదికము గల్గుట అసంభవము. ప్రాపంచిక పాశములెవ్వియు నట నుండనేరవనుట అతిశయోక్తి ఏమాత్రము కానేరదు. 'అవిద్యానివృత్తిరేవ హి మోక్షః' (శ్రీ భా. 1-1-1) అవిద్యా నివృత్తియే మోక్షమగుటచే, నిక అవిద్యాసంబంధ పాశము లదృశ్యముకాన నా పదము అమలము అని నిర్వచింపబడెను.

కాని మోక్షమన కైవల్యముకాక, ప్రేమస్వరూపుడైన పరమాత్మను బొందుట యని సిద్ధాంతము. దేహాది పాశ విముక్తి నొంది, జీవుడు బ్రహ్మముతో నొక్కడై, సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యములనెడు చతుర్విధ మోక్షస్థితుల గ్రమవిధాన మున బొందుచుండును. విశిష్టాద్వైత సిద్ధాంతమున బరమేశ్వరుడు జీవ జగత్తుల, సూక్ష్మ స్థూలశరీరములుగ గలవాడు. అంశాంశి భావమున జీవులు పరమాత్మలో నుండునని చూచియున్నాము. ఈశ్వర జీవ జగత్తులు పరస్పర విరుద్ధతత్త్వములుగాక, అన్యోన్యా పేక్షికములై యున్నవి. కాన జీవుడు తా బరమాత్మతో ననన్యముగ నంశాంశిభావముననున్నానని గ్రహించుకొని, బ్రథమమున సాధన స్థితిలో బ్రపన్నుడగుచుండ, దేహపతనానంతరము తదన్యత్వ మును, అవిద్యానాశనమగుటచే ననన్యత్వ సత్యమును గ్రహించి, శ్రీమహావిష్ణువుతో నుండును. అంత కర్మ పాపములు జీవునకుండ నేరవు. అనంతమైన పరమాత్మలో నీ జీవుడొక అణువు.

ముక్తస్థితిలో జీవుడు, బ్రహ్మ దృష్టిలో సర్వమును, గాంచును. అతడుండు వైకుంఠము భౌతికముకాక, దేశ కాల నిమిత్త ములకతీతమైన స్థితి. అతడచ్చట శ్రీమహావిష్ణువుతో నవిభాగస్థితి

నుండును. అప్పటికైనను ముక్తుడు పరమాత్మయొక్క లేశమాత్ర తత్త్వమునే గ్రహింపగలుగును.

శరీరమును వీడి బహిర్గతమగు బ్రహ్మవేత్త, కఠ ప్రమాణము (2-6-16) ననుసరించి, నూటయొక్క నాడుల భేదించి చను సుషుమ్నానాడి ద్వారమున నూర్ధ్వభాగమును బొంది, జన్మమరణాదులు లేని మోక్షమును బొందుచున్నాడు (శ్రీ భా. 4-2-7,16). అట్లు బహిర్గతమై జీవుడు సూర్యకిరణములద్వారమున బైకిపోవుచున్నాడని వేదాంతసూత్రము (4-2-17). రాత్రికాలముననైన సూర్య తేజముండుటచే, రాత్రి శరీరత్యాగము జేసిన బ్రహ్మవేత్త యీ తేజము ననుసరించి పోవునని తాత్పర్యము (శ్రీ భా. 4-2-18). అదేవిధముగ బ్రహ్మవేత్త దక్షిణాయనమున మృతుడైనను బ్రహ్మమునే బొందుచున్నాడు (శ్రీ భా. 4-3-1). అతడు చంద్రలోకమును జేరగ, అతని దోడ్కొని పోవుటకు పరమ పూరుషునిచే బంపబడిన కొందరు దేవతలు అతని జేరుదురు (శ్రీ భా. 4-3-4). అంత నతడు బ్రహ్మలోకమును బొందును. అచట హిరణ్యగర్భునితో నుండి యటనుండి పరబ్రహ్మమును జేరుచున్నాడు (శ్రీభా.4-3-9)

ఈ విధముగ బరబ్రహ్మమును బొందినవాడు, 'స్వేన రూపేణాభినిష్పద్యతే' (ఛాం. 8-12-2) అని ఉపనిషత్తు వచనము. కాన అతడు తన నిజస్వరూపమును బొందుచున్నాడు (శ్రీ భా. 4-4-1). అతనికి సర్వ బంధములు నిరాసమొందినవి. ఇచట నా బ్రహ్మవేత్త అపహతపాప్మాది లక్షణములచే నలంకృతుఁడు. సహజముగ నీతనికి గుణములున్నను, సంసారదశయందు అవి తిరోధానము నొంది, మరల సంసార విచ్ఛేదమున స్వస్వరూపమున ప్రకాశించుచున్నవి

(శ్రీ భా. 4-4-3). మరియు ముక్తపురుషుడు పరబ్రహ్మమునుండి తా నవిభక్తుడననియు గ్రహించుకొనును. 'అతోఽవిభాగేన అహం బ్రహ్మాస్మీత్యేవానుభవతి' (శ్రీ భా. 4-4-4) కాబట్టి ముక్తుడు 'నేను బ్రహ్మమును' అనగా బ్రహ్మమునుండి అవిభక్తుడనని తెలిసికొనుచున్నాడు. అప్పుడతని శరీరము ప్రాకృతముగాక బ్రహ్మసమ పరిశుద్ధమైనదై యుండును.

ఈ ప్రత్యగాత్మ విజ్ఞానమాత్రస్వరూపుడైనను, అతనికి అపహతపాప్మత్వాది లక్షణములుండనగును. అతనికి సత్యసంకల్పత్వాది గుణములుండుటచే, నతడు పితృలోకమును జూడగోరినచో నటకేగగలడు (శ్రీ భా. 4-4-8). అతనికి విధినిషేధములు అభావములు (శ్రీ భా. 4-4-9). సంకల్పమాత్రమున నతడు సశరీరుడుగను, అశరీరుడుగను గాగలడు (శ్రీ భా. 4-4-12). అనేక శరీరములతో గూడ నతనికి సంబంధము ఏర్పడగలదు (శ్రీ భా. 4-4-15).

ఇన్ని శక్తులున్నను ఈశ్వరునికి గల సృష్టిశక్తిమాత్రము యితనికి శూన్యము. నిఖిల చేతనాచేతనముల స్వరూప స్థితి ప్రవృత్తుల నియమించు జగద్వ్యాపార సామర్థ్యము యితనికి లేదు (శ్రీభా. 1-1-1, 4-4-17, 1-1-13). ఆ నిర్వహణము పరమేశ్వరునిది. జగదీశ్వరత్వము బ్రహ్మలక్షణముగుగాని ముక్తలక్షణముకాదు. సకల కల్యాణ గుణగణాలంకారుడైన బరబ్రహ్మమును ముక్తుడు అనుభవించుచుండును (శ్రీ భా. 1-3-19, 4-4-19.) ఇచట అతడు అవ్యయానందము ననుభవించును. సర్వలోక సంచార ప్రజ్ఞయు నితనికున్నది (శ్రీ భా. 4-4-10). అంతటితో నతనికి బునర్జన్మ గలుగనేరదు. ఇచట నతనికి బ్రహ్మముతో స్వరూపైక్యత్వముగాక, విశిష్ట ఐక్యము గలుగునని సిద్ధాంతము.

పై విధానమున ముక్తుడు బ్రహ్మము నాశ్రయించి, బహ్మముతో సర్వసమానత్వము నొంది ఆనందమువనుభవించునని విదితము. బ్రహ్మముయొక్క విశేష లక్షణములైన సృష్టి స్థితి లయాంతర్యామిత్వములు ఆ ముక్తునికి లేవు. అయినను అతనికి బ్రహ్మముతో నేకత్వభావమే గలిగి 'అహం బ్రహ్మాస్మి' అను భావమునగూడ నుండునని విశిష్టాద్వైత తాత్పర్యము.

## సమాప్తి వచనము

శ్రీ వైష్ణవ సిద్ధాంతమున బ్రముఖాచార్యుడై, విద్యానుభవ సంపన్నుడై, విశిష్టాద్వైత వాదమును వేదోపనిషత్పురాణముల నుండియు, ఆళ్వారుల ద్రవిడ ప్రబంధము నుండియు, సంకలనము గావించి, మహాప్రసాదముగ అనంతకోటి ముముక్షువుల కందించిన శ్రీ రామానుజ మహత్కార్యమును, సంక్షిప్తముగ నవలోకించి యున్నారము. ఈ సిద్ధాంత బీజములు వేదముల విరివిగ వెలసియున్నవై, కాలాంతర మహర్షిగణ అద్భుత పోషణమున నభివృద్ధిచెంది, సర్వ పురాణేతిహాసముల స్మృతుల బ్రసరించి, శ్రీరామానుజ అమానుష ప్రజ్ఞావిశేషముచే ఫలవంతములై, సర్వ వ్యాప్త సంతుష్టిని సాధకగణముల గలుగజేయుటయు గాంచినారము.

అందుచే నీ విశిష్టాద్వైత సిద్ధాంతము వేదవేదాంత సమ్మతమై, మహర్షిగణ ప్రాపకమై విరాజిల్లుట సువిస్పష్టము. ఈ సిద్ధాంతరాజము కేవలము శ్రీరామానుజ స్వకపోల కల్పితము కాదని, అతడే తన పూర్వ భాష్యకారులైన బోధాయన ద్రమిడాదుల సూచించి, వారి సిద్ధాంతముల పునర్వివరణము గావించు

చున్నట్లు తెలిపియుండుట దీన స్పష్టము. శ్రీవైష్ణవ చిహ్నమైన ప్రపత్తి శ్రీరామానుజునిలో మూర్తీభవించి, దా వైష్ణవపీఠాధిపతియై యుండియు, విద్యాభిలాషచే ననేకగురుపుంగవుల నాశ్రయించి, వివిధ వేదాంత రహస్యముల నవగాహనము నొనరించి, సర్వశాస్త్ర, సర్వ సిద్ధాంత, సర్వ అంతరార్థముల జీర్ణింపచేసికొని, అజేయమైన మేధాసంపత్తిని, దానికిమించిన భక్తిప్రపత్తులను గడించి, యతిరాజు బిరుదమునకసమార్హతను సంపాదించెను. అంతవరకు బౌద్ధ, జైన, అద్వైతములచే నావరింపబడిన భారతావని వాతావరణము, రామానుజు ప్రేమైక దృష్టులచే జల్లబడినదై, ముముక్షుజన హృదయముల నాశల రేకెత్తించి, భక్తి రసములచే సంతృప్తి గలుగజేసెను. వరబ్రహ్మమును సర్వాతీత స్థితినుండి యుద్ధరించి, మానవ హృదయములకు సన్నిహితుని గావించి, భక్తిచే బంధించి, మానవ బాహుబంధములకీడ్చి, విభవార్చామూర్తులుగ అనగా అవతారములుగను, విగ్రహస్వరూపములుగను ఒనరించి, భక్తునికి స్వాధీనము జేసిన శ్రీరామానుజాచార్యుని అమానుష శక్తినెవరు గ్రహింపగలరు? కొనియాడగలరు? అది అద్భుత ప్రజ్ఞాశక్తి స్వరూపము, ప్రేమసాగరము. అందుచే నీ విశిష్టాద్వైత సిద్ధాంతామృతప్రదాత, భక్తిప్రపత్తిరహస్యానుభవైకసంధాత, అనంత ముముక్షుగణ శ్రితయైన శ్రీమద్రామానుజాచార్య యతిరాజేశ్వరునకు, సదా సర్వథా శత సహస్రాంజలుల నర్పించెదముగాక!

శ్రీభాష్యకారో జయతు శ్రీరామానుజ జగద్గురుః।
ముముక్షూణాం చ సర్వేషాం శ్రీమదష్టాక్షరప్రదః॥

హరిః ఓం తత్ సత్

స్థాపితము : 1951.

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

ఉద్దేశ్యము : ఈ గ్రంథమాలలో శ్రీ అనుభవానంద స్వాములవారి, శ్రీ మాతాజీ త్యాగీశానందులవారి మరియు [illegible] రచితములైన భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధక గ్రంథములు ప్రకటింపబడును.

విధానము : సంవత్సరమున మొత్తమునకు [illegible] గ్రంథములు వెలువడుచుండును.

విరాళము : 1] రు. 1116/- మించు విరాళమొసంగువారు మహారాజ పోషకులు. వీరి పేరటో ఒక ముఖ్య గ్రంథము [illegible] బడును.

2] రు. 516/- మించు విరాళమొసంగువారు రాజపోషకులు. [సంవత్సరమున 10 వాయిదాలలో పైకము [illegible]]

* గ్రంథమాల పుస్తకములను పీఠ [illegible].

---

గ్రంథమాల మహోద్యమమునకు [illegible]

---

* వి. పి. ద్వారా పుస్తకములు [illegible] ముందుగా పంపవలెను.

** పోస్టేజ్, ప్యాకింగ్ చార్జీలు [illegible].

*** ఉత్తర ప్రత్యుత్తరములకు [illegible]

# ప్రచురణములు

1. సాధన రహస్యము (8 వ ముద్రణ) (Revised - Edition)

ముముక్షువులు సాధన ఎలా చేయాలి ? దాని ఫలితములు, ఆధ్యాత్మికాభివృద్ధికి మార్గములు, చక్కని వ్యావహారిక భాషలో తెల్పిన అశేష ప్రజాదరణ పొందిన మహోత్కృష్ట గ్రంథరాజము. 22-00

[సంస్కృతము, ఇంగ్లీషు, హిందీ, మరాఠి, తమిళ, కన్నడ, మళయాళ భాషలలో అనువదింపబడి ప్రచురింపబడనున్న గ్రంథము.]

2. సాధన మకరందము (2 వ ముద్రణ)

సాధన విషయములేకాక, అనేక నిత్యావసర విషయముల విచారణ మిందుకలదు. శ్రీ స్వాములవారి జీవితమున జరిగిన కొన్ని సంఘటనలు యిందున్నవి. 5-00

3. సాధనసుధ (3 వ ముద్రణ) (Revised – Edition)

సాధనలో దగులు ఆటంకముల నివారింప అమూల్యమగు సలహాల నొసంగు గ్రంథము. శ్రీ స్వాములవారి జీవితమున జరిగిన కొన్ని సంఘటనలు ఇందు కూర్చబడినవి. [ఇందులోని కొన్ని తత్త్వములు "స్టీరియో కేసెట్" రూపమున వెలువడినవి.]

4. అనుభవ రహస్యము

సాధనానుభవములు బొందుటకు సాధకులకు మార్గదర్శి యగు "సాధనరహస్య" అనుబంధ గ్రంథరాజము.

5. మన రామకృష్ణుడు (3 వ ముద్రణ)

జగద్గురు శ్రీ రామకృష్ణుని అద్భుతాదర్శ, సాధన వివరముల తెలుపు మహత్తర గ్రంథము. 5-00

6. మన శారదామాయి (3 వ ముద్రణ)

జగన్మాత శ్రీ శారదామాయి జీవితోపదేశముల వివరించు ఉత్సాహ పూరిత గ్రంథము, 5-00

7. మన వివేకానందుడు (3 వ ముద్రణ)

వేదాంతకేసరి శ్రీ వివేకానందుని జీవితాదర్శముల ప్రబోధించు ఉత్కృష్ట గ్రంథము. 5-00

8. శాంతి సామ్రాజ్యము (2 వ ముద్రణ)

శాంతినిగోరు నేటి ప్రపంచమునకు శాంతిప్రబోధగావించు ఉత్తమ గ్రంథము. 2-00

9. శ్రీ రామకృష్ణాదర్శము (3 వ ముద్రణ) (Revised – Edition)

శ్రీ రామకృష్ణుని సాధన, సిద్ధుల రహస్యముల వివరించు ఉత్తేజకర గ్రంథము. 2-00

10. శ్రీ శారదాదర్శము (2 వ ముద్రణ) (Revised–Edition)

ఇందు శ్రీ శారదాదేవి గొప్పదనము మన హృదయముల గదిలించును. 2-00

11. శ్రీ వివేకానందాదర్శము (3 వ ముద్రణ) (Revised – Edition)

శ్రీ వివేకానందుని ఆదర్శము ఇందు ప్రస్ఫుటముగా విరచితము. 2-00

12. శ్రీ అనుభవానందాదర్శము

ఇందు శ్రీ అనుభవానందుల ఆదర్శానుభవములు గోచరము.

2-00

13. మాండూక్యరసాయనము (2 వ ముద్రణ)

మాండూక్య ఉపనిషత్తుకు 108 ఉపనిషత్తుల ముఖ్యమంత్రముల, గౌడపాద కారికలతో శ్రీ అనుభవానందుల అద్భుత వ్యాఖ్యానము గల గ్రంథము.

5-00

14. ప్రాచీన భగవద్గీత (2 వ ముద్రణ) (Revised - Edition)

745 శ్లోకములు గల గీత. ఇది భోజపత్ర వ్రాతప్రతినుండి గ్రహింపబడి, శ్రీ అనుభవానందులచే పీఠిక వ్రాయబడినది. తాత్పర్యము కలదు.

15. శ్రీ రామకృష్ణ పూజ (2 వ ముద్రణ)

(Revised – Edition)

శ్రీ రామకృష్ణ సహస్రనామము, శ్రీ రామకృష్ణ, శ్రీ శారదా, శ్రీ వివేకానంద, శ్రీ అనుభవానందుల అష్టోత్తర శత నామములు యిందు కలవు. శ్రీ రామకృష్ణ అష్టోత్తర శతమునకు ఉపనిషత్ మంత్రములతో శ్రీ త్యాగీశానందుల చక్కని వ్యాఖ్యానము కలదు.

6-00

16. శ్రీ రామకృష్ణ లీలాసంకీర్తనము (6 వ ముద్రణ)

(Revised – Edition)

భక్తి, జ్ఞాన, వైరాగ్య ప్రబోధక కీర్తనలు. 169.

[ఇందులోని కొన్ని పాటలు "శ్రీ రామకృష్ణ గానసుధ" రూపమున 'స్టీరియో కేసెట్' గా విడుదల అయినవి. మరి కొన్నిపాటలు 'కేసెట్' రూపమున వెలువడనున్నవి.]

6-00

17. శ్రీ రామకృష్ణ-వివేకానంద కథాగానములు
శ్రీ రామకృష్ణ, వివేకానందుల జీవితములు ప్రదర్శించుటకు అనుగుణ్యముగా శ్రీ స్వాములవారిచే విరచితము. ఆంధ్రదేశమున 100 ప్రదర్శనలకు పైగా యీయబడినవి.

18. యుగావతారము
శ్రీ రామకృష్ణ గాన కథామంజరి ["స్టీరియో కేసెట్" రూపమున వెలువడ నున్నది.]

19. పరమహంస (Pocket Size Book)
"స్టీరియో కేసెట్" రూపమున విడుదల కానున్నది.] 0-50

20. స్వామి వివేకానంద (Pocket Size Book)
["స్టీరియో కేసెట్"గా విడుదల కానున్నది.] 0-50

21. శ్రీ రామకృష్ణాంజలి (5 వ ముద్రణ)
శ్రీరామకృష్ణ తత్త్వమునుగూర్చి భక్తి, ఉత్సాహపూరిత శతకము-వివరణములతో. 1-50

22. శ్రీ దక్షిణేశ్వరీ స్తవము (4 వ ముద్రణ)
శ్రీ కాళికాదేవినిగూర్చి భక్తితో తత్త్వవిషయముల బోధించు శతకము-వివరణములతో. 1-50

23. చిత్తప్రబోధ (4 వ ముద్రణ)
సాధకులకు అనేక అమూల్య రహస్యములను, మనోతత్త్వమును గూర్చి బోధించు శతకము - వివరణములతో. 1-50

24. అనుభవానందము (4 వ ముద్రణ)
అద్వైతానంద విభూతి వ్యక్తపరచు, అద్భుతామరవ శతకము.
(A Master-piece in the Vedanta Literature.) 0-75

25. ఉపనిషత్ వైభవము

108 ఉపనిషత్తులగూర్చి సులభశైలిలో ప్రత్యేకముగా ప్ర

సర్వసిద్ధాంతసారభవము (12 సంపుటములలో

[మన భారతీయ సంస్కృతి, వాఙ్మయమునుగూర్చి, పరిశో (Re-search) గ్రంథములు. (An Encyclopaedia of Philosophy) సుమారు 4,500 పుటలలో.

26. సాంఖ్య, యోగములు (3 వ ముద్రణము)

సాంఖ్య యోగ విషయములతో శ్రీ కపిల, పతంజలి జీవితకాల విశేషములు, సిద్ధాంతములు యిందు విరచితము.

27. వైశేషిక, న్యాయములు (2 వ ముద్రణ)

శ్రీ కణాద, గౌతమ మహర్షుల జీవితకాల విశే వైశేషిక, న్యాయ సిద్ధాంతములు పండితాభిప్రాయములతో చర్చి

2

28. మీమాంస, వేదాంతములు (2 వ ముద్రణ)

జైమిని, వ్యాసమహర్షుల జీవితకాల సిద్ధాంతములు పండితాభిప్రాయములతో రచితము.

29. శ్రీ శంకరపూర్వాద్వైతము (2 వ ముద్రణ) 2

వేదములనుండి శ్రీ శంకరులవరకు ప్రవహించు అద్వై ప్రవాహమును తెలుపు విపుల గ్రంథము. అద్వైత సిద్ధాంతమ ఆధునిక భౌతిక విజ్ఞానమునకు సమన్వయము జూపును. 20.

30. శ్రీ శంకరాద్వైతము (2 వ ముద్రణ)

శ్రీ శంకర జీవితకాల విశేషములు, అద్వైత సిద్ధాం విస్తృతముగా వివరింపబడినవి. సన్న్యాస ప్రాశస్త్య, అద్ వివరములును కలవు.

20.

31. శ్రీ శంకరానంతరాద్వైతము (2 వ ముద్రణ)

శ్రీ సురేశ్వర, విద్యారణ్య జీవితకాల విశేషములతో అద్వైత సిద్ధాంతములిందు చర్చితము. 20-00

32. విశిష్టాద్వైతము (2 వ ముద్రణ)

వేదములనుండి వైష్ణవ సిద్ధాంత జనన చారిత్రము, శ్రీ రామానుజ జీవిత సమీక్ష, విశిష్టాద్వైత సిద్ధాంత వివరణములిందు ప్రస్ఫుటము. 20-00

33. వైష్ణవము (2 వ ముద్రణ)

శ్రీ మధ్వాచార్యునినుండి శ్రీ కృష్ణచైతన్యుని వరకుగల వైష్ణవాచార్యుల జీవిత సిద్ధాంత విషయములు సమీక్షింపబడినవి. 20-00

34. శైవాద్వైతము (2 వ ముద్రణ)

వేదముల రుద్రాధ్యాయ జనితమైన శైవసిద్ధాంతము, వీరశైవము వరకు ఎట్లు పరిణమించియున్నదియు నిట స్పష్టము. నాయనారుల జీవితములు కలవు. 20-00

35. శాక్తాద్వైతము (2 వ ముద్రణ)

వేదాంతర్గత దేవీసూక్త అదితి ప్రస్తావనతో ప్రారంభమై, దక్షిణ వామాచారరూపమున సర్వత్ర ప్రఖ్యాతి నొందిన శాక్తసిద్ధాంత సాధనములతో వివరింపబడినవి. 20-00

36. బౌద్ధము

బౌద్ధసిద్ధాంతము - ప్రాముఖ్యత, శ్రీ బుద్ధభగవానుని, జీవిత విశేషములు పరిశీలనాత్మకముగా వివరింపబడినవి.

37. సర్వ సిద్ధాంత సౌరభ సారము
సులభశైలిలో "సౌరభము"ను గూర్చి వివరణాత్మక గ్రంథము.

38. శ్రీ రామకృష్ణ గానసుధ (స్టీరియో కేసెట్)
మధురమైన భక్తిపాటలుగల స్టీరియో కేసెట్.
వెల. రు. 40-00 లు రిజిష్టర్ పోష్టులో రు. 44-00 లు

39. భారతీయ సంస్కృతి (స్టీరియో కేసెట్)
భక్తిపాటలతో భారతీయ సంస్కృతినిగూర్చి శ్రీ మాతాజీ త్యాగీశానందుల అనర్గళ ఉపన్యాసములుగల స్టీరియో కేసెట్.
వెల రు. 30-00 లు రిజిష్టర్ పోష్టులో రు. 34-00 లు
*పై రెండు కేసెటులు తీసుకొనేవారికి పోస్టేజి ఉచితము*

40. స్టిక్కర్లు (Stickers), ఒక్కొక్కటి 4 రంగులలో, సైజు 7" × 5".
1) ఓంకారము, 2) శ్రీ రామకృష్ణ పరమహంస, 3) శ్రీ శారదామాయి, 4) శ్రీ వివేకానందస్వామి. ఒక్కొక్కటి .... 1-50

*అముద్రితములు*

1) శ్రీ అనుభవానందస్వామి జీవితచరిత్ర, 2) శ్రీ అనుభవానందుల లేఖావళి, 3) శ్రీ అనుభవానందుల ఉపన్యాసములు, 4) అనుభవామృతము, 5) మన భారతీయ సంస్కృతి, 6) శక్తి పూజా విశిష్టత, 7) మంత్రశాస్త్రము, 8) తంత్రశాస్త్రము, 9) శాక్తేయము - శ్రీ రామకృష్ణుడు, 10) పరమహంస ప్రబోధము, 11) శ్రీ శారదా సందేశము, 12) శ్రీ వివేకానంద విజయభేరి, 13) శ్రీ త్యాగరాజ హృదయం మొ॥.

* శ్రీ అనుభవానంద స్వాములవారు చిత్రించిన 'ఓంకారము', శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదామాయి, శ్రీ వివేకానంద స్వామి ఫొటో కాపీలు కాబినెట్ మరియు ఫుల్ సైజులో మన గ్రంథమాలలో లభించును. *